౧౧. శ్రీ రామానుజ వైభవోల్లాసము **279-281**

శ్రీమాన్ కరి నారాయణాచార్యులు

౧౨. శ్రీ పరాశర భట్టరు **282-288**

శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు

అవతారిక

ప్రతిభా విశేషములు

భట్టరు రచనలు



# శ్రీ వేంకటాద్రీశ్వర స్తవము

'ఉభయ భాషా ప్రవీణ - కవి పాదుషా'

శ్రీ పువ్వాడ శేషగిరిరావు, పి. ఓ. యల్.



శ్రీమ త్తిర్పతి వేంకటాద్రి మకుట శ్రీరత్న రింఛోళికా
ధామా! రక్షణ కంకణాభయద ముద్రాభద్ర హస్తద్వయీ
స్థేమా! భీషణ శంఖ చక్ర యుగళీ దివ్యాంగుళీ సీమ! రా!
ఓమన్ రా! కరుణింపురా! ప్రణుతిరా! ఓం వేంకటాద్రీశ్వరా!

శ్రీమ ద్దేవ కిరీట చుంబిత నిజ శ్రీపాద మంజీర! మం
గా మాంజిష్ఠ పదాబ్జ నూపుర నయ న్మాణిక్య కోటీర! మా
ప్రేమారామ మధూళికా మృగమద శ్రీగంధ శృంగార! రా!
ఓమన్ రా! కరుణింపురా! ప్రణుతిరా! ఓం వేంకటాద్రీశ్వరా!

శ్రీమ న్నీల విహాయసస్థ ఘన చాంద్రీభూత తారావళీ
సీమా మధ్య శర త్సుధాకర! సమీచీన ప్రసూన ప్రభా
రామారామ నిరంత మాధవ జగ త్సమ్మోహనాకార! రా!
ఓమన్ రా! కరుణింపురా! ప్రణుతిరా! ఓం వేంకటాద్రీశ్వరా!

స్వ ర్గంగా లహరీ పయ స్సుకవితా స్వారస్య పారమ్యముల్
స్వర్గ ద్వార కవాట భేదన చణ స్వైర ప్రభా రమ్యముల్
సర్గానర్గళ లోక పాలన కళా సంస్కార సంహార సం
సర్గంబుల్ గద త్వ త్కృతీశ మహిమల్ మ ద్వేంకటాద్రీశ్వరా!

ముడిచిన చేతు లాపదల మ్రొక్కులు బంగరు సొమ్ము లూడ్చి, గ్రా
మ్మమువులు గట్టుటల్ సఫలముల్ గను చే తడ వింటి కన్న నీ
గుడి పదిల మ్మటంచు నమగు న్మమ గిచ్చుచు బిచ్చ మెత్తి, నీ
కడ ధనికాలి వాకిలిని గాతురు కొంకక వేంకటేశ్వరా!

నంబిన భక్తి నిన్ను గడపన్ గడపం దలపోసి, పూర్వ క
ర్మంబు శమింప నంత్య శిఖరమ్మున ముక్తులు భక్తకోటి నాఁ
డంబుజనాభ! నేఁడును భయావహ యానము నెక్కి నీదు నా
మంబె జపింత్రు కర్మములు మాయఁగఁ దిర్పతి వేంకటేశ్వరా!

మరకత మాణిక్య మణి హేమ కింకిణీ
క్వణిత నూపురములు కాళ్ళఁ దొడిగి
వజ్ర వైడూర్య నిర్వ్యూహితాంగ విలస
త్కేయూరతతి భుజాంకిత మొనర్చి
హరి నీల పద్మ రాగాభి శోభితములౌ
దండ కడెమ్ము లొంచగ నమర్చి
లలిత ప్రవాళా చ్ఛలసిత మౌక్తిక హార
ములు కంఠ లంబితములు పొనర్చి
ఆత్మ మందిర నందనోద్యాన సీమ
కోర్కె దగదీఱఁ గైసేసి కొందు నిన్ను
ముగ్ధ మోహన సుందరమూర్తి నేది?
తిరుపతి నివాస! వేంకటేశ్వర విలాస!



# భారతీయ దర్శనములు
# బ్రహ్మసూత్ర భాష్యములు

'విద్యా భూషణ - కవితా విశారద'

## శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు



## 1. అంజలి

" ప్రణామం లక్ష్మణ మునిః ప్రతిగృహ్ణాతు మామకమ్
యేన విశ్వసృజో విష్ణో రపూర్యత మనోరథః. "

— (యతిరాజ సప్తతి : శ్లో. 10)

## 2. ఉపక్రమము

సృష్టిలో ప్రాణికోటియందు మానవుఁడు అధికుఁడుగా పరిగ ణింపఁబడుచున్నాఁడు. అతఁడు - మనన శీలుఁడు, బుద్ధిజీవితుఁడునై యుండుటయే ఇందులకు కారణము. మనుష్యుఁడు తన పనుల నన్నిటిని ఆలోచించి నిర్వర్తించుచుండును. ఇందుచే - "మత్వా కర్మాణి సీవ్యతి ఇతి మనుష్యః" - అని మనుష్య శబ్దము నిర్వచింపఁబడు చున్నది. మానవునకుఁ గల ఈ విశేషమే దర్శన శాస్త్రోదయము నకు మూల మైనది. 'నే నెవరు? ప్రకృతి యేమి? ఈ ప్రకృతియొక్క - ఉత్పత్తికి కారణ మేమి? ఈ ప్రకృతి ఎవరిచే ఎపుడు ఎట్లు సృష్టింపఁ బడినది?' ఈ మొదలగు వివిధ విషయములనుఁ గూర్చిన జిజ్ఞాస - మానవుని మనస్సులో నిరంతరము ఉత్పన్న మగుచుండును. మానవుని మనస్సు నందలి ఈ సమస్త జిజ్ఞాసలకు సమాధానమే దర్శనము.

బృహదారణ్యకోపనిషత్తులో - యాజ్ఞవల్క్య, మైత్రేయుల సంవాదమున, ఆత్మ సంబంధ మగు చర్చ చేయుచు యాజ్ఞవల్క్యుడు -

" అయ మాత్మా ద్రష్టవ్యః, శ్రోతవ్యః, మంతవ్యః, నిదిధ్యాసితవ్యః.

' ఆత్మ పరమాత్మల తత్త్వ దర్శనమునకు - శ్రవణము (HEARING), మననము (READING), నిదిధ్యాసనము (STUDY MEDITATION) అనునవి ఆవశ్యకములు ' అని పలికెను.

వీని యన్నింటిలో - అనుభవమునకు ప్రాధాన్య ముండును. అనుభవము వల్లనే ఆత్మ జ్ఞానము లభించును. ఈ కారణముచే, అనుభవ జ్ఞానమే దర్శనము (REALIZED SENCE IS PHILO - SOPHY) - అని మనము భావింపగల్గుచున్నాము. 'దృశ్యతే ఇతి దర్శనమ్' - అని, దర్శన శబ్ద వ్యుత్పత్తి. దేనిచే మనము చూడ గలమో, ఎయ్యది వివిధ జిజ్ఞాసువులను సమాధాన పఱచునో, అదియే దర్శన మని చెప్పబడును. దర్శన శబ్దమునకు - ' దృష్టి కోణ' మనియు అర్థ మున్నది. విభిన్నము లగు భారతీయ దర్శనములు మాత్రము - విభిన్న లగు జిజ్ఞాసువులను సమాధాన పఱచు దృష్టి గల్గి యున్నవి. అనగా - భిన్న భిన్న వ్యక్తులను, విభిన్న తత్త్వము గలవారిని తృప్తి పఱచుటలో భారతీయ దర్శనములు అత్యంతము శక్తి యుక్తులు కలిగి యున్న వని దీని తాత్పర్యము. ఈ రీతిగా - 'యుక్తి పూర్వక మగు జ్ఞానమును పొందుట' అను నదియే దర్శనము.

## 3. భారతీయ దర్శన విశేషములు

భారతీయ వాఙ్మయమునకు సర్వతోముఖ వికాసము, మహత్త్వము ప్రాప్తించి యున్నవి. తత్ఫలముగా - భారతీయ లగు

తాత్త్వికులు - ధర్మార్థ కామ మోక్ష రూప మగు పురుషార్థ - చతుష్టయ సిద్ధియే మానవ జీవిత పరమార్థ మని భావించిరి. ఈ పురుషార్థ చతుష్టయ సాధనలో భారతీయులు తమ తమ మనస్సులను లగ్నము గావించి, జీవితములను సుఖ మయము చేసికొనుచు, మోక్షమును పొందుచున్నారు. ఇట్టి ఐహిక, పారలౌకిక సుఖ ప్రాప్తియే - భారతీయ దర్శనమున ముఖ్య విశేషము.

భారతీయ దర్శన చరమ లక్ష్యము - మోక్ష ప్రాప్తియే. ఇందుచే, మానవుఁడు అట్టి మోక్ష ప్రాప్తికై - సత్కర్మ లగు తప మును, త్యాగమును చేయును. ఈ తప - త్యాగముల వలన, భార తీయ దర్శనము అష్టాంగ యోగ విధానముతో ముడిపడుచున్నది.

భారతీయ దర్శనములలో ఆస్తిక దర్శనము లన్నియు ఆధ్యా త్మిక చైతన్య ప్రాప్తియే ధ్యేయముగా గలిగి యున్నవి. ఈ దర్శన వాఙ్మయమునకు ఉపనిషత్తులు ఉపజీవ్యగ్రంధములుగా నున్నవి. ఉపనిషత్తులలో ప్రధానముగ - బ్రహ్మను గూర్చియు, ఆత్మను గూర్చియు అభివర్ణింపఁబడినది. 'ఆత్మ యన నేమి ? అది నిత్యమా ? అనిత్యమా ? అది ఏకమా ? అనేకమా ? ఆత్మకు, పరమాత్మకు సంబంధ మేమి ?' అను ఆత్మజ్ఞాన జిజ్ఞాస వలన ఉత్పన్న మగు ఇట్టి ప్రశ్నలు - భారతీయ దర్శనములకు మౌలిక సత్త్వములై యున్నవి.

"స బ్రహ్మవిద్యా సర్వవిద్యా ప్రతిష్ఠా మధర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ."

అని, బ్రహ్మ విద్య - సర్వ విద్యలలో ప్రతిష్ఠాత్మకమైనదిగా - ముండ కోపనిషత్తులో చెప్పఁబడినది. కృష్ణభగవానుఁడు కూడ గీతలో -

"అధ్యాత్మవిద్యా విద్యానామ్."

అని చెప్పుచు, ఆధ్యాత్మ విద్యకు అగ్ర స్థాన మిచ్చియున్నాఁడు.

జీవిత వ్యాఖ్యానమును పరామర్శించుటయే భారతీయ దర్శనముల ముఖ్యోద్దేశము. ఆధ్యాత్మిక - ఆధిభౌతిక - ఆధిదైవిక - ఆత్యంతిక దుఃఖ నివృత్తి నిమిత్తమే భారతీయ దర్శన శాస్త్రములుద్దేశింపఁబడినవి. భారతీయ ధర్మము దార్శనికము లగు అనుభూతులపై ఆధారపడి యున్నది. భారతీయ ధర్మప్రాణు లగు ప్రజల నిమిత్తమై దర్శన శాస్త్రము ప్రాముఖ్యము వహించి యున్నది. భారతీయ దర్శనములలో జీవిత వ్యవహారమున కెంతటి ప్రాముఖ్యము కలదో, ఆ దర్శనము లంతటి ప్రాముఖ్యమును పొంది యున్నవి. ఇందువలన, సిద్ధాంతము, వ్యవహారము - అనువాని సమన్వయమే ఈ దర్శనముల మౌలిక విశేషమై యున్నట్లు తెలియ నగును.

పాశ్చాత్య విద్వాంసులు భారతీయ దర్శనమును - 'నిరాశా వాద దర్శన' మని యందురు. కాని, వీరి యీ యాక్షేపణము సరియైనది కాదు. ఏలనన, వేదాంతము నందలి బ్రహ్మ పదార్థము ఆనంద స్వరూపము. ఇట్టి ఆనంద స్వరూపుఁ డగు బ్రహ్మను పొందుటకై, నిరాశా వాదులు ప్రయత్నింపరు. భారతీయ దర్శనములు సర్వథా ఆశా వాదముతో కూడి యున్నవి. ఇందుచే -

" పశ్యేమ శరద శ్శతం । జీవేమ శరద శ్శతం
నన్దామ శరద శ్శతం । మోదామ శరద శ్శతం
భవామ శరద శ్శతం । శ్రుణుయామ శరద శ్శతం
ప్రబ్రవామ శరద శ్శతం । అజీతాస్యామ శరద శ్శతమ్. "

'మనము నూఱు సంవత్సరములు జీవించి, విజ్ఞానమును సంపాదింతము. సంపాదించిన విజ్ఞానమును లోకములకు ప్రబోధింతము. పరు లగు శత్రువులచే ఎన్నఁడును తెలియ కుందుము గావుత! ఎల్లప్పుడు మనము - విజేతల మగు మన వైభవమును దశ దిశలలో

ప్రకటింతము గావుత !' అని యిట్లు వేదమున ఆకాంక్షింపఁబడినది. ఈ రీతిగా - నూఱు వర్షముల వఱకు సుఖము జీవితాశయముగాఁ గల భారతీయ దర్శనము - నిరాశావాది కాఁజాలదు.

భారతీయ దర్శనము - విద్య, అవిద్య - అను విషయములను గూర్చి నిశితముగ చర్చించును. ఈ దర్శనము - జ్ఞాన మహత్వమును విశేషముగ పరిగణించును. ప్రకృతిలో - జనన మరణ లోభ మోహ రూపము లగు బంధనములకు అవిద్యయే ముఖ్య కారణము. అట్లే, మోక్ష కారణము జ్ఞానము అనఁగా - విద్య. అట్టి విద్యకు కారణము - మానవ జీవిత చక్రమున భోగములచే ముక్తి పొందుట. అనఁగా - మానవుఁడు ఈ జన్మ నుండియే జ్ఞాన సాధనము వలన పూర్ణత్వము పొందును. ఇట్టి జ్ఞాన ప్రాప్తికై మానవుఁడు సాధన చేయును. అట్టి సాధనలో - యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధు లను అష్టాంగ యోగము లను అనుష్ఠించుట ఆవశ్యకము. ఇట్టి సాధనచే చిత్త వృత్తులను నిరోధించి, మానవుఁడు జ్ఞానమును పొందఁ గల్గును. సాంఖ్య, యోగ, న్యాయ దర్శనములు - వివిధ దుఃఖములను నివృత్తి చేయఁ గల వనియు, అదియే మోక్ష మనియు కొందఱు భావింతురు. కాని, వేదాంతులు - అట్టి భ్రమను, అజ్ఞానమును దూర దూరము చేసి, వివేక - విజ్ఞానములు లభించుటకై మిక్కిలి శ్రమించి సాధన చేయుచు, భక్తిరూపాపన్న మగు జ్ఞాన మార్గమున పయనింతురు. తత్ఫలముగా అట్టి సాధకులకు - దుఃఖ నివృత్తి మాత్రమే గాక, అలౌకిక మగు ఆనందానుభూతియుఁ గల్గును.

భారతీయ దర్శనము సమన్వయ ప్రధానమైనది. వివిధ విచార ముల, ధర్మముల, జీవిత వ్యవహారముల ముఖ్య లక్ష్యము ఆ బ్రహ్మయే. "బ్రహ్మ తల్లక్ష్య ముద్యతే" ప్రత్యేక దర్శనము, ప్రత్యేక భార

తీయ ప్రవృత్తియు ఆ బ్రహ్మ ననుసరించియే యుండును. అట్టి బ్రహ్మ భావన యందే అనేకత్వమున ఏకత్వమును దర్శింపఁగల్గు చున్నారు. ఇదియే భారతీయ దర్శన సంకల్పము. ఉదాహరణకు -

" స యథా సర్వాసా మపాం సముద్ర మేకాయనమ్. "

అనునట్లు - నదు లన్నియు సముద్రమునఁ గలిసినట్లు, భారతీయ దర్శనము కూడ అంతర్గతముగా ఆ పరమాత్మ తత్త్వమునే ప్రతిపా దించును. కావున, భారతీయ దర్శనము - సమన్వయ ప్రధానమైన దిగా సంభావింప నగును.

పర లోకము, పున ర్జన్మము - అను విషయములపై భారతీయ దర్శనము విశ్వాస ముంచును. భారతీయము లగు ఆస్తిక దర్శనము లన్నియు - పున ర్జన్మ, పర లోకము - అను విషయములపై ఆస్థయు, విశ్వాసము - వ్యక్తము చేయును. ఇందువలన, ఈ సృష్టిలో ఒక శక్తి తన పనిని తాను కొనసాగించుచున్న దనియు స్పష్ట మగును. ఇట్టిది ఋగ్వేదమున - 'ఋతము' అని చెప్పఁబడినది. అట్టి ఋతము - ఈ బ్రహ్మాండ మంతయు వ్యాపించి యున్నది. అది యొక ప్రత్యేక తత్త్వముగా ప్రవర్తించుచున్నది. ఈ ఋతము ననుసరించి మాన వుఁడు తాను చేయు కర్మలనుఁబట్టి -

" అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్. "

అనునట్లు, ఫలమును కూడ అనుభవించును. దీనినిఁబట్టి, మానవుఁడు తన సత్కర్మాచరణము వలన భాగ్యవంతుఁ డగుటకు అవకాశము గల్గియున్నాఁడు. ఇట్టి భాగ్య స్థితి - 'అపూర్వ మగు అదృష్టము' అని వ్యవహరింపఁబడును. మానవుఁడు తాను చేయు కర్మలనుఁబట్టి భోగము లనుభవించును. ఆత్మసంయమనాదులలో నతఁడు శిక్షను పొంది, శుభ కర్మల నాచరించును.

భారతీయ దర్శనమున - వ్యావహారిక జ్ఞాన విషయమును గురించి అనేక ప్రమాణములు గన్పట్టును. అట్టి జ్ఞానము - మిక్కిలి మహత్తర మైనదని అందు వర్ణింపఁబడును. భౌతిక వాదులగు చార్వాకులు కేవలము ప్రత్యక్ష ప్రమాణమును, బౌద్ధ - జైన - వైశేషికములు ప్రత్యక్ష, అనుమాన ప్రమాణములను, సాంఖ్యులు ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణములను, న్యాయ దర్శనము ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద, అర్థాపత్తులనే గాక, అభావమునుఁ గూడ ప్రమాణములుగా స్వీకరించుచున్నవి.

ఋగ్వేదము నందలి పురుష సూక్త, నాసదీయ సూక్త, హిరణ్య గర్భాది సూక్తములలో భారతీయ దర్శన స్రవంతి - వివిధ రూపములలో ప్రవహించుచున్నది. ఈ స్రవంతి - అథర్వ, యజుర్వేద మంత్రములనుండి ఔపనిషద కాలము వఱకు కాలక్రమమున విస్తరించుచున్నది. ఈ స్రవంతియే దర్శన శాస్త్ర రూపమున వెలువడినది. వస్తుతః అట్టి దార్శనికుల విచారమే వారి ఆధ్యాత్మిక మానస సరోవరమై యొప్పుచున్నది. అచటినుండి జ్ఞాన మనఁబడు నిర్మల గంగా ప్రవాహము కేవలము భారతీయులకే గాక, విశ్వమందలి సకల దార్శనికుల హృదయములను పావనము చేయుచున్నది. అయ్యది - ఐహిక, ఆముష్మిక శుభములను సాధించుచు, నిరంతరము ప్రవహించుచునే యున్నది.

భారతీయ దర్శనము వివేచనాత్మ కలదియై, ప్రసిద్ధి గాంచినది. పరంపరగా ప్రసిద్ధ మగు ఐతిహాసిక జన శ్రుతు లిందు వ్యాఖ్యానింపఁబడలేదు. విచారముల నన్నిటిని తన తార్కిక బుద్ధి యను గీటురాతిపై పరీక్షించియే గౌరవించుచున్నది. భారతేతర దేశము

లందు వలె - ధర్మము దర్శనముపై ఆధారపడి యుండలేదు. భారతీయ తత్త్వ జ్ఞానము సమీక్షాత్మకమై యుండుటయే ఇందులకు కారణము. భారతీయ దార్శనికు లెల్లరును ఈశ్వరుని కూడ సమీక్షా విషయమున గైకొనియున్నారు.

## 4. ఆస్తికులు - నాస్తికులు

భారతీయ దర్శనములను - ఆస్తిక దర్శనములు, నాస్తిక దర్శనములు - అని రెండు విభాగములు చేయవచ్చును. ఆస్తికుఁడనఁగా - 'ఈశ్వర వాది' యనియు, నాస్తికుఁ డనఁగా 'నిరీశ్వర వాది' యనియు జన సామాన్యము భావించుట పరిపాటి. కాని, ప్రాచీన కాలము నుండియు దార్శనిక విషయమున ఈ రెండు శబ్దములును భిన్నార్థ ద్యోతకములుగా భావింపఁబడుచున్నవి. వేదములను పరమ ప్రమాణములుగా భావించువారు ఆస్తికు లనియు, వేద విరోధులు నాస్తికు లనియు చెప్పఁబడుచున్నారు. అదియునుఁగాక, పర లోకము కల దని విశ్వసించువారు ఆస్తికు లనియు, పర లోకము నందు విశ్వాసము లేనివారు నాస్తికు లనియు వ్యవహరింపఁబడుచున్నారు.

## 5. నాస్తిక దర్శనములు

చార్వాకము, జైనము. బౌద్ధము - అనునవి మూఁడును నాస్తిక దర్శనములుగా పరిగణింపఁబడుచున్నవి.

## 6. చార్వాక దర్శనము

అవైదిక దర్శనములలో ఈ చార్వాక దర్శనము అతి ప్రాచీనమైనది. ఇయ్యది - మహా భారత కాలమున కంటెను పురాతనమైన

డని అభిజ్ఞుల వరీక్షణ. ఈ దర్శనమునకు - అక్రియా వాదము, అజ్ఞాన వాదము, నాస్తిక వాదము, బార్హస్పత్యము, లోకాయతము, చార్వాకము - అను నామాంతరములు కలవు.

ఈ లోకమే ఆత్మకు క్రీడా స్థలము. దీని కంటెను పరలోక మనునది వేరేదియు లేదు. ఈ శరీరమే ఆత్మ. మరణమే ముక్తి. కావున, శరీరములో ప్రాణ మున్నంత వఱకు సుఖప్రాప్తికై ప్రయత్నింపవలెను. ధర్మము ఒక పురుషార్థము కాదు. మానవ జీవితానందమున కుపయుక్త మగునదియే పరమ పురుషార్థము.

ఈ దర్శన ప్రాచీన నామము - లోకాయతము. ఈ దర్శనము ననుసరించువారు - బుద్ధి వాదముపై ఆస్థ కలిగియుండురు. ఏకపక్ష ఖండనమే వారి సిద్ధాంతము. తమ వాదమునకు ఏ విధమైన బలమును ఉండదు. ఇందువలన, దీనిని పూర్వము - 'వైతండిక' మని వ్యవహరించెడివారు. నిర్విచారము గల సామాన్య ప్రజల వలె ఆచరణము గల్గినవారగుటచే, ఈ సంప్రదాయులను - 'లోకాయతు' లనియు, 'లోకాయతికు' లనియు వ్యవహరించెడివారు. బృహస్పతి శిష్యుఁడగు చార్వాకునిచే ప్రచారము చేయఁబడినందున - 'చార్వాక' మని అతని పేర సిది వ్యవహరింపబడసాగెను. తినుము (చర్వ = కొవ్వు పదార్థమును భుజించుము), త్రావుము, ఆనంద మనుభవించుము. ఈ సిద్ధాంతములు గల దగుటచే నిది 'చార్వాక' మనఁబడుచున్నది. పుణ్య పాప వస్తు జాతమును చర్వణము చేయుటచే ఈ దార్శనికులు - 'చార్వాకులు' అని వ్యవహరింపఁబడిరి. తళుకు బెళుకు గల భాషణము చేయుటచే వీరికి - 'చారు వాకము' అను పేరు వచ్చెను. ఈ దర్శనమును ఉపదేశించినది బృహస్పతి యగుటచే, భారతీయ దర్శనేతిహాసమున నిది - 'బార్హస్పత్య' మనియు వ్యవహృత మైనది.

ఈ చార్వాక దర్శనము కేవలము భౌతిక వాదముతోఁ గూడినది. ప్రత్యక్ష ప్రమాణమున మాత్రము విశ్వాసము గలది. ఈ మతమున - ఈశ్వరుఁడు, పర లోకము, ఆత్మ, స్వర్గము, నరకము అనునవి యేవియు లేవు. జీవితాంతము వఱకు తినుము, త్రాగుము, సుఖముగా జీవించుము - అనియే వీరి ముఖ్య ప్రబోధము. శరీరము భస్మమైన పిమ్మట - మఱల ఈ ప్రపంచమునకు రాదు గనుక, అప్పు చేసియైనను - నేయి త్రావు మని ఈ చార్వాక దర్శన మిట్లు ప్రబోధించుచున్నది :-

" యావ జ్జీవే త్సుఖం జీవేత్, ఋణం కృత్వా ఘృతం పిబేత్
భస్మీ భూతస్య దేహస్య, పున రాగమనం కుతః ? "

అధ్యాత్మ వాదము, పాప పుణ్యములు - సర్వథా మిథ్యలు, బూటకము. లోకమున కన్నులకు గన్పట్టు భూమి, అగ్ని, జలము, వాయువు - ఈ నాల్గు త త్త్వములే సత్యములు. ఈ శరీరములో - ఈ నాల్గు భూతముల సంయోగముచే జీవాత్మ ఉత్పన్న మగును. అట్టి జీవాత్మ పోయినంతనే శరీరము పతన మగును. అదియే మరణము. మరణానంతరము ఇంకను ఏమియు లేదు. ఇదియే ఈ చార్వాక దర్శన సిద్ధాంతము. ఇందుచే ఈ దర్శనమున ప్రత్యక్షమే ప్రమాణముగా భావింపఁబడుచున్నది. కాని, అనుమానాది ప్రమాణముల కిందు తావు లేదు.

చార్వాకుల జీవితోద్దేశ్యము - ద్రవ్య ప్రాప్తి, భోగానుభవము. వీరి మతమున వేదముల రచయిత - ధూర్తుఁడు, నిశాచరుఁడు. ఈ దర్శనమును వివరించు 'బార్హస్పత్య సూత్రములు' అను గ్రంథము నేఁడు లభించుట లేదు. 'ప్రబోధ చంద్రోదయ' మను గ్రంథమునందలి ద్వితీయాంకములో - ఈ చార్వాక సంప్రదాయులు - 'లోకాయతు' లని పేర్కొనఁబడిరి.

# 7. జైన దర్శనము

క్రీ: పూ: 6 - వ శతాబ్దమునకుం జెందిన మహావీరుఁడు (599 - 627) ఈ దర్శనమునకు మూల పురుషుఁడు. ఈ దర్శనమున - ప్రత్యక్షము, అనుమానము - అనునవి రెండును ప్రమాణములు. జీవుఁడు, అధర్మము, పుద్గలము, ఆకాశము - అనునవి యైదు తత్త్వము లని కొందఱి అభిప్రాయము. ఈ అయిదింటితో కాలమును చేర్చి ఆఱు తత్త్వము లని కొంద ఱందురు. జీవము, అజీవము, ఆస్రవము, బంధము, సంవరము, నిర్జవము, మోక్షము - అను ఏడింటిని తత్త్వములుగా మఱి కొందఱు తలంచిరి. వీనితో పుణ్య పాపములను చేర్చి, తొమ్మిది తత్త్వము లని కొంద ఱందురు. కాని, జీవము, అజీవము - అను రెండు తత్త్వములే సాధారణముగ ఈ దర్శనమున కానవచ్చును.

జీవ మనఁగా ఆత్మ. ఆత్మ యనునది ఉన్ననేగాని - లౌకిక ఫలములను సాధించుటకు అవకాశము కలుగదు. కనుక, ఆత్మ తప్పక ఉండవలెను. ఈ ఆత్మలు - బద్ధు లనియు, యోగసిద్ధు లనియు, ముక్తు లనియు - మూఁడు విధములుగా నుండును. 'అజీవ' మనఁగా - మిగిలిన ధర్మాధర్మ పుద్గలాదులు. పుద్గల మనఁగా - రూప రస గంధ స్పర్శవంతము లగు వాయు, వహ్ని, జల, తను, భువనాదులుగా నుండును. కాల మనఁగా - స్వరూపము. ఒక్కటియై, అంతులేని విస్తీర్ణము గలది ఆకాశము. అణువుగా నుండు కాలము గాక, మిగిలిన జీవ - ధర్మ - అధర్మ - పుద్గల - ఆకాశములు అయిదును 'పంచాస్తి కాయములు' అని చెప్పఁబడుచున్నవి. ఒకే విధము లగు పరమాణువులు - పరిమాణముచే పృథివి మొదలగునవిగా రూపొంది, జగత్తునకే ఉపాదాన మగుచున్నది.

ఈ జైన దర్శనమున దేవుఁడు లేఁడు. సర్వజ్ఞుఁడైన జినుఁడే దేవుఁడు. అతఁడు దోషములను జయించినవాఁ డగుటచే, పూజ నీయుఁ డగు నని ఈ జైన సంప్రదాయుల విశ్వాసము. సమ్యక్ దర్శనము, సమ్యక్ జ్ఞానము, సమ్యక్ చరిత్రము - అనునవి మూఁడును ప్రత్యేకముగ గాక, ఒకటిగా చేరి, మోక్షమునకు హేతు వగును.

ఈ సమ్యక్ దర్శన - సమ్యక్ జ్ఞాన - సమ్యక్ చరిత్రములలోఁ గల విశేషము లగు మలధారణము, దిగంబరత్వము, విషయ నైరా గ్యము, పాణిపాత్ర భోజనము, కేశోల్లుంఛనము, వాఙ్నియమము - అను నియమములను ఆచరించుటచేతను, దేహమునకంటె అతిరిక్త మగు ఆత్మజ్ఞానము చేతను ప్రకృతి బంధము క్షీణింపఁగా, ఊర్ధ్వ గతి లభించును. ఇదియే మోక్షము.

వస్తువు లన్నియు - సత్త్వాసత్త్వములుగా, నిత్యానిత్యములుగా, భిన్నాభిన్నములుగా నుండు నని వీరి మతము. ఈ మతమున - దిగం బరులు, శ్వేతాంబరులు - అని రెండు వర్గములుగాఁ గలరు. దిగంబరులు - లుంచిత కేశులు, క్షమాశీలురు, నిస్సంగులు నగు జైన సాధువులు. రెండవ వర్గమునకుఁ జెందిన శ్వేతాంబరులు - లుంచిత కేశులు, పాణి పాత్రులును అగుచు, దాత గృహమున భుజింతురు. స్త్రీలకు ముక్తి లే దని దిగంబరు లందురు. దాని నంగీక రింపరు శ్వేతాంబరులు. ఈ జైన మతమునకు - 'అర్హాత మత' మనియు నామాంతర మున్నది.

## 8. బౌద్ధ దర్శనము

ఈ దర్శన కర్త - గౌతమ బుద్ధుఁడు. ఈతఁడు మహా వీరు నకు సమకాలికుఁడు. ఈ బౌద్ధ దర్శనమున - ప్రత్యక్షము, అను

మానము - అనునవియే ప్రమాణములు. అయిదు సంబంధములు, పండ్రెండు ఆయతనములు, పదునెనిమిది ధాతువులు - వీరి తత్త్వములు.

సర్వము క్షణికము, దుఃఖము, స్వలక్షణము, శూన్యము - అను చతుర్విధ భావనయే ముక్తి యని వీరి మతము. ఈ మతమున - ఆత్మధార నిలిచిపోవుటయే మోక్షము. ఆత్మ వినాశమే మోక్ష మని దీని తాత్పర్యము.

ఈ బౌద్ధులలో - మాధ్యమికులు, యోగాచారులు, సౌత్రాంతికులు, వైభాషికులు - అని నాలుగు వర్గములు కలవు.

## 1. మాధ్యమికుఁడు :—

యోగము, ఆచారము - అను ఈ రెంటిని శిష్యుఁడు తప్పక పాటింపవలసిన విధులు. యోగ మనఁగా - తెలియని యర్థమును తెలిసికొనుటకై ప్రశ్నించుట. ఇందు మాధ్యమికుఁడు - గురువు చెప్పిన అర్థముల శూన్యత్వములను అంగీకరించుటచే ఉత్తముఁడును, ప్రశ్నింపకుండుటచే అధముఁడును అగుచున్నాఁడు. ఉత్తమత్వ, అధమత్వములు ఒక్కనియందు ఉండనేరవు గనుక, ఇతఁడు ఉత్తముఁడనుటకు అవకాశము లేదు. కావున, ఇతనిని మాధ్యమికుఁ డని వ్యవహరింతురు. ఇట్టి వీనికి - జ్ఞానము, జ్ఞేయము - అనునవి రెండును శూన్యములు. ఇట్టి మాధ్యమికులకు శూన్యత్వమే తత్త్వము.

## 2. యోగాచారుఁడు :—

గురువు ఉపదేశించిన భావనా చతుష్టయమును అంగీకరించుటచే ఆచారములును, ఆంతర పదార్థము లెట్లు శూన్యము లని ప్రశ్నించుటచే యోగమును ఇతనికి కలవు కావున, యోగాచారుఁ

డని వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఇట్టి యోగాచారులు - జ్ఞేయము, శూన్యము, జ్ఞానము అను వానిని మాత్రము సత్య మని తలంతురు.

### 3. సౌత్రాంతికుఁడు :—

ఆంతర పదార్థ మంగీకరించి, బాహ్య పదార్థములు అనుమేయము లను నతఁడు సౌత్రాంతికుఁడు. బుద్ధుఁ డుపదేశించిన నాల్గు సూత్రములలో మూఁడింటిని విని, మననము చేసి, 'ఎవరి సూత్రమేది?' అని ప్రశ్నించుటచే, ఇతఁడు సౌత్రాంతికుఁ డనఁబడుచున్నాఁడు. బాహ్యాభ్యంతర పదార్థములు రెండును తత్త్వములే గాని, బాహ్య పదార్థములు అనుమేయము లని ఈ సౌత్రాంతికులు పలుకుదురు.

### 4. వైభాషికుఁడు :—

బాహ్య - ఆంతర పదార్థములు రెంటిని అంగీకరించి, బాహ్య పదార్థములు లేనందునను, 'నీ భాషణము విరుద్ధముగా నున్నది' అనుటచేతను ఇతఁడు వైభాషికుఁ డనఁబడుచున్నాఁడు. ఈ వైభాషికులు - ఆంతర జ్ఞాన - బాహ్య జ్ఞేయ పదార్థములు రెండును సత్యములే యని యందురు.

ఈ దార్శనికులు - క్షణిక విజ్ఞాన వాదులు. ఆత్మ నిత్యత్వమును, పునర్జన్మను, వేద ప్రామాణ్యమును అంగీకరింపనందున, వీరు నాస్తికులుగా పరిగణింపఁబడుచున్నారు.

ఈ బౌద్ధ మతము - హీన యాన మనియు, మహా యాన మనియు, వజ్ర యాన మనియు - ముత్తెఱంగులుగా రూపొందినది.

1. హీనయానము :—

హీన యాన మనఁగా - నికృష్ట మార్గ మనియు, నిమ్న మార్గ మనియు అర్థములు. ఈ శబ్దమును మహాయానులు తమ ప్రత్యర్థుల నుద్దేశించి ప్రయోగించిరి. హీనయాన సంప్రదాయము గృహస్థుల కనుకూలమైనది. ఇది నివృత్తి ప్రధానమైన గృహస్థాశ్రమ మును పరిత్యజించువారి నిమిత్తమై ఉద్దేశింపఁబడినది. ఈ మతమున బుద్ధుఁడు సామాన్య మానవుఁడు. అతఁడు తన కర్తవ్య పాలనము వల్లనే బుద్ధత్వమును పొందెను. ఈ మతమున జీవిత లక్ష్యము బుద్ధ త్వము కాదు. కాని, 'అర్హత' అను పద ప్రాప్తికై ఉద్దేశింపఁబడినది. హీనయాన మార్గమున నిర్వాణము నొందు భిక్షువు - 'అర్హతను' పొందుచున్నాఁడు. ఈ సంప్రదాయమునకు లోక కల్యాణ కాంక్ష లేదు. ఈ మతానుయాయు లగు భిక్షుకులు - అనిత్యము, క్షణ భంగురము నగుదానిని విశ్వసింతురు. లోకమున పరివర్తన ప్రభావము పరివ్యాప్త మగుచున్నది. అట్లు వస్తువు లన్నియు - అనిత్యములు క్షణభంగురములునై యున్నవి.

ఈ హీనయాన సంప్రదాయులు - అనాత్మవాదమును విశ్వ సింతురు. దీని తాత్పర్య మే మనఁగా - రూపము (భౌతికతత్త్వము), వేదన, సంజ్ఞ, సంస్కారము, విజ్ఞానము - అను ఐదు స్కంధములతో వ్యక్తిత్వ నిర్మాణము జరుగుచున్నది - అని. ఇందు ప్రతి క్షణము పరివర్తన మగుచుండును. ఆత్మ ఏవిధముగను స్థిరముగా నుండదు. అష్టాంగ యోగ మార్గములును ఈ సంప్రదాయమునకు అంగము లుగా నున్నవి. ఈ హీనయాన సంప్రదాయము కూడ - వైభాషి కము, సౌత్రాంతికము - అను రెండు విభాగములుగా రూపొందినది.

**2. మహా యానము :—**

మహా యాన మనగా - ఉత్కృష్ట మార్గ మని యర్థము. ఈ బౌద్ధ ధర్మ శాఖ - క్రీ: శ: మొదటి శతాబ్దమున ప్రచారమునకు వచ్చెను. మొదటి శతాబ్దమునందే నాగార్జునుడు తన ప్రతిభచే ఈ సంప్రదాయమునకు దార్శనిక ప్రతిపత్తిని కల్గించెను. హీన యాన సంప్రదాయమున బుద్ధికి సామాన్య మానవ మాన్యత లభించెను కాని, భక్తి ప్రచార మహోద్యమ మారంభ మైనంతనే, అవతార వాదమున బౌద్ధ మతము తట్టుకొనజాల దయ్యెను. మహా యాన సంప్రదాయులు - బుద్ధుని ఈశ్వరునిగా భావించిరి. ఈ బోధిసత్వ కల్పనమే - మహా యాన సంప్రదాయము నందలి విశేషము. ఈ కల్పనను ఆధారము గావించుకొని, ఈ మహా యాన సంప్రదాయము లోకమున ఒక ప్రత్యేక స్థానమును సంపాదించెను. బోధిసత్వు డనగా - జ్ఞానమును కోరువాడని యర్థము.

బోధి సత్వుడు లోకమున గల సమస్త ప్రాణుల దుఃఖమును నివారించి, తాను నిర్వాణము నొందుట తన జీవిత లక్ష్య మని ఈ మహాయాన సంప్రదాయుల మనో భావన. లోకమున ఒక్కొక్క ప్రాణి ముక్తుడు కానంత వఱకు - అతడు నిర్వాణమును పొందు టకు ప్రయత్నించుటలేదు. ఆతని జీవిత లక్ష్యము స్వార్థ సిద్ధి కాక, పరోపకారమై యుండి, అతడు ప్రపంచము నందలి ప్రతి వ్యక్తిని తన వలెనే భావించెను. మానవ సమాజము నుద్ధరించుటకు బుద్ధుడు అనేక విధములుగా యత్నించె నని ఈ మహాయాన సంప్రదాయుల అభిప్రాయము. 'సద్ధర్మ పుండరీక' మను గ్రంథము - ఈ మహాయాన సంప్రదాయమునకు ప్రమాణ గ్రంథము. నిజ మగు ప్రేమతో బుద్ధ భగవానుని - బుద్ధి యను పుష్పముతో పూజించిన యెడల, అట్టి సాధకునకు సుఖము లభించు నని వీరి విశ్వాసము. ఈ రీతిగా మహా

యాన సంప్రదాయములు - నిరీశ్వర వాదియు, శుష్క నివృత్తి ప్రధానము నగు హీనయాన సంప్రదాయమునకు భిన్నముగ, ఈశ్వర వాదిగా - ప్రవృత్తి ప్రధానముగా తమ సంప్రదాయమును రూపొందించిరి.

## 3. వజ్ర యానము :-

ఇది బౌద్ధ మతము నందలి చివరి సంప్రదాయము. ఈ సంప్రదాయమున - తంత్ర మంత్రములు ప్రధానములు. క్రీ: శ: 5, 6 శతాబ్దములకు పిమ్మట - తంత్ర మంత్ర ప్రభావముచే ఈ సంప్రదాయ ముద్భవించెను. ఈ సంప్రదాయమున - 'గృహ్యా సమాజము' మున్నగు అనేక తంత్ర గ్రంథములు రచింపఁబడినవి. ఈ సంప్రదాయమున - మద్యము, మాంసము, మైథునము, హఠ యోగము - అను వానికి సంబంధించిన శిక్షణము ముఖ్య విషయము. ఈ వజ్రయాన సంప్రదాయము నిరీశ్వరవాది యైనను, ఆచరణమున తాంత్రిక మగు క్రియా కలాపముతో కూడి యున్నది. ఈ మహాయాన సంప్రదాయము - టిబెట్టు, చీనా - మొదలగు దేశములలో విశేషముగ వ్యాపించెను.

ఈ వజ్ర యానమున - వజ్రము నందలి అలౌకిక తత్త్వము స్వీకరింపఁబడినది.

ఈ వజ్ర యాన సంప్రదాయమున - దేవతా స్త్రీలను ఉపాసించుట - తాంత్రిక క్రియల ప్రభావముచే వృద్ధి యయ్యెను. భ్రష్టాచారముల సంఖ్య హెచ్చెను. ఇందులకు ఫలితముగా - ఈ సంప్రదాయము పతనమై, భారత దేశమునుండి అదృశ్య మయ్యెను.

## 9. ఆస్తిక దర్శనములు

న్యాయ - వైశేషిక - సాంఖ్య - యోగ - పూర్వ మీమాంసా - ఉత్తర మీమాంసా (వేదాంత) దర్శనము లాఱును ఆస్తిక దర్శనములుగా పరిగణింపఁబడుచున్నవి. ఈ దర్శనములు - క్రీః పూః 5 - వ శతాబ్దము మొదలుకొని, మొదటి శతాబ్దము వఱకు వెలువడె నని చారిత్రకుల అభిప్రాయము.

## 10. న్యాయ దర్శనము

న్యాయ దర్శనము నందలి విషయము - న్యాయమును వివేచించి చేయు ప్రతిపాదనము. న్యాయ మనఁగా - "ప్రమాణై రర్థ పరీక్షణం న్యాయః" (వాత్స్యాయన న్యాయ భాష్యము : 1-1-1.) అనునట్లు, వివిధ ప్రమాణముల సహాయముచే వస్తు తత్త్వమును పరీక్షించుట. ఈ దర్శనమును గౌతమ మహర్షి ప్రవర్తింపఁజేసెను. ఈతనికి అక్షపాదుఁ డనియు నామాంతర మున్నది. ఇతఁడు క్రీః పూః 3 - వ శతాబ్దమునకుఁ జెందినవాఁడు. కాని, క్రీః శః 5 - వ శతాబ్దము నుండి ఈ దర్శనము వెలుగునకు వచ్చెను. ఈ న్యాయ దర్శన వికాసమునకు రెండు శాఖలు కానవచ్చును. మొదటిశాఖ సూత్రకారుఁ డగు గౌతముని నుండి వెలువడినది. ఇందు - ప్రమాణము, ప్రమేయము, సంశయము, ప్రయోజనము - మున్నగు పదునాఱు పదార్థములను వివేచించిన కారణము వలన, ఇది - 'పదార్థ మీమాంసాత్మకము' - లేక, 'ప్రాచీన న్యాయము' అని చెప్పఁబడుచున్నది. ఇఁక రెండవ శాఖ - ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దప్రమాణము - అనువానిని సూక్ష్మముగా విచారించుటచే, ఇయ్యది - 'నవ్య న్యాయ ధార' యనియు, 'ప్రమాణ మీమాంసాత్మక స్రవంతి' యనియు చెప్పఁబడుచున్నది.

ఈ న్యాయ దర్శనమున పదునాఱు తత్త్వము లున్నవి. అవి యివి :- (1) ప్రమాణము (2) ప్రమేయము (3) సంశయము (4) ప్రయోజనము (5) దృష్టాంతము (6) సిద్ధాంతము (7) అవ యవము (8) తర్కము (9) నిర్ణయము (10) వాదము (11) జల్పము (12) వితండము (13) హేత్వాభాసము (14) ఛలము (5) జాతి (16) నిగ్రహ స్థానము - అనునవి.

ఈ పదునాఱు తత్త్వములలో - ప్రమాణము, ప్రమేయము - అను మొదటి రెండు తత్త్వములును ముఖ్యములు. మిగిలినవి గౌణ ములు. 'ప్రమాణము' జ్ఞాన ప్రాప్తి సాధనము. "యథార్థానుభవః ప్రమాంత త్సాధనం ప్రమాణమ్." యథార్థమైన అనుభవమే ప్రమ. అట్టి ప్రమను సాధించునదియే ప్రమాణము. "ప్రమీయతే అనే నేతి ప్రమాణమ్" అని దీని వ్యుత్పత్తి. (1) ప్రత్యక్షము (2) అను మానము (3) ఉపమానము (4) శబ్దము - అని, ఈ ప్రమాణములు నాలుగు విధములు. ఇంద్రియముల యొక్కయు, అర్థము యొక్కయు సంయోగముచే లభించు జ్ఞానమును 'ప్రత్యక్ష ప్రమాణ' మని యందురు. ఈ ప్రత్యక్షము కూడ - నిర్వికల్పకము, సవికల్పకము - అను భేదముచే రెండు విధములు. ఏ హేతు జ్ఞానముచే, ఆ హేతు ధారణ చేయు వస్తు జ్ఞానమును పొందుట - 'అనుమాన' మని చెప్పఁ బడును. ఎట్లనఁగా - "యత్ర ధూమః తత్ర వహ్నిః" అనునట్లు పర్వత శిఖరము నందలి అగ్నిసత్తా జ్ఞానమును పొందుట. అనఁగా - 'ఈ పర్వతము వహ్ని కలిగి యున్నది' అనునది - అనుమాన ప్రమాణ విషయము. ఈ అనుమాన ప్రమాణము న్యాయ సూత్ర ములలో - 'పూర్వవత్, శేషవత్, సామాన్యతోదృష్టము' అని మూఁడు విధములుగా చెప్పఁబడినది. ఈ అనుమాన ప్రమాణము నకు - స్వార్థానుమాన మనియు, పరార్థానుమాన మనియు మఱి

రెండు భేదములు కలవు. నైయాయికుల మూఁడవ ప్రమాణము ఉపమానము. పూర్వానుభవముచే, దృష్ట వస్తువును సాదృశ్యముగ భావించుట - 'ఉపమాన' మని చెప్పఁబడును. నాల్గవ ప్రమాణము శబ్దము. " ఆప్తోపదేశః శబ్దః " (న్యా : సూ : 1. 1-6.) ఆప్తుఁడైన వ్యక్తి యొక్క ఉపదేశమును 'శబ్ద ప్రమాణ' మని యందురు.

న్యాయ దర్శనమున వివేచింపఁదగిన రెండవ తత్త్వము - 'ప్రమేయము. ప్రమేయ జ్ఞానము ముక్తికి సాధనము. ఈ ప్రమేయము పండ్రెండు విధములు. అవి యివి :- (1) ఆత్మ (2) శరీరము (3) ఇంద్రియములు (4) అర్థము (5) బుద్ధి (6) మనస్సు (7) ప్రవృత్తి (= శరీర వ్యాపారము) (8) దోషము (9) ప్రేత్య భావము (= పునర్జన్మ) (10) ఫలము (11) దుఃఖము (12) అపవర్గము (= దుఃఖము నుండి ఆత్యంతిక నివృత్తి) అనునవి.

మూఁడవ పదార్థము 'సంశయము'. ఏదేని ఒక వస్తు విశేష జ్ఞానమునఁగాని, లేక - వస్తు ప్రాప్తికై చేయు ప్రయత్నమునఁగాని కలుగు శంకయే సంశయము. ఏ ఫల ప్రాప్తికై ఏ ప్రయత్నము చేయఁబడుచున్నదో - వాని కిది ప్రయోజన మగును. దృష్టాంతము :- వివాద రహితమైన తథ్యము. సిద్ధాంతము :- సర్వతంత్రము, ప్రతి తంత్రము, అధికరణము, అభ్యుపగమము అని - సిద్ధాంతము నాలుగు విధములు. అవయవము :- ప్రతిజ్ఞ, హేతువు, దృష్టాంతము, ఉపనయము, నిగమనము - అను అయిదు అంగముల జ్ఞానమే అవయవము. తర్కము :- సంశయము యొక్క పరాకాష్ఠయే తత్త్వము. నిర్ణయము :- సందేహానంతరము, తర్కానంతరము నిశ్చయ మగున దియే నిర్ణయము. వాదము :- పక్ష, ప్రతిపక్ష పరిగ్రహామునుండి వెలువడు ప్రశ్నోత్తరములనే 'వాద' మని యందురు. జల్పమున -

వాదియు, ప్రతివాదియు కేవలము విజయ కాంక్షతో - మోసము, జాలి, నిగ్రహము, మున్నగువానిని అనుకూలముగ చేసినచో - అది 'జల్ప' మని చెప్పఁబడును. పక్ష, ప్రతిపక్ష సాధన మగు తర్కమే వితండము. హేత్వాభాసమున - హేతువు యొక్క ఆభాసమే యగును. ఇది - అసిద్ధ, విరుద్ధ, అనైకాంతిక, కాలాత్యయాపదిష్ట, ప్రకరణ సమము లని అయిదు విధములు. ఛలము :- వక్త యొక్క అభిప్రాయమును వదలి వైచి, రెండవ అర్థమును కల్పించుట. ఇది - వాక్ ఛలము, సామాన్య ఛలము, ఉపచార ఛలము - అని మూఁడు విధములు. జాతిలో అదూషణము దూషణ తుల్యముగ ఆభాస మగును. ఇది ఇరువది నాల్గు భేదములుగాఁ గలదు. నిగ్రహ స్థానమున - విపక్ష నిగ్రహము చేయఁబడుచున్నది.

ఈ విశ్వమున - పరమాణువు, ఆత్మ, ఈశ్వరుఁడు - మున్నగు సత్య పదార్థము లున్నవి. ఏ కారణముచే జగత్తు కలదో, మన ఇంద్రియములకు ఏ జగత్తు దృగ్గోచర మగుచున్నదో - అది వస్తుతః 'సత్' అగుచున్నది. ఈ 'సత్' పదార్థమునకు పరమాణువు సమవాయ కారణము. ఈశ్వరుఁడు నిమిత్త కారణము. ఈశ్వరుఁడు అనుమాన గమ్యుఁడు; ఆతని ఇచ్ఛ కలిగినంతట - ఒక పరమాణువు రెండవ పరమాణువుతో కలిసి, ద్వ్యయణుకమును సృష్టించునట్లు, మూఁడు ద్వ్యయణువుల పరస్పర యోగముచే, త్ర్యణుకము - లేక, త్రస రేణువు ఉత్పన్న మగును. అదియునుఁగాక, ఈ రీతిగా - ఆకాశాది క్రమమున పంచ తత్త్వము లుత్పన్నము లగును.

న్యాయ దర్శనమున - ముక్తిలో సుఖ దుఃఖములు రెండును మనోవృత్తులు నశించిన యనంతరము - సామ్యావస్థను పొందును. సుఖముతో బాటు, రాగ సంబంధము కూడ ఉండును. ఈ రాగమే బంధనమునకు కారణ మగును. ఇందుచే, మోక్షమున సుఖ దుఃఖము

లుండవు. జీవన్ముక్తిని అపర నిశ్శ్రేయస మనియు, విదేహా ముక్తిని పర నిశ్శ్రేయస మనియు వ్యవహరింతురు. మిథ్యా జ్ఞానమే దోష ప్రవృత్తి, జన్మ, దుఃఖముల ఉత్పత్తికి కారణము. ఈ మిథ్యా జ్ఞానము తత్త్వ జ్ఞానముతో నశించి పోవును. యమ, నియమ, ధ్యాన, ధారణాదులచే ఆత్మసాక్షాత్కారమును పొందుట, సుఖ దుఃఖ రహితమగు సామ్యావస్థను పొందుట - న్యాయ దర్శనము యొక్క చరమ లక్ష్యము.

## 11. వైశేషిక దర్శనము

కణాద మహర్షిచే ప్రవర్తింపఁజేయఁబడిన ఈ దర్శనము - ప్రాచీన దర్శనములలో నొకటిగా నున్నది. ఈ దర్శనము నందలి కణాద సూత్రములు - గౌతమ సూత్రముల కంటెను మిక్కిలి ప్రాచీనములు. ఈ కణాద సూత్రములు విక్రమ శకము కంటెను మూఁడు వందల సంవత్సరములకు పూర్వము రచింపఁబడినవి. కాని, ఇవి - అనంతర కాలమున ప్రచారమునకు వచ్చెను.

వైశేషిక దర్శనము నందలి ప్రధాన సిద్ధాంతము - న్యాయ దర్శనము నందలి సిద్ధాంతమునకు సమముగా నున్నది. ఇందుచే, ఈ వైశేషిక దర్శనము - 'సమాన తంత్ర' మని చెప్పఁబడుచున్నది. న్యాయ దర్శనము యొక్క ప్రధాన లక్ష్యము - అంతర్జగత్తు యొక్కయు, జ్ఞానము యొక్కయు మీమాంస చేయుట కాఁగా, వైశేషిక దర్శనము యొక్క ముఖ్య లక్ష్యము - బాహ్య జగత్తు యొక్క విపుల సమీక్షను ప్రస్తుతించుట.

ఈ వైశేషిక దర్శనము - (1) ద్రవ్యము (2) గుణము (3) కర్మ (4) సామాన్యము (5) విశేషము (6) సమవాయము (7) అభావము - అను ఏడు పదార్థములు కలవు. ద్రవ్యములు :—

(1) భూమి (2) జలము (3) తేజము (4) వాయువు (5) ఆకాశము (6) కాలము (7) దిశలు (8) ఆత్మ (9) మనస్సు - అనునవి తొమ్మిది. గుణములు ఇరువదియైదు. అవి యివి :— (1) రూపము (2) రసము (3) గంధము (4) స్పర్శము (5) సంఖ్య (6) పరిమాణము (7) పృథక్త్వము (8) సంయోగము (9) విభాగము (10) పరత్వము (11) అపరత్వము (12) గురుత్వము (13) ద్రవ్యత్వము (14) స్నేహము (15) శబ్దము (16) బుద్ధి (17) సుఖము (18) దుఃఖము (19) ఇచ్ఛ (20) ద్వేషము (21) ప్రయత్నము (22) ధర్మము (23) అధర్మము (24) సంస్కారము (25) కర్మ - అనునవి. కర్మ - అయిదు విధములుగా నుండును. (1) ఉత్క్షేపము (2) అవక్షేపము (3) అవకుంచనము (4) ప్రసారణము (5) గమనము అని. సామాన్యము - పర మనియు, అపర మనియు రెండు విధములు. విశేషముచే వస్తువుల పారస్పరిక సంబంధము తెలిసికొనఁబడును. పటమున తంతువు వలె - 'అభావ' మను ద్రవ్యము కూడ - వాస్తవము, యథార్థము, మహత్వపూర్వ మగు పదార్థమునై యున్నది. ఈ పదార్థములు తెలిసిన పిమ్మట, ఆత్మ స్వరూప పరిచయముతోనే మోక్ష ప్రాప్తి సంభవము. ఈ దర్శనమున - ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము - అని, నాలుగు ప్రమాణములు కలవు.

పరమాణు వాదమే ఈ వైశేషిక దర్శనమునందలి ప్రత్యేకత. దాని పుట్టుక - ఔపనిషదము. జైనులు, ఆజీవకులు మున్నగువారు కూడ దీనిని గుర్తించియున్నారు. న్యాయ దర్శనమున పరమాణు వాదము ప్రస్తావింపబడినది కాని, అది యీ వైశేషిక దర్శనముచే విపులముగా చర్చించబడినది. సమస్త భౌతిక జగత్తు - పరమాణువుల చేతనే నిర్మింపఁబడుచున్న దని పరమాణువాద సిద్ధాంతము.

పరమాణువులు జగత్తునకు ఉపాదాన కారణములుగా తలంచబడు చున్నవి. పరమాణువులు ఒకపుడు వేర్వేరుగను ఉండును. ఈ క్రియ - చిర కాలము నుండియు జరుగుచున్నది. అగ్ని యొక్కయు, పృథివి యొక్కయు పరమాణువులతో - పరమాత్మను ధ్యానించిన మాత్రమున, బ్రహ్మాండ ముత్పన్న మగును. తదుపరి పరమాత్మ - జగత్తును, బ్రహ్మను సృజించును.

ఈ జగ ద్బ్రహ్మలు రెండును సృష్టి స్థితి లయములకు కారణము లని, న్యాయ - వైశేషిక దర్శనముల తులనాత్మక పరిశీలనము వలన స్పష్ట మగును. ఈ దర్శనముల ననుసరించి - ఆత్మ, శరీరము - మనస్సున కంటెను భిన్నములు. జైన - సాంఖ్య దర్శనము లలో వలె - ఈ దర్శనము నందును ఆత్మ లనేకములు. చైతన్యము నకు ఆత్మ - తత్త్వ మనియు, అది దాని నిత్య లక్షణ మనియు తలంపబడలేదు. మనస్సు యొక్క సంబంధము తోనే ఆత్మకు చైతన్య గుణము, జ్ఞానము లభించును. అణు రూపముగాఁ గల అట్టి మనస్సు - సూక్ష్మము, అవిభాజ్యము నగు ఒక నిత్య తత్త్వమై యున్నది. ఇయ్యది - ఆత్మ కౌఱకు - జ్ఞానము యొక్కయు, సుఖ దుఃఖముల యొక్కయు అనుభూతికి సాధనమై యున్నది. శరీరము ఇతర పదార్థముల వలె పరమాణువులచే నిర్మింపబడును. న్యాయ వైశేషిక దర్శనములు రెంటి ననుసరించి - ఆత్మ మనస్సుతో, శరీర ముతోఁ గూడ కలియుటయే దుఃఖ కారణ మగును. మిథ్యా - జ్ఞానము చేతను, ద్వేష మోహముల చేతను ఆత్మ ప్రేరితమై, ఉత్తమ - అధమ కర్మల నాచరించును. అదియునుఁ గాక, కర్మల ప్రభావముచే దుఃఖము యొక్కయు, అనాగమనము యొక్కయు బంధనమున ఆత్మ పడవేయును. అపవర్గము (మోక్షము) యొక్క తత్త్వ జ్ఞానము

సత్యము యొక్క సమ్యక్ జ్ఞానముచే లభించును. మోక్షమున దుఃఖముల నుండి ముక్తుఁడగు పరిస్థితి యేర్పడును. ఇదియే జీవిత లక్ష్యము.

## 12. సాంఖ్య దర్శనము

ఈ దర్శనమును కపిల ముని రచించెను. ఈ సాంఖ్య దర్శనము - న్యాయ, వైశేషిక దర్శనముల కంటెను అతి ప్రాచీనమైనది. ఈ దర్శనము నందలి మూల సూత్రములు - కఠ, ఛాందోగ్య, శ్వేతాశ్వతర ఉపనిషత్తులలో లభించును. ఈ దర్శనము ద్వైతమును ప్రతిపాదించును. ఇందుచే, ఇది అభేదమును ప్రతిపాదించు వేదాంత దర్శనమునకు - ప్రబల మగు ప్రతిపక్షగాఁ గన్పట్టును. సాంఖ్య మనఁగా - సమ్యక్ ఖ్యాతి - లేక, యథార్థ జ్ఞానము. ఈ దర్శనమున ఇరువదియైదు తత్త్వములు కలవు. అవి యివి :- (1) పురుషుఁడు (2) ప్రకృతి (3) మహత్తు (4) అహంకారము (5) మనస్సు (6-10) పంచ జ్ఞానేంద్రియములు (త్వక్ - చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణములు (11-15) పంచ కర్మేంద్రియములు (వాక్ పాణి పాద పాయూపస్థలు) (16-20) పంచ సూక్ష్మ తన్మాత్రలు (శబ్ద స్పర్శ రూప రస గంధములు) (21-25) పంచ మహా భూతములు (పృథివ్యాపస్తేజో వాయు రాకాశములు) ఇవి - క్రమ వికాసము నొందును. వీనిలో - ప్రకృతి, పురుషుఁడు ముఖ్యములు. ఈ రెంటి సంబంధము - కుంటి, గ్రుడ్డి సంబంధము వంటిది. ప్రకృతి గ్రుడ్డిది. పురుషుఁడు కుంటివాఁడు. ఈ రెంటి సంబంధము ఎంత కాలము వఱకు కొనసాగునో - అంత కాలము వఱకు ఈ జగన్నాటకము జరుగుచుండును. పురుషునకు కైవల్య జ్ఞానము కల్గినంతనే ఈ నాటకము ముగిసి పోవును. ప్రకృతికి - సత్త్వ రజస్తమో గుణములు మూఁడు కలవు. వీని సామ్యావస్థ ఎంత కాలము కొనసాగునో, అంత కాలము

వఱకు ప్రకృతి - చేష్టా రహిత మగును. కాని, గుణ క్షోభ మైనంతనే ప్రకృతి మెలకువం జెంది, కార్యమును ప్రారంభించును.

సాంఖ్య దర్శనము నందలి పురుషుండే ఇతర దర్శనములలో ఆత్మగా పరిగణింపంబడుచున్నాండు. ఈ సాంఖ్య దర్శనమున పురుషు లనేకులు. వారు ఏకాగ్ర భావముతో తటస్థముగా నుండి, ప్రకృతి యను నటి యొక్క - నాటకమును - అనగా, జగన్నాటకమును చూచుచుందురు. సాంఖ్య దర్శనము నందలి పురుషుండు - అమూర్తము, చేతనము, భోగి, నిత్య సర్వగతము, అప్రియము, అకర్త, నిర్గుణము, సూక్ష్మము - మున్నగు విశేషములతోం గూడి యున్నాండు. ఈ పురుషుండు - శరీరము, మనస్సు, ఇంద్రియములు - మున్నగువానితో బంధింపంబడుచున్నప్పుడు - అతండు 'జీవుం' డని చెప్పంబడును. జీవునకు స్థూల శరీర మేర్పడినచో - అది మరణ సమయమున నశింపంగలదు. దానిని - 'లింగ శరీర' మని యందురు. అట్టి లింగ శరీరముతో జీవాత్మ పున ర్జన్మ నొందును. ఈ సాంఖ్య దర్శనమున జ్ఞానము - అయిదు విధములుగా నుండును. అవి - (1) ప్రమాణము (2) విపర్యయము (3) వికల్పము (4) నిద్ర (5) స్మృతి - అనునవి. ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణములు మూండును ఈ దర్శనమున ముఖ్యములు. దుఃఖ మయమైన ఈ ప్రపంచమున - ఆధ్యాత్మిక, ఆధిదైవిక అధిభౌతికము లను మూండు విధము లగు దుఃఖము లున్నవి. వివేక - జ్ఞానములచే ఈ దుఃఖముల నుండి జీవునకు విముక్తి లభించును.

ఈ సాంఖ్య దర్శనములో - ఈశ్వరుని విషయమున భిన్నాభి ప్రాయములు కలవు. సాంఖ్య దర్శనము అవైదిక దర్శన మనియు, ఈశ్వరుని అస్తిత్వము కూడ ఇందు లేదనియు - కొందఱు విద్వాంసుల

అభిప్రాయము. సాంఖ్యమున ఈశ్వరుఁడు లేఁ డనియు, ఈశ్వరుని అస్తిత్వము కూడ లే దనియు ప్రాచీనాచార్యుల పక్షము.

సాంఖ్య దర్శన ప్రభావము - జైన, బౌద్ధములపై విశేషముగ ప్రసరించినది, జైన బౌద్ధముల యందలి అహింసా సిద్ధాంతమును సాంఖ్య దర్శనమే ప్రేరేపించు చున్నది. దీనికి నుంచి బౌద్ధులు - దుఃఖము యొక్క సత్తును, వైదిక కర్మకాండ యొక్క గౌణతను, ఈశ్వరుని సత్తపై అనాస్థను, జగత్తుయొక్క పరిణామశీల సిద్ధాంతమును సాంఖ్య దర్శనము నుండి స్వీకరించియున్నారు.

## 13. యోగ దర్శనము

యోగ దర్శన ప్రణేత పతంజలి. ఇతఁడు బహుశః - వ్యాకరణ మహాభాష్య రచయిత యగు పతంజలియే కావచ్చును. ఈతని కాలము బహుశః క్రీ. పూ॥ రెండు - మూఁడు శతాబ్దములు అయి యుండవచ్చును. సాంఖ్య - యోగ దర్శనములు చాల యంశములలో సమానములుగా కానవచ్చును, సిద్ధాంత సమాన కారణమువలన, విద్వాంసులు వీని పారస్పరిక భేదమును ప్రతిపాదించుటకై, క్రమశః వీనిని - నిరీశ్వరము అనియు, సేశ్వర సాంఖ్య మనియు భావించు చున్నారు. సాంఖ్యము నందలి 25 తత్త్వములు, యోగ దర్శనము నందలి ఈశ్వరుఁడు - వెరశి మొత్తము 26 తత్త్వములు ఈ యోగ దర్శనమునఁ గలవు. యోగ శబ్దములో - ఈశ్వరుని లక్షణము లివి :-

" క్లేశ కర్మ విపాకాశయై రపరామృష్ట పురుష విశేష ఈశ్వరః. "

విశేష క్లేశ, కర్మ విపాక (కర్మ ఫల), ఆశయ (విపాకానురూప సంస్కార) ముల సంపర్కము లేని పురుషుడే ఈశ్వరుఁ డని చెప్పఁ బడుచున్నాఁడు. ముక్త పురుషుఁడు పూర్వము బంధనమున నున్నట్లే,

ప్రవృత్తినిఁ బట్టి, అతనికి భవిష్య బంధన భావ ముండును. కాని, ఈశ్వరుఁడు ఎల్లప్పుడు ముక్తుఁడుగా నుండును.

కైవల్య ప్రాప్తికి ఆవశ్యక మగు సాధనలు - ఈ యోగ దర్శనమున ప్రతిపాదింపఁబడినవి. యోగ మనఁగా - చిత్త వృత్తులను నిరోధించుటయే. "యోగ శ్చిత్త నిరోధకః." చిత్తము యొక్క ఏకాగ్రత - ముక్తికి మిక్కిలి ఆవశ్యకము. ఇట్టి ఏకాగ్రత - అష్టాంగ యోగ సాధనము వలననే సాధ్య మగును. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధు లనఁబడు నవియే అష్టాంగ యోగములు. యమము (అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము), నియమము (శౌచము), సంతోషము, తపము, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము) ఇవి సాధనమునకు అంగములు. అటు పిమ్మట - ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము (ఇంద్రియ నిగ్రహము) - ఇవి మూఁడును యోగమునకు మొదటి మెట్టు. అనంతరము - సమాధి (మనస్సు యొక్క పరిపూర్ణమైన ఏకాగ్రత). ఇయ్యది - యోగ దర్శన మందలి మహోన్నత సాధనము. ఈ సమాధియు - సంప్రజ్ఞానము, అసంప్రజ్ఞానము - అని రెండు విధములు. మొదటి సమాధి అవస్థలో - బుద్ధి ఏదియో యొక రూపమున క్రియాశీలముగా నుండును. కాని, రెండవ దానిలో అట్లుండదు. అసంప్రజ్ఞాన సమాధినుండియే కైవల్యము లభించును. యోగ దర్శనానుసారము ఎల్లఱకు కైవల్యము లభింపదు. వారికి క్రియాయోగ మొక్కటియే విధానము. యోగ దర్శనానుసారము - ఈశ్వరుఁడు జగత్కర్తయై, ప్రాకృతిక వికార ప్రథమ ద్రష్టగా నున్నాఁడు.

# 14. పూర్వ మీమాంసా దర్శనము

మీమాంసా దర్శనము స్వరూపమునుబట్టి, ప్రాచీనతమమైనదిగా తలంపబడుచున్నది. ఏల నన, ఈ దర్శనమున - వైదిక కర్మకాండ యొక్క మహత్త్వము ప్రాప్తించుచున్నది. కర్మకాండకు సంబంధించిన వేద మంత్రము లిందు విశేషముగ వివేచన చేయబడినవి. ఈ మీమాంసా దర్శనమున - సంహితలు, బ్రాహ్మణములు ప్రమాణములుగా పేర్కొనబడినవి. ఇందుచే, ఈ దర్శన ప్రాచీనత - స్వయం సిద్ధము. కాని, ప్రాచీనతను, వివాదములను శృంఖలా బద్ధము చేయుటకై జైమిని క్రీః పూః 500 - (600) విశేషముగ పరిశ్రమించి, ఈ దర్శనమును రచించెను. అనంతర కాలమున - అనగా, రెండవ శతాబ్దమున - బాదరాయణ ఉపవర్షుడు, భవ దాసుడు మున్నగు ఆచార్యులు - ఈ దర్శనమును ప్రచారమునకు దెచ్చిరి. రెండవ శతాబ్దమున - మీమాంసా దర్శనముపై శబరస్వామి - 'శబర భాష్య' మను పేర నొక వ్యాఖ్యానమును రచించెను. ఈ శబర భాష్యమును - మూడు సంప్రదాయములకు జెందిన భాట్ట, గురు, మురారి అను వారలు - తమ తమ సంప్రదాయములకు అనుగుణముగా పరిసర్తనము గావించుకొనిరి. 8 - వ శతాబ్దపు పూర్వార్థమునకు జెందిన భాట్ట మత ప్రవర్తకు డగు కుమారిల భట్టు - కుమారిల మీమాంసా దర్శనమున - తన పాండిత్యమును, తర్క బలమును విశేషముగ ప్రదర్శించెను. ఈ కుమారిలుడు బౌద్ధుల లోక ప్రియమును బట్టి, ఈ దర్శనమును రచించుటే గాక, విశేషించి లోక ప్రియముగా కూడ సిద్ధము చేసెను. గురు మత స్థాపకు డగు కుమారిలభట్టు యొక్క శిష్యుడు ప్రభాకర మిశ్రుడు. మురారి మతమును మురారిమిశ్రుడు 12 - వ శతాబ్దమున ప్రవర్తింపజేసెను.

మీమాంసా దర్శన విషయము - ధర్మమును గురించి వ్యాఖ్యానించుట.

" ధర్మాఖ్యం విషయం వక్తుం మీమాంసాయాః ప్రయోజనమ్. "

ఆదియును గాక, ఈ దర్శనము - "చోదనా లక్షణోఽర్థో ధర్మః." అనునట్లు, ధర్మ లక్షణమును వివరించెను. ఈ మతమున - వేద విహిత మగు ఇష్ట సాధనమే ధర్మము. అట్లే, అనిష్ట సాధనము అధర్మము. వేదము నిత్యము, అపౌరుషేయము. ఈ సంసారమున కర్మయే ప్రధాన వస్తువు. ఆచార్య బాదరాయణుడు - ఈశ్వరుని కర్మ ఫలము లనిచ్చు వాడని తలచెను. కాని, యజ్ఞము వల్లనే కాలాంతరమున ఆ యా ఫలములు ప్రాప్తించు నని జైమిని మతము. మీమాంసకులు - అపూర్వ మను సిద్ధాంత నొకదానిని ఆవిష్కరించిరి. కర్మల నుండి ఉత్పన్న మగునది అపూర్వము (పుణ్యాపుణ్యము). అట్లే, 'అపూర్వముతో నగును ఫలము.' మీమాంసా దర్శనమున కర్మ - నిత్యము, నైమిత్తికము, కామ్యము - అని మూడు విధములుగా నుండును. మూడు వర్ణములవారు - ఈ కర్మల నాచరించుటకు అధికారులు. కర్మ యొక్కయు, కర్మ ఫలము యొక్కయు సంచాలనము - అపూర్వమునుండి యగును. ఈ మీమాంసా దర్శనమున కర్మయే సత్యము.

ఈశ్వర సంబంధ మగు విచారణ చేసిన పిమ్మట, ఈ మీమాంసా దర్శనము - యజ్ఞములలో హవిస్సులను స్వీకరించు వైదిక దేవతల అస్తిత్వమును అంగీకరించినట్లు తెలియుచున్నాము. కాని, ఈశ్వరుని అస్తిత్వమును గురించి మీమాంసకులు కొందఱు మౌనము వహించిరి. కొందఱు మీమాంసకులు ఈశ్వరుని అస్తిత్వమును అంగీకరించిరి. కుమారిలుడు మున్నగువారు కొందఱు ఈశ్వరుని అస్తిత్వమును అంగీకరింపలేదు. ఆత్మ సంబంధ మగు విచారణ

గావించిన పిమ్మట మన మీమాంసా దర్శనమున - ఆత్మ నిత్య మనియు, శాశ్వత తత్త్వ మనియు గ్రహించుచున్నాము. కాని, చైతన్యము దాని లక్షణము కాదు. శరీరముతోఁ గూడిన పిమ్మట - పదార్థముల సామీప్యము వలన, ఆత్మకు చైతన్య గుణ మావిర్భవించును.

మీమాంసా దర్శనము ఆఱు ప్రమాణములను (సమ్యక్ జ్ఞాన సాధనములను) స్వీకరించును. ఆ ప్రమాణములు - (1) ప్రత్యక్షము (2) అనుమానము (3) శబ్దము (4) ఉపమానము (5) అర్థాపత్తి (6) అభావము - అనునవి. జ్ఞాన ప్రాప్తికి - జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము, కారణము - అను నాలు గంగము లున్నవి.

ప్రభాకరుఁడు ఎనిమిది తత్త్వములను ప్రమాణములుగా గ్రహించెను. అవి - (1) ద్రవ్యము (2) గుణము (3) కర్మ (4) సామాన్యము (5) పరతంత్రత (6) శక్తి (7) సాదృశ్యము (8) సంఖ్య - అనునవి. గుణముల అధిష్ఠానమును ద్రవ్య మని యందురు. ద్రవ్యములు తొమ్మిది. అవి యివి :— (1) మనస్సు (2) జలము (3) వాయువు (4) అగ్ని (5) ఆకాశము (6) ఆత్మ (7) మనస్సు (8) కాలము (9) స్థానము. వీనిలో - ద్రవ్యము, గుణము - అను రెండు తత్త్వములును వైశేషిక దర్శనము నుండి ప్రభావితమైనవి.

మీమాంసకులు శబ్ద స్వరూపమును గుఱించియు, దాని నిత్యానిత్యతల గుఱించియు నిశితముగ చర్చించిరి. విరోధ వాక్య విషయమందును, వ్యాఖ్యాన సంబంధ మందును సిద్ధాంతమును స్థిరము గావించిరి. అవి - అత్యంత విశిష్టములు. ఈ మీమాంసా దర్శనము -

వస్తు వాది. అనఁగా - యథార్థ వాది. ఈ దర్శనము - భౌతిక జగత్తు యొక్క అస్తిత్వమును అంగీకరించుచున్నది.

## 15. వేదాంత దర్శనము – దాని భాష్యకారులు

భారతీయ దర్శన వైశిష్ట్యము - వేదాంత దర్శనమునందు కానవచ్చును. ఈ దర్శనమును - 'ఉత్తర మీమాంస' యనియు అందురు. వేదాంత శబ్దమునకు - 'ఉపనిషత్తు' అని యర్థము. ఈ ఉపనిషత్తులు వేదములలోఁ గల సిద్ధాంతములను ప్రతిపాదించుటచే, ఇవి - 'వేదాంతములు' (వేదము యొక్క అంతములు - సిద్ధాంతములు) అను పేర ప్రసిద్ధములై యున్నవి. కాని, ఉపనిషత్తు లనేకములు కలవు. వానిలో - వివిధ సిద్ధాంతములు గన్పట్టును. ఆ సిద్ధాంతములు - పరస్పర విరుద్ధములుగా నున్నట్లును స్పష్ట మగును. అట్టి పరస్పర విరుద్ధము లైన సిద్ధాంతములను పరిహరించుటకై, వేదాంత దర్శనమును బాదరాయణుఁ డను వ్యాసుఁడు రచించెను. బాదరాయణుఁడు ఈ సందర్భమున కొన్ని సూత్రములను రచించెను. అవి - వేదాంత సూత్రము లనియు, బ్రహ్మ సూత్రము లనియు, వ్యాససూత్రము లనియు వ్యవహరింపఁబడుచున్నవి. ఈ బ్రహ్మ సూత్రములు పాణిని కంటెను ప్రాచీనములు. ఏల నన, పాణిని -

" పారాశర్య శిలా లిభ్యాం భిక్షు నట సూత్రయోః. "

అను తన సూత్రమున వ్యాస రచితములైన బ్రహ్మసూత్రములనే నిర్దేశించెను. ఈ బ్రహ్మసూత్రములు అల్పాక్షర యుక్తములు. భాష్యములు లేక, ఈ సూత్రములకు అర్థ జ్ఞానము గల్గుట సాధ్యము కాదు. ఈ సూత్రములకు కొందఱు భాష్యకారులు - తమ తమ సిద్ధాంతములకు అనుగుణముగా భాష్యములు రచించియున్నారు.

| ఆచార్యులు | సమయము (క్రీ:శ:) | భాష్యము | మతము |
|---|---|---|---|
| శంకరాచార్యులు | 788-820 | శంకర భాష్యము | అద్వైతము |
| భాస్కరాచార్యులు | 9, 10 శతాబ్దములు | భాస్కర భాష్యము | ఔపాధిక భేదాభేదము |
| రామానుజాచార్యులు | 1017 - 1137 | శ్రీ భాష్యము | విశిష్టాద్వైతము |
| నింబార్కాచార్యులు | సుమారు 1162 | వేదాంత పారిజాత సౌరభము | స్వాభావిక భేదాభేదము |
| మధ్వాచార్యులు | 1238 - 1317 | పూర్ణ ప్రజ్ఞభాష్యము | ద్వైతము |
| శ్రీకంఠాచార్యులు | 13వ శతాబ్దాంతము | శైవ భాష్యము | శైవ విశిష్టాద్వైతము |
| శ్రీపతి (ఆచార్యులు) | 14వ శతాబ్దము | శ్రీకర భాష్యము | వీరశైవ విశిష్టాద్వైతము |
| వల్లభాచార్యులు | 1479 - 1530 | అణు భాష్యము | శుద్ధా ద్వైతము |
| విజ్ఞాన భిక్షువు | 17వ శతాబ్దము | జ్ఞానామృత భాష్యం | అవిభాగా ద్వైతము |
| బలదేవుడు | 18వ శతాబ్దము | గోవింద భాష్యము | అచింత్య భేదాభేదము |

## 16. ప్రముఖ బ్రహ్మసూత్ర భాష్యకారులు సంప్రదాయములు

పై పట్టికలో పేర్కొనబడిన పది మంది భాష్యకారులలో - భాస్కరాచార్యులు, విజ్ఞాన భిక్షువు - అను వారల సంప్రదాయములు గాక, మిగిలిన యెనిమిది సంప్రదాయము లిపుడు ఆచరణములో నున్నవి.

సంప్రదాయమునకు సంబంధించిన ప్రధాన తత్త్వము - పరంపరాగత మగు సిద్ధాంత వైశిష్ట్యము పైనను, తదనుగుణ మగు పరిపాలనము పైనను ఆధారపడి యుండును. ఒకవేళ - పైఁ జెప్పఁబడిన సంప్రదాయములు శ్రుతి ననుసరించినవే యని తలంచినను, వాని

వర్తమాన స్వరూపమున - తత్త్వ నిష్ఠలో, ఆచార నిష్ఠలో పర సర్వము ఎంతో భేదము కానవచ్చును. ఇందువలన, ఈ దృష్టితో పై ఎనిమిది సంప్రదాయములను - శంకర సంప్రదాయ మనియు, ఇతర సంప్రదాయము లనియు - రెండు వర్గములుగా విభజింప వచ్చును.

శంకరాచార్యులు - ఈశ్వరుండు, జీవుండు - భిన్ను లని తలంచలేదు. "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" (బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య), "జీవో బ్రహ్మైవ నాపరః." (జీవుండు బ్రహ్మయే. వానికి భిన్నమైనది లేదు.) "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" (ఇది యంతయు బ్రహ్మము) "తత్త్వ మసి." (నీవు ఆ బ్రహ్మ వగుచున్నావు.) ఇదియే శంకరాచార్యుల సిద్ధాంతము. ఇది అద్వైతమను పేర వ్యవహరింపఁబడు చున్నది. దీనికి మఱి యొక పేరు - మాయా వాదము. మాయావాద మనఁగా - కనఁబడుచున్న పదార్థము సత్యము కాదు; అది కేవలము ఆభాస మాత్రము. అంధకారములో త్రాడును పాము అను భ్రాంతిలో భావించినట్లు, అజ్ఞానముచే ఈ ప్రకృతిని సత్యముగా భావించుటకు - భ్రాంతియే కారణము. ఇదియే మాయావాద స్వరూపము.

పై పట్టికలోని సంప్రదాయములను మఱి యొక రీతిగా రెండు విభాగములు చేయవచ్చును.

**(1) నిర్విశేష వాదము** — సామాన్య స్మార్త మతము శంకరాచార్యులు.

**(2) సవిశేష వాదము** — విశిష్ట ఆగమిక మతములు. రామానుజ, మధ్వ, నింబార్క, వల్లభ, బలదేవ, శ్రీకంఠ, శ్రీపతి.

రెండవ వర్గమునకుఁ జెందిన సంప్రదాయములలో - సవిశేష వాదముఁబట్టి, ఆగమాచార దృష్టితో భేదము లనేకములు కలవు.

ఈ సవిశేష వాదము - విష్ణువును పరమ తత్త్వముగా భావించును. తదనుసారము వైష్ణవాగమములలో ప్రతిపాదింపఁబడిన వైష్ణవాచారములు ఆచరింపఁబడుచున్నవి. దీనికి భిన్నమైనది - సవిశేషవాదము. ఇయ్యది - శివుని పరతత్త్వముగ తలచి, శైవాగమములలో ప్రతిపాదింపఁబడిన ఆచారము నాచరించుచున్నది. ఇది వైష్ణవ, శైవ మతముల రెండు ఉపవర్గములుగా విభజింపవచ్చును.

**(1) వైష్ణవ మతము** — రామానుజ, మధ్వ, నింబార్క, వల్లభ, బలదేవ.

**(2) శైవ మతము** — శ్రీకంఠ, శ్రీపతి.

ఈ రెండు సంప్రదాయములలో - తత్త్వ నిష్ఠయందును, ఆచార నిష్ఠయందును పరస్పర భేదము లున్నవి.

## 17. శ్రీ రామానుజ భాష్య వైశిష్ట్యము

శ్రీ రామానుజ భాష్యము వైష్ణవ భాష్యములలో అగ్రగణ్యమైనది. ఇందలి వ్యాఖ్యాన విధానము - సూత్రానుకూలముగ నుండుటయే ఇందులకు కారణము. సూత్రము లన్నింటిలో శ్రుతులు సూత్రానుసారముగ నిర్దేశింపఁబడినవి. అదియునుఁగాక, శ్రీ రామానుజ భాష్యము - విషయ వివరణలో అసమానమైనది. తత్త్వ మీమాంస, ఆచార మీమాంస - అనువానిని నిశితముగ చర్చించి, వాస్తవ సిద్ధాంతము లిందు ప్రతిపాదింపఁబడినవి. సాంఖ్య, వైశేషిక, బౌద్ధ, జైన, పాశుపత, మాయావాదాది మతములు ఖండింపఁబడినవి.

పాంచరాత్ర మతము శ్రుతి విహిత మని నిరూపింపఁబడినది. విశిష్టాద్వైత సిద్ధాంతము - వేద శాస్త్ర పురాణేతిహాసాది ప్రమాణములతో ప్రతిపాదింపఁబడినది.

## 18. ఉపసంహారము

వైష్ణవ భాష్యములను పరిశీలించిన చో - రామానుజ భాష్యము, మధ్వ భాష్యము - ఈ రెండును పోటీ సమము, స్వతంత్ర మైనవిగా - మౌలిక స్వరూపముతో కానవచ్చును. తదితరము లగు నింబార్క భాష్యము, వల్లభ భాష్యము, బలదేవ భాష్యము - అనునవి - తమ తమ సంప్రదాయములను వ్యక్తీకరించుటకై, ఏదియో యొక విధమున పై రెండు భాష్యములనుండియే అనేక విషయములను హెచ్చు తగ్గులుగ స్వీకరించి యున్నవి. కాలక్రమమున రామానుజ భాష్యము - వైష్ణవ భాష్యములలో సర్వ ప్రథమ మైనదిగా సంభావింపఁబడి, దార్శనికులకు శిరోభూషణమై, ముముక్షువులకు మార్గదర్శకమై, దేశ విదేశములలో అపారమైన ఖ్యాతిని గడించి యలరారుచున్నది. ఈ రామానుజ భాష్యము స్వదేశ భాషలందే గాక, పాశ్చాత్యభాష లందును అనూదితమై, విశ్వ వ్యాప్తి నందియున్నది.

శ్రీభాష్యకారో జయతు రామానుజ జగద్గురుః
ముముక్షూణాం చ సర్వేషాం శ్రీమ దష్టాక్షర ప్రదః.



# భగవద్రామానుజులు - శ్రీభాష్యము

## (తృతీయాధ్యాయ - ఉత్తరార్ధము)

న్యాయ విద్వాన్ - వేదాంత విద్వాన్

సాహిత్య విద్యా ప్రవీణ - సాహిత్య రత్న

ప్రవచన వాచస్పతి - మహోపన్యాసక - విశిష్ట వాక్శిఖామణి - పౌరాణిక కేసరి

శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు, ఎం.ఏ.; బి.ఓ.యల్.



# తృతీయాధ్యాయము - తృతీయ పాదము

## 1. సర్వ వేదాంత ప్రత్యధియాకరణము

శ్రీభాష్య తృతీయాధ్యాయము ఉపాసనమును సమీక్షించు నది. దీనిలోని మొదటి రెండు పాదములు ఒక పేటిక. వానిలో ఉపాసనకు ఉపయోగపడు జీవదోషరాశి, భగవద్గుణ గణము చర్చించబడినది. జీవదోషరాశి వైరాగ్యము ద్వారా, భగవద్గుణ గణము ప్రాప్యరుచి ద్వారా ఉపాసనకు ఉపయోగపడునవి. చివరి ఫలాధికరణము పరమ పురుషునకు సర్వ ఫలప్రదత్వ రూప గుణమును ప్రకాశింపజేసినది. వీనితో భగవత్ ప్రాప్తిరూప మగు మోక్షము నకు భగవంతుడే ఉపాయ మని తెలిసినది. ఉపాసనలు కూడ ఉపాయము అని కదా ఉపనిషత్తులు పేర్కొనుచున్నవి ! భగవంతుడు, ఉపాసనలు - రెండును విడి విడిగా, స్వతంత్రముగా ఉపాయములా ? అనగా - కాదు. ఉపాసనము చేత ప్రసన్నుడగు పరమాత్మయే

ఉపాయము - అని ఫలాధికరణము నిర్ణయించినది. కనుక, భగవంతుడు మనచేత సాధించు కొనదగిన ఉపాయము కాక, సిద్ధోపాయముగనవలెను. ఉపాసనలు మనము సాధించుకొనవలసినవి కనుక, అవి సాధ్యోపాయము లనవలసి యుండును. సిద్ధోపాయము తెలిసిన తరువాత, సాధ్యోపాయము లేవి ? అను జిజ్ఞాసా శాంత్యర్థము సాధ్య ఉపాయము లగు ఉపాసనములు మూడవ పాదమున వివరింపబడు చున్నవి. పూర్వ పాద ద్వయాత్మక మగు పేటికలో ఉపాసనా ప్రయోజకము లగు వైరాగ్య ప్రాప్యరుచి రూపార్థములు వివరింపబడినవి. ఇందులో - తత్ప్రయోజ్యము లగు ఉపాసనలు చర్చించబడుచున్నవి. కనుక, పూర్వపాద ద్వయాత్మక పేటికకును ప్రయోజ్య ప్రయోజక భావ రూప సంగతి యని తెలిసికొనవలెను.

ఈ సాధ్యోపాయ స్వరూపము లగు ఉపాసనలకు విద్య లని వ్యవహరించుచుందురు. శాండిల్య విద్య, వైశ్వానర విద్య, అక్షర విద్య, దహర విద్య - మొదలగు పేర్లు కూడ వీనికి ఉన్నవి. ఒక విద్య ఒకే శాఖకు చెందిన ఒక ఉపనిషత్తులోనే కాక, వేరు వేరు శాఖలకు చెందిన వానియందును ఉన్నది. ఛాందోగ్యము సామవేద శాఖకు, తైత్తిరీయము కృష్ణయజు శ్శాఖకు చెందినవి. ఇట్లు వేరు వేరు స్థలములలో కనపడు విద్యలు వే ర్వేరా ? లేక - ఒకటియా ? అని ఈ ఉపాసన విషయములో సంశయ మేర్పడ గలదు. పేరు మొదలగు వానిని బట్టి చూచిన, ఒకటి యనినట్లుగా నున్నది. ఎట్టి విశేషము లేక, మరి యొక సారి వేదములో పఠింపబడినందునను ప్రకరణము కూడ వేరైనందునను - వేరు వేరు అనునట్లుగా కన్పట్టు చున్నవి. అందు వలన ఇవి వేరు వేరు అనుకొనవలెనా ? ఒకటే అనుకొనవలెనా ? అనునది సంశయము. విషయము ఉపాసనకు సంబంధించినది అని గ్రహించవలెను.

అవిశేష పునశ్శ్రవణమును బట్టియు, ప్రకరణాంతరమును బట్టియు విద్యాభేదమే స్వీకరింపవలెనని పూర్వపక్షము. ఒక్కమాట పూర్వమీమాంసా దర్శనకారులు కూడ, యాగాది కర్మల విషయములో ఇట్టి సంశయము నెదుర్కొని యున్నారు. ఒకే యాగము అనేక శాఖలందును అధీత మైనపుడు, పేరును బట్టి ఒకటి యనవలెనా? మరల చెప్పుటను బట్టి వేరు అనవలెనా? అనునది వారి ముందు ఏర్పడిన సంశయము. దీనిని వారు - 'ఏకం వా సంయోగ రూప చోదనాఖ్యాం విశేషాత్' అను సూత్రముతో నివారించి, ఒకటి యని నిర్ణయించిరి. ఒకటి యనుటకు ఫలము ఒకటి వచ్చుటయు, ద్రవ్య దేవతలు ఒకటి యగుటయు, పురుష ప్రయత్నము ఒకటి యగుటయు, అగ్నిహోత్రాది నామధేయ మొకటి యగుటయు - ఈ సూత్రములో కారణములుగా పేర్కొనబడినవి. మరి - పూర్వమీమాంసా దర్శనము, ఈ ఉత్తర మీమాంసా దర్శనము వేరు వేరు కావు - అని గదా వేదాంతుల సిద్ధాంతము! "సర్వ వేదాంత ప్రత్యయం చోదనాద్యవిశేషాత్" అను ప్రకృతాధికరణ ప్రథమ సూత్రములోని ఆది పదము వలన, పూర్వమీమాంసా దర్శనమునకు సంబంధించిన "ఏకం వా సంయోగ రూప చోదనాఖ్యాऽవిశేషాత్" అను సూత్రములో పేర్కొనబడిన సంయోగ రూపాఖ్యలు కదా గ్రహించబడుచున్నవి! కనుక, ఈ రెండు దర్శనములకును ఏకశాస్త్రము సర్వసమ్మత మనవచ్చును. ఇట్లు పూర్వ దర్శనములో నివారించబడిన సంశయమును నివారించుటకు ఇచట మరి యొక అధికరణ మారంభించుట అసంగత మనిపించవచ్చును. అందువలన, ఇచట పూర్వదర్శనములోని యుక్తులకంటె అధిక మగు ఒక యుక్తి కూడ పూర్వపక్షి చూపుచున్నా డని, తన్నివారణార్థ

మీా యధికరణ మవసరమైన దని శ్రీభాష్యకారు లానతిచ్చి యున్నారు.

విశేష మేమియు లేకనే మరల చెప్పినందు వలన, రెండు యాగములు వేరు వేరే ననియు, వానిని, ఆ యా శాఖలలో చెప్పిన ప్రకరణములు (వేరే) ఐనందు వలనను, ఈ రెండు యాగములు వేరే యనియు ఆ దర్శనములోని పూర్వపక్షి యుక్తులు యాగాది కర్మ భేదమును సాధించుటకు పేర్కొనబడినవి ; నివారించబడినవి. ఇక ఇచ్చట వేదాంత దర్శనము నందును అక్షరాది విద్యలు ఆ యా శాఖలలోనివి వేరనుటకు పైన పేర్కొనబడిన రెండు యుక్తులే కాక, అధిక యుక్తియు పూర్వపక్షికి ఒకటి లభించినది. అదేమనగా - అక్షర విద్య ముండకోపనిత్తు నందును, బృహదారణ్యకోపనిషత్తు నందును ఉన్నది. ముండకము అథర్వణ వేదశాఖకు చెందినది. బృహదారణ్యకము శుక్లయజుశ్శాఖకు చెందినది. ఇవి రెండును వేరగుటకు పైన పేర్కొనిన రెండు యుక్తులే కాక, మరియొక యుక్తియు ఉన్నది. అదేమనగా - ముండకము చివర - "తేషామేవ ఏతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్" అని ఉన్నది. 'ఈ అక్షర బ్రహ్మవిద్య యథావిధిగా శిరోవ్రత మనుష్ఠించిన వారికే చెప్పవలెను' అని దీని యర్థము. ఇపుడు ఈ రెండు తావులలోని అక్షర విద్యలు ఒకటి యనుకొనుట సాధ్యము కాదు. ఒకటి తీసికొనినచో, అక్షర బ్రహ్మవిద్య కావలె ననుకొనినప్పుడు - శిరోవ్రతము అంగ మని తేలును గదా ! అపుడు శుక్లయజుర్వేదము కూడ అక్షర విద్య కావలె ననుకొనినప్పుడు - శిరోవ్రతము చేసికొనవలసియే యుండును. అపుడు శిరోవ్రతము చేసికొనినవారికి చెప్ప వలె నను నియమమునకు అంతగా అర్థ ముండదు. శిరోవ్రతము విద్యాంగమైనపుడు - ఆ విద్యను అభ్య

సించువా రందరును విధిగా శిరో వ్రతము చేసికొనియే గదా అభ్య
సింతురు !

ఈ నియమము అర్థవంతము కావలయు ననిన, విద్యాభేద మంగీకరించవలసియుండును. విద్యలు రెండు వేరైన పక్షమున, ముండకాక్షర విద్యకే శిరోవ్రతము అంగముగా చెప్పబడి యున్నం దున, శుక్ల యజుస్సును జెందిన అక్షరవిద్య, నభ్యసించువారికి ఈ శిరోవ్రత మవసర ముండదు. అట్లే, శుక్ల యజుశ్శాఖీయులకు శిరో వ్రతము లేనందున, ఈ ముండకాక్షరవిద్య చెప్పకూడ దనియు, ఈ నియమము సార్థక మగును కనుక, వేరు వేరు స్థలములలో పఠితము లగు వైశ్వానరాది విద్యలు వేరు వేరే కాని, ఒకటి యని అంగీక రించుటకు వీలు కాదని పూర్వపక్షము. ఈ శిరోవ్రత నియమ భంగ ప్రసంగ రూప మగు అధిక యుక్తి - పూర్వపక్షికి ఉన్నందున, త న్నిరసనార్థము ఈ యధికరణ మని యందురు.

ఆ యా ఉపనిషత్తులలో వేరు వేరుగా పఠించబడినను - ఒకే పేరు, ఒకే విధి, ఒకే ఫలము ఒకే విధమైన ఉపాస్యాకారము కలిగి యున్నందున, దహరాది విద్యలు వేరు కావని సిద్ధాంతము. "వైశ్వా నర ముపాస్తే" యని ఛాందోగ్య - బృహదారణ్యకములలో విధి ఒకే విధముగా నున్నది. రెండు చోట్ల కూడ - వైశ్వానరవిద్య అనియే పే రున్నది. రెంటి యందును - ఉపాస్య మగు వైశ్వానరుని ఆకార మొకే విధముగా నున్నది. రెంటికిని బ్రహ్మప్రాప్తి రూప మగు ఫలముకూడ ఒక్కటియే. ఈ నాలుగు కారణములనుబట్టి, పూర్వ దర్శనములలోని అగ్నిహోత్రాది కర్మలకు వలె, ఈ దర్శనమునందలి విద్యలకును ఐక్యమే నిర్ణయింపబడుచున్నది. ఐనచో - మరల చెప్పి నందునను, వేరొక ప్రకరణమైనందునను - విద్యయు వేరు కావలయు

నన్నారుకదా పూర్వపక్షీ ! అది అనవసరము. విద్య ఒకటి యైనను, వినువారు మారినప్పుడు మరియొకసారి చెప్పుట జరుగునుకదా ! చెప్పిన వ్యక్తికే మరల చెప్పుట జరిగిన యెడల, ఆ చెప్పిన విద్య వేరు, ఈ చెప్పుచున్న విద్య వేరు - అని అనుకొనవచ్చును. ఆధర్వాణికులకు చెప్పిన అక్షరవిద్య - శుక్లయజుర్వేదీయులకు చెప్పుట జరిగినప్పుడు - విద్యాభేదము రావలసిన యవసర ముండదు. అట్లే, వీరికి చెప్పిన ప్రకరణము వేరు కావచ్చును. వారికి చెప్పిన ప్రకరణము కావచ్చును. అంత మాత్రమున విద్యా భేదము సిద్ధింపదు.

ఇక శిరో వ్రతము విద్యా భేదమును సాధించు ననుకొనరాదు. అది అధర్వణ వేదాధ్యయనమునకు మాత్రమే కదా అంగము ! అధర్వణ వేదాధ్యయన మొనరించ గోరినవారు శిరో ముండన మొనరించుకొని, యథావిధిగా నిప్పు కణికలతో నిండి యున్న కుంపటిని తలపై నిడుకొని, గురూపసత్తి చేయవలసి యుండును. "నైతద చీర్ణవ్రతోఽధీతే" అను వాక్యము - శిరోవ్రతము చేయువాడు అధ్యయనము చేయకూడ దని నిషేధించుచున్నది. దీని వలన, శిరోవ్రతము అధ్యయనాంగమే కాని, అక్షరోపాసనకు అంగము కాదని తెలియుచున్నది కదా ! సూత్రకారుడు ఇచ్చట 'సమాచార' గ్రంథమును పేర్కొనినాడు. అందు ఒక వ్రతమును చెప్పి, "ఇదమపి వేద వ్రతేన వ్యాఖ్యాతమ్" ఇదియు వేదవ్రత వ్యాఖ్యానముతోడనే వ్యాఖ్యానము చేయబడినది - అని యున్న దనుచున్నారు శ్రీభాష్యకారులు. ఇట్లు శిరోవ్రత మను దానికి - వేదవ్రతమని పేర్కొనినందున, శిరోవ్రతము అధ్యయనాంగమేకాని, ఉపాసనాంగము కాదు - అని వక్కాణింపవలెను.

శిరోవ్రతము వేదాధ్యయనాంగమే యైనచో, ఏ వేదమును చదువువాడైనను సరియే - శిరోవ్రతము చేసికొనవలసినదే కదా

ఉండును - అని భావింప రాదని సూత్రకారుడు - "సవత చ్చ త న్నియమం" అనుచున్నాడు. ఆధర్వణికులు ఏకాగ్నులు ఇతరులందరు త్రేతాగ్నులు. సవముల పేరులో - "స ప్త మార్య" మొదలుకొని "శతౌదన" వరకు గల కొన్ని హోమములు ఏకాగ్నిలో చేయవలెనని విధించబడి యున్నవి. కనుక, త్రేతాగ్నిలో చేయకూడదు. అనగా - ఈ స ప్త మార్యాది శతౌదన పర్యంత హోమములు - ఆధర్వణికులు మాత్రమే చేయవలసినవి కాని, ఇతరులు కాదు. వీని వలెనే శిరో వ్రతము కూడ అధర్వణికులకు మాత్రమే కాని, ఇతర వేదాధ్యయన మొనరించు వారికి కాదని నియమము ఏర్పడు చున్నది. కనుక శిరో వ్రతము సామాన్యముగ - వేదాధ్యయనాంగ మనకూడదు ; కేవలము అధర్వ వేదాధ్యయనాంశము మాత్రమే - అని తెలిసికొన వలెను.

సర్వ వేదాంత ప్రతిపాద్య మగు ఉపాసన మొక్కటియే - అని శ్రుతియే - చూపించుచున్న దని సూత్రకారు డనును. అ దెట్లన :- శ్రీ భాష్య కారులు దహర విద్య నుదహరించి వివరించు చున్నారు. ఛాందోగ్యములో దహర విద్య యున్నది. "తస్మిన్ యదంత స్త దన్వేషవ్యం" దాని - లోపల ఉన్న దానిని ఉపాసింప వలెను అని చెప్పి, "కిం తత్ర విద్యతే య దన్వేష్టవ్యం" లోపల ఏ మున్నది ఉపాసించుటకు ? - అని శంకించుకొని, అపహత పాప్మ త్వము మొదలుకొని, సత్య సంకల్పత్వాది పర్యంతలు అగు గుణము లెనిమిది కల వని స్పష్టపరచినది. తైత్తిరీయమునందలి దహర విద్య యందును - "తస్మిన్ యదంత స్త దుపాసితవ్యం" దానిలోపల ఉన్న దానిని ఉపాసింపవలెను - అని విధింపబడియున్నది. మరి - లోపల ఏ మున్నది ? అది మన శంకకు ఛాందోగ్యములో చెప్పబడిన గుణా ష్టకమే కదా సమాధానముగ స్వీకరింపవలసియుండును ! అందువలన,

వేదాంతము లన్నింటియందును చెప్పబడిన ఉపాసన యొక్కటియే శ్రుతి తాత్పర్యముగా స్వీకరించవలె నని తాత్పర్యము. ఇట్లు వివిధ వేదాంతము లందలి దహర వైశ్వానరాది విద్యల భేదము న్యాయ సిద్ధము కనుక, ఒక శాఖలో ప్రతిపాదించిన గుణములు - మరి యొక శాఖలో అశ్రుతము లైనను - అనుసంధించుకొనవలసియుండును. ఒకే శాఖలో ఉపాసన విధించిన తరువాత, శ్రుతము లగు గుణములు ఎట్లు ఆ విద్య కుపకరించుటను బట్టి, అనుసంధించుకొనుట జరుగు చున్నదో, అట్లే - శాఖ భిన్న మైనను - విద్య ఒక్కటి యని ఏర్పడి నందున, త దుపకారకములుగా ఇతర శాఖలలోని గుణములనుకూడ అనుసంధించుకొనుట అవసరము. ఇట్లు శాఖాంతర శ్రూయమాణ గుణానుసంధానమే విద్యైక్యమునకు ప్రయోజనము. ఈ శాఖాంతర గుణములను శాఖాంతర విద్య యందును అనుసంధించుకొనుటనే గుణోపసంహార మని వ్యవహరింతురు. ఈ పాదమున ఎక్కువగా ఈ గుణోపసంహారమే చర్చించబడుచున్నందున, దీనికి గుణోపసంహార పాద మని పేరు. విద్యైక్య మున్నచో - గుణోపసంహారము. మరి - విద్యైక్యము ఈ యధికరణార్థమువలన సిద్ధించినది. ఒక యధికరణము యొక్క అర్థమును ఆ యధికరణ న్యాయ సిద్ధము విద్యైక్య మనియు, దానికి గుణోపసంహారము ప్రయోజన మనియు మనము గ్రహించ వలెను.

## 2. అన్యథాత్వాధికరణము

పేరు మొదలగునవి ఒకటి యైనచో - వివిధ శాఖలలో విని పించు విద్యల కైక్య మని పూర్వాధికరణము శాసించినది. ఛాందోగ్య బృహదారణ్యకములలో - ఒకే పేరు గల ఉద్గీథ విద్య జ్ఞాపకమునకు వచ్చినది. ఈ రెంటిలోని ఉద్గీథ విద్యయు ఒకటియో, కాదో

చర్చించవలసిన అవశ్యకత ఉన్నందున, ఈ యధికరణ మారంభింప బడినది. జ్ఞాపకమునకు వచ్చినది కూడ ఉపేక్షింపరాని దైనచో - దానిని నిరూపించుట ఈ ప్రసంగ సంగతి ఉండును. ఇపు డీ యధి కరణమునకు పై యధికరణముతో ప్రసంగ సంగతి యని యెరుగ వలయును. పై రెంటి యందును శ్రుతము లగు ఉద్గీథ విద్యలు భిన్న ములా ? అభిన్నములా ? అని సంశయము. ఉద్గీథ విద్యయే విష యము, దేవతలు, రాక్షసులు కూడ పూర్వము పరస్పరము యుద్ధము చేసినారు. ఉద్గీథముతో రాక్షసులను జయింత మని తలంచినారు దేవతలు. యజ్ఞమున గానము చేయబడునది ఉద్గీథము. ఈ ఉద్గీథ మును వాక్కు అనుకొనినారు దేవతలు. ఓడిపోయినారు. మనస్సు అనుకొనినారు. ఓడిపోయినారు. చివరకు ఉద్గీథను ముఖ్య ప్రాణ మని తలంచినారు. అపుడు గెలిచినారు. ఇట్లే, ఉద్గీథమును ప్రాణ దృష్టితో ఉపాసించినవారికి - శత్రు పరాజయ రూప మగు ఫలితము లభించ గలదు. ఇంచు మించు రెండు ఉపనిషత్తు లందును ఉద్గీథ విద్య - శత్రు పరాభవ భూత మగు ఫలమునకు సాధనముగా చెప్పబడినది. ఐనచో - ఇది అర్థ వాదము. అర్థ వాదములో ఫలము అబద్ధ మందురు పూర్వమీమాంసకులు. కాని, వేదాంతులు అర్థవాద ప్రతిపాదిత మగు ఫలము కూడ అబాధితము కనుక, అసత్య మేమియు కా దందురు. ఉద్గీథ విద్య ఫల సాధనముగా చెప్పబడినందున, ఉపాసన చేయవలయు ననెడి విధిని కల్పించుకొనవచ్చును.

ఇక ఈ రెండు శాఖ లందును ఒకే పేరుతో పఠించబడి యున్నందున, ఈ రెండు విద్యలకును భేదము లే దని పూర్వ పక్షము. పేరు మాత్రమే కాదు - ఫలము కూడ శత్రు పరాజయము ఒకటియే. పేరు, ఫలము మాత్రమే కాక, ఉపాసన చేయవలసినది ప్రాణ మనుకొనబడు ఉద్గీథము కూడ ఒక్కటియే కనుక, రూపము

కూడ ఒక్కటియే. "య ఏవం వేద" అని విద ధాత్వర్థ రూప మగు విధియు ఒక్కటియే. ఇట్లు చోదనా (విధి) ఫలరూపాఖ్యా చతుష్టయము, విద్యైక్య సాధనము ఉన్నందున, ఈ రెంటిలోని ఉద్గీథ విద్యలకును ఐక్యచో - సిద్ధాంతి రూపభేద మున్న దని భావించుటకు కొంత అవకాశము లేకపోలేదు. ఏ మనగా - బృహదారణ్యక కథలో దేవతలు ముఖ్య ప్రాణమును 'నీవే మా కొరకు ఉద్గానము చేయుము' అని ప్రార్థించిన ట్లున్నది. ప్రాణమే ఉద్గానము చేసినట్లు కూడ ఉన్నది. కనుక, బృహదారణ్యకములోని ఉద్గీథము ప్రాణ కర్తృకము. అనగా - గానము చేసెడువాడు ప్రాణము. గానము చేయఁబడినవాఁడు కాఁడు. ఛాందోగ్యమున నైనచో - ముఖ్య ప్రాణ రూప మగు ఉద్గీథ మును ఉపాసన చేసిన ట్లున్నది. ఇట్లు ఉద్గీథ రూపమున భేద మున్నందున, విద్యా భేదము చెప్పుకొను నవకాశము కొంత ఏర్పడుచున్నది.

కాని, పూర్వపక్షి అనును - నిజమే. బృహదారణ్యకమున ప్రాణ కర్తృక మగు ఉద్గీథము, ఛాందోగ్యమున ప్రాణ కర్మక మగు ఉద్గీథము చెప్పబడినవి. దీనితో విధేయ మగు విద్య భిన్నము కా నక్కరలేదు. ఏ మనగా - ప్రారంభమును బట్టి ముగింపును అర్థము చేసికొనవలె కదా ! ఒక విధముగా ఆరంభించి, మరి యొక విధముగా ముగించుట సమంజసము కాదు. ఆరంభమున రెంటి యందును దేవతలు ఉద్గీథముతో శత్రు పరాజయ మొనరించిన ట్లున్నది. కనుక, శత్రు పరాజయ సాధనమైన ఉద్గీథరూప మొక్కటియే యని చెప్ప వలయును కదా ! ఇక బృహదారణ్యకములో చివర, ప్రాణము ఉద్గాన మొనరించిన ట్లున్నందున, ఆ ఉద్గీథమే ప్రాణకర్తృక మనవలెను. ప్రారంభమున ప్రాణ కర్మకముగా కానవచ్చిన ఉద్గీథము యొక్క ముగింపు - తద్భిన్నముగా జరుగరాదు. కనుక, ప్రాణ కర్మకమే ఉద్గీథము. ఐనచో ప్రాణమును కర్తగా కదా ముగింపులో చెప్పియు

న్నారు ! అని వ్యాకులము చెందవలదు. ఏల ననగా - కర్మను సౌకర్యాతిశయముగ చెప్పుటకై, అచ్చటచ్చట కర్తగా పేర్కొనుట లోకమందును గలదు. బియ్యము మంచివి యైనపుడు, "బియ్యమే వండినవి" అందురు లోకమున. ఏ దేవదత్తుడో కదా కర్త వంటకు ! కాని, వంటకు కర్మ అను బియ్యమునే కర్తగా వ్యవహరించుచున్నట్లు ఉద్గీథ కర్మ యగు ప్రాణమును సౌకర్యము కొరకు కర్తగా కూడ చెప్పవచ్చును. అంతమాత్రమున అది కర్మ కాకపోదు. అందువలన, విధేయ భేదము లేదు. రూప భేదము లేదు. విద్యా భేదము కూడ లేదు. ఇది పూర్వపక్ష సారము.

సిద్ధాంతి ఉపక్రమము యొక్క ఉపక్రమమును కూడ చూపి, విద్యైక్యము సాధ్యము కా దనుచున్నాడు. "ఓమిత్యే తదక్షర ముద్గీథ ముపాసీత" ఓం అను అక్షరమును ఉద్గీథముగా ఉపాసన చేయవలెను" ఇది ఛాందోగ్యము నందలి ఉద్గీథ విద్యకు ప్రారంభము. "ఏతస్యై వాక్షరస్య ఉపవ్యాఖ్యానం" అనుచు, అసుర పరాజయ కథ చెప్పబడినది. కనుక, ఛాందోగ్య మందలి ఉద్గీథ విద్య - ప్రణవోపాసన రూపమైనదిగా గ్రహింపవలెను.

ఇక బృహదారణ్యకము నందు ఈ ప్రకరణము లేకనే ఉద్గీథోపాసనము చెప్పబడినది. కనుక, రెంటికి ప్రకరణము భిన్నము. అందువలన, విధేయము కూడ భిన్నమే. ఛాందోగ్యమున ఉద్గీథావయన మగు ఒక్క ప్రణవమునందే ప్రాణదృష్టి ఒక్క ప్రణవమే ఉపాసన చేయదగినదిగా పేర్కొనబడుచున్నది కదా ! బృహదారణ్యకములో నైన-చో, మొత్తము సామవేదము ఉద్గీథము. దాని కర్త అనగా ఉద్గాతయందు ప్రాణ దృష్టి. అట్టి ఉద్గాత కర్తయే ప్రాణ

భావముతో ఉపాస్యుఁడు. ఇట్లు ఉపాసన చేయ తగినది ప్రణవము. మరియు ఉద్గాత వేరు కనుక, రూప భేదము స్పష్టముగా నున్నది. ఉపాస్య రూపము భిన్న మైనందున, విధేయము కూడ భిన్నమే యని విధేయ భేద విద్యా భేదములేకదా చెప్పను ! ఏనచో - బృహదారణ్యకము నందును ఉద్గీథమునకే శత్రు పరాజయ రూప ఫలము చెప్పబడినందున, ఉపాస్య రూప ముద్గీథమే కాని, ఉద్గాత యందే ఉపక్రమ భంగము కాదా అని భావింపరాదు. ఉపాస్యుడు ఉద్గాత యైనను, అతడు గానము చేయు ఉద్గీథమే శత్రు పరాజయ మును కలిగించిన దనవచ్చును కదా ! ఉద్గాత యనినను, గీయమానో ద్గీథ మనినను సాధన భావమున చెప్పుకొన దగిన వైపరీత్య మేమియు ఉండదు. కనుక, రూప భేదమును బట్టి, విద్యా భేదము అంగీకరించక తప్పదు అని సిద్ధాంతి యనును.

మరియొక మాట. ఛాందోగ్యమున ఉద్గీథావయవ మగు ప్రణ వము యొక్క ఉపాసన లనేకములు విధించబడినవి. దానిలోని ఒకటి రెండు ప్రణవోపాసనలకు భేద మెట్లు ఏర్పడినదో పరికింతము. ఈ రెండు ప్రణవోపాసన లందును - ప్రణవములో పరమాత్మ సృష్టిరేగ విధించబడి యున్నది. ఏనచో - ఆ పరమాత్మ ఒకచోట హిరణ్మయ పురుషుడుగా పేర్కొనబడినాడు. మరి యొక చోట - పరోవర్ యస్త్వాది గుణ విశిష్టుడుగా పేర్కొనబడినాడు. హిరణ్మయ విగ్రహ వైశిష్ట్యము కలవాడు ఒకచోట ఉపాస్యుడు. ఇచట ధర్మ భేదమును బట్టి ఉపాస్య రూప భేదమేర్పడినందున, ఒకే శాఖకు చెందినవి యైనను - ఉపాస్య వ్యక్తి ఒక్కడే యైనను విధేయ భేదమును బట్టి, విద్యా భేదము సిద్ధాంతము అందువలన, ప్రకృత ఉద్గీథ విద్యయు విధేయ భేదమునుబట్టి భిన్న మనియే అంగీకరించవలెను. పేరు ఒక్కటి యైనంత మాత్రమున విద్యలు ఒక్కటి యనరాదు. అగ్నిహోత్ర

హోమము నిత్యమైనది యున్నది; కామ్యమైనదియు ఉన్నది. ఛాందోగ్యములో ఉద్గీథ మను పేర అనేక విద్యలున్నవి. కనుక, విధేయము భిన్న మైనను - పేరు ఒక్కటి ఉండవచ్చును. అంతమాత్రమున విద్యైక్యము సంభవము కాదు. ఛాందోగ్యమున ఉద్గీథావయవ ప్రణవోపాసనలు చెప్పు సందర్భమున మధ్యలో నున్నది ప్రకృత ఉద్గీథ విద్య. అనగా - దీనికి వెనుకను, ముందును కూడ ప్రణవోపాసనలే ఉన్నవి కనుక, ప్రకృత శత్రు పరాభవ సాధన భూతమైన ఉద్గీథ శబ్దమునకు ప్రణవ రూపార్థము చెప్పుకొను ప్రకరణము లేనందున, మొత్తము ఉద్గీథ మచట గ్రహింపవలసి యున్నది. అందువలన, ఈ రెండు విద్యలు - రూప భేదము వలన ఏర్పడిన విధేయ భేదమును పురస్కరించుకొని, భిన్నములుగనే స్వీకరింపవలసి యున్నది. కాని, విద్యైక్యము సాధ్యము కాదు. ఇది సిద్ధాంత సారము.

## 3. సర్వభేదాధికరణము

పై యధికరణమున ప్రాణదృష్టి నుంచవలసిన ఉద్గీథ విద్య విచారించబడగా - ఉపాసన చేయవలసిన దని చెప్పు ప్రాణవిద్య స్ఫురణకు వచ్చినది. ఇదియు ఉపేక్షించదగినది కాక, నిరూపించవలసినదే యైనందున, ఈ యధికరణము తన్నిరూపణము కొరకు ఆరంభించబడినది. కనుక, ఇదియు ప్రసంగ సంగతి కల దని తెలిసికొనవలెను. ఛాందోగ్య - బృహదారణ్యకములలో నొకే విధముగను, కౌషీతకిలో కొంచెము న్యూనముగను శ్రూయమాణ మగు ప్రాణ విద్య ఈ యధికరణమునకు విషయము. ఈ మూడు ఉపనిషత్తు లందును చెప్పబడిన ప్రాణ విద్యలో ఉపాస్యము ప్రాణమే కనుక, ఈ విద్య ఒక్కటియే యనవచ్చును. కాని, ఉపాస్య మగు ధర్మికి చెప్పిన ధర్మములలో భేద మున్నది. కనుక, విద్యలు అభిన్నము లన

వచ్చును. ఈ విధముగా ఈ ప్రాణ విద్యలు భిన్నములా? అభిన్నములా? అని సంశయ మేర్పడును.

ఇచట ఈ మూడు విద్య లందును ఛాందోగ్య - బృహదారణ్యకములలో ప్రతిపాదించిన విధానములో భేద మంతగా చెప్పినను, ఇంద్రియముల యొక్క వసిష్ఠత్వాది గుణములును ప్రాణమునకే చెప్పబడినవి. ఒక కౌషీతకిలో మాత్రము జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వములు చెప్పబడినవి కాని, వసిష్ఠత్వాది గుణములు ప్రాణమున గలవని చెప్పబడ లేదు. కనుక, ఉపాస్యము, ప్రాణము ఒకటియే యైనను, వసిష్ఠత్వాది ధర్మములు లేని ప్రాణమే కౌషీతకిలో ఉపాస్యముగా ప్రతీత మగుచున్నందున, ఇతర ప్రాణ విద్య కంటెను ఈ ప్రాణ విద్య భిన్న మని పూర్వపక్షి అభిమతము.

కాని, మూడింటి యందును ప్రతిపాదన శైలిలో భేద మంతగా లేనందున, ఈ మూడింటిలోని విద్యల కభేదమే న్యాయ మని సిద్ధాంతము. మూడింటి యందును వాగాది ఇంద్రియములు - తాను గొప్ప - అనుకొనుటయు, చివరకు ప్రాణము లేనిచో ఏ ఇంద్రియమును పని చేయనందున, ప్రాణమే జ్యేష్ఠ మని, శ్రేష్ఠ మని అంగీకరించుటయు జరిగిన ట్లున్నది. వాగాది ఇంద్రియముల యొక్క వసిష్ఠత్వాది గుణములు కూడ ప్రతిపాదించబడి యున్నవి. కౌషీతకిలో ఈ వాగాది ఇంద్రియములు తమ వసిష్ఠత్వాది గుణములను ప్రాణాధీనములని చెప్పుట ఒక్కటియు లేదు. మిగిలిన రెండు ఉపనిషత్తు లందును వాగాదింద్రియములు తమకు వసిష్ఠత్వాది గుణము లున్న వన, అవి ప్రాణాధీనమే కనుక, ప్రాణమునకు కూడ ఆ గుణ సంబంధమును చెప్పినవి. ప్రాణమునకు వసిష్ఠత్వాది గుణములకు తాను ప్రయోజకమగుటచే కదా! కౌషీతకి యందును వాగాదులు తమకు ప్రాణాధీనస్థితి కలవిగా చెప్పినప్పుడు, తమ గుణములకును ప్రాణాధీపత్వము

అర్థముగ సిద్ధమే యగుచున్నది. కనుక, కౌషీతకి ప్రాణవిద్య యందలి ఉపాస్య రూపము కూడ వసిష్ఠత్వాది గుణ విశిష్టమే కాని, అట్టి గుణ విధురము కాదని గుర్తించవలెను. ఐనపుడు - భిన్న శాఖలకు చెందినవే యైనను, విధేయ భేదము లేనందున, చోదనాది భేదము లేనందున, ఈ మూడింటి యందును శ్రూయమాణము లగు ప్రాణ విద్యలకు భేదము లేదనియే చెప్ప వలె నని సిద్ధాంతము. ఈ యధి కరణ మొకే సూత్రమున నిబద్ధ మైనది.

## 4. ఆనందా ద్యధికరణము

ప్రాణవిద్యను గురించి మరి కొంత విషయము వివరింపవలసి యున్నది. కాని, మధ్యలో ఆ విషయమును అడ్డుకొను జిజ్ఞాస ఒకటి ఏర్పడినది. అ దేమనగా - వాగాదుల వసిష్ఠత్వాది గుణముల నను సంధించినపుడు ప్రాణమునకు జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వానుసంధానము అంతగా ఉపపన్నము కానందున, కౌషీతకిలో అశ్రుతమైనను, వసిష్ఠ త్వాది గుణ సంబంధము ప్రాణమునకు అనుసంధించుకొనవలసిన దని పై యధికరణము నిరూపించినది కదా ! మరి అట్లే, ఏ గుణములు అనుసంధించక బ్రహ్మస్వరూపమే సరిగా ఉపపన్నము కాదో, అట్టి గుణములు అచ్చట అశ్రుతము లైనను అనుసంధించుకొనవలెనా ? అను ఈ జిజ్ఞాసకు సమాధానము కొరకే ఈ యధికరణ మారంభింప బడినది. కనుక, ఇదియు ప్రసంగ సంగతితో ప్రవర్తించినట్లు గ్రహించ వలెను.

ఆనందాది బ్రహ్మస్వరూప గుణములు ఈ యధికరణ విష యములు. ఈ గుణములు అశ్రుతము లగు విద్యలలో కూడ ఉప సంహరించుకొనవలెనా ? లేదా ? అని సంశయము. అశ్రుతములు కనుక ఉపసంహార మవసరము లేదు. కాని, పై యధికరణము నందలి

న్యాయము వలన ఉపసంహరించుకొనుట అనివార్యము కదా ! అందు వలన, ఆ సంశయ మేర్పడినది. ఇక, ప్రకరణములో చెప్పబడనందున, ఆనందాది గుణముల నన్నింటిని పర విద్యలో అనుసంధించుకొన వలసిన యవసరము లేదు. వసిష్ఠత్వాదులు అన్ని ప్రాణ విద్య లందును కనబడినందున, కౌషీతకి ప్రాణవిద్య యందును అనుసంధించు కొనుట న్యాయము. మరి ఆనందాదులు అన్ని పరవిద్య లందును పఠితములు కావు గదా ! అందువలన, ఆనందాదులకు అన్ని పర విద్యలలో ఉపసంహార మవసరము లేదు. వసిష్ఠత్వాదులు వాగాది గతము లగు అతిశయములు. దానికి కూడ ప్రాణమే హేతు వని తెలిసిననే తప్ప, ప్రాణము యొక్క శ్రేష్ఠత్వము తెలియదు. అందు వలన, వసిష్ఠత్వాది గుణములకు ప్రాణ విద్య లన్నింటి యందును ఉపసంహార మవసరము. ఇచట - నారాయణ, బ్రహ్మ - జగత్కా రణము మొదలగు రీతిలో పరబ్రహ్మ ఆనందాది గుణానుసంధానము వలెనే తెలిసికొనుచున్నందున, ఆనందాది స్వరూప నిరూపక గుణము లన్ని పరవిద్య లందును ఉపసంహరింపవలసిన యవసరము లే దని పూర్వపక్షము.

ఐనచో - అన్ని పరవిద్య లందును ఉపాస్య స్వరూపము ఒక టియే యైనందున, స్వరూపముతో పాటుగా నుండు ఆనందాది గుణ ములు అన్నివిద్య లందును ఉపసంహరింపబడవలె నని సిద్ధాంతము. తైత్తిరీయము నందలి ఆనందవల్లిలో - ఆనందమయోపాసన ప్రకరణ మున, సత్యజ్ఞానానందామలత్వ అనంతత్వములు శ్రుతములు. ఇవి స్వరూప నిరూపకములు కనుక, ఈ స్వరూపము ఉపాస్యముగా నున్న పరవిద్య లన్నింటి యందును అనుసంధించుకొనుట యుక్తము. ఐనచో - "తస్య ప్రియ మేవ శిరః" 'ఆతనికి ప్రియమే శిరస్సు' అని ప్రియ శిరస్త్వము మొదలగునవియు కొన్ని ఆ ప్రకరణమున పఠింప

బడి యున్నవి. కాని, అవి వాస్తవముగా బ్రహ్మ స్వరూప నిరూపక ములు కావు. అవి కేవలము బ్రహ్మ యొక్క పురుష విధత్వ రూప న్నమునకు తోడ్పడునట్టివే. స్వరూప నిరూపకములే అనుకొనిన శిరః పక్ష పుచ్ఛాదులను బట్టి, బ్రహ్మకు కూడ ఉపచయాపచయములు అంగీకరించవలసి వచ్చును. అపుడు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ఇత్యాది శ్రుతులు బాధించబడును. అందువలన, ప్రియ శిరస్త్వాదుల కుపసంహారమును శంకించరాదు. ఐనచో - స్వరూపముతో పాటుగా నుండు ఔదార్య కారుణ్యాది అనంత గుణములు కూడ, అన్ని పర విద్యలలో అనుసంధించుకొనవలసివచ్చుననియు భయపడనక్కరలేదు. ఏ మనగా - స్వరూపముతో పాటు ప్రతీతము లగు సత్య జ్ఞానానందా మలత్వానంతత్వము లైదు మాత్రమే అన్ని పరవిద్య లందును అను సంధేయములు. ఏ మనగా - ఇవి మాత్రమే స్వరూప నిరూపక గుణ ములు; స్వరూప నిరూపణ పర మగు తైత్తిరీయములో శ్రుతములు. మిగిలిన ఔదార్య కారుణ్యాదులు - నిరూపిత స్వరూప గుణములు. అవి ఎచ్చట పఠించబడిన, అచ్చట మాత్రమే అనుసంధేయములు. ప్రియ శిరస్త్వాదులు స్వరూప గుణములు కానప్పుడు అట్లు రూపించు టెందులకు ? కఠోపనిషత్తులో ఆత్మను రథికుడుగా, శరీరమును రథ మునుగా, ఇంద్రియములను అశ్వములుగా రూపించుటకు శరీరేంద్రి యాది వ్యాకరణోపదేశ సౌకర్యము ప్రయోజనముగా కన్పడు చున్నది. అట్లే, ఇచటి ప్రియ శిరస్త్వాది రూపణమునకును ప్రయోజన మేదేని కనబడవలెగదా ! అని ఆక్షేపించుకొని, ఆ విధముగా ధ్యానిం చుటకే రూపన్నము అని సూత్రకారు డనును. సాధారణముగా నొక పురుషుడు అన్నమయ కోశముతో శిరః పక్ష పుచ్ఛాదులు కల వాడుగా కన్పట్టుచున్నాడుగదా ! అట్లే, మన బుద్ధిలో పరమ పురు షుని ధ్యానించుటకు మాత్రమే ఈ నిరూపణము. వేరే ప్రయోజన మేమియు లేదు. అంతేకాని, ప్రియ శిరస్త్వాదులు స్వరూపములో

చేరినవి - అనుకొనగూడదు. ఈ ఆనందమయుని - "అన్యోఽంతర ఆత్మాఽఽనందమయః" అని ఆనందమును చెప్పుచున్నదిగదా శ్రుతి! ఆత్మకు శిరఃపక్షపుచ్ఛాదుల ప్రసక్తియే లేదుగదా! ఐనచో - ప్రాణమయ మనోమయ కోశముల నెప్పుడును - "అన్యోఽంతర ఆత్మా" అని ఆత్మ శబ్దము ప్రయోగించబడినందున, ఇచటి ఆత్మ శబ్దము పరమాత్మనే చెప్పు నని ఎట్లు నిర్ణయింపవచ్చును? అని శంకించ వలదు. ఐతరేయము నందును ఆత్మను చెప్పి, లోకములను సృష్టించు సంకల్పము కూడ అతనికి చెప్పినందున, ఆ ఆత్మ శబ్దము పరమాత్మనే చెప్పుచున్న దని ఎట్లు నిర్ణయించవచ్చునో, ఇచ్చటను ఈ ఆనందమయుడు "బహుస్యాం" అని సంకల్పించినా డనుట వలన, ఆత్మ శబ్ద మిచటిది పరమాత్మనే చెప్పు నని నిర్ణయింపవచ్చును.

పూర్వము ఆత్మలు కాని ప్రాణమయ మనోమయములను కూడ ఆత్మ శబ్దముతో పేర్కొనినందున, ఉపక్రమములోని వానివలె ఈ ఆత్మ శబ్దము కూడ అనాత్మను చెప్పుటయే సమంజసము కదా! మరి - మం దెపుడో "బహుస్యాం" అని, సృష్టి సంకల్పము చెప్ప బడుచున్నందున. ఈ ఆత్మ శబ్దము పరమాత్మను చెప్పు ననుట ఏమి న్యాయము? అనియు భావింపరాదు. కారణ మే మనగా - ఉప క్రమ మందును "తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" అని, ఆత్మకు సృష్టికారణత్వము చెప్పబడి యున్నది. కనుక, ఉప క్రమానుగుణముగా ఆత్మ శబ్దమునకు అనాత్మ పరముగా అర్థము చెప్పవలె ననుట తగదు. ఉపక్రమోపక్రమమును కూడ పరిశీలించ వలెను. అపుడు ఆత్మ శబ్దము పరమాత్మయందే ప్రయుక్త మని తెలియును. తరువాత వరుసగా - అన్నమయ ప్రాణమయాదుల యందు పరమాత్మ బుద్ధి యేర్పడినది. చివర ఆనందమయునియందు పరమాత్మ బుద్ధి అవతరించినది. కనుక, ఇచట ఆత్మ శబ్దమునకు పర

మాత్మరూప మగు అర్థమును చెప్పినందున, ఉపక్రమ భంగ మేమియు లేదు. ఇట్లు ప్రియ శిర స్త్వాదులు వాస్తవిక స్వరూప సంస్థాన నిరూపకములు కానందున, అన్ని విద్య లందును అనుసంధేయములు కావు. ఆనందాదులు స్వరూప నిరూపణములు కనుక, అన్ని పరవిద్య లందును ఉపసంహరణీయములే యని సిద్ధాంతము.

## 5. కార్యాఽఖ్యానాధికరణము

మధ్యలో అడ్డు తగిలిన జిజ్ఞాస తొలగిన తరువాత చెప్పవలసి యుండుటను - 'అవసర సంగతి' యందురు. ప్రకృత మగు ప్రాణ విద్యకు సంబంధించిన మరి కొన్ని విశేషములను వివరించు ఈ యధి కరణము - పూర్వాధికరణముతో అవసరసంగతి గలిగి యున్న దని గ్రహించవలెను. ఛాందోగ్య - బృహదారణ్యకములలో ప్రాణ విద్యను చెప్పిన తరువాత, ప్రాణమునకు జలమును వస్త్రముగా పేర్కొనబడినది. అందువలననే శ్రోత్రియులు భోజన పూర్వోత్తర కాలమున ఆచమనము చేయుదురు. వీనితో ప్రాణమునకు వస్త్రము కట్టినట్లు అగు దనియు పేర్కొనబడి యున్నది. ఆ తరువాత ఇట్లు ప్రాణము నగ్నము కాకుండుటకు విద్వాంసులు భోజన పూర్వోత్తర కాలములలో ఆచమనము చేయవలయు నని విధించబడి యున్నది. "తస్మా దేవం విట్ అశిత్వాష్య న్నాచామేత్, అశిద్వాచామేత్" అను ఈ మహా వాక్యము ఈ యధికరణ విషయము. ఇచట ఆచమనము స్మృతిప్రాప్తమే కనుక, విధించవలసిన యవసరము లేదు. అందువలన, జలమును ప్రాణవస్త్రముగా అనుసంధానమే విధించ బడుచున్న దనుకొంద మన్న, అచ్చట విధించు శబ్దము లేదు. అందు వలన, ఏ విధముగను నిర్ణయించుకొనలేని స్థితి - అనగా, ఆచమనము

విధేయమా ? ప్రాణవస్త్రముగా జలము ననుసంధించుకొనుట విధే యమా ? అని సంశయ మేర్పడినది.

పూర్వపక్షి ఆచమనము స్పష్టముగా భావించబడుచున్నందున, ఇది ఆచమన విధాయకమే అందురు. అయినచో - ఆచమనము స్మార్తాచారముతో ప్రాప్తమే కదా ! ప్రాప్త మగు దానిని విధిం చుట సాధ్యము కాదు. అనగా, ఇది శ్రుతి విహితమైనది గనుక, స్మార్తాచమనము తరువాత, భోజన పూర్వోత్తర కాలములలో మరి యొక ఆచమనము కూడ చేయవలసిన దని తాత్పర్య మనును. కాని, అది అసంగత మని సిద్ధాంతి వాకొనును. మ రేమి విధింపబడుచున్న దనగా - ఆచమనము చేయు జలమును ప్రాణవస్త్రముగా అనుసంధా నము చేయుటయే ఇచ్చట విధించబడుచున్న దనును. ఏ మనగా - ఇతర ప్రమాణ ప్రాప్తము కాని దానిని విధించినపుడే శబ్దము అర్థ వంత మగునుగదా ! ఆచమనము ప్రాప్తము. మరి యొక ఆచమనము అర్థము లేనిది. ఇక ఇచ్చటి వాక్యములుకూడ ప్రాణవస్త్ర మను దృష్టికి ఆచమనము చేయు జలమునందు ఉంచవలయు నను అపూర్వా ర్థమునే తెలుపుచున్నవి. ఛాందోగ్యములో ఈ విషయము నుపసంహ రించు నపుడు - 'భోక్తలు మొదట, చివర కూడ నీటితో ప్రాణము నాచ్ఛాదింతురు' అని ఆచ్ఛాదనమును ప్రధానముగా పేర్కొనినది. కాని, ఆచమనమును పేర్కొనలేదు. అందువలన, ప్రాణోపాసకునకు ఆచమనము చేయు జలమునందు ప్రాణ వస్త్ర దృష్టియే ఇచట విధేయ మని సిద్ధాంతము.

## 6. సమానాధికరణము

శుక్ల యజుర్వేదమునకు సంబంధించినది శతపథ బ్రాహ్మణము. దీని చివరిది నాలు గధ్యాయముల బృహదారణ్యకోపనిషత్తు. ఈ

ఉపనిష ద్భాగమునకు, పూర్వపు కొంత భాగమునకు అగ్ని రహస్య మని పేరు. ఈ అగ్ని రహస్యము నందును, బృహదారణ్యకము నం దును శాండిల్య విద్య పేరుతో - ఒక ఉపాసనము విధింపబడి యున్నది. విద్యల యొక్క భేదా భేద విచారము ఈ పాదమున ప్రస్తుతము కదా! అందువలన, ఈ రెండు శాండిల్య విద్యలయొక్క భేదా భేద విచారము కూడ ఇచట చేయవలసి యున్నది. ఇట్లు ఈ యధికరణమున ఈ శాండిల్య విద్యా ద్వయము విషయము.

ఈ రెండు విద్య లందును చోదనాదులు సమానములే. కాని, వశిత్వాది గుణములు కొన్ని అగ్ని రహస్యములో పఠింపబడనివి బృహదారణ్యకములో వినబడుచున్నవి.

పై యధికరణములోని ఆచమనము వలె అనువాద రూపమా ఈ వశిత్వాది గుణ గణము ? లేక - అపూర్వ విధానమా ? అని, సందేహ మేర్పడును. ఈ సంశయ మిచట కలుగుటకు - పై యధి కరణములోని ఆచమన సామ్యమును బట్టి, ఈ వశిత్వాది గుణ గణము, తద్ద్వారా ఈ శాండిల్య విద్య జ్ఞాపకమునకు రావలసి యుండును. అందువలన, పూర్వాధికరణములో ఈ యధికరణమునకు ప్రసంగ సంగతి యని గ్రహింపవలెను. జ్ఞాపకమునకు వచ్చిన విష యము అనుపేక్షణీయమై, నిరూపింపవలసి వచ్చినపుడు - ప్రసంగ సంగతి కల దని తెలిసికొనవలెను. ఇట్లు సంగతి, విషయము, సంశ యము - అనునవి ఇట స్పష్ట మైనవి.

ఇక పూర్వపక్షము. ఈ రెండు విద్యలకు - విధిలో, ఫల ములో, పేరులో వ్యత్యాసము లేకున్నను, ఉపాస్య మగు పరమాత్మ - వశిత్వాది గుణ విశిష్టముగా నొక చోట, అట్టి గుణ రహితుడుగా నొక చోట పేర్కొనబడనందున, రూప భేద మున్నట్లు స్పష్ట మగు

చున్నందున, విద్యలు రెండు విద్య లందును మనోమయత్వాది గుణ ములు కొన్ని బృహదారణ్యకములో కానవచ్చినను, అవి అన్ని రహస్యములో పఠించబడిన సత్య సంకల్పత్వము కంటె వేరు కావు కనుక, గుణ భేదము లేదు. అందువలన, రూపభేదము కూడ లేదు. కనుక, రెండు విద్యల కభేదమే సిద్ధాంతము.

## 7. సంబంధాధికరణము

బృహదారణ్యకములో శాండిల్య విద్యకు పూర్వము అక్షి పురుష విద్య, ఆదిత్య పురుష విద్యయు శ్రుత మగుచున్నవి. ఈ రెండు విద్యలందును ఉపాస్యము సత్య స్వరూప మగునట్టి వ్యాహృతి త్రయము శరీరముగా గలిగి యున్నట్టి బ్రహ్మమే. ఈ విద్యలు చెప్పు నట్టి వాక్యమే ఈ యధికరణమునకు విషయము. పై యధికరణము లోని శాండిల్యాది విద్యలలో వలెనే వీనిలో కూడ కొంత భేద మున్నది. ఆదిత్య మండల పురుషునకు "అహః" అని నామధేయ మట! ఆక్షిపురుషున కైనచో - "అహం" అని నామధేయ మట! ఇట్టి పూర్వాధికరణ సామ్యముతో స్మరణకు వచ్చిన విద్య ఈ యధి కరణమున విచారించబడుచున్నందున, ప్రసంగ సంగతి ప్రస్ఫుట మగుచున్నది. ఇచట ఉపాస్య రూప మొకటియే యైనందున, విద్యయు - శాండిల్య విద్య వలె ఒకటి యని అంగీకరించిన పక్షమున, పై రెండు నామధేయములును కేవలము ఆ యా స్థానముల యందలి పరమాత్మకే నియతములు కాక, రెండు విద్యలందును ఉపసంహ రించవలె నని విశద మగును. కాదు - స్థానము భిన్నము కనుక, అక్షి పురుషునకే "అహం" ఆ ఆదిత్య పురుషునకు "అహః" అని నియత మునసే నామధేయము లుండు నని స్పష్ట మగును. దీనిని బట్టి, ఈ

పేరు ఆ యా స్థానములలోని బ్రహ్మకే అని నియత మేమియు లేక, రెండు విద్య లందును రెండు పేర్లు అనుసంధించుకొనవలెనా ? లేక - స్థాన నియమముతో ఆ యా స్థాన పురుషునకే ఆ యా పేరు అనుసంధించుకొనవలెనా ? అని సంశయ మేర్పడును.

ఈ సంశయ మేర్పడినపుడు - పై యధికరణము నిర్ణయించిన పద్ధతి ననుసరించి ఉపాస్యమానము వేరు కానందున, విద్యయు వేరు కాదనవలెను. రెండును ఒకే విద్య యని తలంచినపుడు, రెంటిలోని విశేష గుణములు రెండు స్థలములందును అనుసంధించుకొనవలె ననియే స్పష్ట మగుచున్నది - అని పూర్వపక్ష మేర్పడును. ఐనచో - సిద్ధాంతి విద్యైక్యమును అంగీకరించడు. ఉపాస్య మగు ఒక్కటియే యైనను, అట్టి ఆదిత్య మండల రూప మగు స్థాన భేదమును బట్టి, రూప భేదమును అంగీకరింపవలసియే యుండును. శాండిల్యాది విద్య లలో హృదయ మొక్కటియే ఉపాస్య స్థానము. "అహః" అను శబ్దము - ఆదిత్య ప్రకాశము గల కాలమును చెప్పుచు, తద్ద్వారా పరమాత్మను చెప్పునుగదా ! "అహం" అను శబ్దము శరీర సంబంధి యగు ఆత్మను చెప్పుచు, తద్ద్వారా పరమాత్మను చెప్పును కదా ! మొదటిది అధిదైవతము, రెండవది అధ్యాత్మము అందురు. అందు వలన, ఈ రెండు పేర్లు - రెండు విద్య లందును అనుసరించవలె ననుట - భావ్యము కాదు. ఒకే విద్య - స్థానభేదమును బట్టి, పునరుక్తమైనదని భావింపరాదు. ఏ మనగా - ఛాందోగ్యములోని అంతరాదిత్య విద్య, అంతరక్షి విద్య - సందర్భములలో రెండు విద్యలు వేరు వేరు అని స్పష్టముగా శ్రుతి వలన తెలియుచున్నది. అచట ఆదిత్యమండలాంతర పురుషుని రూపమే అట్టి పురుషునకును అని చెప్పబడి యున్నది. ఇట్లు చెప్పుటను అతి దేశ మందురు. విద్యలు భిన్నము లైనందున, ఆ 'రూపము' ఈ విద్యలోనికి ఉపసంహరించు

టకు వీలు లేనపుడే కదా అతివేగము ! కనుక, ఈ అతివేగముతో ఛాందోగ్యములో వలెనే ఇచటి అక్షి పురుష ఆదిత్య పురుష విద్యలు లేవని అంగీకరింపవలసి యున్నందున, పూర్వాధికరణ దృష్టాంత మిచట చెల్ల దని సిద్ధాంతము.

## 8. సంభృత్యధికరణము

"అహః" "అహం" అని రెండు నామధేయములు ఆ యా ఉపాసన విధాన సందర్భమున పఠింపబడినందున, ఆ యా ఉపాసన లందే నియతముగా అనుసంధించుకొనుట పై యధికరణమున నిర్ణ యింపబడినది. ఐనచో, ఏ ఉపాసన సందర్భము లేకనే కొన్ని గుణ ములు సామ వేదమునకు సంబంధించిన రాణాయనీయ శాఖలో నొక చోట పఠింపబడినవి. వీని నెచట అనుసంధించుకొనవలె నను జిజ్ఞాసతో విచార మవసరమై, ఈ యధికరణ మారంభింపబడుచున్నది. ఉపాసన సందర్భమున పఠించబడిన గుణములు - ఉపాసన సందర్భము లేకనే పఠించబడిన కొన్ని గుణములను స్మరింప జేసినవి. ఇట్లు జ్ఞాపకము వచ్చిన వానిని నిరూపింపవలసి వచ్చినందున, ఈ యధికరణము ప్రసంగ సంగతి కలిగి యున్నది. రాణాయనీయ శాఖలోని "బ్రహ్మ జ్యేష్ఠా వీర్యా సంభృతాని" ఇత్యాది మంత్ర వాక్య మిచ్చట విష యము. ఇందు బ్రహ్మ గొప్ప శక్తి గలవా డని, అన్ని దేశము లందును, అన్ని కాలము లందును కలవా డనియు, ఆతనితో ఎవ్వ డును పోటీ పడలే రనియు చెప్పబడి యున్నది. ఈ అతి శయిత శక్తి - సర్వ దేశ కాల వ్యాప్తి మొదలగు గుణములు ఏ ఒక్క ఉపాసన సందర్భమునందో పఠించబడినవి కావు. ఉపాసన ప్రకరణమే లేదు కదా ! ఇట్లు ఉపాసన ప్రకరణము లేకుండ పఠించబడిన విశేషములను అనారభ్యాధీతములు' అందురు. ఈ అనారభ్యాధీతములను అన్నింటి

యందును అనుసంధించుకొనవలసి యుండును. కనుక, వీనికి కూడ అన్ని విద్య లందును అనుసంధించుకొనవలెనా ? లేక - ఏవేని కొన్ని విద్యలలోనే అనుసంధించుకొనుట చెప్పవచ్చునా ? అనునది ఇచట సంశయము. అనారభ్యాధీతముల కన్ని విద్యలలో నుపసంహారమే మీమాంసా సిద్ధాంతము. కనుక, ఇచటి వీర్యాతిశయాది గుణములు కూడ అన్ని విద్య లందును ఉపసంహరించుకొనవలసినవియే అని పూర్వపక్ష మేర్పడును.

సిద్ధాంతములో అనారభ్యాధీతములే యైనను, వీనికి కూడ స్థాన భేదమును బట్టి, వ్యవస్థ ఏర్పాటు చేయవచ్చు నని సూత్రకారుడు వక్కాణించును. ఏ మనగా - ఇచట గుణములలో - "శిర మాతతాన" అని ద్యులోక వ్యాప్తియు ఒకటి చెప్పబడినది. ఇది హృదయము, అక్షి - మొదలగు అల్పస్థానమున చెప్పబడు విద్యలలో అనుపపన్నము. ఇట్లే, ఇచట ఈ ద్యులోక వ్యాప్తితోపాటు పఠించ బడిన గుణము లన్నియు ఆ ద్యువ్యాప్తిని ఉపసంహరించు విద్యలందే ఉపసంహరించవలెను. అన్నియు సహ పఠితములు కనుక, ఇట్లు అనార భ్యాధీతములే యైనను అర్థస్వభావము ననుసరించి ఈ ద్యువ్యాప్తి ప్రభృతి గుణములు అల్ప స్థానగోచరము లగు అక్షి పురుషాది విద్యల కంటెను అన్య విద్యల యందే ఉపసంహరించుట వ్యవస్థాపిత మగుచున్నది. ఐనచో - అల్ప స్థానము గల శాండిల్య - దహర విద్య లందును ఉపాస్య మగు పరమాత్మ పృథివ్యాకాశాదు లంతటి గొప్పవాడుగా చెప్పబడుచున్నాడు. నిజమే - కాని, ఇచట ఈ గొప్ప తనము పరమాత్మ యొక్క స్వాభావిక మాహాత్మ్యముగా గోచరించునే కాని, "దివ మాతతాన" అనెడి పై వాక్యమునందు చెప్పిన ఔపాధిక మహత్త్వమును కాదు. ఔపాధిక మహత్త్వము ఆ స్థానమున నున్నం దున చెప్పబడునది - పరమాత్మకు దహర విద్యలో కాని, శాండిల్య

విద్యలలో కాని అల్పత్వము ఔపాధికము మహత్వము స్వాభావిక మన వలె గదా ! ఇక ప్రకృత మగు ద్యువ్యాప్తి ఔపాధికము కనుక, అల్పస్థాన విషయక విద్యలతో ఈ గుణము అనుపపన్నము. అందు వలన, అనారభ్యాధీతములే యైనను, ఈ గుణములు స్థాన భేదముతో వ్యవస్థాపితములు కావలసినవే కాని, అన్ని విద్యలందును ఉపసంహారములు రాజాల వని ఈ ప్రకరణ సిద్ధాంతము.

## 9. పురుష విద్యాధికరణము

విద్యల యొక్క భేదాభేద విచారమే ప్రస్తుత మైనందున, ఈ యధికరణము కూడ ప్రసంగముతో సంగత మగుచున్నది. "తస్యైవం విదుషో యజ్ఞ స్యాత్మా యజమానః శ్రద్ధా పత్నీ" ఇత్యాదిగా తైత్తిరీయమునందును, "పురుషో వాజ్ఞః" ఇత్యాదిగా ఛాందోగ్యమున నందున పురుష విద్య పఠించబడి యున్నది. ఈ రెంటికి భేదమా ? అభేదమా ? అని సంశయము. నామాదులు ఒకటే కనుక, అభేద మని పురుష అవయవాది కల్పనా రీతిలో భేద మున్నందునను, భిన్న మని అనుకొనుటకు అవకాశ మున్నందునను- ఈ సంశయ మేర్పడినది. పురుషుని యజ్ఞముగా కల్పించుట సమానమే కనుకను, పేరు 'పురుష విద్య' అని ఒకటియే కనుకను - తైత్తిరీయములోని విద్యకు ఫలము శ్రుతము కాకున్నను, ఛాందోగ్యమున శ్రూయమాణ మగు ఫలమే దీనికిని చెప్పికొనవచ్చును కనుక, ఫల సంయోగము సమానమే కనుకను ఈ రెండు విద్యలకు భేదము లేదని పూర్వపక్ష మేర్పడు చున్నది.

ఐనను, సిద్ధాంతి దీనిని అంగీకరించడు. పేరు ఒక్కటే యైనను, ఒక విద్యలోని గుణములు మరి యొక దానిలో చెప్పబడనందున, ఈ పురుష విద్యలు భిన్నములే యని సిద్ధాంతము. "యత్ ప్రాతః

సాయం మధ్యందినం చ తాని సమాని" అని తైత్తిరీయకమున ప్రాత ర్మధ్యాహ్న సాయంకాలములు సవనములుగా రూపించబడినవి. ఛాందోగ్యము పురుషాయుషమును మూడుగా విభజించి, దానికి మూడు సవనములుగా రూపించబడినది. అట్లే, దీక్షా విషయ మందును, యజమానాది కల్పనారీతి యందును భేదము స్పష్టముగాగన్పట్టు చున్నది. అందువలన, ఈ విద్యలకు కూడ భేద మున్న దని కదా తెలియుచున్నది ! అంతే కాదు. తైత్తిరీయక పూర్వానువాకమున "బ్రహ్మణేత్వా మహస ఓమి త్యాత్మాను యుంజీత" అని బ్రహ్మ విద్య పేర్కొనబడినది. తరువాత దానికి ఫలితముగా "బ్రహ్మణో మహిమాన మాప్నోతి" అని బ్రహ్మ మహిమ ప్రాప్తిని చెప్పిన తరు వాత, పురుషవిద్య ఆరంభించబడినది. కనుక, ఈ పురుష విద్య - పైన పేర్కొనబడిన బ్రహ్మ విద్యకు అంగ మగుచున్నది. అట్టిచో - బ్రహ్మ విద్య ఫల మగు బ్రహ్మ ప్రాప్తియే ఈ తైత్తిరీయ పురుష విద్యకు ఫల మనవలసి యున్నది. ఛాందోగ్యము నందలి పురుష విద్యకు - "ప్రహా షోడశం వర్ష శతం జీవతి" అని నూరు పదారేళ్ళ జీవితము ఫలముగా పేర్కొనబడినది. ఇట్లు ఈ రెండు విద్యలకును రూపము నందును, ఫలమునందును భేద మున్నందున, ఇవి రెండును భిన్నములే కాని, అభిన్నములు కావని సిద్ధాంతము.

## 10. వేదాద్యధికరణము

పై యధికరణమున బ్రహ్మవిద్యా సన్నిధి పాఠ మున్నందున, తైత్తిరీయ పురుష విద్య బ్రహ్మవిద్యాంగ మని నిర్ణయించబడినది. దీని సామ్యమును బట్టి ఆ యా ఉపనిషత్తులను మొదట పఠించబడు

మంత్రములు కూడ ఆ యా ఉపనిష ద్విద్యలకు అంగములు కావచ్చు నేమో అని ఈ ఉపనిష దారంభ పఠిత మంత్ర ప్రవర్గ్యాది కర్మలు జ్ఞాపకమునకు వచ్చినవి. అందువలన, వాని విచార మొనరించు ఈ యధికరణము ప్రసంగ సంగతితో ఆరంభించబడుచున్నది. ఆ యా ఉప నిష దారంభములుగా శ్రూయమాణము లగు మంత్రములు "శంనో మిత్ర శ్శం వరుణః" ఇత్యాదులు కాని, ప్రవర్గ్యాది కర్మలు కాని ఈ అధికరణ విషయముగా తెలియవలెను. ఇవి ఉపనిష దారంభమున ఆ యా విద్యల రంగము కావచ్చునా ? లేదా ? అను సంశయము ఏర్పడ నచ్చును. సన్నిధి పఠితములు కనుక, ఆ యా విద్యలకు అంగము లగుటయే ఉచిత మని పూర్వపక్షము. కొన్ని మంత్రములు, కర్మలు కూడ శ్రుత్యాది ప్రమాణములచేత కర్మలకు అంగములు పూర్వమీమాంసలో నిర్ణయించబడినవి.

సిద్ధాంతము మాత్రము వీనికి విద్యాంగములుగా అంగీక రించదు. ఆ యా మంత్రములకు ఆ యా అర్థములను ప్రకాశింపజేయు సామర్థ్యమును అంగ ప్రమాణ మందురు. అంగ ప్రమాణములో ఈ మంత్రములు విద్యలకు అంగములు కాక, అధ్యయనమునకే అంగము లని ఏర్పడు నని సూత్రకారుడు వచించును. ఆథర్వణికులు ఉపనిష దారంభములో పఠించు "శుక్ర ప్రధ్య" ఇత్యాదులు అర్థ సామర్థ్య మును బట్టి, అభిచార హోమాదులకు అంగము లైనట్లు - "తేజస్వి నావధీత మస్తు", "ఋతం వదిష్యామి" ఇత్యాదులు కూడ అధ్యయన రూపార్థమును ప్రకాశింపజేయుచున్నందున, అధ్యయనమునకే అంగ ములు కాగలవు. కనుక, ఇవి విద్యాంగములు కావనియే సిద్ధాంతము.

## 11. హాన్యధికరణము

పై యధికరణమున మంత్రములకు విద్యాంగత్వము చర్చించు టలో ఈ యధికరణమున చర్చించబడు పుణ్య పాప ప్రహాణాది

చింతనముకూడ విద్యాంగ మని స్మరణకు వచ్చినందున, ప్రసంగ సంగతితో ఈ యధికరణ మారంభ మగుచున్నది. ముక్త పురుషుడు పాప పుణ్యములను పరిత్యజించు నని - "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం" ఇత్యాదిగా ఛాందోగ్యము ముండకము కూడ - "తదా విద్వాన్ పుణ్య పాపే విధూయ" ఇత్యాదిగా - బ్రహ్మను పొందువాడు పాప పుణ్యముల ప్రహాణము చేయు నని చెప్పుచున్నది. శాట్యాయన శాఖలో నైనచో - "సుహృద స్సాధు కృత్యాం ద్విషంతః పాప కృత్యాం" ఇత్యాదిగా - ముక్తి చెందువాని పుణ్యము - స్నేహితులను, పాపము శత్రువులను చేరు నని చెప్ప బడియున్నది. ఈ పుణ్య పాప ప్రహాణము, ప్రియాప్రియ జనుల పుణ్య పాపములు చేరుట అను ఈ రెం డంగములును బ్రహ్మవిద్యా నిష్ఠుడు అనుసంధాన మొనరించుకొనవలె నని - "విధూయ పాపం... బ్రహ్మలోక మభిసంభవామి" అను ఛాందోగ్య వాక్యము వలన తెలియుచున్నది. కనుక, పుణ్య పాప ప్రహాణాది చింతనము బ్రహ్మ విద్యాంగ మనుటలో సందేహము లేదు. మరి - సంశయ మే మనగా - కొన్ని స్థలములలో పుణ్య పాప ప్రహాణమే ఉన్నది. మరి కొన్ని చోట్ల - ప్రియాప్రియ జనులను పుణ్య పాపములు చేరుట మాత్రమే ఉన్నది. ఇంకొక చోట - ప్రియాప్రియ జనులను చేరుట యున్నది. పుణ్యపాప ప్రహాణమును ఉన్నది కదా! కనుక, ఈ పుణ్యపాప ప్రహాణాది చింతనము ఈ యధికరణమునకు విషయము. ఈ పుణ్యపాప ప్రహాణము ఏ శాఖలో శ్రుత మైనదో, అచ్చటనే ఆ చింతనము అంగమా ? ఇట్లే, ఎచ్చట పుణ్య పాపములు ప్రియా ప్రియ జనుల చేరు నని యున్నదో, అచ్చట మాత్రమే ఆ చింతనము అంగమా ? లేక - ఈ ఉభయ చింతనము సర్వ బ్రహ్మవిద్యలకును అంగమా ? అనునది సంశయము.

ఎచ్చట శ్రుత మైనది అచ్చట మాత్రమే అంగము అని పూర్వపక్షము. వేరు వేరుగనే ఉపదేశింపబడినందున, ఎచ్చట ఎట్లు ఉపదేశ ముండునో - అచ్చట అంతమాత్రమే చింతించుట భావ్యము. కాదు - అంతటను ఉభయ చింతనము ఉపసంహరించబడవలె నను కొనినచో - కౌషీతకిలో ఉభయ ముపదిష్టమైనది కనుక, ఇతర శాఖలలో ఒక్కొక్కటి చెప్పుట నిరర్థకము కదా ! ఆ శాఖ అధ్యయనము చేయువారి కొరకు చెప్పినందున, నిరర్థకము కాదని తలంప వలదు. విశేషములు ఏమియు లేక పున రుపదిష్ట మైనచో, ఆ శాఖీయుల కొరకు చెప్పినందున, సార్థక మనవచ్చును. కాని, ఇది పున రుపదిష్టము కాదు. ఒక శాఖలో పుణ్యాపాప ప్రహాణమే మరి యొక శాఖలో ప్రియాప్రియ జనోపాయనమే కదా చెప్పబడినది ! ఉభయము ఒకే చోట కదా ఉపదిష్టము ! అందువలన, ఉభయ చింతనము సార్వత్రిక మనుకొనినచో - ఆ యా శాఖలలో ఒక్కొక్కటి చెప్పుట నిరర్థకమే కావలసి యుండును. కావున, ఏ శాఖలో ఏ యంశము ఉపదిష్ట మైనదో, అచట - ఆ చింతనము మాత్రమే అంగ మనుకొనవలె నని పూర్వపక్షము.

ఒక చోట పుణ్య పాప ప్రహాణము మాత్రమే. మరి యొక చోట ప్రియాప్రియ జనోపాయనము మాత్రమే శ్రుత మైనందున, అన్ని చోట్లను ఈ రెంటిని చింతించుట ఆవశ్యకము. ఈ ప్రియాప్రియ జనుల చేరుట అనునది - ప్రహాణమునకు సంబంధించినది కదా ! ఏ మనగా - బ్రహ్మవిద్యానిష్ఠుడు విడిచినప్పుడు పుణ్యాపాపములు ప్రియాప్రియులను చేరును. కనుక, ఇవి రెండును ఒక దానితో మరియొకటి కలిసియుండవలసిన దనియే అని సిద్ధాంతము. ఒక శాఖలో నున్న ప్రహాణమునకు మరి యొక శాఖలోని ఉపాయనము ఎట్లు సంబంధించి యుండవచ్చునో సూత్రకారాదులు వివరించి

యున్నారు. కాలాప శాఖీయులు - "కుశాః వానస్పత్యాః" అని పఠించి రట ! కుశలు అనగా - ఋక్కులు. గానము చేయునపుడు ఉద్గాత లెక్కించుకొనుటకు తెచ్చి పెట్టుకొనిన పుల్లలు. ఇవి వానస్పత్యమునకు - అనగా, చెట్లకు సంబంధించినవి - అని యర్థము. శాట్యాయన శాఖీయులు - "ఔదుంబ ర్యపి కుశాః" అని పఠించిరి. మేడిచెట్టు పుల్లలు - అని దీని యర్థము. ఇపుడు మొదట - 'చెట్ల పుల్లలు - అని సామాన్యముగా నున్నవానికి - 'మేడి పుల్లలు' అను విశేష రూపమున పర్యవసాన మేర్పడును. ఇట్లు శాఖా భేద మున్నను, ఆ యా అర్థములకు పరస్పర సంబంధము సర్వ సమ్మతమే యని కదా తెలియుచున్నది.

ఇట్లే, దేవ చ్ఛందస్సుల ప్రసంగ మొక శాఖలోను, వేరొక శాఖలో దేవ చ్ఛందస్సులు పూర్వ మనియు ఉన్నది. ఈ రెంటికిని పరస్పర సంబంధము అంగీకార్యమే కదా ! ఇట్లే, షోడశి గ్రహ స్తుతి ఒక శాఖలో చెప్పబడగా, సూర్యుడు అస్తమించినపుడు - షోడశి గ్రహ స్తోత్రము చేయ వలె నని మరి యొక చోటను తెలుప బడినది. ఐనను, ఈ రెంటికి సంబంధము చెప్పికొని, అధ్వర్యువు తప్ప, తక్కిన ఋత్విక్కులు గానము చేయవలయు ననియేకదా చెప్పు కొనుచున్నాము ! అందువలన, ప్రకృతములోను, పుణ్య పాప ప్రహాణోపాయణములు భిన్న స్థలములలో శ్రుతము లైనను, పరస్పర సంబంధము ఆవశ్యకమే కనుక, రెంటికి అన్ని విద్యలందును చింతించ వలె నని తాత్పర్యము. కౌషీతకిలో మరల ఉభయ శ్రవణము శాఖా భేదము వలన సార్థకము కావచ్చును. ఇది సిద్ధాంత సారము.

## 12. సాంపరాయాధికరణము

పై యధికరణములో ప్రసక్తమైన పుణ్య పాప ప్రహాణాది చింతనమునకు సంబంధించిన మరి యొక విశేషమును విమర్శించుటకు

ఈ యధికరణ మారంభించబడుచున్నది. పుణ్య పాపములు అర్చి రాది మార్గమున విరజా నదిని దాటిన తరువాత విడిచిపెట్టు నని కౌషీతకి చెప్పుచున్నది. "స అగచ్ఛతి విరజాం నదీం. తాం మనసాఽత్యే అ తత్ సుకృత దుష్కృతే ధూనుతే" అని. ఛాందోగ్య మైనచో - శరీర వియోగ కాలము నందే పుణ్యపాప ప్రహాణమును "... విధూయ పాపం చంద్ర ఇవ రాహోర్ముఖాత్ ప్రముచ్య ధూత్వా శరీరం" ఇత్యాదిగా నుడువు చున్నది. ఇవు శ్రీ యధికరణ విషయము - పుణ్య పాప ప్రహాణ చింతనము. సంశయ మే మనగా - పుణ్య పాప ప్రహాణము శరీర వియోగ కాలము నందును, మార్గము నందును ఉభయత్ర జరుగు నని చింతించ వలెనా ? అనునది. ఐనచో - పూర్వాధికరణములో ఒక చోట అశ్రుత మైనను, ప్రహాణము, ప్రాప్తి అను రెండు - అన్ని స్థలము లందును అనుసంధించుకొనవలె నని నిర్ణయము జరిగినది కదా ! ఆ ప్రసంగము ననుసరించియే సంగతమైన ఈ యధికరణ విషయము నందును ఆ పుణ్య పాప ప్రహాణాదికము శరీర వియోగ కాలమున కొంత జరిగినట్లు, మార్గ సంచార కాలమున మిగిలినది జరిగినట్లు చింతించవలె నని పూర్వపక్ష మేర్పడును.

మొత్తము పుణ్య పాప సముదాయము దేహ వియోగ కాల మున జరుగు దనియే చింతించవలె నని సూత్రకారుని సిద్ధాంతము తెలుపుచున్నది. ఏ మనగా - జీవుడు బ్రహ్మవిద్యా నిష్ఠు డగువాడు శరీరమునుండి ఉత్క్రమించి, అర్చిరాది మార్గము ద్వారా ప్రయా ణము చేయుచుండ, పుణ్య పాపముల వలన అనుభవించవలసినవి ఏవియు ఉండవు. బ్రహ్మప్రాప్తివిద్యాఫలమే కాని, పుణ్యపాపముల అవసర మేమియు దానికి లేదు. "అశరీరం వావ సంతం న ప్రియా ప్రియే స్పృశతః 'శరీరము లేనివానికి సుఖ దుఃఖ భోగ ముండదు

అన్ని ఛాందోగ్యము చెప్పుచున్నది. అందువలన, కౌషీతకిలో - మార్గమున జరుగునట్లు చెప్పు వాక్యమును మొదటి వాక్యమునకు ముందు - అన్వయము చెప్పుకొనవలెను. అపుడు దేహ వియోగ కాలమునందే పుణ్య పాప ప్రహాణాదికము జరుగు నని చింతించుటయే భావ్యము. ఐనచో, దేహ వియోగ కాలమునందే సర్వ కర్మ క్షయము జరిగినచో, ఇక సూక్ష్మ శరీరము కూడ ఉండుటకు వీలు లేదు. అపుడు శరీరము కాని జీవునకు అర్చిరాది మార్గమున గతియు సాధ్యము కాదు. కనుక, శరీర వియోగ కాలమునందే సర్వ కర్మ క్షయము అనుపపన్న మని పూర్వపక్షి ఎదిరించవచ్చు.

కాని, సర్వ కర్మ క్షయము దేహ వియోగ కాలమున జరిగినను, శరీర సంబంధము జీవునకు అనుపపన్న మేమియు కాదని సిద్ధాంతి యనును. మోక్ష దశలో - జీవునకు శరీర సంబంధమును చెప్పు శ్రుతు లున్నవి. "స ఏకధా భవతి త్రిధా భవతి" మొదలగునవి. ఆదరములు కర్మ కృతములు కావు. ఈ సూక్ష్మ శరీరము కర్మ కృతమే యని భావించినను, విద్యా మాహాత్మ్యమును బట్టి - బ్రహ్మ ప్రాప్తి పర్యంతమో, లేక - బ్రహ్మావేష ప్రాప్తి పర్యంతమో, విరజా స్నాన పర్యంతమో అనువర్తించుటలో అనౌచిత్య మేమియు లేదు. వసిష్ఠాదులు బ్రహ్మవిద్యా నిష్ఠులే ఐనను, వారికి దేహ వియోగానంతరము పునః దేహాంతరము పుత్ర ప్రాప్తి మొదలగునవి కలిగినట్లు శాస్త్రము చెప్పుచున్నది. మరి - దేహ వియోగ కాలమునందే వారికి సర్వ కర్మ క్షయ మేర్పడినచో - ఇది సాధ్యము కాదు కదా ! అని శంకించ నక్కరలేదు. సర్వ కర్మ క్షయము విద్యా నిష్ఠులందరుకును దేహ వియోగ సమయమున జరుగు నని అర్థము కాదు. ఎవరికి అర్చిరాది మార్గము ద్వారా బ్రహ్మప్రాప్తి ఏర్పడ నున్నదో, అట్టి వారికి మాత్రమే శరీర వియోగ సందర్భమున, సకల కర్మ క్షయ

మని చెప్పబడుచున్నది. వసిష్ఠాదులు ఆధికారిక పురుషులు. ఒక రక మైన ప్రత్యేక కార్య నిర్వహణ కేర్పడినవారు. వారికి వారి యధి కారానుగుణమైన కార్యము పూర్తి యగునంతవరకు కర్మ అను వర్తించుచునే ఉండును. శరీర పాతానంతరము వారు అర్చిరాది మార్గమున సంచరించినవారును కారు. కనుక, పుణ్య పాప ప్రహా ణాదికము శరీర వియోగ సందర్భమున జరుగునట్లే చింతించవలయు నని సిద్ధాంతి అభిప్రాయము.

## 13. అనియమాధికరణము

పై అధికరణములో అర్చిరాది గతి ప్రసక్తమైనది. ఇట్లు స్మృత మైన అర్చిరాదిని గురించిన విచారము ఈ యధికరణమున చేయబడు చున్నది. కనుక, ప్రసంగ సంగతియే ఈ యధికరణమును ఆరంభింప జేయుచున్న దనవలెను. విషయము అర్చిరాది మార్గమునకు సంబం ధించినది. పుణ్య పాప ప్రహాణము వలె అర్చిరాది మార్గము కూడ బ్రహ్మవిద్యా నిష్ఠు లందరికిని సమానమే యగునా ? లేక, ఏ విద్య వద్ద అర్చిరాది గతి చెప్పబడినదో - ఆ విద్య గలవారికే యగునా ? అనునది సంశయము.

ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులలోని ఉపకోసల విద్యాది సందర్భమున మాత్రమే ఈ యంశము శ్రూయమాణ మగు చున్నందున, అర్చిరాది గతి చింతనము కూడ తద్విద్యా నిష్ఠులకు మాత్రమే అను నియమ ముచితము. ఇతర విద్యా విధాన సందర్భ మున అర్చిరాది గతి చెప్పబడలేదుగదా ! అని పూర్వపక్ష మేర్పడును.

ఉపకోసల పంచాగ్న్యాది విధాన సందర్భమున మాత్రమే శ్రుత మైనందున, అర్చిరాది గతి - తద్విద్యా నిష్ఠులకే అని నియమము

ఉచితము కాదు. సర్వ బ్రహ్మ విద్యా నిష్ఠులు కూడ అర్చిరాది మార్గముననే వెళ్ళవలసినవారు కనుక, అందరికిని ఆ గతి సమానమే. ఛాందోగ్య, బృహదారణ్యకములలో - పంచాగ్ని విద్య నిష్ఠులతో పాటు - ఇతర సర్వ బ్రహ్మ విద్యానిష్ఠులకు కూడ అర్చిరాది గతి చెప్పబడినది. అచ్చట సత్య తప శ్శబ్దములతో బ్రహ్మకే చెప్పబడు చున్నది. కనుక, సర్వ బ్రహ్మవిద్యా నిష్ఠులకును అర్చిరాదియే మార్గ మని గ్రహింపవలెను. శ్రుతిలోనే గాక, అర్చిరాది మార్గము ద్వారానే బ్రహ్మ వేత్తలు బ్రహ్మను చేరుదురు. "అగ్ని ర్జ్యోతి రహః. ... తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః" అని భగవద్గీతయు వక్కాణించుచున్నది. ఇట్లు చెప్పు అనేక శ్రుతి స్మృతులకు విరోధము రాకుండుట కొరకు అర్చిరాది గతి కాని, దాని చింతనము కాని - సర్వ విద్యా నిష్ఠులకు సాధారణ మని సిద్ధాంతము.

## 14. అక్షర ధ్యధికరణము

ఆనందాద్యధికరణమునకు పిమ్మట ప్రసంగ వశమున విద్యాంగ చింతనము చేయబడినది. ఇక అవసర సంగతిని బట్టి, మరల ప్రధాన విద్యా విషయక విచారము ఆరంభించబడుచున్నది. బృహదారణ్య కము నందును, ముండకము నందును అక్షర విద్య ఒకటి ఉన్నది. అది ఈ యధికరణమున విషయము. అచట అక్షరముగా నిర్దిష్ట మగు బ్రహ్మకు - అస్థూలత్వ అగ్రాహ్యత్వాది గుణములు కొన్ని విధించ బడినవి. అవియు ఆనందాదుల వలె అన్ని బ్రహ్మ విద్య లందును అనుసంధించుకొనవలసినవియా ? లేక, ఎచ్చట శ్రుతము లైనవో, అచ్చట మాత్రమే అనుసంధించుకొనవలసినవియా ? అని సందేహము.

ఒక విద్యలో చెప్పబడిన ఉపాస్య రూపమునకు సంబంధించిన గుణములు మరి యొక విద్యోపాస్య రూపమునకు గుణములు కావలెనని ప్రమాణ మేమియు లేదు. ఆనందాదులవలె ఈ అస్థూలత్వాదులు కూడ స్వరూప నిరూపకములు అనుటకును వీలు లేదు. స్థూలత్వాది నిషేధ స్వరూపములు గుణములు కనుక, మొదట స్వరూప ప్రతిపత్తి కలుగక, చెప్పరానివికూడ. అందువలన, ఈ గుణములు అన్ని విద్యలలో గాక, ఎచ్చట శ్రుతము లైనవో - అచటి విద్యలలోనే అనుసంధేయములు - అని పూర్వపక్ష మేర్పడును.

అన్ని బ్రహ్మ విద్య లందును ఉపాస్య మగు అక్షర బ్రహ్మ స్వరూప మొక్కటే కనుక, ఈ అక్షర బ్రహ్మసంబంధి అస్థూలత్వాది గుణములు అన్ని విద్యలందును అనుసంధేయములే. ఉపాస్య స్వరూప ప్రతిపత్తిలో ఆనందాదుల వలె అస్థూలత్వాదులు కూడ అవసర మైనవేకదా ! స్వరూపము ఇతర వ్యావృత్తముగా గ్రహింపబడవలయును. అందువలన, ఆనందాదులు మాత్రమే చాలవు. ఆనందాదులు ప్రత్యగాత్మకు కూడ ఉండవచ్చును కనుక, అవి ఉపాస్య బ్రహ్మ స్వరూపమును ఇతర వ్యావృత్తముగా గ్రహింపజేయజాలవు. అందువలననే బ్రహ్మ - ఉభయ లింగ మని కదా చెప్పుదురు ! ఆనందాది గుణములతోపాటు - హేయ ప్రత్యనీకత్వము కూడ చెప్పినపుడే బ్రహ్మ యొక్క సకలేతర వ్యావృత్త స్వరూపము ప్రతిపన్నము కాగలదు. స్థూలత్వాదులు చేతనాచేతనాత్మక ప్రపంచములో కన్పడునట్టివి. వానికి ప్రత్యనీకము పర స్వరూపము. అందువలన, అస్థూలత్వాదులు కూడ ఆనందాదుల వలె పరస్వరూప ప్రతిపత్తిలో చేరినవియేగదా ! ఇట్లు ఇవియు స్వరూప నిరూపకము లైనందున, సర్వ బ్రహ్మవిద్యలందును అనుసంధేయములే యని సిద్ధాంతము. ప్రధాన మొకటియే యైనపుడు, ఒక చోట చెప్పిన అంశము మరి యొక చోట

సంబంధించు నను విషయములో సూత్రకారుడు "ఔపసద" మును ఉదాహరించుచున్నాడు. 'ఉపసత్తు' అను ఒకానొక కర్మకు అంగ మగు మంత్రము ఔపసద మనబడును. ఈ మంత్రము సామవేదములో నున్నది. ఐనచో - ప్రధాన మగు ఉపసత్కర్మ యజుర్వేదములో నున్నది. ప్రధానము ననుసరించియే ఈ మంత్రము ఉపాంశువుగా చెప్పవలె నని పూర్వమీమాంసావాదుల నిర్ణయముకదా ?

ఐనచో - ప్రధానమునే గుణము లనుసరించునని - "సర్వ గంధః సర్వ రసః" అని పేర్కొనబడిన గుణము లన్నియు సర్వ విద్య లందును అనుసంధించుకొనవలసిన యవసర మేమియు లేదు. అస్థూల త్వాదులు, ఆనందాదులు లేనిచో, బ్రహ్మ స్వరూపము ఇతర వ్యావృత్తముగా గ్రహింపబడజాలనందున, అవి మాత్రమే అను సంధేయములు. సర్వ గంధత్వాదులు ప్రధానము ననువర్తించియే యుండునవి యైనను, స్వరూప ప్రతిపత్తిని అవసరమైనవి కావు కనుక, అవి ఏ విద్యలో శ్రుతము లైనవో, ఆ విద్యలో మాత్రమే అను సంధేయము లని సిద్ధాంతము.

## 15. అంతరత్వాధికరణము

అస్థూలత్వాది గుణములతో ఉషస్త - కహోల విద్యలకు సంబంధించిన "ప్రాణితృత్వ" ప్రభృతి గుణములు స్మరణమునకు వచ్చినందున, అందుకు సంబంధించిన విద్యల భేదాభేదములు ఈ యధికరణమున విచారించబడుచున్నవి. కనుక, దీనికి సంగతి ప్రసం గము. విషయము - బృహదారణ్యకములోని ఉషస్త - కహోల విద్యలు. ఈ రెండు విద్యలకు సంబంధించిన ప్రశ్నలు ఒకే విధముగా నున్నవి. వాని ప్రతి వచనములు భిన్నములుగా నున్నవి. కనుక, ఈ విద్యలు పరస్పర భిన్నములా ? అభిన్నములా ? అని సంశయ మేర్పడు

యున్నది. సర్వాంతరు డగు ఆత్మను సాక్షాత్తుగా గాని, పరోక్షముగా కాని బ్రహ్మను చెప్పుమని ప్రశ్న - రెండు విద్యలందును సమానమే. కాని, ప్రతి వచనములో ఉపాస్య రూపము భిన్నముగా గన్పట్టుచున్నది. ఉషస్తు విద్యలో ప్రాణన మొనరించువాడు, కహోల విద్యలో ప్రాణాపాన వ్యాపారములు గల జీవుడుగా చెప్పబడి యున్నాడు. కనుక, మొదటి విద్యలో - ఆకలి దప్పికలు లేనివాడు ఉపాస్యుడుగా చెప్పబడి యున్నాడు. కనుక, మొదటి విద్యలో - ప్రాణాపాన వ్యాపారములు గల జీవుడు చెప్పబడుచున్నా డని యనవలెను. దీనితో రూప భేదము స్పష్టముగా నున్నందున, విద్యలు రెండును వే రనుటయే యుక్తము. ఐనచో, ప్రత్యగాత్మ సర్వాంతరుడు కావచ్చునా ? అని శంకించనక్కరలేదు. పాంచభౌతిక దేహములలో నుండువాడు గనుక, జీవుడు అన్ని భూతములందును ఉండు ననుటలో దోష మేమియు లేదు. సర్వాంతరత్వము కొరకు ఇచట పరమాత్మను స్వీకరించినచో, అతనికి ప్రాణాపానాది వ్యాపారములు అనుపపన్నములు కదా ! ఇచటను పరమాత్మయే వివక్షిత మైనచో, భేదము అనుపపన్న మగును. కనుక, మొదటి విద్యలో జీవుడు, రెండవ విద్యలో పరమాత్మయు పేర్కొనబడినారని వాకొనవలెను. అపుడు విద్యా భేదమే అని పూర్వపక్షము.

రెండు విద్య లందును ప్రశ్న - ప్రతి వచనములకు సంబంధించి ప్రతిపాదింపబడువాడు పరమాత్మయే కనుక, విద్యా భేదము అనవసరము లే దని సిద్ధాంతము. ప్రశ్నలలో సర్వాంతరత్వముతోపాటు - సాక్షాత్తుగా బ్రహ్మ ఎవ రనియు ఉన్నది కదా ! బ్రహ్మ శబ్దము జీవుని పరముగను అచ్చటచ్చట గౌణముగను ప్రయోగించవచ్చును. కాని, సాక్షాత్తుగా - అనగా, ముఖ్యముగ బ్రహ్మ శబ్దార్థ మేమి ? అని కదా ప్రశ్న ఉన్నది ! అట్లే, పరోక్షము కాని బ్రహ్మ యనియు

ప్రశ్నలలో ఉన్నది. ఈ అపరోక్షత్వము సర్వ దేశ కాల సంబంధిత్వమే. ఇదియే "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను చోట, అనంత పదముతో చెప్పబడినది. సర్వాంతరత్వము కూడ - "యః పృథివ్యాం తిష్ఠన్" "యః ఆత్మని తిష్ఠన్" ఇత్యాది అంతర్యామి బ్రాహ్మణమున ప్రతిపాదించిన విధముగా - పరమాత్మకే కాని, జీవునకు సాధ్యము కాదు. కావున, ప్రశ్నలు పరమాత్మ విషయకములని భావింపవలెను. ఇక ప్రతి వచనములలో చెప్పబడినవాడు కూడ పరమాత్మయే యని వచింపవలెను. ప్రాణాపానాది వ్యాపార కర్తృత్వము ముఖ్యముగా పరమాత్మకే చెప్పవలసి యున్నది. జీవుడు సుషుప్తి దశలో - ప్రాణాది వ్యాపార కర్త కాలేడు కదా ! ఇంద్రియాధీన జ్ఞానము గలవాడు ఇచట ప్రాణాది వ్యాపార కర్తగా పేర్కొనబడుటలేదు అని ఇచట - "న దృష్టేః ద్రష్టారం పశ్యేః" ఇత్యాది వాక్యముల ద్వారా నిషేధింపబడినది. 'ఈ పరమాత్మ లేనిచో - ఎవరు జీవించగలరు ?' "కో హ్యేవాన్యాత్ కః ప్రాణాత్. య దేష ఆనంద ఆకాశో న స్యాత్" అని మరియొక చోట కూడ- పరమాత్మయే ప్రాణాది వ్యాపార కర్త యని నిర్వివాద మగు విషయము గదా ! అందరను బ్రతికించువాడు ఆకలి దప్పికలు లేనివాడే యని తెలుపుటకే విద్యలు రెండుగా ఆవృత్తి చెందినవి. సద్విద్య యందును శ్వేతకేతువు అనేక పర్యాయములు ప్రశ్నించుట, ఆతని తండ్రి విశేషముల నుపదేశించుటయు గ్రహింప దగిన యంశము. ఈ ఉపదేశము వలెనే ప్రకృతమున కూడ రెండుగా ఆవృత్తి చెందిన విద్యలందును ఉపాస్య భేదము లే దని సిద్ధాంతము.

ఐనచో - ప్రశ్న లడిగినవారు వేరు గనుకను, ఉపాస్య రూపము ఒక చోట ప్రాణన కర్తగను, మరియొక చోట అశనాయా పిపాసకు అతీతుడుగను భిన్నముగా నున్నందున, విద్యా భేదము

చెప్పవచ్చునేమో అని భావింపరాదు. ప్రశ్నించువారు వేరైనను, ప్రశ్నలు రెండును ఒకే ఒక సర్వాంతరుని గురించినవి గనుక, విద్యా భేదము అవసరము లేదు. "స త ఆత్మా సర్వాంతరః" అని రెండు విద్య లందును ప్రతివచనముకూడ సమానమే. ఐనచో - రెండుగా ఆవర్తనము జరుగుటకు కారణము - ప్రాణనాది కర్తృత్వము కహోల విద్యయందును, "అశనాయా పిపాసా అతీత్వము" ఉషస్త విద్య యందును - అనుసంధానము చేసికొనవలె నని చెప్పుటకే అని గ్రహించవలెను. కనుక, రెండు విద్య లందును ఉపాస్యము యొక్క ప్రధాన గుణము సర్వాంతరత్వమే. ప్రాణ కర్తృత్వాదులు ఉపాస్య మగు పరమాత్మకు జీవాత్మ వ్యావృత్తి కొరకు మాత్రమే అను సంధేయములు కాని, ఉపాసనలో అంతర్భవించునవి కావు. సద్విద్యలో కూడ అనేక ప్రశ్న ప్రతివచనములతో సచ్ఛబ్ద వాచ్యు డగు పర మాత్మ యొక విశేషములు ప్రతిపాదింపబడును. అవి యన్నియు తదుపాసనలో చేరవు గదా ! అట్లే, ప్రకృత విద్య లందును చెప్పిన ప్రాణ కర్తృత్వాదులు ఉపాసనలో చేరునవి కావు. సద్విద్య యం దును ప్రశ్న ప్రతివచనములు భిన్నము లయ్యును, ఉపసంహారము లన్నింటియందును ఒకే రీతిగా కన్పడుచున్నది. ఇచట కూడ రెండు విద్యలందును - "అతో న్యదార్తమ్" అని, ఉపసంహారము ఒకే రీతిలో నున్నది. కనుక, విద్యా భేదము లే దనియే సిద్ధాంతము.

ఈ యధికరణము నందలి మూడు సూత్రములను మూ డధి కరణములుగా విభజించి రట ఇతరులు. వానిలో మొదటి సూత్రము లేక, మొదటి అధికరణము ఇంతవరకును ప్రతిపాదించిన విధముగా ఉషస్త కహోల విద్యల ఐక్యమును ప్రతిపాదించునదిగా స్వీకరించ బడినది. ఇక రెండవ అధికరణములో - జాబాలోపనిషత్తు, ఐతరే యారణ్యకములకు సంబంధించిన రెండు వాక్యములను విషయముగా

స్వీకరించి, జీవ బ్రహ్మలకు అన్యోన్య తాదాత్మ్యము ననుసంధించవలె నని నిర్ణయించబడినది. జీవులకును ఆత్మ యైనవాడు పరమాత్మ కనుక, జీవ వాచక శబ్దములు తచ్ఛరీరక పరమాత్మ పర్యంతము బోధించు నని "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అనెడు శాండిల్య విద్యా వాక్యము వలనను, "తత్త్వ మసి" యనెడు సద్విద్యా వాక్యము వల నను తెలిసిన విషయమే కదా ! బ్రహ్మసూత్రములందును - "ఆత్మేతి రూప గచ్ఛంతి గ్రాహయంతి చ" అను సూత్రమున జీవు లకు ఆత్మనే పరమాత్మయొక్క ఉపాసన చేయవలయు నని నిర్ణయింప బడుచున్నది. కనుక, ఇచ్చట - పరస్పర వ్యతిహారానుసంధాన విధా రావశ్యకత కానరా దందుకు శ్రీభాష్యకారులు. ఇట్లే, మూడవ అధికరణమున, బృహదారణ్యకమునకు సంబంధించిన సత్యోపాసన కును, ఆదిత్యాక్షి పురుష విద్యకును ఐక్యము నిర్ణయింపబడినది. కాని, స్థానాది భేదమును పురస్కరించుకొని, ఈ అక్షిపురుష ఆదిత్య పురుష విద్యలకే ఐక్య మనుపపన్న మని గదా సంబంధాధి కరణములో నిర్ణయింపబడినది ! కనుక, ఇదియు అవసరము కా దని ఈ రెండు సూత్రములకును పై సూత్రముతో కలిపి ఒకే అధికరణ ముగా శ్రీభాష్యకారులు నిర్ణయించి యున్నారు.

## 16.కామాద్యధికరణము

విద్యలయొక్క భేదాభేద విచారమే ప్రసక్త మైనందున, ఈ యధికరణ మిచట చోటు చేసికొనినది. "అథ య దిదం అస్మిన్ బ్రహ్మ పురే" ఇత్యాదిగా - దహరాకాశ విద్య యొకటి శ్రుత మగు చున్నది. బృహదారణ్యకమందును - "స వా ఏష మహానజ ఆత్మా" ఇత్యాదిగా ఆకాశ విద్య యొకటి శ్రుత మగుచున్నది. ఈ రెండు విద్యలకును గల సారూప్య వైరూప్యములను బట్టి, ఈ రెండును వేర్వేరు విద్యలా ? వేరు కాని విద్యలా ? అని సంశయ మేర్పడు

చున్నది. మొదటి దానిలో అపహత పాప్మత్వాది గుణ విశిష్ట మగు ఆకాశ శబ్ద వాచ్యమైన పరమాత్మ ఉపాస్యముగా చెప్పబడుచున్నది. రెండవ దానిలో - వశిత్వాది గుణ విశిష్ట మగు ఆకాశ శమి డగు పరమాత్మ ఉపాస్యముగా చెప్పబడుచున్నాడు. ఇట్లు ఉపాస్య రూపము భిన్నముగా నున్నందున, ఇచట విద్యలకు భేదమే సిద్ధించు నని పూర్వపక్షు మేర్పడును. కాని, రెండు విద్య లందును హృదయ స్థానమున నుండు బ్రహ్మమే ఉపాస్య మనియు ఆ బ్రహ్మ సేతు వనియు, వివశు డనియు చెప్పబడుచున్నది. ఇక బృహదారణ్యకమున చెప్పబడిన వశిత్వాదులు ఛాందోగ్యమున చెప్పిన సత్య సంకల్పత్వ గుణ విశేష స్వరూపములే కదా ! కనుక, అచ్చటి సత్య సంకల్పత్వ గుణములతో పాటు - శ్రూయమాణము లగు ఎనిమిది గుణములు కూడ బృహదారణ్యక విద్యలో అనుసంధేయము లని స్పష్ట మగు చున్నది. ఇట్లు ఈ రెండు విద్యలలో ఉపాస్య రూప మొకటియే యైనందున, విద్యా భేదము లే దని సిద్ధాంతము. రూపమే కాక, రెండు విద్యలకును బ్రహ్మ ప్రాప్తి రూప మగు ఫలము కూడ ఒకటియే శ్రుత మగుచున్నందునను, విద్యా భేదము లే దని సిద్ధాంతి యనును. ఐనచో - ఛాందోగ్యమున ఆకాశ శబ్దమే పరమాత్మను చెప్పగా, బృహదారణ్యకములో పరమాత్మ కాధారముగ ఆకాశము చెప్పబడుచున్నది. కాని, ఇంతమాత్రము విద్యా భేదకము కాజాలదు. ఏ మనగా - తైత్తిరీయ దహర విద్య యందును హృదయము నందలి "సుషీరము" నం దుండు పరమాత్మను చెప్పుట జరిగినది. సుషిర మనగా కూడ ఆకాశమే. ఆ ఆకాశమే ఇచట బృహదారణ్యక విద్య యందును ఆకాశ శబ్దమున చెప్పబడిన దనవచ్చును. కనుక, హృద యమునం దున్న హృదయాకాశమునం దున్న పరమాత్మ ఒక్కడే అయినందున, విద్యా భేదము లేదని సిద్ధాంతము.

ఐనచో - బృహదారణ్యకములో - "నేహనా నాస్తి కించన" ఇత్యాదిగా ఈశిత్వాది గుణ జాతము కూడ ముందు ప్రతిషేధింప బడుచున్నందున, ఛాందోగ్య మందలి సత్యకామత్వాదులును వశిత్వాదులతో పాటు అపారమార్థికములే యని తెలియుచున్నది. కనుక, ఇట్టి గుణము లెవ్వియు మోక్షార్థము చేయవలసిన ఉపాసనలలో చేరు నవకాశము లే దని నిర్గుణ విద్యా వాదమును నిరసించుటకు - "ఆదరా న లోపః" అని మరి యొక సూత్రమును కూడ బాదరాయణ భగవానుడు నిర్మించి యున్నాడు. మోక్షార్థమైన ఉపాసన చేయ దగిన బ్రహ్మ యొక్క గుణములుగా ఛాందోగ్యమున సత్య సంకల్పాదులు కాని, బృహదారణ్యకములో వశిత్వాదులు కాని ఆదరముతో ఉపదేశింపబడినందున, ఈ ఉపాసనములలో వానికి లోపింపజేయుట భావ్యము కా దని సూత్ర తాత్పర్యము. ఛాందోగ్యమున - "తద్య ఇహ ఆత్మాన మను విద్య...." ఇత్యాదిగా సత్యకామత్వాది గుణ విశిష్టోపాసనము నుపదేశించి, "అథ య ఇహాత్మాన మననువిద్య వ్రజంతి" ఇత్యాదిగా - అట్టి ఉపాసన చేయని వారిని నిందించుటయు గ్రహించవలెను. ఈ నింద - గుణ విశిష్టోపాసనమునందు ఆదరమునుగదా ప్రదర్శించుచున్నది! ఇట్లే, బృహదారణ్యకమునందును - "సర్వస్య వశీ సర్వ స్యేశానః.... ఏష భూతాధిపతిః ...." ఇత్యాదిగా అనేక పర్యాయములు గుణోపదేశము గుణములయందు ఆదరమును చూపెట్టుచున్నది. ఇంతే కాదు. ఇట్లే, అనేక స్థలములలో గుణోపదేశమును గ్రహింపవచ్చును. శాస్త్రము గొప్ప వాత్సల్యము గలది యందురు గదా! అట్టి శాస్త్రము అనేక గుణములు, మనకు తెలియని గుణములు. ఇతర ప్రమాణముల కందని గుణములు గల వని ఉపదేశించి, మొదటనే

అజ్ఞానముతో ఆవరింపబడి యున్నందువలన - ఇంతను భ్రమను కలిగించ ప్రయత్నించగలదా? ః

"నేహ నానాస్తి కించన ... ఏకధైవానుద్రష్టవ్యం" అను వాక్యము అన్నింటియందును పరమాత్మ కానవచ్చి, అన్నిటికిని ఆత్మయై యున్నందున అన్నియు బ్రహ్మాత్మకములే తప్ప, కొన్ని బ్రహ్మాత్మకములు, మరి కొన్ని "అబ్రహ్మాత్మకములు" అని భావించుట కవకాశమే లేదని విశద మగుచున్నది. బృహదారణ్యకములోని "స ఏష నేతి నేత్యాత్మా" అనునదియు - పరమాత్మకు ప్రపంచ వైలక్షణ్యము నుపదేశించుచున్నదే కాని, నిర్విశేషత్వమును కాదు. "అగ్రాహ్యః" ప్రమాణాంతర గ్రాహ్య ప్రపంచ విలక్షణుడు అనియే కదా బృహదారణ్యకోత్తర వాక్యములు చెప్పుచున్నవి! ఛాందోగ్యము నందును ఉత్తరత్ర - "నాస్య జరయాదీ తే జీర్యతే" ఇత్యాదిగా ప్రపంచ వైలక్షణ్యమునే చెప్పి, "అస్మిన్ కామా స్సమాహితాః" అను ఈ పరమాత్మయందు సత్యకామత్వాది గుణములు కలవని ఉపదేశించుచున్నది. కనుక, మోక్షోపాసనలలో గుణములు చేరవనుట సమంజసము కాదు. అందువలన, బృహదారణ్యక మందలి వశిత్వాదులు, ఛాందోగ్యము నందలి సత్యకామత్వ అంతర్భూతములు గనుక, ఈ రెండు విద్యలందును రూప మొకటియే యైనందున, విద్యైకమే చెప్పవలెను.

ఇక ఛాందోగ్యమున - "తద్య ఇహాత్మాన మనువిద్య వ్రజంతి ఏతాంశ్చ సత్యాన్ కామాన్ తేషాం। సర్వేషు లోకేషు కామచారో భవతి" ఇత్యాదిగా - ఈ ఉపాసన చేసినవారికి సర్వలోక కామచార రూప సాంసారిక ఫలమే శ్రుత మగుచున్నది. కనుక, బ్రహ్మప్రాప్తిని అభిలషించు ముముక్షువు - ఈ గుణ విశిష్ట బ్రహ్మోపాసన చేయవలసిన పని లేదు. "పరంజ్యోతి రుపసంపద్య స్వేన

రూపేణ అభినిష్పద్యతే" అని - పర విద్యకు స్వస్వరూపావిర్భావమే కదా ఫలము ఉపదేశించబడుచున్నది ! కనుక, పరవిద్యలో సత్యకామత్వాది గుణములు ఉపసంహరించుకొనవలసిన యవసరము లేదు' అని ఆశంక ఏర్పడవచ్చును. ఈ ఆశంకను ఈ అధికరణము నందలి మూడవ సూత్రము తొలగించుచున్నది. బ్రహ్మను చేరినవాడు సర్వ బంధముల నుండియు ముక్తుడై, స్వస్వరూపముతో ఆవిర్భవించును గదా ! అప్పుడతడు బంధములు లేనివాడు కనుక, అన్ని లోకము లందునా యథేష్టముగా చరింపవచ్చునని, సర్వలోక కామచారము వివరించు శ్రుతి వాక్యముల తాత్పర్యము. దీని వలన, సర్వలోక కామచారము ముక్తు డనుభవించ గలిగెడు ఫలములలో చేరు నని తెలియునే గాని, తప్పక సర్వలోక కామ చారము కోరువారు చేయు ఉపాసనము ఇది' అని అర్థము కాదు. కావున, ప్రకృత విద్యలు రెంటి యందును - వశిత్వ సత్యకామత్వాది గుణములు అనుసంధేయములే యైనందున, విద్యాభేదము లే దని సిద్ధాంతము.

## 17. తన్నిర్ధారణానియమాధికరణము

ఈ యధికరణ మిచట ప్రసంగ సంగతిలో ఉత్థిత మైనది. సత్యకామత్వాదులు నియతముగా పై యధికరణమునందు ప్రస్తావించిన విద్యలలో ఉపసంహార్యము లని నిర్ణయించినందున, ఉద్గీథాది విద్యలు కూడ ఆ యా కర్మలలో నియతముగా ఉపసంహరింపవలసి యుండు నేమో యని ఈ విషయము జ్ఞాపకమునకు వచ్చినది. స్మృత మైనందున ఇచ్చట చెప్పవలసిన కొన్ని విశేషములు చెప్పుటకే ఈ యధికరణము.* ఓమిత్యే త దక్షర ముద్గీథ ముపాసీత" ఇత్యాదిగా

---

ఈ పాదము చివరి అధికరణములో ఈ విషయము సమగ్రముగా వర్ణింప బడును.

కర్మాంగాశ్రయము లగు ఉపాసనలు విషయము. ఈ ఉపాసనలు తప్పక తత్తత్కర్మలలో ఉపసంహరింపవలసిన నియమ మున్నదా ? లేదా ? అను సంశయ మేర్పడినది. తప్పక కర్మాంగముగా ఉపసంహరింపవలె నని నిర్ధారణ చేయవచ్చు నని పూర్వపక్షము. ఏ మనగా - ఫలము వలె కర్మ వద్ద పఠించబడిన నిష్ఫలము ఆ కర్మకే అంగ మని చెప్పవలెను. "య దేవ విద్యయా కరోతి ... వీర్యవత్తరం భవతి" అని విద్య - కర్మ వద్ద ఫలము లేనిదిగా పఠించబడలేదే అని నుడువరాదు. "య దేవ విద్యయా" అనునది అర్థ వాదం. "యస్యాపవర్గ మయీ జుహూ ర్భవతి" అని మోదుగు కఱ్ఱతో చేసిన జుహూవును చెప్పి, ఇది కలవానికి అపకీర్తి కలుగ దని వేదము చెప్పినది. ఇది అర్థ వాదమే యందురు. అర్థ వాదములు స్తుతి కొరకే కాని, అచట చెప్పిన ఫలము కలుగు నని చెప్పుటలో తాత్పర్యము లేనివి యందురు. ఇట్లే, ప్రకృతమునను ఉద్గీథోపాసనకు వీర్యవత్తరత్వాది ఫలము శ్రూయమాణ మగుచున్నను, ఆ ఫలము నుపదేశించుటలో ఆ యర్థ వాద వాక్యమునకు తాత్పర్యము లే దనవలెను. కనుక, ఉద్గీథోపాసనము కర్మాంగాశ్రయమే యని నిర్ధారణ చేయవచ్చు నని పూర్వ పక్ష మేర్పడును.

కర్మలకు అంగములుగా ఉద్గీథాది ఉపాసన లుండవలె నని నియమ మేమియు లే దని సిద్ధాంతము. ఉపాసన చేసినవారు, చేయని వారును ఆ కర్మలు చేయవచ్చు నని స్పష్టముగా అచ్చటనే ఉన్నది. "తేనోభౌ మురుతః య శ్చైత దేవం వేదయ శ్చ న వేద" అని. కనుక, ఉపాసన చేయనివారును కర్మలు చేయవచ్చు నని చెప్పుట సాధ్యము కాదుగదా ! అందువలన, ఉపాసనము అంగము కాదు. ఇట్లు అంగము కానియపుడు - ఈ ఉపాసనమునకు ఫలము చెప్పవలసి యుండును. అదియే వీర్యవత్తరత్వము. వీర్యవత్తరత్వ మనగా -

చేయు కర్మ యొక్క ఫలమునకు గల అవరోధమును తొలగించుట అని యందురు. కర్మలు చేసినపుడు - వాని ఫలమును అడ్డుకొనునది స్వర్గాది ఫలము కంటెను భిన్నమైనది. ఉపాసనల యొక్క ఫలమే. ఇట్లు ఉపాసనలు తప్పక కర్మాంగములుగా చేయవలయు నని నిర్ధారణ చేయుటకు వీలు లేదు. కనుక, నియమము లే దని సిద్ధాంతము.

## 18. ప్రదానాధికరణము

ప్రసంగ సంగతిలో ఏర్పడిన అధికరణమునకు పిమ్మట, త త్పూర్వాధికరణమున ప్రస్తుత మగు దహర విద్యకు సంబంధించి అవశ్య వక్తవ్యాంశములు కొన్నిటికి చెప్పుటకు అవసర సంగతితో ఈ యధికరణ మారంభింపబడుచున్నది. ఛాందోగ్య దహర విద్యలో - "తస్య ఇహాత్మాన మనువిద్య" ఇత్యాదిగా పరమాత్మ యొక్క ఉపాసనము చెప్పి, ఏతాం శ్చ సత్యాన్ కామాన్" అని - గుణముల యొక్క ఉపాసనము కూడ విధించబడి యున్నది. ఈ గుణోపాసన మిచట వర్ణింపబడు విషయము. గుణోపాసన చేయు నప్పుడును గుణి యైన పరమాత్మ యొక్క చింతన మవసరమా? కాదా? అని సంశయము. గుణములకు విడిగా ఉపాసనము విధింప బడినందునను, గుణములు గుణిని విడిచియుండునట్టివి కావు కనుకను - పై సంశయ మేర్పడినది. గుణ యైన దహరాకాశమును చింతించిన తరువాత, గుణానుసంధానము కొరకు పునః గుణి చింతన మవసరము లేదు. ఇది పూర్వపక్షము.

గుణోపాసన కొరకు గుణి చింతన మవసర మనియే సిద్ధాం తము. ఏ మనగా - మొదట దహరాకాశరూప పరమాత్మ స్వరూ పము చింతించబడినను, అదియే పరమాత్మ స్వరూపమును అపగత

పాప్మత్వాది గుణ విశిష్టముగా ఉపాసించుట విధించబడి యున్నందున, స్వరూప చింతన మావశ్యనీయమే కదా !

ధర్మిని అనుసంధించుట ఆవశ్యనీయమే యనుటకు సూత్ర కారులు త్రైధాతవీయేష్టికి సంబంధించిన పురోడాశ ప్రదానమును ఉదాహరించుచున్నారు. ఆ ఇష్టిలో - మూడు పురోడాశములు చెప్ప బడినవి. ఈ మూడును ఒకే దేవత యగు ఇంద్రునకు ఐనవో ఇంద్ర దేవత ఇచట మూడు విశేషణములతో పేర్కొనబడినది "ఇంద్రాయ రాజ్ఞే . . . ఇంద్రాయాధిరాజాయ । ఇంద్రాయ స్వరాజ్ఞే" అని విశేషణ భేదమునుబట్టి, విశిష్ట ఇంద్రాకారము భిన్న మైనందున, పురోడాశ ప్రదానము ఒకటే అనుటకు వీలు లేదు. కాని, ఈ మూడు పురోడాశములు అవదానము ఒకే సారి చేయ వలయు నని ప్రత్యేక వచన మున్నది. అందువలన, అవదానము వలె ప్రదానము కూడ మూడు సార్లు కాక, ఒకే సారి చేయవచ్చునేమో అని సంశయ మేర్పడును. ఈ సంశయ నివారణార్థము సంకర్ష కాండ మున "నానా వా దేవయ పృథక్త్వాత్' అని సూత్రించవలసినది. ఇట్లు విశేషణ భేదమును బట్టి, దేవతా పృథక్త్వ మేర్పడినందున, తత్పురోడాశ ప్రదానము కూడ - "నానా' అనగా మూడు సార్లు అనుష్ఠేయమే యని సిద్ధాంత మేర్పడినది అట్లే, ప్రకృతము నందును, శుద్ధ స్వరూప, గుణ విశిష్ట స్వరూప భేద మున్నందున, అపహత పాప్మత్వాది గుణ చింతనము నందును దహరాకాశ స్వరూప చింతన మావశ్యకమే యని తాత్పర్యము.

## 19. లింగభూయస్త్వాధికరణము

ప్రత్యగాత్మ చింతనమునందు గుణసంబంధ ముండితీరవలె నని పై యధికరణమున నిర్ణయించగా, ప్రతి పరవిద్య యందును నారా

యణ సంబంధమే చెప్పబడు చున్న దను అంశము స్మరణకు వచ్చినది. అదియు నిర్ణయించవలసిన యంశమే యైనందున, ఈ యధికరణమున అది నిర్ణయింపబడు చున్నది కనుక, ఇచట ప్రసంగ సంగతిని గ్రహింపవచ్చును. తైత్తిరీయ దహర విద్యానంతరము పఠించబడిన "సహస్ర శీర్షం దేవం" ఇత్యాది నారాయణానువాకము ఈ యధికరణమునకు విషయము. ఇచట ప్రతిపాదింపబడు నారాయణుడే కైన పేర్కొనబడిన దహర విద్యలో మాత్రమే ఉపాస్యుడా? అని సంశయ మేర్పడును ఐనచో - దహర విద్య చే ప్రస్తుతాంత మైనందున, దహర విద్యలో ఉపాస్యుడు నారాయణు డనియే సిద్ధించు నని పూర్వపక్షము. ఈ నారాయణానువాకమునందును - "పద్మకోశ ప్రతీకాశం హృదయం చా ప్యధోముఖమ్" అని పఠించబడుచున్న హృదయము - దహర పుండరీక ప్రత్యభిజ్ఞను కలిగించు చున్నది కదా! కావున, దహర విద్యలో మాత్రమే ఉపాస్యుడు నారాయణుడు అన్ని పరవిద్య లందును ఉపాస్యత్వ మతనికి సిద్ధించదు - అని పూర్వపక్షి అభిమతము

నారాయణుడే సకల విద్య లందును ఉపాస్య - అనుటకు అనేక చిహ్నము లున్నందున, సర్వ పర విద్య లందును నారాయణునకే ఉపాస్యత్వము నిర్ణయింపబడు చున్న దని సూత్రకారులు సిద్ధాంతము చేయు చున్నారు పర విద్యలందు ఉపాస్య శక్తి - అక్షర, శివ, శంభు, పరబ్రహ్మ, పరతత్త్వ, పరంజ్యోతి రాది శబ్దములచేత కదా చెప్పబడుచున్నాడు! అది మే అక్షరాది శబ్దములచేత ఆ స్వక్తిని అనుసరించి, విశేష విశిష్టుడు, ఆనందాది గుణ విశిష్టుడు లన్ని విద్య లందును ఉపాసన చేయునవలసినవాడుగా ఆ యా శబ్దముల చేత పేర్కొనబడినవాడు, పరబ్రహ్మ మైనవాడు నారాయణుడే యని

నిర్ణయించుటకు - పైన పేర్కొనిన ఉపదేశము పర్యాప్త మగు చున్నది.

లింగ భూయస్త్వమును బట్టి, ఈ నిర్ణయము చేయవచ్చు నని సూత్రకారుడు రచించును. లింగ మనగా - చిహ్న మని యర్థము. లింగ మనునది - అర్థ ప్రకాశన సామర్థ్య రూపము. శ్రుత్యాది ప్రమాణములలో నొకటి కలదు. అది ఇచట నారాయణ రూపార్థ ప్రకాశన సామర్థ్యరూప మనుకొనిన-చో - అది ఒకే ఒకటికదా ఉన్నది ! సూత్రకారు లైన-చో - "భూయస్త్వము"ను చెప్పు చున్నారు. మరి - బహుతర లింగములు లేవు కనుక, ప్రమాణు లింగము ఇచట గ్రహించరాలేదు. బహు తరములుగా నున్నవి వాక్య ములు. ఈ వాక్యములు అక్షరాది శబ్ద నిర్దిష్ట వ్యక్తిని ఉద్దేశించి, నారాయణత్వములు విధించుచున్నది. ఇవి యన్నియు - సర్వ పర విద్య లందును నారాయణుడే ఉపాస్యు డనుటకు చిహ్నములు. ఈ చిహ్నములను చెప్పు వాక్యముల భూయస్త్వమే సూత్రకారుని అభి మతము. ఈ వాక్యములు ప్రకరణమును ప్రమాణము కంటెను ప్రాబల్యము కల దని పూర్వమీమాంసలోని ఒక సూత్రమున నిర్ణ యించడ మైనది. దహర విద్యలో మాత్రమే నారాయణుడు ఉపాస్యు డనుట ఈ ప్రమాణమైన ప్రకరణము కంటెను ప్రబలమైన, బహుతర మైన వాక్యప్రమాణమునుబట్టి, ఈ నారాయణ సంజ్ఞిత పర బ్రహ్మమే సర్వ పరవిద్య లందును ఉపాస్యమైనవా డని సిద్ధాంతము.

ప్రబల మగు వాక్య ప్రమాణముతో, సర్వ పరవిద్య లందును ఉపాస్య మగు పరబ్రహ్మ స్వరూప నిర్ధారణ కొరకే ఈ నారాయ ణానువాక మని సిద్ధ మగుచుండ, దహరవిద్య యందును ఈ నారా యణుడే ఉపాస్యు డని చెప్పుటకే పద్మకోశ ప్రతీకాశ హృదయ

మిచట పేర్కొనబడిన దనవచ్చును. ఐనచో - "సహస్ర శీర్షం దేవం" ఇత్యాది ద్వితీయాంత నిర్దేశము - పూర్వ ప్రక్రాంత ఉపాసనలో ఉపాసించబడువానిని చెప్పునేమో అని భావింప నక్కరలేదు. ఏల నన, ఇచటి ద్వితీయ ప్రథమార్థమునందే ప్రయుక్త మని - "విశ్వమే వేదం పురుషః" "తత్త్వం నారాయణః పర" ఇత్యాది ప్రథమాంత నిర్దేశమునుబట్టి నిర్ణయించుకొనవచ్చును. "అంత ర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః । తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః । స బ్రహ్మా స శివ స్సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్" ఇట్టి అనేక నిర్దేశములను బట్టి, సర్వ పరుడు అని నారాయణుడే సర్వ పర విద్య లందును ఉపాస్యు డని నిర్ణయింపవచ్చు నని సిద్ధాంత సారము.

## 20. పూర్వ వికల్పాధికరణము

ప్రసంగ సంగతితో ఈ యధికరణ మారంభింపబడుచున్నది. ప్రకరణమును బోధించు వాక్యరూప ప్రమాణ మున్నందున - "సహస్ర శీర్షం" ఇత్యాదికము దహర విద్యకు కాక, సర్వ పర విద్యలకును అంగ మని నిర్ణయింపబడినది. దీనితో - మన శ్చిదా ద్యగ్నులు జ్ఞాపకమునకు వచ్చినవి. ఇవి క్రియామయములు లని ప్రక రణము వలన నిర్ణయించవచ్చును. ప్రకరణ బాధకముగ ప్రబల ప్రమాణ మేమియు లేదు గదా! ఇట్లు స్మరణకు వచ్చిన అవశ్య వక్తవ్యాంశములను చర్చించవలసి యున్నందున, ఈ యధికరణము ప్రసంగ సంగతితో ఆరంభింపబడిన దని గ్రహింపవచ్చును. అగ్ని రహస్యములో (బృహదారణ్యకోపనిషత్ పూర్వభాగములో) మన

శ్చిదా ద్యగ్నులు కొన్ని పేర్కొనబడినవి. అవి ఈ యధికరణమునకు విషయము. ఇచట అగ్ను లనగా - అగ్నికి ఆధారములుగా కట్టబడిన స్థండిల విశేషములు. వీనిలో - ఇటుకలతో ఏర్పాటు చేయబడిన ఒక స్థండిల విశేషమునకు - 'ఇష్టక చిత' మని పేరు. మానసిక వ్యాపార సముదాయమునే ఇచట 'మన శ్చిత్' అని వ్యవహరింపబడును. ఇట్టివే - వాక్చిత్, ప్రాణచిదాదులు మరి యొక కర్మకు ఉన్నవి. ఈ మనశ్చిదాదులు ఏమను కాల్పనికములే.

కాల్పనికములు కనుక, క్రియా రూపములు అని భావించుట కవకాశ మండదు గదా ! కేవలము మానసిక వాచికాది వ్యాపార సంఘాతమును ఇష్టకచిత మగు స్థండిలము వంటి స్థండిలముగా భావింప బడిన ఈ మనశ్చిదాదులు - క్రియామయ క్రతువులో అనుసంధేయ ములా ? లేక - విద్యారూపములై నందున - విద్యామయ క్రతువులో అనుసంధేయములా ? విద్యా రూపములే యైనను, క్రియామయ క్రతువు నందలివే అనుసంధానము చేయవలసినవి అని పూర్వపక్షము. ఏ మనగా - పైన ఇష్టకచితము చెప్పబడినది. ఇష్టకచితము క్రియా రూపము కనుక, క్రియామయ క్రతు శేషమే కదా ! అట్లే, తత్ప్ర కరణ పఠితము లైనందున, మనశ్చిదాదులును క్రియామయ క్రతువు నందే చేరుట సమంజసము. ఆరోపితము లైనందున, విద్యారూపము లగు మనశ్చిదాదులు క్రియామయ క్రత్వంగములు ఎట్లు కాగల వని శంకింప నక్కరలేదు. ఏ మనగా - "ద్వాదశాహ" క్రతువులో మానస గ్రహము విధించబడినది. గ్రహ మనగా - పాత్రము. పృథి విని పాత్రగా భావించి, గుణమును సోమ రసముగా భావించుట - అచ్చట విహితము. ఇట్లు మానసిక పాత్రమును మానస గ్రహ మందురు. ద్వాదశాహ క్రతువు నందలి ఆద్యంత దివసములు కాక, మిగిలిన వానిలో పదియవ దివసమునాడు, అనగా - ముఖ్య క్రతువులో

పదునొకండవ దినమున, ఈ మానస గ్రహము చెప్పబడి యున్నది. దీనికి ప్రకృత మగు సోమ యాగాంగత్వము తప్ప, మరి యొకటి చెప్ప రాదు. ఇట్లు భావనా మయమే యైనను, మానస గ్రహము క్రియా మయ ప్రత్యంగముగా నెట్లు చెప్పుకొనుచున్నామో - అట్లే - ప్రకృత మనశ్చిదాదులు కూడ కాల్పనికములే యైనను, క్రియా మయ క్రత్వంగములు కావచ్చు నని పూర్వపక్షి. అభిమతము ఇంతే కాదు ఇష్టక చితము వలె ఇవి అగ్నికి ఆధారములు కాకున్నను - "తేషా మేకైక ఏవ తావాన్ యావా దసౌ పూర్వః" అని మన శ్చిదాదులు ఇష్టకచితన మంతటి శక్తి గలవిగా చెప్పబడుచున్నందున, ఇష్టకచితమునకు వికల్ప రూపము లని తెలియవచ్చును. లపుడు - ఇష్టకచితము వలె ఇవియు క్రతు సంపాదకములు కనుక, వీనికి క్రత్వంగత్వము అనివార్యము.

ఇవి విద్యారూప క్రతువుకే అంగములు - అని సిద్ధాంతము. స్పష్టముగా అవధారణముతో - "తే హైం తే విద్యాచిత ఏవ" అని ఉత్తర వాక్యము వీనిని విద్యారూపములుగనే కదా పేర్కొను చున్నది ! ఇష్టకచితముల వలె కాక, కేవల మనో మంత్ర కల్పితము లైనందున, విద్యారూపములే కాని, క్రియా రూపములు కావని తెలియుచున్నను, తిరిగి వీనిని "విద్యాచిత ఏవ" అని చెప్పుటవలన, ఇవి విద్యారూప క్రత్వంగములే యని నిర్ధారణ చేయవచ్చును - "తే మనసైవాధీయంత, మనసైవాచీయంత." ఇత్యాదిగా - విద్యామయ క్రతువు కూడ వీనికి అంగిగా ఇచట శ్రూయమాణ మగుచునే యున్నది. ఐనచో, ప్రకరణము క్రియామయ క్రతువుకు సంబంధించి నది కనుక, ప్రకరణ ప్రమాణము ననుసరించి, ఈ మనశ్చిదాదులకు క్రియామయ క్రత్వంగత్వమే ఉచితము గదా అని భావించరాదు. ప్రకరణమునకంటె ప్రబలము లగు శ్రుత్యాదుల వలన వీనికి విద్యా

మయ క్రత్వంగత్వము సిద్ధించుచున్నది. "తే హైతే విద్యాజిత ఏవ" అని శ్రుతి వీనికి విద్యామయ క్రతు శేషత్వమునే చెప్పుచున్నవి. ఐనచో - విద్యామయ క్రతువునకు విధానము కాని, ఫలసంబంధము కాని శ్రూయమాణము కానందున, విద్యామయ క్రతువే లేదన రాదు. యజ్ఞమున కుండవలసిన గ్రహ స్తోత్ర శస్త్రాదు లన్నియు విద్యామయ - క్రతువునకు శ్రూయమాణము లగుచున్నందున విధిని కూడ కల్పించవచ్చును. ఇక - "తేషా మేకైక ఏవ తావాన్ యావాన్ పూర్వాది" అని, మనశ్చిరాదులు ఇష్టకచిత మంతటి శక్తి కలవిగా చెప్పబడి యున్నందున, ఇష్టకచితనము కల క్రతువున కేది ఫలమో - దానినే ఈ మనశ్చిరాదులు కల విద్యామయ క్రతువునకును ఫలముగా తెలియవచ్చును. ఈ అతిదేశము అన్ని విధముల సామ్యము కాదు. కనుక, ఇష్టకచితము వలె ఇవియు క్రియామయ క్రత్వంగములు కావలసిన యవసరము లేదు. ఆదిత్య మండలములోని పురుషుని ఒక చోట - "స ఏష ఏవ మృత్యుః" అని - మృత్యువుగా చెప్పబడినది. మృత్యువు వలె ఇతడు సంహార కారకుడని యర్థము. అంతమాత్ర మున ఈ పురుషుడు మృత్యు లోకమున ఉండవలసిన యవసర మేమియు లేదు. అట్లే, ప్రకృతమందును మనశ్చిదాదులు ఇష్టక చితములవంటి వనినంత మాత్రమున ఇష్టకచితము వలె ఇవియు క్రియా మయ క్రియా శేషములు కానక్కరలేదు. ఫలమున మాత్రమే అతి వేగముతో చెప్పుకొనవచ్చును. ఇంతే కాదు దీని తరువాతి భాగము నందును, పూర్వ భాగము నందును విద్యామయ క్రతువులు శ్రుతము లగుచున్నవి. తరువాత, వైశ్వానర విద్యయు విహితమై యున్నది. ఇట్లు ఈ అగ్ని రహస్యమున కేవల క్రియామయములే గాక, విద్యా మయ క్రతువులు కూడ విహితములై యున్నవి. విద్యామయములు తరువాతి భాగ మగు బృహదారణ్యకోపనిషత్తులో చేరవలసినవియే.

కాని, ఆరోపించుకొనవలసిన అగ్ని అంగములు అనేకము లున్నందున, మనశ్చిరాది విద్యా క్రతువు ఇచట పేర్కొనబడినది. అందువలన, మనశ్చిదాదులు విద్యామయ క్రత్వంగములే యని సిద్ధాంతము.

## 21. శరీరే భావాధికరణము

పరవిద్యా విచారమున పై యధికరణము ప్రసంగ సంగతితో ప్రసక్తమైనది. తరువాత తిరిగి పరవిద్యా సంబంధి అంశమును విచారించుటచే, ఈ యధికరణము అవసర సంగతితో ఆరంభించబడు చున్నది. అన్ని పరవిద్య లందును ఉపాస్యుడు నారాయణుడే యని పై దాని కంటె పూర్వపు అధికరణమున నిర్ణయింపబడినది. అట్లే, అన్ని పరవిద్య లందును ఉపాసకు డగు జీవుని స్వరూప మేమియో ఈ యధికరణమున నిర్ణయింపబడుచున్నది. కనుక, ఇది అవశ్య వక్తవ్య మైన అంశము కనుక, అవసర సంగతితో సంగత మైనది. ఉపాసన స్వరూపము విషయము. ఉపాసన చేయు జీవుని స్వరూపము జ్ఞాతృత్వ కర్తృత్వ భోక్తృత్వాదులు కలదిగను ఉన్నది. మరి - ప్రజాపతి వాక్యమున - అపహత పాప్మత్వాది గుణాష్టక విశిష్టముగను వినబడుచున్నది. కనుక, ఉపాసన చేయువాడు ఆత్మ స్వరూపమును జ్ఞానాదులు కలదిగా అనుసంధానము చేసికొనవలెనా ? లేక, అపహత పాప్మత్వాది గుణాష్టక విశిష్టముగా అనుసంధానము చేసికొనవలెనా ? అని సంశయ మేర్పడును. అపుడు కొందరు జ్ఞాతృత్వా ద్యాకారణు మాత్రమే అను సంధించుకొనిన, చాలు నన్నారు. ఏ మనగా - ఉపాసన చేయునపుడు జీవుడు శరీరమునందుకదా ఉన్నాడు ! శరీరమున ఉన్నప్పుడు జ్ఞాతృత్వాదులేకదా ఉన్నవి ! యాగాది క్రియానుష్ఠానము చేయువారు ఇంతే కదా అనుసంధానము చేయుదురు ! కాదు, ఉపాసన చేయువారు ఎట్లు ఉపాసింతురో, అట్టి స్వరూపమును

చేరుదురు కనుక, అపహత పాప్మత్వాది విశిష్టముగనే ఆత్మ స్వరూపము ననుసంధించుకొనవలె నని భావింపరాదు. "యథా క్రయః" ఇత్యాదిగా చెప్పినది ఉపాస్య స్వరూపమును గురించియే కాని, ఉపాసక స్వరూపమును గురించి కాదు. అందువలన, ఉపాసనా సందర్భము నందును - ఉపాసకుడు జ్ఞాతృత్వా ద్యాకార విశిష్టుడు గనే తనను అనుసంధానము చేసికొనవలె నని పూర్వపక్షి అభి మతము.

మోక్ష దశలో శ్రూయమాణము లగు గుణాష్టక విశిష్ట స్వరూపమునే అనుసంధానము చేసికొనవలసి యుండు నని సూత్ర కారుడు వక్కాణించును. ఏల ననగా - యథా క్రతు న్యాయ మను సరించి, ఎట్టి స్వరూపమును తాను చెందగలడో - అట్టి స్వరూపము గలవానినిగనే తాను ఉపాసన సమయము నందును అనుసంధించ వలసి యున్నది. పూర్వపక్షి ఈ న్యాయము ఉపాస్య విషయక మని చెప్పియున్నాడు. ఉపాస్యు డగు పరమాత్మకు ఈ ప్రత్యగాత్మ శరీరక పరమాత్మ ఉపాస్యు డగుచున్నాడు. పరమాత్మను చేరగల డని నపుడు - యథావస్థిత పరమాత్మను చెందగలడనియే కదా అర్థము ! అట్లే, చెందువాడును యథావస్థిత స్వరూపము కలవాడే చెందు నని ఏర్పడును. యాగాది కర్మాంగముగా ఆత్మను అనుసంధానము చేసి కొనినపుడు ఈ శరీరము పోయినను, తా నుండి - స్వర్గమును అను భవించగల నను నిశ్చయము కలుగుటకు - ఆత్మ శరీరాతిరిక్త మను అనుసంధాన మాత్రము చాలును. ఉపాసనలో స్వస్వరూపావిర్భావము ఫలము కనుక, పరిశుద్ధ రూపము గుణాష్టక విశిష్టము కనుక, దానినే అనుసంధానము చేసికొనవలె నని సిద్ధాంతము.

# 22. అంగావబద్ధాధికరణము

అన్ని పర విద్య లందును శుద్ధ జీవ స్వరూపము విషయ మగు నని పై యధికరణములో నిర్ణయింపబడినది. దీనితో - ఉద్గీథోపాసన స్మృత మైనది. ఉద్గీథ మని సామ వేద భాగమునకు పేరు. ఇది క్రతువుకు అంగము. ఈ ఉద్గీథము యొక్క అవయవముగా ప్రణవము పేర్కొనబడుచున్నది. ఈ అక్షరము యొక్క ఉపాసన - "ఓమి త్యేత దక్షర ముద్గీథ ముపాసీత" అని ఛాందోగ్యమునందు విధించ బడి యున్నది. ఇది క్రతువుకు అంగ మగు ఉద్గీథము నాశ్రయించి యుండు ఉపాసన. ఇట్లే - ఉక్థము, సామ, అగ్ని - ఇవియు క్రత్వంగ ములు. ఉక్థ మనగా - శస్త్ర మని పేర్కొనబడు స్తోత్ర విశేషము. సామ పంచ విధ మైనది మరి యొకటి. అగ్ని యనగా - అగ్ని కాధారముగ పేర్చబడిన ఇటుకలు గల స్థండిల విశేషము. వీని ఉపా సనలు కూడ కొన్ని శాఖలలో విధించబడినవి. ఇవి యన్నియు క్రత్వంగాశ్రయ ఉపాసనలు. ఇవి ఏ శాఖలో విహితములో - ఆ శాఖలందే కాక, అన్నిటియందును అన్వయించుట సిద్ధాంతి సిద్ధాం తము. శుద్ధ జీవ స్వరూపము అన్ని పర విద్యలలో అన్వయించినట్లు - ఈ ఉపాసనలు కూడ అన్ని శాఖలలో అన్వయించుట వలన, సామ్య మును బట్టి స్మృతములై నిరూపింపబడుచున్నందున, పై యధికరణ మునకు ఈ యధికరణము ప్రసంగ సంగతి యనవచ్చును. సర్వ వేదాంత ప్రత్యయ న్యాయమున వీనికి అన్ని శాఖలందును అన్వ యము చెప్పవచ్చును. కాని, ప్రతి శాఖ యందును, ఉద్గీథాది వ్యక్తులు సర్వ భేదమున భిన్నములు కదా ! అందువలన, ఆ శాఖలో శ్రుత మైనది ఆ శాఖలోనే నియతమై యుండు నని భావించుటకును అవకాశ మున్నదికదా ! అందువలన, ఈ ఉపాసనలు ఆ యా శాఖా

నియతములా ? సర్వశాఖాగతము లగు ఉద్గీథాదులతోను సంబంధించునవియా ? అని సందేహ మేర్పడును.

పూర్వపక్షి - ఏ శాఖలోని ఉపాసనయో, అది ఆ శాఖలోని ఉద్గీథమునకు మాత్రమే సంబంధించినది కాని, సర్వశాఖాగత ఉద్గీథాదులకు సంబంధించినది కాదు - అనును. ఏ మనగా, ఉపాసనకు కావలసినవి ఉద్గీథాదులు. అవి ఆ యా శాఖలలో విధించబడినవే కదా ఆ ఉపాసనలకు సన్నిధి పఠితములు. అందువలన, ఏ శాఖలోని ఉపాసనలు - ఆ శాఖలోని ఉద్గీథాదులకు సంబంధించినవి అనియే చెప్పవలె నని పూర్వపక్ష సారము. సర్వశాఖ లందును శ్రూయమాణము లగు ఉద్గీథాదులతో సంబంధించినవియే ఈ ప్రత్యంగోపాసనలు - అని సిద్ధాంతము. ఏ మనగా - ఈ ఉద్గీథాదులు ఎచ్చెచ్చట నున్నను, అచ్చటచ్చట ఈ ఉపాసనలకు సంబంధ మున్నది కదా ! స్వరాదులు భిన్నము లైనను, ఉద్గీథాదులు ఉద్గీథాది శబ్ద వ్యవహారములుగా అనుగతాకారముతోనే ఆ యా శాఖలలో చెప్పబడుచున్నవి. ప్రతి శాఖ యందును చెప్పబడిన క్రతువు ఒక్కటియే యైనట్లు - ఆ క్రతువునకు అంగములుగా శ్రూయమాణము లగు ఉద్గీథాదులు కూడ స్వరాకారాది భేద భిన్నములే యైనను, క్రత్వంగత్వ రూపమున ఒక్కటిగనే భావింపబడును. ఇట్లు అన్ని ఉద్గీథములును - అన్ని శాఖ లందును ప్రత్యంగములు కనుక, ఉపస్థితము లైనపుడు అన్నిటికిని సన్నిధి పాఠము సమాన మగును గదా ! కనుక, ఆ వ్యక్తి మాత్రమే ఆ ఉపాసనలో అన్వయించు నను వ్యవస్థ సాధ్యము కాదు. ఆ ఉపాసన అన్ని శాఖలలోని ఉద్గీథాదులతో సంబంధించు ననియే సిద్ధాంతము. ఏదియో యొక శాఖలోని ఆ ఉద్గీథ వ్యక్తి మాత్రముతోనే ఆ ఉపాసన సంబంధించిన యెడల, సర్వ వేదాంత ప్రత్యయ న్యాయముతో ఆ ఒక్క ఉద్గీథాది వ్యక్తి

మాత్రమే సర్వశాఖలలోని క్రత్వంగోపాసన యందును అన్వయింప వలసివచ్చును కదా ! అందువలన, ఆ వ్యక్తి - ఆ శాఖ యందే వ్యవస్థిత మని చెప్పరాదు. అన్ని శాఖ లందును ఈ క్రత్వంగో పాసనలు సంబంధించు నని చెప్పవలెను. మంత్ర జాతి గుణాదులు ఆ యా విభిన్న శాఖలలో వినబడుచున్నను, సర్వశాఖలలోని క్రతువు ఒక్కటియే యైనందున, ఈ మంత్రాదులకు అన్ని శాఖ లందును అన్వయము చెప్పబడి యున్నది కదా ! అట్లే, ఈ క్రత్వం గోపాసనలు కూడ అన్ని శాఖ లందును అన్వయించవలసినవియే యని సిద్ధాంత సారము.

## 23. భూమ జ్యాయ స్త్వాధికరణము

ఉద్గీథ పదముతో సర్వోద్గీథములు ఉపస్థితము లైనట్లు వైశ్వా నర విద్య యనుటలో వ్యస్తములుగను, సమస్తములుగను ఉన్న సర్వ విధ వైశ్వానర విద్యలును ఉపస్థితములు కావచ్చునేమో అని స్మృత మైనందున, ఇందులో వైశ్వానర విద్య వివరించబడుచున్నది. కనుక, ఇదియు ప్రసంగ సంగతితో ఉత్థితమైన యధికరణ మనవచ్చును. విషయము దీనితో వైశ్వానర విద్య. వైశ్వానరము పరమాత్మ త్రైలోక్య శరీరుడుగా దనిలో పేర్కొనబడినాడు. ఇతనికి స్వర్గ లోకము శిరస్సు. ఆదిత్యుడు చక్షువు. వాయువు ప్రాణము. ఆకాశము మధ్య కాయము. మలము పొత్తి కడుపు. పృథివి పాదములు. ఇట్లు వర్ణించబడిన ఈ వైశ్వానరుని వ్యస్త స్వరూపము నుపాసింపవలెనా ? వ్యస్తము, సమస్తము - రెండు స్వరూపముల నుపాసింపవలెనా ? లేక - కేవలము సమస్త స్వరూపమునే ఉపాసింపవలెనా ? అని

సంశయ మేర్పడును. ఉపక్రమమున వ్యస్తోపాసన ప్రసక్త మైనందున, కేవల వ్యక్త స్వరూపమే ఉపాస్య మని పూర్వ పక్షము.

జాప మన్య వాదు లార్గురు కేకయ దేశాధిపతి యగు అశ్వపతి వద్దకు వెళ్ళి, వైశ్వానర విద్య నుపదేశించు మని అర్థించిరి. ఆయన - ఈ యార్గురు ఇంతవరకు ఎట్లు ఉపాసన చేయుచున్నారో అడిగి తెలిసికొనును. వారు - స్వర్గ లోకాది శరీరకుడుగా వైశ్వానరుని ఉపాసించువారు కేవల మూర్ధోపాసన చేయుచున్నారు. వీరికి అన్నము బ్రహ్మవర్చసము ఫల మని అశ్వపతి ఉపదేశము. ఇట్లు ఉపక్రమమున వ్యస్తోపాసన ప్రక్రాంత మైనందున, వ్యస్తోపాసనయే కర్తవ్య మని పూర్వపక్ష సారము.

వ్యస్తోపాసన వలె సమస్తోపాసనయు అచట శ్రుత మగుచున్నది. కనుక, ఏ ఫలము కావలయు ననుకొందురో - ఆ ఫలము నిచ్చునట్టి వ్యస్త స్వరూపమునుకాని, సమస్త స్వరూపమునుకాని ఉపాసించ వచ్చు నని మరి యొక విధమైన పూర్వపక్ష మేర్పడవచ్చును. ఐనచో - ఈ పూర్వపక్షి వైశ్వానర విద్యలో - వ్యస్త - సమస్త - ఉభయ విధానము నంగీకరింపవలెను. అపుడు విధేయ భేదమునుబట్టి, వాక్య భేద మంగీకరించవలసి యుండును. ఇంతకును, వైశ్వానర విద్య - ఒకటి కాక పోవును. వాస్తవమునకు - వైశ్వానర విద్యకు ఏక వాక్యత అందరును అంగీకరించినది కదా ! అనగా, పూర్వపక్షి ఇంత మాత్రమునకే వాక్యభేద ప్రసక్తి ఏమియు లే దనును. ఏ మనగా, ఇట్టివాని ఏక వాక్యత భగ్నము కాజాలదు. ఉదాహరణకు - భూమ విద్య ఒకటి ఉన్నది. దానిలో - నామము మొదలుకొని ప్రాణ పర్యంతము ఒక్కొక్క ఉపాసన చెప్పి, తత్ఫలము కూడ చెప్పి, పిదప భూమ విద్య ఉపదేశింపబడి యున్నది. అంతమాత్రమున భూమ

విద్యకు ఏక వాక్యతా భంగ మేమియు కలిగినట్లు - ఎవరును అన లేదు. అట్లే, ప్రకృత వైశ్వానర విద్య యందును - వ్యస్త, సమస్త - ఉభయ ఉపాసన విధించబడినను, వాక్యభేద ప్రసక్తి లేదని ఈ పూర్వపక్ష సారము.

సిద్ధాంతి సమస్తోపాసనమే విధించబడిన దనును. ఇపుడు ఏక వాక్యత విషయమునందు భిన్నాభిప్రాయమునకు అవకాశ ముండదు. ఉభయ విధాన మున్నచో - ఎచ్చటేని వాక్య భేదము తప్పదు కదా ! భూమ విద్యలో - నామా ద్యుపాసనములు విధించబడినను, అది ప్రకృత భూమ విద్య యొక్క అతిశయత ఫలప్రదత్వమును చూపుటకు మాత్రమే యని గ్రహించవచ్చును. అచట నామా ద్యుపాసన చేయువారికి అనర్థ మేమియు ఉపదేశింపబడలేదు. వైశ్వానర విద్యలో - వ్యస్తోపాసన చేసినవారికి మూర్ధ ప్రతిపాత నేత్ర హీన తాది అనర్థములు చెప్పబడినవి. కనుక, వ్యస్తోపాసనము అభిమతము. కాదు. ఐనచో - వానిని చెప్పుటలో తాత్పర్యము - సంపూర్ణ వైశ్వానర స్వరూపము యొక్క ఏకదేశానువాద మాత్రమే యందురు. ద్వాదశ కపాలేష్టిలో - అష్టాకపాలాదులను విడిగా చెప్పుచు, తత్ఫలము కూడ విడిగా చెప్పబడి యున్నది. అంతమాత్రమున అష్టాకపాలేష్టి మొదలగునవి వేరు కాదు - కేవలము ఏక దేశానువాదమే అని కదా అందురు ! అట్లే, వైశ్వానర విద్యయు - ఏక వాక్యత కలది. సమస్తోపాసనమే సిద్ధాంతము. వ్యస్తోపాసనము ఏకదేశానువాదము మాత్రమే యని సిద్ధాంత సారము.

## 24. శబ్దాది భేదాధికరణము

వైశ్వానర విద్యకు శ్రుత మగు నానాత్వమును కా దని విద్యైకము నిర్ణయించు సందర్భమున పర విద్యల నన్నిటికిని విద్యైక్యమే

న్యాయ్యమేమో యను ఆలోచనతో స్మరణము వచ్చిన సర్వ పర విద్యా నానాత్వము ఈ యధికరణమున చర్చించబడుచున్నది. కనుక, ఇది ప్రసంగ సంగతితో యుక్తియుక్తమైన అధికరణము. సర్వ పరవిద్యా నానాత్వము ఈ యధికరణ విషయము. బ్రహ్మ విద్యలు - స ద్విద్య, భూమ విద్య - మొదలగునవి. బ్రహ్మప్రాప్తి రూప మగు మోక్షమే ఫలముగా కలిగి యున్నవి. కనుక, వీనికి ఐక్యమే యగునా ? లేక - పేర్లు వేరు వేరుగా నున్నందున, నానాత్వము చెప్పవలెనా ? అనునది సందేహము. ఉపాసన విషయ మగు బ్రహ్మ స్వరూప మొక్కటియే యైనందున, వి ద్యైక్యమే న్యాయ మనును పూర్వపక్షి. రూపైక్యము, ఫలైక్యము ఉన్నందున, పర విద్య లన్నిటికిని విద్యైక్యమే ఉచిత మని పూర్వపక్ష పద్ధతి.

పరవిద్య లన్నిటికిని నానాత్వమే న్యాయ మని సిద్ధాంతము. విధేయ రూప భేదమును సూచించు శబ్దాది అనుబంధ భేదమును గ్రహించినచో - విధేయ రూప మగు నానాత్వమే స్ఫురించక మానదు. వేదనోపాసనాది శబ్ద భేదము, ఒక్కొక్క విద్య యందును విడిగా మోక్ష రూప మగు ఫలమును రెండు మూడు సార్లు చెప్పుట, అపహత పాప్మత్వాది గుణ భేదము, దహర విద్యాది నామధేయ భేదము, ఇతర విద్యలచేత నివారణ చేయవలసిన యవసరము గల ఆకాంక్ష లేకుండుట - ఇవి యన్నియు పరవిద్యల నానాత్వమును బలపరచుచున్నవి. పూర్వ మీమాంసాలో - "శబ్దాంతరే కర్మ భేదః" మొదలగు సూత్రములతో - యాగ దాన హోమాది కర్మ లకు భేదము సాధించబడినది. అదియే న్యాయముతో ఈ పర విద్య లకు కూడ నానాత్వము సిద్ధము కావచ్చును. ఐనను, తిరిగి ఈ యధి కరణము నారంభించుటలో - సూత్ర కారుల తాత్పర్యము మొకటి యున్నది. అ దేమనగా - కొందరు వేదాంత వాక్యములు ధ్యానో

పాసనాది రూప జ్ఞానమును విధించుచవి కావు - అని అనుకొందు రట ! అట్టి వారికి ఈ యధికరణము ఉపాసన లన్నియు విడి విడిగా విధేయములే సుమా ! అని ఈ యధికరణమున ఏర్పడిన తరువాతనే అన్ని వేదాంతములలోని దహరాది విద్యలు ఒక్కటియే యని సర్వ వేదాంత ప్రత్యయ న్యాయము పని చేయు నని తెలిసికొనవలెను.

## 25. వికల్పాధికరణము

సకల పర విద్యలు ప్రసక్త మైనందున, ప్రసంగ ప్రసంగతితో ఆ పరవిద్య లన్నియు ఫల ప్రాప్తికి అవసరమా ? ఏదియో యొకటి చాలదా ? అను సంశయమును నివారింపజేయుటకై ఈ యధికరణ మారంభింపబడినది. సర్వ పర విద్యా సముచ్చయ వికల్పములు ఈ యధికరణ విషయము. సర్వ పర విద్యల సముచ్చయము కూడ సంభవ మని పూర్వ పక్షము. స్వర్గ రూప మగు ఫల మొకటియే యైనను, అగ్నిహోత్ర మొనరించినవారు - దర్శ పూర్ణ మాసము లను కూడ చేయుచున్నారుకదా ! ఎక్కువ స్వర్గ సౌఖ్యము ఈ సముచ్చయము వలన కలుగవచ్చును. అట్లే, బ్రహ్మానుభవము కూడ హెచ్చుగా కావలె ననుకొనువా రెవరైనను - పర విద్యలను కూడ ఒకటిని మించి సాధింపవచ్చును. అందువలన, విద్యల సముచ్చయము కూడ సంభవమే యని పూర్వ పక్షము.

సిద్ధాంతి - సముచ్చయ సంభావనను కూడ సహించము. స్వర్గా దులు పరిమితము కనుక, ఆ యా దేశములలో అధిక సుఖానుభూతి కొరకు అగ్నిహోత్రాది అనేక కర్మల నాచరించు ప్రసక్తి ఉన్నది. ఇచ్చట బ్రహ్మ విద్య లన్నిటికి స్వస్వరూపావిర్భావ పూర్వక మగు బ్రహ్మానుభవ మొక్కటియే ప్రయోజనము కదా ! ఈ బ్రహ్మ - అనవధికాతిశయానంద స్వరూపమే అందరికిని. కనుక, ఒక ఉపాసన

చేతనే పుణ్య పాప నివృత్తి, పరమాత్మ ప్రాప్తి, స్వస్వరూపావిర్భావము, పరబ్రహ్మానందము జరుగుచుండ, ఇతర విద్యా సముచ్చయము యొక్క ప్రసక్తియే రాదు. బ్రహ్మప్రాప్తి కాక, మరి ఏ ఇతర ఫలము కొరకు చేయు ఉపాసన లైనను సరియే - అగ్నిహోత్రాది కర్మల వలె సముచ్చయమును సహించగలవు. కాని, అపరిమితానంద లక్షణములు గల మోక్ష సాధనము లగు పరవిద్యలకు సముచ్చయ సంభావన కూడ లే దనియే సిద్ధాంతము.

## 26. యథాశ్రయ భావాధికరణము

ఉద్గీథాదులు క్రత్వంగములు కొన్ని కలవు. వాని నాశ్రయించిన ఉపాసనలు కూడ సముచ్చితము లేమో అని స్మరణ కలిగినది. కనుక, త ద్విచారము చేయు ఈ యధికరణము ప్రసంగ సంగతితో ఏర్పడినది. ఉపాసనల సముచ్చయ విచారార్థమే ఉపాసనల కాశ్రయము లగు ఉద్గీథాదులకును, త దుపాసనలకును సముచ్చయము నవసరమా ? కాదా ? అను విచారము చేయవలసి యున్నది. ఉద్గీథమునకు క్రతు ఫలమే తప్ప, ఫలాంతరము లేనందున, అది క్రత్వంగ మైనది. అట్లు క్రత్వంగమైనపుడు - తప్పక క్రతువులో అన్వయించి తీరును. కాని, " ఓ మి త్యే త దక్షర ముద్గీథ ముపాసీత " అని విధించబడిన ఉద్గీథాశ్రయ మగు ఉపాసనకు విడిగా వీర్యవత్తవత్వ ఫలము వినబడుచున్నది. కనుక, ఇది క్రత్వంగము కాని యపుడు - ఉద్గీథము వలె త దుపాసనము నియతముగా క్రతువులో ఉండవలసిన నియమ ముండదు గదా ! అపుడు ఉద్గీథమునకు త దుపాసనకును సముచ్చయ నియమము లే దనవలెను. ఈ విషయము - త న్నిర్ధారణా నియమాధికరణము (3-3-17)లో - కొంత నిర్ణయింప బడియున్నది. మరి కొన్ని విశేషములు తెలుపుటకు ఈ యధికరణ

ముద్దేశింపబడినది. పర విద్య లన్నిటికి ఫల మొక్కటియే యైనందున, సముచ్చయము లేదు. వికల్పమే అని సిద్ధాంతము చేయుచున్నది. ఇట్లు ఈ యధికరణ విషయము క్రత్వంగ ఉద్గీథాది విద్యలు. త దుపాసనలకు క్రతువులో ఉపాదాన నియమ మున్నదా ? లేదా ? అనునది సందేహము. ఉపాసనలు కూడ నియతముగా ఉపాసనలే యని పూర్వ పక్షము. ఉపాసనలకు ఆశ్రయము ఉద్గీథము. అది క్రత్వంగము కనుక, నియతముగా క్రతువులో ఉపాదేయము కదా ! అట్లే, త దాశ్రిత ఉపాసనలు కూడ తద్ద్వారా క్రత్వంగములే గనుక, ఉపాసనలు కూడ నియతముగా ఉపాదేయములే. ఇట్లు ఉద్గీథాదు లకు, త దుపాసకులకును సముచ్చయమే కాని, వికల్పము లే దని పూర్వపక్షి సంకల్పము.

"ఉద్గీథ ముపాసీత" అను విధియే ఉపాసనమునకు ఉద్గీథాంగత్వమును విధించుచున్నది కదా ! ఉపాసన లేని ఉద్గీథ మును మరుద్గీథ మని వ్యవహరించిరి. ఉద్గాత మపద్గీథ మొన రించినచో - హోతృ స్థానము నుండి సమాధానమును సంపాదింప వలసి యుండును. ఇట్లు చెప్పుట వలన, ఉపాసన లేని ఉద్గీథము ఉప యుక్తము కాదని తెలియుచున్నది. కనుక, ఉద్గీథము వలె త దుపాస నము కూడ ద ద్ద్వారా క్రత్వంగములై, నియమముగా ఉపాదేయము లగుచున్నవి.

మరి యొక మాట. "తే నేయం త్రయీ విద్యా వర్తతే" అని, ఉపాసన విశిష్ట మగు ప్రణవ రూప ఉద్గీథమునకు సర్వ వేద

కార్య సంబంధము చెప్పబడుచున్నది. కనుక, సర్వ వేద వాక్యము లందును ఉద్గీథోపాసనలు రెంటికిని నియమముతో గూడిన సముచ్చయమే అని పూర్వ పక్షము.

ఉపాసనలకు ఉద్గీథాంగ భావమే విధింపబడలేదు. అంగమైనచో సదా ఉపాసనము ఉద్గీథముతోపాటు తప్పక కలిసి యుండవలసి యుండును! "ఉద్గీథ ముపాసీత" అని ఉపాసనమును చెప్పి, "య దేవ విద్యయా ... వీర్యవత్తరం భవతి" అని, ఆ ఉపాసనమునకు వీర్యవత్తరత్వము ఫలముగా చెప్పబడినది. ఉపాసనమున కాలక్రమమున మాత్రమే ఉద్గీథము చెప్పబడినది. క్రతు ఫలము కంటె పృథక్ ఫలము కలిగి యున్న ఉపాసనలు - క్రత్వంగములు కనుక, క్రతువులో ఉద్గీథము తప్పక వినియోగించుకొనబడును. క్రతువు అవిలంబితముగా ఫలప్రదము కావలె నను కామన కలవారైనచో - ఉద్గీథోపాసన చేయగలరు. లేక, ఉపాసన చేయరు. కనుక, ఉద్గీథాదులం తదుపాసనలకే సహ భావ నియమము లేదను చుండ, స దుపాసన లన్నిటికిని సముచ్చయ నియమ ప్రసక్తియే యుండ దని సిద్ధాంతము. అంతే కాదు. బ్రహ్మ తాను ఉపాసన కలవాడైనచో చాలు - యజ్ఞ యజమాన సర్వ ఋత్విక్కులను కూడ రక్షించు నని శ్రుతి చెప్పుచున్నది. దీనితో యజమానుడు ఉపాసన చేసి తీర వలె నను నియమము లేనట్లే కదా తెలియుచున్నది! అందువలన, ఉద్గీథాది ఉపాసనా సముచ్చయ నియమము లే దనియే సిద్ధాంత సారము.

# తృతీయాధ్యాయము - చతుర్థ పాదము

## 1. పురుషార్థాధికరణము

పూర్వ పాదమున గుణోపసంహార నిమిత్తమై సర్వ పర విద్యల యొక్క భేద అభేదాదులు వివరింపబడినవి. ఇట్లు విద్యా విషయక విశేషములను వివరించిన తరువాత, ఆ విద్యలకు ఫల సాధన భావము సిద్ధించుటకు ఉపకరించు అంగములను విచారించవలసి యున్నది. పూర్వాధికరణమున ఉపాసన క్రతు ఫలమును త్వరలో సాధించి యిచ్చుటకే ఉపయోగపడినట్లు తెలిసినది కదా! దానితో బ్రహ్మ విద్యలు కూడ ఫలమును సాధించి యిచ్చుటలో సహకరించునట్టివే నేమో - అని అనుకొన వీలుండును కదా! ఇట్లు స్మృత మైన బ్రహ్మ విద్యలు అంగ భావము కలవి కావు. స్వతంత్రించి ఫల సాధన భావము కలవియే యని వివరించుటకు ప్రసంగ సంగతితో ఈ యధి కరణ మేర్పడిన దనవచ్చును. సర్వ పర విద్యలును ఇచట విషయమే. ఈ పర విద్యలే ముక్తి సాధనములా ? లేక - ఇవి అంగములుగా నున్న కర్మలే ముక్తి సాధనములా ? అని సంశయము. విద్యాంగకము లగు కర్మలే మోక్ష సాధన మనునది పూర్వ పక్షము. ఈ పూర్వ పక్షి ప్రవక్త ప్రధానముగా పూర్వమీమాంసా శాస్త్ర ప్రణేత యైన జైమిని మహర్షి యే. ఇచట అనేక పూర్వపక్ష యుక్తుల నుపపాదించి ఖండించవలసివచ్చినది. అందువలన, మొదట తన సిద్ధాంతమునే బాద రాయణ భగవానుడు పేర్కొనుచున్నాడు. శ్రుతి ప్రమాణములను పురస్కరించుకొని, పరిశీలించిన-చో - విద్య వల్లనే పురుషార్థ యని బాదరాయణుని సిద్ధాంతము. "బ్రహ్మవి దాప్నోతి పరం" "త మేవం

విద్వాన్" తథా విద్వా న్నామ రూపా ద్విముక్తః" ఇత్యాది బహు శ్రుతి వాక్యములు - విద్యయే ముక్తి సాధన మని చెప్పుచున్నవి. కనుక, విద్యలకే మోక్ష ఫల సాధ్యత్వ మని సిద్ధాంతము.

పూర్వపక్షి - "బ్రహ్మవి దాప్నోతి పరం" ఇత్యాది వాక్యములు యాగ మొనరించు జీవుని పరిశుద్ధ స్వరూప మగు చేతనమును గురించి చెప్పునట్టివే కాని, విద్యను చెప్పునట్టివి కా వనుము. కర్త - యాగమునకు శేషభూతుడు ఈ ద్యాధాత్మ జ్ఞానము ఆ కర్తకు సంస్కారమును కలిగించు నని వారి మతము. ప్రథమాధ్యాయములో జీవుని కంటె అతిరిక్తుడు పరమాత్మ. ముక్త ప్రాప్య డొక డున్నాడని సాధించి యుంచినాము. ఆ బ్రహ్మను "తత్త్వ మసి" ఇత్యాది సామానాధికరణ్య బోధక వాక్యములు జీవ రూపముగా చెప్పుటయు - జీవ బ్రహ్మలకు గల శరీర శరీరి భావ నిబంధన మనియు చెప్పినాము. ఐనను, కొన్ని కారణములను బట్టి ఈ వాక్యములు జీవ స్వరూప యాథాత్మ్యమును చెప్పునట్టివే అని అంగీకరించవలసి యుండును - అందురు. విద్వాంసులు కూడ కర్మలు చేయు ఆచారము కన్పడుచున్నది. వైశ్వానర విద్యా నిష్ఠుడు అశ్వపతి - తాను యాగము చేయబోవు చున్నా ననును కదా ! ఇట్లే, జనకాది రాజర్షులు బ్రహ్మవేత్త లయ్యును - కర్మలు చేసినట్లు చెప్పబడుచున్నది. కనుక, ఈ ఆకారమును బట్టి, విద్యాంగక మగు కర్మయే సాధన మని చెప్పవచ్చును. "య దేవ విద్యయా కరోతి" అని శ్రుతి స్పష్టముగా విద్యను కర్మాంగకత్వమునే చెప్పినదికదా ! "తం విద్యా కర్మణే సమన్వారభేతే" అని - విద్యా కర్మల సముచ్చయము చెప్పబడినది. ఈ సాహిత్యము ఒకటి అంగము, మరి యొకటి అంగి యైనపుడుగదా సమన్వయించును ! అందువలన, విద్య - కర్మకు అంగమే యగుచున్నది. "ఆచార్య కులా ద్వేద మధీత్య" ఇత్యాది వాక్యములు

విద్యా విశిష్టునికేగదా కర్మానుష్ఠానమును ఉపదేశించుచున్నవి ! కనుక, బ్రహ్మ విద్యయు క్రతు శేష భూతమే. "కుర్వ న్నేవేహ కర్మాణి" అని - బ్రహ్మ వేత్తయు కర్మ చేయుచునే జీవించవలెనని కదా శ్రుతి చెప్పుచున్నది ! అందుచే, విద్యవలన పురుషార్థ లాభ మనరాదు. ఏ మేమనగా - విద్య అంగముగా గలిగి యున్న కర్మ వల్లనే పురుషార్థ మని మహర్షి జైమిని పూర్వపక్ష వాదము.

విద్య వల్లనే పురుషార్థ మని బాదరాయణుని సిద్ధాంతము కర్మలకు శేషభూతుడుగా నున్న జీవున కంటెను - హేయ రహితు డైనందునను, సర్వ కల్యాణ గుణాకరు డైనందున, ఉత్కృష్టు డగు పరమాత్మనే బ్రహ్మ విద్యలు చెప్పుచున్నవి. కనుక, ఉపాసన కూడ ఆ పరమాత్మదే కాని, జీవోపాసన కాదు. ఇచట చెప్పబడునది - "భీషాస్మా ద్వాతః పవ తే" "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి..." స కారణం కరణాధిపః" ఏష సర్వేశ్వరః, ఏష భూతాధి పతిః" ఇత్యాది పరశ్శత వాక్య సముదాయము పరమపురుషోపాసనమే మోక్ష సాధన చెప్పుచున్నవి కదా ! ఇక బ్రహ్మవేత్తలును కర్మ నిష్ఠులై యుండుట - కర్మ వల్ల పురుషార్థమును తెలుపదు. ఏ మనగా - "కి మర్థా వయం యక్ష్యామహే" అని, త్యాగము చేసిన బ్రహ్మవేత్తలును మనకు కానవచ్చును. ఫలాభిసంధిరహితముగా కర్మ లను చేయవచ్చును. ఫలాభిసంధి కలిగియున్న, మోక్షవిరోధి యగు నని కర్మలు మానవచ్చును. కనుక, విద్యయే పురుషార్థ సాధనము. కాని, విద్య అంగముగా నున్న కర్మ కాదని తెలిసికొనవలెను. "య దేవ విద్యయా కరోతి" అనునది దేవల ఉద్గీథమునకు సంబంధించినదే కాని, కర్మ సామాన్యమునకు సంబంధించినది కాదు. అందువలన, విద్య కర్మాంగ మగు ప్రసక్తియే లేదు. "విద్యా కర్మణి సమన్వారభతే" అని - విద్యా కర్మలకు చెప్పబడిన సాహిత్యములో - అను

పపత్తి యేమియు లేదు. ఏ మనగా - విద్య తన ఫలమును కర్మ తన ఫలితమును ఈ చేతనునకు ఇచ్చుటకై ఆరంభించు నని కదా దాని యర్థము! క్షేత్ర రత్నములను నమ్మిన వానికి రెండు వందల విద్యలు - అనగా, క్షేత్రమునకు వంద, రత్నమునకు వంద - అని విభాగము కుదురవచ్చు కదా! అట్లే, విద్యా కర్మల సాహిత్యము కూడ తన తన ఫలము నిచ్చు నని విభాగ మేర్పడును. "వేద మధీత్య" అని - విద్య కలవారికే కర్మ విధించి నందున, విద్య కర్మకు అంగ మనుటయు పొరపాటే. ఇచ్చట - వేదాధ్యయనము చేసిన వారికి - అని అర్థమే కాని, ఉపాసన చేయువారికి - అని అర్థము కాదు. వేదాధ్యయనానంతరము - తదర్థ విచార రూప మగు శాస్త్రము నభ్యసించి, కర్మలు చేయగోరువారు, కర్మ జ్ఞానముకొరకు మోక్షము కోరువారు బ్రహ్మజ్ఞానము కొరకు ప్రయత్నింతురు. అందు వలన, విద్యయే పురుషార్థ సాధకము. "కుర్వ న్నేవే హ కర్మాణి" అని - బ్రతికియున్నంతవరకు కర్మలు చేయుచునే యుండవలె నను నియమము బ్రహ్మవేత్తలను గురించియే యనుటకు ప్రమాణ మేమియు లేదు. బ్రహ్మవేత్తకు కూడ కర్మ కరణ నియమ మున్న దనుకొనినను, ఆ కర్మలు బ్రహ్మవిద్యకు అంగములుగా నుండుకర్మలు కావచ్చును. కనుక, దీనితో విద్య కర్మాంగ మని చెప్పరాదు. బ్రహ్మ వేత్త కర్మ లొనరించినను, తత్ఫల మితనికి బంధించదు - అని బ్రహ్మవేత్తను స్తుతించుచున్నది - కుర్వ న్నేవేహ కర్మాణి" అను మంత్రము. ఈ వాక్యము చివర - న కర్మ లిప్యతే నరే" అను వాక్యము వలన, ఇది కేవలము విద్యాస్తుతి యని తెలియవచ్చును. కనుక, విద్య కర్మాంగము కాదు. "కిం ప్రజయా కరిష్యామః" అని - విరక్తు లగు బ్రహ్మవిద్యా నిష్ఠులు స్వేచ్ఛతో గృహస్థాశ్రమ త్యాగ మొనరించినట్లు వినుచున్నాము. విద్య కర్మాంగ మైనపుడు కర్మలను

చేయు అధికారము నిచ్చి ఆశ్రమమును విడచుట సాధ్యము కాదు కదా ! అందువలన, విద్య కర్మాంగము కాదు.

"క్షీయంతే చాస్యకర్మాణి" అని - బ్రహ్మవిద్య సర్వ క్షయ మును చెప్పుచున్నందున, విద్య కర్మకు అంగ మనుట భావ్యము కాదు. గృహస్థాశ్రమము విడిచి సన్యసించినవారికిని బ్రహ్మవిద్యాధి కార మున్నది. కాని, వారికి దర్శ పూర్ణ మాసాది కర్మలలో అధి కార ముండదు. అందువలన, బ్రహ్మవిద్య ప్రధాన సాధనమే వాని కర్మకు అంగ మనుట కవకాశము లేదు. "యావ జ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" 'జీవితాంతము అగ్నిహోత్రము చేయవలెను' అని విధి యున్నందున, సన్యాసాశ్రమమే లేదన రాదు. "త్రయో ధర్మ స్కంధాః" "ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి" ఇత్యాదిగా వేదమే ఉపదేశించుచున్నదికదా సన్యాసమును ! అందు వలన, సన్యాసము వేద సమ్మతమే. విరక్తి చెందనివారి విషయమందే జీవితాంతము అగ్నిహోత్ర విధానము.

ఆచార్య జైమిని అభిప్రాయానుసారము - సన్యాసము అవై దికము. "త్రయో ధర్మ స్కంధాః" ఇత్యాదులు బ్రహ్మోపాసనను స్తుతించుచున్నవేకాని, ఆశ్రమమును విధించుటలేదు. విధాయక వాక్యము లేక. ప్రవ్రజనాదులు శ్రుతములైనను, అవి అనువాదములే అనికదా అనుకొనవలసి యున్నది ! అంతే కాదు - "వీరహా వా ఏష దేవానాం యోగ్ని ముద్వాసయతే" అగ్ని ఉద్వాసన చేసిన వాడు - వీర హనన మొనరించినవా డగు నని సన్యాసాశ్రమమే లే దని ఆచార్య జైమిని అభిప్రాయము. కాని, బాదరాయణుడు సన్యా సము వైదికమే యని వక్కాణించును. సన్యాసమునకు విధి లే దనుట సమంజసము కాదు. "త్రయో ధర్మ స్కంధాః" అనునది - బ్రహ్మ

చర్య, గార్హస్థ్య, తదితర ఆశ్రమములను పేర్కొనుచున్నదికదా! వీనిలో - గృహస్థాశ్రమమునకును ఇది అనువాదమే అనవలెను. ఐనచో - విధి లేక, అనువాద మనుపపన్నము. కనుక, ఈ అనువాదము ఆ యా ఆశ్రమములకు విధిని కల్పించి తీరును. ఇట్లు విధి కల్పనము గృహస్థాశ్రమమునకు వలెనే సన్యాసమునకును సరిపో వచ్చును. గదా! మూడు ఆశ్రమములకును బ్రహ్మచర్యము, యజ్ఞాధ్యయన దానములు, తపస్సు అనునవి చెప్పబడినవి. ఇవి యన్నియు ఒక్క గృహస్థాశ్రమ ధర్మములే యనుటకు ఆస్కారము లేదు. అపుడు - 'ప్రథమ ద్వితీయా తృతీయః' - అని విభజించుటకే వీలుండదు కదా! కనుక; ఇచట మూడాశ్రమములు చెప్పబడు చున్నవి. తపః ప్రధానములు కనుక ఇచట మూడాశ్రమములు చెప్ప బడుచున్నవి. తపః ప్రధానములు కనుక, వానప్రస్థ సన్యాసములను ఏకముగా పరిగణించుట జరిగినది. ఈ ఆశ్రమము స్వీకరించిన వారిలో - ఎవరు బ్రహ్మనిష్ఠ గలవారైనను, అమృతత్వము చెందుదురు. "బ్రహ్మ సంస్థోఽమృతత్వ మేతి" అని చెప్పబడినది. విష్ణు పురాణము కూడ ఈ ఆశ్రమములను గురించి విపులముగా వివరించి యున్నది. అందువలన, గృహస్థాశ్రమము వలె మిగిలిన ఆశ్రమములు కూడ ప్రామాణికములే యని అంగీకరింపవలసి యున్నది. "త్రయో ధర్మ స్కంధాః" అనుదానినే విధి యనియు వచింపవచ్చు. పితృ హవిర్భాగమును స్రుక్కుకు క్రింద సమిధ నుంచి, తీసికొని వెళ్ళవలె నని చెప్పుచు, దేవతల కైనచో స్రుగ్దండమునకు పైనకదా సమిధ నుంచుట - అని వేదము చెప్పినది! అచట స్రుక్కుకు పైన సమిధ నుంచుట ఎచ్చటను విధించబడి యుండలేదు కనుక, దీనినే విధి యన వలెను. "విధి స్తు ధారణేఽపూర్వత్వాత్" అని సూత్రించినాడు జైమిని. అట్లే, ఇచటను అపూర్వ మైనందున, విధి యనియే చెప్ప

వలె నని సిద్ధాంతి వక్కాణించును. అందువలన, విద్య వల్ల నే పురు షార్థ మని సిద్ధాంతము.

## 2. స్తుతిమాత్రాధికరణము

వేద వాక్యము సన్యాసాది ఆశ్రమ విధాయకమే యని చెప్పి నందున, ఉద్గీథమును రసతమముగా జెప్పు వాక్యము జ్ఞప్తికి వచ్చి నది. అచ్చట ఉద్గీథము రసతమ యని స్తుతించుట తాత్పర్యమా? రస తమత్వమును విధించుటయే తాత్పర్యమా? అను చర్చ కవకాశ మున్నది. కనుక, ఇచట ప్రసంగము సంగతి యని "స ఏష రసానాం రసతమః...య దుద్గీథః" అను వాక్యము - విషయ మని గ్రహింప వచ్చును. ఇచట రసతమ మని ఉద్గీథమును స్తుతించుటయా లేక - ఉద్గీథమునందు రసతమత్వ దృష్టిని విధించుటయా జరుగుచున్నది? అని సంశయ మేర్పడును. ఉద్గీథాదులను వివరించినందున, ఈ వాక్యము తత్ స్తుతిమాత్ర పరమే యని పూర్వపక్షము. అప్రాప్తము కనుక, స్తుతిమాత్రపర మనుటకు అవకాశము లే దని సిద్ధాంతము. ఉద్గీథాది విధానము వెంటనే ఈ వాక్య మున్నచో - స్తుతిమాత్ర పర మని అంగీకరించవలసివచ్చెడిదేమో కాని, ఆ విధముగ లేదు కనుక, క్రతువుకు అవిలంబిత ఫలప్రదత్వ సిద్ధికొరకు ఉద్గీథాదుల యందు రసతమత్వ దృష్టిని ఈ వాక్యము విధించుచున్న దనియే చెప్పవలెను. "ఉపాసీత" అని విధిప్రత్యయముతో నున్న క్రియా పదము - విధేయమునే స్వతాత్పర్యార్థముగ తెలుపునుగదా! కనుక, ఇదియు విధానమే యని సిద్ధాంతము.

## 3. పారిప్లవార్థాధికరణము

విద్యా ప్రసంగమును బట్టి, వానిలో వినబడు ఆఖ్యానకములు స్మరణమునకు వచ్చినవి. విద్య కాకున్నను, ఆఖ్యానములైనను కర్మాక

అంగములు కావచ్చునేమో అను సంశయము రావచ్చును. కనుక, ప్రసంగ సంగతితో ఆఖ్యానకములను ఈ యధికరణమున చర్చించుచున్నారు. కనుక, ఆఖ్యానకములు విషయము. అశ్వమేధములో - "పారిప్లవం శంసతి" అని - పారిప్లవ శస్త్రము విధించబడి యున్నది. "ఆఖ్యానాని శంసంతి" అని, ఆఖ్యానములు కర్మకు అంగములుగా చెప్పబడినవి. కనుక, "ప్రతర్దనో హవై దివో దాసి రింద్రస్య ప్రియం ధామోప జ గామ" దివోదాసుని తనయుడు ప్రతర్దనుడు. ఇంద్రుని లోకమునకు వెళ్ళినాడు' ఇత్యాది ఉపనిష దాఖ్యానములును కర్మాంగములే. కాని, విద్యా ప్రదర్శనార్థములు కావని అచ్చట విశేషించి పేర్కొనబడినందున, ఆఖ్యానము లన్నియు కర్మలలో ప్రయోగించునట్టివి కావు - అని సిద్ధాంతము.

అశ్వమేధములో మొదటి రోజు - "మను ర్వైవస్వతో రాజా" ఇత్యాది ఆఖ్యానములు చెప్పవలె నని ఉన్నది కదా ! కనుక, ఆ ఆఖ్యానములే అచ్చట వినియోగపడుచున్నవి. కనుక, ఆఖ్యానము లన్నియు కర్మశేషము లనుటకు వీలు లేదు. మ రేమనగా - విద్యా విశేష ప్రదర్శనార్థమే ఔపనిషదాఖ్యానము. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" ఇత్యాదులతో ఏక వాక్యత యున్నందున, "సోఽరోదీత్" ఇత్యాదులును విద్యా విధానార్థములేకాని, కర్మవిధులలో వినియోగపడునవి కావని గ్రహింపవలెను. అందువలన, ఆఖ్యానము లన్నియు కర్మాంగములు కానక్కర లే దని సిద్ధాంతము.

## 4. అగ్నీంధనాద్యధికరణము

పురుషార్థాధికరణమునకు పిమ్మట - ప్రసంగ వశమున రెండు అనేకరణములు ఏర్పడినవి. విద్య కర్మలకు అంగము కాదు కాని, పర విద్యకు కూడ యజ్ఞదానాదులు కొన్ని కర్మలు అంగములుగా

నున్నవి. పై యధికరణములలో సన్న్యాసాశ్రమ ప్రసక్తి వచ్చినది గదా! దానితో సన్న్యాసులకు బ్రహ్మవిద్య ఎట్లు ఉపపన్నము? సన్న్యాసులకు యజ్ఞాది కర్మలయందు అధికారము లేదు కదా! అను సందేహమును తొలగించవలసి యున్నందున, అవసర సంగతితో ఈ యధికరణము ఆరంభింపబడుచున్నది.

ఊర్ధ్వరేతస్కులకు గల బ్రహ్మవిద్యాధికారము ఈ యధికరణములో వివరింపబడు విషయము. సన్న్యాసాశ్రమియులకు బ్రహ్మవిద్య ఉపపన్నమా? కాదా? అని సందేహము. యజ్ఞ దానాది కర్మలు సన్న్యాసులకు అనుపపన్నములు కనుక, వానిని అంగములుగా కలిగి యుండెడు బ్రహ్మ విద్య - ఊర్ధ్వ రేతస్కులకు అనుపపన్నము అని పూర్వ పక్షము.

"బ్రహ్మ సంస్థో உమృతత్వ మేతి" "ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి" ఇత్యాదులవలన, గృహస్థాశ్రమేతరములగు ఊర్ధ్వ రేతస్కుల ఆశ్రమములు ఉన్నట్లు అంగీకరించి తీరవలె గదా! వారికి అగ్న్యాధానాది అపేక్ష లేదు. వారి బ్రహ్మ విద్యకు అగ్నిహోత్ర దర్శ పూర్ణ మాసాది కర్మలు కూడ అంగములు కావు. వారి వారి ఆశ్రమ విహితము లగు కర్మలే వారి వారి బ్రహ్మ విద్యకు అంగములు. కనుక, సన్న్యాసాది ఊర్ధ్వ రేతస్కులకు బ్రహ్మవిద్య ఉపపన్నమే అని సిద్ధాంతము.

## 5. సర్వాపేక్షాధికరణము

యజ్ఞాద్యపేక్ష లేకనే ఊర్ధ్వాశ్రమియులకు బ్రహ్మ విద్య ఫలించు పక్షమున, గృహస్థులకును యజ్ఞాద్యపేక్ష అవసరము

లేదేమో నని స్మరణకు వచ్చినది. వారితో గృహస్థులకు యజ్ఞాది అపేక్ష ఉన్న దని నిరూపించుటకు ప్రసంగ వశమున ఈ యధికరణ మారంభింపబడుచున్నది. గృహస్థ బ్రహ్మ విద్యకు యజ్ఞాది అంగ కత్వము ఈ యధికరణ విషయము.

గృహస్థులకు బ్రహ్మ విద్యలో యజ్ఞాది అపేక్ష ఉన్నదా ? లేదా ? అని సంశయము. యజ్ఞాదులు లేకున్నను, పై ఆశ్రమముల వారికి బ్రహ్మ విద్య ఫలమును సాధించజాలనందున, ఎవరి బ్రహ్మ విద్యకును యజ్ఞాది అపేక్ష లేదు - అని పూర్వ పక్షము.

గృహస్థులకు అగ్న్యాధాన మున్నందున, వారి బ్రహ్మ విద్యకు యజ్ఞాది నిత్య నైమిత్తికము లగు సకల కర్మల అపేక్షయు ఉన్న దని సిద్ధాంతము. "త మేతం వేదానువచనేన...యజ్ఞేన దానేన తపసా ఽనాశకేన" అని శ్రుతి - యజ్ఞాదులకు వేదన సాధనత్వమును చెప్పు చున్నది. ఇచట వేదన మనగా - కేవలము వాక్యార్థ జ్ఞాన రూపము కాదు. ఉపాసన రూప మనియే సిద్ధించుచున్నది. లఘు సిద్ధాంతమున ఈ విషయమును విశేషముగ పరిశీలించవచ్చును. అశ్వమును వాహన ముగా నుపయోగించుకొనుటకు - జీను, కళ్లెము మొదలగు పరికర ములు ఎంతగా అవసరములో - ఈ బ్రహ్మ విద్యకును యజ్ఞాది నిత్య నైమిత్తిక కర్మలు అంతగా ఆవశ్యకము లని సూత్రకారుడు పలుకును. యజ్ఞాదులను విడువరాదని భగవద్గీతయు బోధించుచున్నది. అందు వలన, గృహస్థునకు బ్రహ్మోపాసనలో - నిత్య, నైమిత్తిము లగు సకల కర్మలు ఆవశ్యకములే యని సిద్ధాంతము.

## 6. శమ దమా ద్యధికరణము

బ్రహ్మ విద్యకు యజ్ఞాదులు అంగము లనగా - శమ దమా దులును స్ఫురణకు వచ్చినందున, ప్రసంగ సంగతితో ఈ యధికరణ

మారంభింపబడుచున్నది. గృహస్థుని బ్రహ్మ విద్యకు కర్మలు అంగము లైనచో - శమ దమాదులు కా వేమో అను సందేహమును తొలగించుటకు శమ దమాదుల అంగత్వమును ఈ యధికరణము నిరూపించుచున్నది. కనుక, శమ దమాది అనుష్ఠానము ఈ యధికరణ విషయము.

బాహ్య కరణ సాధ్య కర్మ లనుష్ఠింపవలసిన గృహస్థునకు - ఇంద్రియ సంయమన సంపాద్యము లగు శమ దమాదులు ఆవశ్యకములు కావేమో అని సందేహము. బాహ్యకర్మవ్యగ్రు లగు వారికి వాస్తవముగా శమ దమాది సంపాదనము ఆయాస సాధ్యమే కదా ! అందువలన, గృహస్థునకు శమ దమాది అనుష్ఠానావసరము లే దని పూర్వ పక్షము.

"తస్మా దేవం విచ్ఛాంతో దాంతః" ఇత్యాదిగా - బ్రహ్మ విద్యాంగములుగ శమ దమాదులు విధింపబడి యున్నందున, గృహస్థునకు కూడ బ్రహ్మవిద్యాంగములుగా శమాదులు ఉపాదేయములే యని సిద్ధాంతము. ఐనచో - ఇంద్రియ వ్యాపార రూపములు కదా కర్మలు ! శమాదులు ఇంద్రియ వ్యాపార ఉపరతి రూపములు. మరి - పరస్పర విరుద్ధము లగు వీని అనుష్ఠానము గృహస్థునకు ఎట్లు ఉపపన్నము కాగల దని ఆశంకించవలసిన యవసరము లేదు. చిత్త సమాధాన మూలమున విద్యకు ఉపయోగపడునవిగా విధింపబడిన కర్మల యందు ఇంద్రియ ప్రవృత్తియు, ప్రయోజనము లేని వానినుండి ఇంద్రియములకు నివృత్తియు సంపాదింపవచ్చును. కనుక, ఇచట పరస్పర విరుద్ధ ప్రసక్తి లేదు. కర్మలు భగవదారాధన రూపములు కనుక, దానితో ప్రసన్నుడైన పరమాత్మ - ప్రసాదముతోనే కర్మవాసనయు నశించిపోగలదు. కావున, కర్మిష్ఠులకు శమ దమాదులు అసంభావితము

అని భావింపరాదు. ఇట్లు బ్రహ్మవిద్యానిష్ఠుడగు గృహస్థునకు శమ దమాదులు ఉపాదేయము అని సిద్ధాంతము.

## 7. సర్వాన్నానుమత్యధికరణము

బ్రహ్మ విద్యయే పురుషార్థ సాధకము. దానికి యజ్ఞాదులు శాస్త్ర చాశ్రమ కర్మలు, శమ దమాదులు కూడ అంగములే యని నిరూపింప, ప్రాణవిద్యా నిష్ఠున కున్నట్లు, బ్రహ్మవిద్యా నిష్ఠునకు కూడ సర్వాన్నానుమతి ఉండవచ్చునా ? అని స్ఫురణకు వచ్చి నందున, ప్రసంగ వశమున ప్రాణవిద్యా నిష్ఠుని సర్వాన్నానుమతియు విషయముగా ఈ యధికరణమున వివరింపబడుచున్నది. ప్రాణవిద్యా నిష్ఠునకు వలె బ్రహ్మవిద్యానిష్ఠునకును సర్వ అన్నానుమతి ఉన్నదా ? లేదా ? ఈ సర్వాన్నానుమతి ప్రాణాపాయదశలోనా ? లేక - జీవిత కాల మంతయునా ? అని సందేహము.

"సహ వా ఏవం విది కించన అనన్నం భవతి" ప్రాణవిద్యా నిష్ఠునకు తినకూడ దనియెడిది లేదు' అని శ్రుతి చెప్పుచున్నది. అంతే కాని, ప్రాణాత్యయాది సమయ విశేషమును ఏమియు చెప్పుటలేదు. కనుక, జీవితకాల మంతయు ప్రాణవిద్యా నిష్ఠుడు ఏమిమైనను భుజింపవచ్చును. వీని వలెనే బ్రహ్మవిద్యా నిష్ఠుడును' అని పూర్వ పక్ష మేర్పడును.

ప్రాణాత్యయ సమయమునందే సర్వాన్నానుమతి బ్రహ్మవిద్యా నిష్ఠునకు శ్రూయమాణ మగుచున్నది. ఛాందోగ్యములోని ఉషస్తి కథ మన కీ విషయమును తెలుపును.

ఉషస్తి గొప్ప బ్రహ్మవిద్యా నిష్ఠుడు. వడగండ్ల వానతో కురుదేశమున దుర్భిక్ష మేర్పడినడుపు ఈ ఉషస్తి - తన భార్యతో

పాటు మావటివాం డుండు ఒక పల్లె వద్ద ఉన్నాడు. ఆకలితో ప్రాణ సంశయ పరిస్థితి ఏర్పడినది. బ్రహ్మవిద్యా నిష్పత్తి కొరకు ప్రాణము లింకను ఉండవలెను. అందువలన అతడు ఒక మావటివాని ఉచ్ఛిష్ట కుల్మాషము లడిగి పుచ్చుకొని, కొన్ని ఆరగించి, మరి కొన్నింటిని భార్య కొసంగినాడు. ఆ మావటి మంచినీ రీయగా - నీరు నీ ఉచ్ఛిష్టము కదా ! పనికిరా దన్నాడు. కుల్మాషములు ఉచ్ఛిష్టములే యయ్యును - వానిని భుజింపనిచో ప్రాణము నిలుచున్నట్లు లేనందున భుజించితినయ్యా ! నీరు త్రావినచో - నేను నిషిద్ధ కార్య మొనరించినట్లు కావచ్చును - అని యనును ఉషస్తి. దీనితో మనకు తెలిసిన విషయ మే మనగా - నిషద్ధ భక్షణముకూడ బ్రహ్మవిద్యా నిష్ఠునకు ప్రాణాత్యయ సమయముననే అనుమతించబడును అని.

“ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః” అని బ్రహ్మవిద్యోత్పత్తికి ఆహార శుద్ధి సాధనముగా చెప్పబడుచుండ, బ్రహ్మవిద్యా నిష్ఠునకు యథేష్ట సర్వాన్నానుమతి సర్వకాలములందును ఉన్న దనుట ప్రబల విరుద్ధము బ్రహ్మవిద్యా నిష్ఠునకే లేనియపుడు - ప్రాణవిద్యా నిష్ఠునకును ప్రాణాత్యయేతర సమయములలో - సర్వాన్నానుమతి లేదనియే స్పష్ట మగును. బ్రహ్మవిద్యా నిష్ఠునకు కాని, ఇతరులకు కాని ప్రాణ సంశయ కాలముననే సర్వాన్నానుమతి స్మృతిప్రోక్తము కూడ. “ప్రాణ సంశయ మాపన్నో యోఽన్న మత్తి యత స్తతః । లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా” అనియు, “తస్మా ద్బ్రాహ్మణః సురాం న పిబతి పాప్మనా నోత్సృజం ఇతి” అనియు - శ్రుతి వాక్యము కూడ, యథేష్టాన్నానుమతిని నిషేధించుచున్నట్లే కదా ! పాప స్పర్శ కూడ దను భావముతో బ్రాహ్మణుడు చేయ డని పై వాక్యమున కర్థము. దీనితో - సురాపానాదికము పాప జనకము కనుక, నిషిద్ధ మనియే కదా స్పష్టము ! అందువలన, ప్రాణవిద్యా

నిపుణునకును, బ్రహ్మవిద్యా నిష్ఠునకును కూడ, సద్వ్యాన్నానుమతి ప్రాణాత్యయాది రూప మగు పద రూప ద్విషయకమే యని సిద్ధాంతము.

## 8. విహితత్వా ధికరణము

యజ్ఞాది కర్మల ప్రసంగమును బట్టి, ఆ కర్మలు బ్రహ్మవిద్యకే అంగము లైనందున, సాధారణ గృహస్థులు ఆచరించవలసిన యవసరము లేదేమో - అని తోచును. అందువలన, ఆ విషయమును ఈ యధికరణము నిర్ణయించుచున్నది. మధ్యలోని యధికరణములు శిష్య జిజ్ఞాసా పూర్తి కొరకు అవాంతర ప్రసంగములుగా ఆరంభించబడినవి. మరియు - ఈ యధికరణము అవసర సంగతితో ఆరంభమైన దన వచ్చును. యజ్ఞాది కర్మలు ఈ యధికరణ విషయము. ఈ కర్మలు బ్రహ్మవిద్యా నిష్ఠులు కాని గృహస్థులు కూడ ఆచరించవలెనా? లేదా? అనునది సందేహము. ఆచరించవలసిన యవసరము లేదని పూర్వ పక్షము. ఏ మనగా - విద్యాంగములు అని కదా నిర్ణయించినారు! విద్య - మోక్ష రూప మగు ఫలము కోరి అనుష్ఠించునది. త దంగము లగు యజ్ఞాదులను కూడ మోక్ష రూప మగు ఫల కామన కలవారే అనుష్ఠింతురుకాని, గృహస్థు లందరు అనుష్ఠింప వలసిన యవసరమే లేదు కదా యని పూర్వపక్ష సారము.

మోక్ష కామన లేని గృహస్థులు కూడ అనుష్ఠించవలసినవియే యజ్ఞాది కర్మలు. ఏ మనగా - విద్యాంగములుగా మాత్రమే గాక, ఆశ్రమ ధర్మములుగా కూడ ఇవి విధించబడి యున్నవి. "యావ జ్జీవ మగ్నిహోత్రం జుహోతి" అని - జీవించియున్నచో చాలును చేసి తీరవలె నని నిత్య కర్మలుగా కూడ విధించబడి యున్నందున, యజ్ఞాది

కర్మలు బ్రహ్మవిద్యా నిష్ఠ లేని గృహస్థులకు అనుష్ఠేయములే యని సిద్ధాంతము.

"త మేతం వేదాను వచనేన...యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" అని, విద్యాంగములుగను కర్మలు విధించబడి యున్నవి. ఇంతమాత్రమున విరోధ మేమియు లేదు. అగ్నిహోత్ర హోమము జీవన నిమిత్తకముగా అవశ్యాచరణీయ మగు నిత్య కర్మ యున్నది. స్వర్గ సాధనముగా కూడ విధించబడి యున్నది. ఇంతమాత్రమున - ఇవి వేరు, విద్యాంగములు వేరు - అనియు భావింపవలసిన యవసరము లేదు.

యజ్ఞాది శబ్దముల చేతనే విద్యా సందర్భము నందును ఆశ్రమ కర్మ విధాన సంద్భరము నందును పేర్కొనబడుచున్నవిగదా ! అవి పరస్పర భిన్నము లనుటలో ప్రమాణ మేమియు లేదు. "ధర్మేణ పాప మపనుదతి" విద్యా ప్రతిబంధక మగు పాపమును ధర్మమే తొలగించవలె కదా ! యజ్ఞాది ధర్మానుష్ఠానముతో - విద్యా ప్రతిబంధక మగు పాపములు నశించి, శుద్ధమైన మనస్సు నందు విద్య వృద్ధి జెందు నని గృహస్థాశ్రమ నిష్ఠునకును అనుష్ఠేయములే యని స్పష్ట మగుచున్న దని సిద్ధాంతము.

## 9. విధురాధికరణము

యజ్ఞాదులు ఆశ్రమ ధర్మములు, విద్యాంగములు కూడ. అవి పరస్పర భిన్నములు కావు - అని చెప్పుచుండగా, భార్య లేని వ్యక్తి యజ్ఞాది కర్మలలో అధికారము లేనివా డగుట వలన, బ్రహ్మ విద్యయందును వానికి అధికారము లే దనవలెనా ? అను విషయము ఈ యధికరణమున ప్రసంగ సంగతిగా ఆరంభింపబడుచున్నది.

విధురునికి బ్రహ్మవిద్యాధికారము కలదా? లేదా? అని సంశయము. విద్యకు ఆశ్రమ ధర్మములు అంగములు కదా! విధురుడే యాశ్రమమునకు జెందినవాడు కాడు. కనుక, దానికి ఆశ్రమ ధర్మానుష్ఠానము లేదు. అయినచో - ఆశ్రమ ధర్మములు అంగములుగా నుండు బ్రహ్మవిద్యయందు అధికారముకూడ నుండ దని పూర్వపక్షము.

ఆశ్రమము లేనివారికిని బ్రహ్మవిద్యానిష్ఠ కానవచ్చుచున్నది. రైక్వ భీష్మ సంవర్త ప్రభృతి మహానుభావులు అనాశ్రములు. ఐనను, వారికి బ్రహ్మవిద్యానిష్ఠ యున్నట్లు కదా వినుచున్నాము! సన్యాసులకు యజ్ఞాదు లవసరము లేనట్లు, విధురులకు ఏ ఆశ్రమ ధర్మముల అవసరము లేకనే బ్రహ్మవిద్య కొనసాగవచ్చు. జపోపవాస దాన దేవతారాధన ప్రభృతి - కర్మలు అనాశ్రములకు అనుపపన్నములు కావు, స్మృతి ప్రోక్తములు కూడ. "జప్యే నాపి చ సంసిద్ధేత్" అని కదా మను స్మృతి చెప్పుచున్నది.

అంతియ కాదు. "తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయా ఆత్మాన మన్విష్య" అని శ్రుతియు - ఆశ్రమ నియతములు కాని వానితో - బ్రహ్మవిద్యా నిష్పత్తిని ఉపదేశించుచున్నది. ఐనచో - ఆశ్రమ మేదియు లేని స్థితి మంచిది కాదు. "అనాశ్రమేన, తిష్ఠేత్తు దిన మేక మపి ద్విజః" అని, దక్ష స్మృతి - అనామ స్థితిని నిషేధించుచున్నది. బ్రహ్మచర్యమును ముగించినంతనే వైరాగ్య మున్నచో - సన్యాసము, వైరాగ్యము లేనిచో - వివాహము చూచుకొనవలెను. భార్య గతించినను - ఇట్లే సన్యాసము కాని, పున ర్వివాహముకాని కానవలెను. కన్య లభించని పక్షము - ఆపద్విషయము. అపుడు అనాశ్రమిగా నుండవచ్చు. ఇంతకును - అనాశ్రములకు కూడ బ్రహ్మవిద్యాధికారము కల దనియే సిద్ధాంతముగ ఫలించినది.

# 10. తద్భూతాధికరణము

అనాశ్రమత్వమునుబట్టి, ఆశ్రమ భ్రష్టులు కూడ స్ఫురణకు వచ్చుట వలన, ప్రసంగ సంగతితో ఈ యధికరణ మారంభింపబడు చున్నది. నైష్ఠిక బ్రహ్మచారులు, వానప్రస్థులు, సన్యాసులు - వీరు తమ ఆశ్రమ విరుద్ధము లగు ధర్మము నాచరించి, ఆశ్రమ భ్రష్టు లని పించుకొందురు. వీరికి బ్రహ్మవిద్యాధికారము కలదా ? లేదా ? అని చర్చించుట - ఈ యధికరణ విషయము.

ఆశ్రమ భ్రష్టులకు కూడ బ్రహ్మవిద్యాధికారము కలదా ? లేదా ? అని సంశయము. ఆశ్రమ ధర్మములు ఆవశ్యకములు కావని పై యధికరణమున సిద్ధాంతము చేసినందున, వీరికి ఆశ్రమ ధర్మాను ష్ఠానము లేకున్నను, బ్రహ్మవిద్యాధికారము ఉండవచ్చు - అని పూర్వపక్షము.

కాని, ఆశ్రమ స్వీకారానంతరము స్వాశ్రమ ధర్మానుష్ఠానము నుండి మరలరాదని - "సత్య స్యాగ్నిం న పున రావర్తయేత్" ఇత్యాది శాస్త్ర వచనములు వివరించుచున్నవి. అందువలన, విధు రాదుల వలె నైష్ఠికాదులు ఆశ్రమ రహితులుగా నుండుటకు వీలు లేదు. ఆశ్రమ స్వీకారము చేసి, పతితులైనవారికి ప్రాయశ్చిత్తము కూడ లే దందురు. "ఆరూఢో నైష్ఠికం ధర్మం య స్తు ప్రచ్యవతే ద్విజః। ప్రాయశ్చిత్తం న పశ్యామి యేన శుద్ధ్యేత్ స ఆత్మహా" అని - దీనికి ప్రమాణము. ప్రాయశ్చిత్తము ఇట్టివారికి లే దని కదా శాస్త్రకారులు చెప్పుచున్నారు !

ఐనచో - ఆశ్రమ చ్యుతి మహాపాతకములలో లెక్కించబడ నందున, ఉపపాతక మనవలెను. దీనికి ప్రాయశ్చిత్త మున్నదను. బ్రహ్మచారికి మధ్వశనము నిషిద్ధముగా తెలియుచున్నది. "ఉత్తరేషాం చైతదవిరోధి" అని, గౌతమ ధర్మ సూత్రము నైష్ఠికాదులకు ప్రాయ శ్చిత్తము చేసికొని, బ్రహ్మవిద్యయందు అధికరించవచ్చును కదా! అని తలచరాదు. అది ఏ పాతకమైనను, బ్రహ్మవిద్యాధికారమునుండి వారు బహిష్కృతులే తప్ప, బ్రహ్మవిద్యాధికారము ఉండ దని బాదరాయణుడు ఉపదేశించును. పాపక్షయార్థము ఏదేని ప్రాయ శ్చిత్తము ఉపయోగింపబడినను, మరల ఆశ్రమ కర్మానుష్ఠానానుగుణ శుద్ధిని సంపాదించెడి ప్రాయశ్చిత్తము లేదు. "ప్రాయశ్చిత్తం న పశ్యామి" అని - స్మృతికారులు చెప్పుటయే కాదు - శిష్టులును ఆశ్రమ భ్రష్టులకు బ్రహ్మవిద్య నుపదేశింపరు. అందువలన, ఆరూఢ పతితులకు బ్రహ్మవిద్యాధికారము లే దని సిద్ధాంతము.

## 11. స్వామ్యధికరణము

ప్రసంగ వశమున ఏర్పడిన అధికరణముల యనంతరము మరల ఉద్గీథాది ఉపాసన సంబంధ మగు అంశము చెప్పవలసి యున్నందున, అవసర సంగతితో ఈ యధికరణము ఆరంభించబడుచున్నది. దీని యందలి విషయము ఉద్గీథాది ఉపాసనలే. ఇవి క్రత్వంగము లగు ఉద్గీథాదులకు సంబంధించినవి. ఈ ఉపాసనము చేయవలసినది యజ మానియా? లేక - ఋత్విక్కా? అనునది సందేహము. ఇచట ఆత్రేయ మహర్షి మతమును పూర్వపక్షముగా, ఔడులోమిమహర్షి మతమును సిద్ధాంతముగా ఉపదేశించుచున్నారు సూత్రకారుడు.

వేదాంతమున ఉపాసన చేయువానికే కదా మోక్షరూప మగు ఫలము శ్రుత మగుచున్నది! అట్లే, క్రతు ఫల విలంబాభావ రూప

మగు ఫలము కూడ యజమానికే కనుక, యజమానియే ఉద్గీథాది ఉపాసన చేయవలసినవాడు. ఉద్గాత గానము చేయు ఉద్గీథమునందు రసతమత్వ అనుసంధానము యజమాని చేయ వీలగును గదా ! అందువలన, ఆత్రేయుని మతమున ఉద్గీథాది ఉపాసనలు యజమాన కర్తృకములుగనే యుండు నని యేర్పడును.

ఔడులోమి - ఈ ఉపాసనము ఋత్విక్ కర్తృకములే యని సిద్ధాంతము చేయుచున్నాడు. ఫల సాధన మగు సాంగ క్రతు నిర్వ హణార్థముకదా ఋత్విక్కు యజమానునిచేత తరించబడు చున్నాడు ! "ఋత్విజో వృణీతే" అని శ్రుతి - ఋత్విక్కులద్వారా క్రతు నిర్వహణమును అనుమతించుచున్నది. కనుక, అచ్చట యజ మానికి శక్తి యున్నదా ? లేదా ? అను విచారమే ఆవశ్యకము కాదు. క్రతువుకు సంబంధించిన సర్వ విషయములు ఋత్విక్కుల చేతనే నిర్వహింపబడుచుండును. ఫలము యజమానికి లభించును. శ్రుతి అట్లు అచ్చట చెప్పుచున్నది. వేదాంతమునందలి దహరాది ఉపాసనలకు ఋత్విగ్వరణము శ్రుతము కాలేదు. అందువలన - "శాస్త్ర ఫలం ప్రయోక్తరి" అను న్యాయమునుబట్టి, ఉపాసన చేసిన వానికే ముక్తి ఫలము. ఇచట ప్రత్యేకించి ఋత్విక్కులు పేర్కొనబడి యున్నందున, ఉద్గీథాది క్రత్వంగములకు సంబంధించిన ఉపాసనలు ఋత్విక్కులు చేయవలసినవే కాని, యజమాని కాదని సిద్ధాంతము. ఈ సిద్ధాంతము ఔడులోమికిని అభిమత మైనందున, ఆదరముతో అయన పేరును ఎత్తి చెప్పుచున్నాడు సూత్రకారుడు.

## 12. సహకార్యంతర వి ధ్యధికరణము

బ్రహ్మవిద్యాంగములను విచారించు ఈ అంగ పాదమున ప్రసంగ వశమున చెప్పవలసినవానిని వరుసగా చెప్పి, అవసర సంగతితో

ఈ యధికరణ మారంభించుచున్నాడు. బృహదారణ్యకోపనిష త్తులో - "తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠా సేత్, బాల్యం చ పాండిత్యం చ నిర్విద్య అథ మునిః" అని, బాల్య పాండిత్య ప్రాప్తికి పిమ్మట ముని కావలయు నని చెప్పబడి యున్నది. ఈ వాక్యము యొక్క అర్థమే ఈ యధికరణమునకు విషయము.

ఇచట మౌనము కూడ విధించబడుచున్నదా ? లేదా ? అని సంశయ మేర్పడును. మౌనమునకు సంబంధించిన విధి ఏదియు కాన రాలేదు. కనుక, మౌనమునకు విధి కాదని పూర్వపక్షము. ఎనచో - పైన పాండిత్యము విధింపబడి యున్నది. పాండిత్య మైనను, మౌన మైనను జ్ఞానమే కదా ! కనుక, పైన విధించబడిన పాండిత్యమే మౌన పదముచేత అనువదించబడున దని పూర్వపక్ష సారము.

యజ్ఞ తపో దానాదుల వలె, శమ దమాదుల వలె బ్రహ్మ విద్యకు అంగముగా బాల్య పాండిత్యములతోపాటు - మౌనముకూడ విధించబడుచున్న దని సిద్ధాంతము. ఎనచో - మౌన మనగా - శ్రుతార్థమును మనస్సులో దృఢముగా ప్రతిష్ఠించుకొనుటకొరకు చేయవలసిన మనన రూప మగు పాండిత్యమే అని పూర్వపక్షి అను కొని - "అథ మునిః" అనునది అనువాదమే యని చెప్పియున్నాడు. కాని, ఇచట ముని శబ్దము గొప్ప విద్యానిష్ఠు లగు వ్యాసాదుల యందును ప్రయోగించుటనుబట్టి, కేవల సాధారణ మనన రూప మగు మౌనమును చెప్పు ననుకొనుట భావ్యము కాదు. ఏమన, ఉపా సనాలంబన మగు పరతత్త్వమును విధించు శబ్దము లేకున్నను, ఇంతకు మున్ను అప్రాప్తము కనుక, ఇచట విధేయముగా స్వీకరించవలసి యున్నది. అందువలన, బ్రహ్మవిద్యా నిష్ఠునకు స్వాశ్రమ ధర్మముల వలె, పాండిత్య బాల్య మౌనములు మూడును అనుష్ఠేయములే.

మౌనము ఆలంబన సంశీలన మైనపుడు, తన్నిష్పత్తి పర్యంతమే ఇతర ధర్మానుష్ఠానము చాలు కదా ! మరి - మౌనమి ఏర్పడిన పిదప, ఇక ఆశ్రమ ధర్మము లగు యజ్ఞ ప్రభృతులలో అవసర మేమి ? నిష్పన్న మౌనము కలవారికి యజ్ఞాదులతో పని లేదను కొనుట శ్రుతి విరుద్ధము. ఛాందోగ్యము - "అభిసమావృత్య కుటుంబే శుచౌ దేశే..." అనుచు, జీవించియున్నంతవరకును యజ్ఞాది ధర్మా నుష్ఠానము ఉండవలసినదే అని చెప్పుచున్నదికదా ! అని ఆశంక కలుగవచ్చును. కాని, ఈ ఛాందోగ్య వాక్యమును చక్కగా అవ గాహన చేసికొనినచో - సమాధాన మేర్పడగలదు. జీవించియున్నంత వరకు గృహస్థుడుగనే ఉండవలె నని పై వాక్యమున నున్నది. బ్రహ్మ విద్యా నిష్ఠునకు ఫలమును చెప్పుచు ఉపసంహరించు సందర్భ మిది. ఈ సందర్భమున ఎవరినో ఒకరిని - అనగా, గృహస్థునో - సన్యాసినో చెప్పక తప్పదు కదా ! అందువలన, గృహస్థుని చెప్పి, ఉపసంహ రించుట జరిగినది. కనుక, తాత్పర్య మే మనగా, ఏ యాశ్రమమునకు చెందినవాడైనను, బ్రహ్మవిద్యాధికారము కల దనియే. ఇట్లే, "బ్రహ్మణః పాండిత్యం నిర్విద్య" అను ప్రకృత వాక్యము నందును ఈషణాత్రయ పరిత్యాగము, భిక్షా చర్యము మొదలగు సన్యాసి ధర్మములు చెప్పుటయు - సర్వాశ్రమ ధర్మముల ప్రదర్శనార్థమే యని భావించవలసి యున్నది. ఏ మన, "త్రయో ధర్మ స్కంధాః" అని, సర్వాశ్రమస్థులకును బ్రహ్మవిద్యాధికారము చెప్పబడి యున్నది కదా ! అందువలన, ఇచట సర్వాశ్రమ ధర్మముల వలెనే బ్రహ్మవిద్యా నిష్ఠునకు అనుష్ఠేయముగా బాల్య పాండిత్యములతోపాటు - మౌనము కూడ విధించబడి యున్న దనియే అంగీకరించవలసి యున్న దని సిద్ధాంత సారము.

# 13. అనావిష్కారాధికరణము

మౌనము వలె బాల్యము కూడ విద్యాంగముగా ఉపాదేయము కనుక, అవశ్య వక్తవ్య కోటిలో చేరినందున, అవసర సంగతితో ఈ యధికరణ మారంభింపబడుచున్నది. "బాల్యేన తిష్ఠాసేత్" అని, బ్రహ్మవిద్యా నిష్ఠునకు ఉపాదేయముగా చెప్పబడిన బాల్యమును గురించి ఈ యధికరణము చర్చించబడుచున్నది. అందువలన, అది విషయము. బాల్య మనగా - బాల భావము. అది వయో రూపము, కర్మరూపము కూడ కావచ్చును. విద్యా నిష్ఠునకు వయోరూప బాల్యము - అవిధేయము, అనుపకారకము కూడ. కనుక, క్రియా రూప బాల్యమే అనవలెను. అదియు రెండు విధములు. ఒకటి - యథేచ్ఛముగ తినుట, తిరుగుట - మొదలగునది. రెండవది - అమాయకత్వము, దంబము లేకుండుట, తన గొప్పదనమును ప్రకటించుకొనుటకు పాటుపడకపోవుట - మొదలగునవి. ఇచట బాల్య మనగా - యథేష్టాహార విహారాదికమా ? దంభాదులు లేకుండుటయా ? అని సందేహము. కేవలము దంభాది రాహిత్యమే చెప్పుకొనవలె నని ప్రమాణ మేమియు లేదు. కనుక, యథేష్టాహారాదికము కూడ విద్యా నిష్ఠునకు అంగీకరింపవలె నని పూర్వపక్షము.

ఐనచో - "నావిరతో దుశ్చరితాత్..." ఇత్యాదిగా శ్రుతి స్వైరాహార విహారాదికమును విద్యా విరోధిగా పేర్కొనుచున్నందున. ఇచట స్వభావానావిష్కార రూప మగు అమాయకత్వాదికమే గ్రాహ్య మని సిద్ధాంతము.

# 14. ఐహికాధికరణము

అంగముల అనుష్ఠానముతో విద్య ఎపుడు నిష్పన్నము కాగలదో కూడ చెప్పవలసి యున్నందున, అవసర సంగతితో ఈ యధికరణ మారంభింపబడుచున్నది, విద్య ముక్తిని కలిగించగలదు. తదితర ఫలములను గురించియు సాధనము కాగలదు. మరి - ముక్తి కంటెను ఇతర ఫలములను అభ్యుదయ మందురు, ఐహిక మందురు. అభ్యుదయ సాధన మగు విద్యయు, పూర్వకర్మానుష్ఠానము - అనునవి వెంటనే నిష్పన్నము లగునా ? లేక - తరువాత ఎప్పుడేని కావచ్చును కనుక, నియమ మేదియు లేదా ? అనునది సందేహము.

విద్యా నిష్పత్తి విచారము ఈ యధికరణ విషయము. పుణ్య కర్మానుష్ఠానమునకు పిమ్మట విద్య ఉత్పన్న మగుటలో ఆలస్యమునకు కారణ మేమియు కానరానందున, వెంటనే విద్య ఉత్పన్నము కావచ్చు నని పూర్వపక్షము.

కాని, ప్రబల మగు కర్మాంతరము లేవేని ప్రతిబంధకములుగా నున్నచో - వెంటనే విద్యోత్పత్తి జరుగవచ్చును. కనుక, పుణ్య కర్మానుష్ఠానంతరము విద్యోత్పత్తి యను నియమము లే దని సిద్ధాంతము. విద్యాపూర్వకముగా జేసిన కర్మలు - అవిలంబ ఫలప్రదము లగు నని ఉపనిషత్తు - "య దేవ విద్యయా కరోతి" ఇత్యాదిగా పేర్కొనుటను బట్టి, ఆలస్యముగా ఫలప్రదములు కావచ్చు నని తెలియుచున్నది కదా ! ఆ ఆలస్యము ఇతర కర్మ ప్రతిబంధ మూలమున ఏర్పడిన దనవచ్చును. అందువలన, అభ్యుదయ ఫలక మగు

విద్య - పుణ్యకర్మానుష్ఠానానంతరము వెంటనే ఉత్పన్న మగు నని నియతముగా చెప్పజాలము. ఎప్పుడేని జరుగవచ్చును. కనుక, విద్యోత్పత్తిలో - నియమాభావమే సిద్ధాంత మని వక్కాణింతురు.

## 15. ముక్తిఫలాధికరణము

ముక్తిఫలక మగు విద్య ఉత్పన్న మగుటలో - ప్రతిబంధక ములు అంతగా నుండవు. కనుక, ఈ విద్య - కర్మానుష్ఠానానంతరమే, వెంటనే ఉత్పన్నము కావచ్చు నని పూర్వపక్షము.

ఈ యధికరణము కూడ అవసర సంగతితో ఆరభింపబడినది. ముక్తి ఫలవిద్యోత్పత్తియే విషయము. కర్మానుష్ఠానము వెంటనే ఉత్పన్న మగు నని చెప్పవచ్చునా ? లేదా ? అనియే సంశయము.

ఐనచో - ఈ ముక్తిఫలక విద్యయు వెంటనే ఉత్పన్న మగు నని నియమ మేమియు చెప్పరాదు. ఇదియు - అనేకము లగు అప చారములచేత ప్రతిబంధింపబడు అవకాశము కలిగియున్నది కదా ! అని సిద్ధాంతము ఈ యధికరణమున చేయబడినది.



# భగవ త్తత్త్వము - శ్రీ రామానుజ దృక్పథము

'సహజ కవి - విద్యా రత్న'

## శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు



## ధ్యాన శ్లోకములు - మంగళ శ్లోకములు

శ్రీ రామానుజ రచనలలో పెక్కులు - ఒక ధ్యాన శ్లోకముతోఁగాని, లేక - మంగళ శ్లోకముతోఁగాని ఆరంభ మగును. దీని యుద్దేశ మే మనఁగా - గ్రంథమును మంగళ ప్రదముగా మొద లిడి, భగవంతునియందును, ఆచార్యునియందును భ క్తి భావమును తెలియఁ జేయుటయేగాక, ఆ గ్రంధ సారమునుఁగాని, దాని ముఖ్యోద్దేశమునుఁ గాని వివరించుటయే. శ్రీ రామానుజుల రచనలలో నాలుగు - భగ వంతుని సంబోధించెడి మంగళ శ్లోకముతో ఆరంభ మగును. మఱి మూఁడు - యామునాచార్య స్తుతితోడను, వేదార్థ సంగ్రహము ఉభయ రీతులుగను ఉన్నది. శ్రీభాష్యమున, వేదాంత సూత్ర కర్త యైన వ్యాసుని స్తోత్రము ద్వితీయ శ్లోకముగా నున్నది.

శరణాగతి గద్యమునకును, శ్రీరంగ గద్యమునకును మంగళ శ్లోకములు లేవు. అయినను, వాని మొదటి పేరాలు - తాదృశమైన విధానమునే అనుసరించుచున్నవి. నిత్య గ్రంథమునకుఁగూడ మంగళ శ్లోకములు లేవు. కాని, అది యింకొక రకమైన రచన. ఏల యన,

అది సిద్ధాంత గ్రంథము కాదు. నిత్యానుష్ఠానము నుపదేశించు చిన్న పొత్తము. యామునాచార్యుల గీతార్థ సంగ్రహము ననుసరించిన శ్రీరామానుజ గీతా భాష్యమునందలి ఉపోద్ఘాతము - నారాయణు నకు అదనముగా నివేదించిన శ్లోకముల కర్తవ్యమును నెరవేర్చుచున్న దని తలంపవచ్చును.

శ్రీ రామానుజ విరచితములైన నాలుగు మంగళ శ్లోకములు - వేదాంత దీపము నందును, వేదాంత సారము నందును కానవచ్చును. భగవత్తత్త్వమును ప్రస్ఫుటింపఁజేయు ఈ నాలుగు శ్లోకముల తాత్ప ర్యములును - ఈ క్రింద ఉల్లేఖింపఁబడుచున్నవి :—

1. అనంతమైన, కల్మష రహితమైన అధ్యాత్మిక - అధిభౌతిక కల్యాణ గుణ యుక్త మగు మహా నిధియు, సత్త్వగుణ సంపన్నుఁ డును, సృష్టికి మూలాధారమై, ఆదిశేషునియందు పవళించిన విష్ణు భగవానునకు నమస్కారము.

2. లక్ష్మీ నిలయుఁడును, వేద సమామ్నాయమునకు మకు టాయమానము లగు ఉపనిషత్తులలో తేజోమయుఁడుగా వర్ణింపబడి, సృష్టి స్థితి లయములకు కారణభూతుఁడై, విధేయు లగు వివిధ జీవు లను పోషించి రక్షించుటకు బద్ధ కంకణుఁడై యున్న భగవంతుని యందు నాకు భక్తి భావము కలుగుగావుత !

3. శ్రియఃపతియు, అనంతుఁడును, కల్యాణ గుణ సంపన్నుఁ డును, అవాఙ్మానసగోచరుఁ డయ్యును - భక్తుల మనో నేత్రమునకు గోచరించువాఁడును అగు ఆది పురుషుని పాద పద్మముల పరిచర యందు - నా మనస్సు గాఢముగా లగ్న మగు గావుత!

4. శ్రీ దేవితోఁ గూడిన, అణు మాత్రము మాలిన్యము లేని, సర్వాత్మకుఁడైన ఆధ్యాత్మిక - అధిభౌతిక తత్త్వములు గల విష్ణు భగవానునకు నమస్కారములు.

కల్యాణ గుణ గణ సంపన్నుఁడు, సమస్త ఆధ్యాత్మిక - అధి భౌతిక తత్త్వముల శేషి, శేషశాయి - అని వేదార్థ సంగ్రహము నందును, పరమాత్మ బ్రహ్మము, శ్రీనివాసుఁడు, సృష్టి స్థితి లయ కారణుఁడు, ఉపనిషత్తులలో మహోన్నతముగా వర్ణింపఁబడిన వాఁడు - అని శ్రీభాష్యము నందును, కల్యాణ గుణ గణ పరి పూర్ణుఁడు, అనంతుఁడు, సర్వదోష హరుఁడు, సర్వోత్కృష్టమైన ప్రధాన పురుషుని స్థానమున నుండువాఁడు, అవాఙ్మానసగోచరుఁడై నను - భక్తుల దృష్టికి గోచరుఁడు - అని వేదాంత దీపము నందును, ఆనంద సాగరుఁడు, నిర్మలుఁడు, సర్వాత్మక - సకల పారమార్థిక - భౌతిక శరీరుఁడు, విష్ణువు, శ్రీయుతుఁడు - అని వేదాంత సారము నందును భగవ త్తత్త్వమును గురించి శ్రీమద్రామానుజులు వర్ణించి యున్నారు.

పరబ్రహ్మము, ఆదిపురుషుఁడు, శ్రీకాంతుఁడైన మహా విష్ణువు, అతఁడు సకల కల్యాణ గుణ సంపన్నుఁడు, కల్మష రహి తుఁడు. సకల దోష రహితుఁడు, ఆత్మలు - స్థూల పదార్థములు నిండిన జగ దంత శ్శరీరి, ప్రభువు, శేషి, అవలీలగా సకల ప్రపంచ మును సృష్టింపఁగలవాఁడు, పోషింపఁగలవాఁడు, లయము గావింపఁగల వాఁడు. ఈ జగత్తున కతీతమైన - సర్వోత్కృష్టమైన తన సామ్రాజ్యము నకు తానే ప్రభువు. అచట ఆది శేషుఁడు మున్నగు నిత్యసూరులచేత నతఁడు భక్తి ప్రపత్తులతో సేవింపఁబడుచుండును. ఆ మహాపురుషుని స్వభావము ఊహాతీతమైనను, వాచామగోచర మైనను - అతఁడు వేద

వేద్యు డగును. భక్తులకు తన దర్శన భాగ్యము నొసంగును. వారిని ఇహములో రక్షించి, పరములో - శాశ్వత మగు తన పదవిని ప్రసాదించుటయే ఆ భగవానుని లక్ష్యము. ఈ లక్షణములే శ్రీ రామానుజ గ్రంథములలో - భగవంతుని దివ్య స్వభావమును గూర్చిన వర్ణనములందు మనకు కానవచ్చును.

## భగవత్తత్వమును గూర్చిన నిర్వచనములు

శ్రీ భాష్య ప్రారంభమున పరబ్రహ్మ యొక్క నిర్వచన మిట్లున్నది :—

బ్రహ్మ మనఁగా - పరమ పురుషుఁడు. అతఁడు సహజముగ సకల దోష రహితుఁడు. అసంఖ్యాకములైన, నిరుపమానములైన అనవధికాతిశయ కల్యాణ గుణ పరిపూర్ణుఁడు. సకల సందర్భము లందును విశిష్ట గుణ సహిత మగు బ్రహ్మము వర్తించును. కాని, ప్రధానమైన స్వభావము నందును, ఇతర లక్షణము లందును ఎవని గొప్పదనము తులనాతీతముగ గలదో - ఆ పరంజ్యోతి యనియే బ్రహ్మము యొక్క ప్రాధాన్యమైన, భావ గర్భితమైన భావము. సర్వేశ్వరుఁడే ఆ పరబ్రహ్మము. శాశ్వత బ్రహ్మ మను పదము - ఆ మహా పురుషుని నిర్దేశించుటకే ప్రయోగింపఁబడినది.

ద్వితీయ సూత్ర వ్యాఖ్యాన ప్రారంభమున - 'దేనినుండి, లేక - ఎవరినుండి' అనునది - ఈ విధముగా నిర్ణయింపఁబడినది :—

ఆ మహా పురుషుఁడు - సర్వ ప్రభువు. నిఖిల ప్రత్యనీక వ్యతిరేకముగా నెవ్వని ప్రధాన స్వభావ ముండునో, ఎవ్వఁడు సత్య సంకల్పుఁడో, ఆ జ్ఞానము, ఆనందము ప్రాధాన్యముగాఁ గల అనంతమైన కల్యాణ గుణము లెవఁడు వహించునో, ఎవ్వఁడు సర్వ వ్యాపియు,

సర్వ శక్తి యుతుఁడును, అపార కరుణామయుఁడో, ఎవ్వని వలన సృష్టి స్థితి లయములు కొనసాగుచున్నవో - అతఁడు పరబ్రహ్మము. అదియే ఈ సూత్రపు సారాంశము.

ఈ విధముగనే శ్రీభాష్యాంతములో నొసంగఁబడిన నిర్వచనము - ఆ సూత్రము నందలి విషయమునకు సంబంధించినదే. ఆ మహా పురుషుని స్వభావమును గూర్చి మనము వేదముల వలననే తెలియఁగలము.

ఆ మహా పురుషుఁడు సకల విశ్వమునకును ప్రభువు. పరబ్రహ్మ మగుటచే, ఇతర జ్ఞానము లన్నింటిచేతను గుర్తింపఁబడిన సకల వస్తువులకు భిన్నమైనవానిగా, సర్వ వ్యాపకత్వము, తన సంకల్ప సాధనము మున్నగు అసమానమైన విశిష్టత గల అప్రమేయమైన లక్షణములు గలవా డనియు, ప్రతి మాలిన్యమునకు విరోధకమైన స్వభావము గలవాఁ డనియు వేదము లతనిని ప్రస్తుతించును.

వేదాంత దీప ప్రారంభములోని నిర్వచనములు - పరమాత్మ జీవాత్మల వ్యత్యాసమును నిశ్చయించును. పరమాత్మ జీవాత్మకు కేవలము విజాతీయము. ఏల ననఁగా - అతఁడు కలుష విదూరుఁడు, కల్యాణ గుణ గణ పరిపూర్ణుఁడు. ఆత్మలను, స్థూల పదార్థములను అన్ని దశలలో వ్యాపించువాఁడు. వాని ధారకుఁడు, నియంత, శేషి.

భగవద్గీతా భాష్యములోని తుది భాగమునందు - విధ్యుక్త నిర్వచనములకు చేరువగా నుండు రెండు ప్రకరణములు గలవు. మొదటిది - ఆస్తిక్యము (వేదములలో అచంచల విశ్వాసము) యొక్క నిర్వచనమున కొంత భాగము (అధ్యా : 18. శ్లో 42). రెండవది - (18 - వ అధ్యాయము 73 - వ శ్లోకము) స్మృతి విజ్ఞాన సారము

నొసంగును. అనఁగా - సర్వేశ్వరుని యందు సహజ దృష్టి పరిణామ మగు భగవ న్మనః ప్రతిబింబము.

భగవానుఁడు పురుషోత్తముఁడు, వాసుదేవుఁడు, దోష వాసనా దూరుఁడు, జ్ఞానము - శక్తి మున్నగు అసంఖ్యాక కల్యాణ గుణములు గలవాఁడు. అవి ఆ మహామహునకు సహజ సిద్ధములు; సాటి లేని ఉత్కృష్టత గలవి. వేదోపనిషత్తుల చేత తెలియఁదగిన నునుఁ డతఁడే. సమస్త విశ్వమునకు కారణ భూతుఁడు, రక్షకుఁడు. సర్వ కార్య సంధాయకుఁ డా మహనీయుఁడే. వేదములు విధించిన ధర్మము లన్నియు అతని పూజకే నియమింపఁబడినవి. ఈ వివిధ ధర్మ ముల ద్వారా పూజింపఁబడి, ప్రార్థనానుసారముగ ధర్మార్థ కామ మోక్ష ఫల రీతిని అతఁడు ప్రసాదించును" - అని, పరబ్రహ్మ పర ముచే విశదపఱచఁబడినది.

పరబ్రహ్మమునకు అనఁగా - పరమ పురుషునకు సమస్త జగత్తు యొక్క సృష్టి స్థితి లయములు లీల. ఆతఁడు సర్వ పాపములకు వ్యతి రేకి. అతని ప్రధాన స్వరూపము సంపూర్ణముగా కల్యాణోపేతము. కల్యాణ గుణ సముదాయ సమేతమైన మహా సముద్రుఁ డతఁడు. ఆ గుణములలో ప్రథమ షట్కము - జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వ ర్యము, వీర్యము, తేజము అనునవి" ఇంచు మించుగా ఈ నిర్వచన ములవంటివే శ్రీ రామానుజులు తమ రచనలలో అచ్చటచ్చట నకార్కణించిన పీఠికల యందలి సారాంశములలోని ప్రథమాధ్యాయ ప్రారంభమున, మొదటి మూఁడు పాదముల ఉపసంహార సమగ్ర స్వీకరణము వానిలో నొకటి.

ఆ భగవంతుని చింతనము మానవుని పరమోన్నత గమ్య స్థానమును, అంతిమ ముక్తిని పొందుటకు సాధనము. అతఁడు సృష్టి

స్థితి లయ కారకుఁడు. అవిద్య మున్నగు భౌతిక వస్తు జాలమునకును, ...నముచే ఉత్తీర్ణులైన జీవులకును బంధములో నున్నను - విముక్తిఁ బొందినను స్వభావములో భిన్నుఁడు. మాలిన్యపు ఛాయా వేశమును లేని వాఁడు. అతఁడు సర్వ వ్యాపి; సర్వ శక్తుఁడు; అనవరత సిద్ధ సంక ల్పుఁడు. సర్వ కల్యాణ లక్షణాత్మకుఁడు. సర్వ జీవుల అంతరాత్మ. అమోఘ వాల్లభ్య యుతుఁడు" అని - ఇట్లు ఆ సూత్రములు బ్రహ్మమును గూర్చి ఉపదేశించి యున్నవి.

జ్ఞానోత్తీర్ణు లగు జీవులును అనేక తరగతుల భౌతిక వస్తువు లును నిండిన జగత్తు యొక్క నిర్మాణమునకు ఎడతెగని యునికికి, నిర్మూలనమునకు ఏకైక కారణుఁడు. సంసారమునకు మూల హేతువు. సకల దోష విదూరు డగుటచేతను, అప్రమేయమైన సంపూర్ణత గలిగి యుండుట వలనను - స్వేతర మైన సర్వ తత్త్వము లకును అతని స్వభావము భిన్నము. అసంఖ్యాకములైన, నిరుపమాన మగు అతిశయము గల కల్యాణ గుణ సందోహము గలవాఁడు. ఉప నిషత్తులలో ఆమూలాగ్రము - 'సర్వాత్మ, పరబ్రహ్మ, పరంజ్యోతి, పరమ సత్త్వము, పరమ పురుషుఁడు' అను వివిధ నామములచే నెఱుంగఁదగినవాఁడు, అని. వేదార్థ సంగ్రహ ప్రారంభమున జీవాత్మ - పరమాత్మలనుఁగూర్చి కొన్ని నిర్వచనము లున్నవి.

పరబ్రహ్మము తన ఆంతరంగికము లగు ప్రధానములైన స్వరూప స్వభావములచేత మాలిన్య దూరుఁడు. అగణితములు, అస మానములు, ఉత్కృష్టములు, స్వభావ సిద్ధములు అగు ఉదార గుణ నాగరుఁడు. కాల పరిణామముచేఁ గల్గిన అనంత సృష్టి స్థితి లయముల వ్యత్యాస స్పర్శ రహితమైన మహా విభూతి గలవాఁడు. క్షణము నుండి యుగ పర్యంత మైన అనంత గుణ పరిమాణ సమేతుఁ డగుట -

అతని స్వభావము. తనలో భాగమేయైన సంసార బంధ విముక్త మగు సూక్ష్మబుద్ధి గల జీవకోటి - తన లీలకు పరికరముగాఁ గలవాఁడు. అట్టులనే, అనంతమైన - అద్భుతమైన - బహుళమైన మార్పులకు ఆలవాల మగు వివేకవంతులకు వినోద సాధనములైన సకల భౌతిక వస్తు సముదాయమును ఆతఁడు వహించును. తనది యగు సర్వ సృష్టికి తానే అధికారి. సకల వస్తు సముదాయము తన శరీరముగాఁ గల వాఁడు" అని వేదార్థ సంగ్రహము నందలి ప్రథమాధ్యాయములో తమ సిద్ధాంతమును వివరించినారు భగవద్రామానుజులు.

పరమ పురుషుఁ డనఁగా - పరబ్రహ్మ; ముక్తి గోరువారి గమ్య స్థానము; అవిద్యాది లోప రహితుఁడు. అసంఖ్యేయములైన, నిరుపమానములైన కల్యాణ గుణములతో గూడియున్నవాఁడు. సర్వోత్కృష్ట మగు గమ్యస్థానము లక్ష్మీ సమేతుఁడైన నారాయణుఁడు - పరబ్రహ్మము, సర్వ సంపూర్ణుఁడు. సకల జగత్కారణుఁడు, సర్వాంతర్యామి, సర్వ వ్యాపకుఁడు, సంకల్ప సిద్ధుఁడు, తన మహా విభూతి సామ్రాజ్యానిచేత. సమస్త పదార్థములు తన శరీరముగా నగుటచేత, అఖిలము లగు ఆధ్యాత్మిక, ఆధిభౌతికములకు హేతుఃభూతుఁ డగు పరబ్రహ్మము, వాసుదేవుఁడు, సర్వశబ్దవాచ్యము, పరమ ప్రధాన భావార్థములుగాఁ గలవాఁడు, అధిపతి, కల్యాణ గుణ సంపన్నతచేత పరతత్త్వము (సర్వేతరాధికుఁడు)" అని, గీతాభాష్యమునందలి కొన్ని ప్రకరణములందును ఉపోద్ఘాతమునందును భగవ తత్త్వమును గురించి వర్ణింపఁబడినది.

## పరమాత్మ స్వభావము యొక్క ఇతర వర్ణనలు

ఒకానొక చర్చా సందర్భమున భగవ త్తత్త్వమునకు సంబంధించిన అనేకము లగు ఇతర వర్ణనములు గలవు. కొంత వఱకు ఇది

వఱకే సూచింపఁబడిన కొన్ని ప్రకరణములలో శ్రీమద్రామానుజులు సంభావించిన భగవ త్తత్త్వము నిరూపింపఁబడినది. ఉపసంహారములను నిర్ధారించుటకుగాని, ఒక తర్క-వాదమును ధృవీకరించుటకు గాని అవి ఉపయోగించును. అయినను, కొన్ని సమయములందు ఈ వర్ణనలు వాదోద్దేశమునే కప్పివేయును.

ఒక ముఖ్య సందర్భ మే మనఁగా - వేద పాఠములు పరమాత్మను, జగత్తుకు గల భేదమును ప్రకటించు - వేదమూల గ్రంథములలోని బాహ్య భేద తీర్మాన మొక పక్షమునను, రెండవ పక్షమున అభేదమునే సమర్థించుట. ఈ రెండు పాఠములకును, మూఁడవది యగు ధ్యాన పద్ధతి పాఠమునకును గ్రహింపఁదగినట్లు తమ వివరణ మాత్రమే యని శ్రీ రామానుజులు నిరూపింతురు. అట్టి ఉత్తమోత్తమ ప్రకరణము వేదార్థ సంగ్రహములో నున్నది. బ్రహ్మము యొక్క నిర్వికల్పత్వమును విచారించు వేద పాదములు - ఆ మహాత్ముని ప్రధాన స్వరూపములో మార్పు లేమిని గ్రహించుటచేతనే అత్యంత ముఖ్యార్థము గలిగి యున్నవి. భౌతిక స్వభావము యొక్క భ్రష్ట గుణ నిరాకరణమునకు సంబంధించి యుండుట వలన, పరమాత్ముని నిర్గుణత్వమును ప్రతిపాదించువారును యథార్థవాదులే. సర్వ పారమార్థిక ఆధిభౌతిక మూల పదార్థములును బ్రహ్మము యొక్క శరీరాంగములే గాన, ఆతని లక్షణములే యని సిద్ధాంతీకరించుటచేత, బహుళత్వమును నిరాకరించువారును, అన్నిటికిని ఆత్మ యగుట వలన - సమస్తమును తన వలె నుండు బ్రహ్మము - ఏకైక సత్యముగ వర్తించు ననువారును దృఢ మగు ఆత్మీయమైన అవగాహనము గలవారే.

అధిపతి, ఈశ్వరుఁడు, సమస్త కల్యాణ గుణ సముపేతుఁడు, సంకల్ప సిద్ధుఁడు మున్నగు లక్షణములను వర్ణించు ప్రకరణములు శ్రీ రామానుజ గ్రంథములలో కొన్ని కలవు, "అన్నిఁటికిని వేత్తైన వాఁడు, సర్వ రక్షకుఁడు, సృష్టి స్థితి లయ కారకుఁడు, దోష రహితుఁడు, నిర్వికల్పుఁడు, అన్నిటికి ఆత్మ యగు పరబ్రహ్మ యొక్క ప్రధాన స్వరూప నిరూపక మగు ధర్మమును నిరూపించుటచేత, అతఁడు కేవలము 'జ్ఞానము', 'ఆనందము' - అను ప్రకరణములు పోషింపఁబడినవి. ఈ నిర్వచనీయ ధర్మము - కల్మష లేశ రహితమైన ఆనంద రూప జ్ఞానమే. కావున, పరమాత్మ యొక్క ప్రధాన స్వరూపము స్వయంప్రకాశక మగుటవలన, పూర్తిగా జ్ఞాన చైతన్యమే. దేహాత్మల సంబంధము - అనఁగా, సమానాధికరణము ఈ పాఠముల ముఖ్య భావములుగ గోచరించుటచేత, ఏకత్వముయొక్క ప్రకటనలు పూర్తిగా సమర్థనీయములు.

శ్రీ రామానుజులు ఇతర విషయములను చర్చించుటలోఁ గూడ, భగవత్తత్త్వమును వర్ణింతురు. పరిమితాత్మలకును, స్థూల పదార్థములకును, పరమాత్మకును భేదము వీనిలో నున్నది. అనఁగా - బ్రహ్మము యొక్క శరీర ధారణము, అవతారములు బ్రహ్మము తన భక్తులకు బహూకరించుట మున్నగు వర్ణనములలో శ్రీ రామానుజులు భావించిన భగవత్తత్త్వము గోచర మగును.

జీవాత్మ యొక్క స్వభావము పరమపురుషునిపై ఆధారపడి యుండు ననియు, సంసార విముక్తి తరువాత, ఆ జీవాత్మ యనుభవించు ఉన్నత భోగముల సనాతనత్వము నధిగమించినను, విముక్తిఁ బొందిన జీవి యొక్క ఆనందమయ స్థితి - పరమపురుషునిపైననే ఆధార పడినది యైనను, భగవానుఁడు స్వతంత్రుఁ డగుటచేత, ఆ విముక్త ప్రాణి మరల సంసారమునకు తిరోగమించుట - అతని యిచ్ఛ కావచ్చు నని శ్రీభాష్యములో చెప్పఁబడినది.

## జన్మ రాహిత్యము

ఒక పరమ పురుషుఁ డున్నాఁడు. అతఁడే పరబ్రహ్మము. అతని స్వభావము పరిపూర్ణ కల్యాణ గుణోపేతము. మాలిన్య లేశము లేనిది, అతఁడు సృష్టి స్థితి లయ కారకుఁడు, సర్వ వ్యాపి, సంకల్ప సిద్ధుఁడు. తనను శరణు జొచ్చిన వారిని క్షమించి కరుణించువాఁడు. అతనితో సమానుఁడుగాని, అతనికంటెను అధికుఁడుగాని లేని పరమోన్నతుఁడు' అని మనకు శ్రుతులవలన తెలియుచున్నది. అదియునుఁగాక, తన భక్తుల సేవకు ప్రీతుఁడైన భగవానుఁడు - కర్మరూపమైన అవిద్యనుండి విముక్తులఁ జేయు ననియు, తన యథార్థ స్వభావ రూపమైన - నిరుపమానమైన - విశిష్టమైన ఆనందమును సాధింపఁజేయు ననియు ఆ భగవానుఁడు నిజముగా సంసార బంధమున త్రోయఁ డనియు వేదముల వలన తెలియుచున్నది.

భక్తుని ధ్యానానురాగముల లక్ష్యము - భగవంతుని శరణు పొందుట' అని, గీతా భాష్యములో - అనేక ప్రకరణములందు విశదీకరింపఁబడినది.

## గీతాభాష్య సూక్తులు

నన్నుఁ గన్గొటకు గల్గు భక్తుని గాఢమైన వాంఛ - నా సేవ యందు అత్యంత ప్రీతినిఁ గల్గించును. అతఁడు నా వియోగమును ఒక్క క్షణ కాలమైనను సహింపఁజాలఁడు. తైల ధార వలె నిరంతరము అవిచ్ఛిన్నముగ నీ మనస్సును నా మీఁద కేంద్రీకరించుము. నేను ప్రభువులకు ప్రభువును, సకల కల్యాణ గుణ సముపేతుఁడను, సర్వ దోష దూరుఁడను.

నా యందు నీ చిత్తము నిల్పుము. నేను సర్వజ్ఞుఁడను. నా సంకల్పము సర్వదా సఫల మగును. సమస్త విశ్వమునకును ఏకైక కారణుఁడను, పరబ్రహ్మను, పరమ పురుషుఁడను. నీ మనస్సు నా మీఁద నిల్పుము. ధవళ పద్మదళములవలె నా నేత్రములు ఆయత ములై, స్వచ్ఛముగా నుండును. నీలమేఘ సదృశముగ దేదీప్య మానుఁడను. ఒక్కపరి నుదయించిన సహస్ర భాస్కర తేజోమయుఁ డను.

నాపై హృదయమును నిల్పుము. నేను నిత్య సౌందర్యా మృతము నిండిన సాగరమును. నాపై మనస్సు నిల్పుము. నా చతు ర్భుజములు దీర్ఘములు, దృఢములు.

నేను పీతాంబర ధారిని. పవిత్ర కిరీటముతోను, తాటంకముల తోను, ప్రవాళ కంఠహారములతోడను, సువర్ణ కంకణములతోడను అనేకము లగు ఆభరణములతోడను అలంకృతుఁడను.

నీ మనస్సును నాపై నిల్పుము, నేను అపారము, ప్రసన్నము అగు అనుగ్రహము, సౌందర్యము, మాధుర్యము, గాంభీర్యము, ఔదార్యము, క్షమాయుక్తమైన ప్రేమ, పక్షపాతము లేని సర్వ జీవుల యాశ్రయ స్థానమును అగు మహా సముద్రమును. నాపై మనస్సు నిల్పుము. నేను సర్వేశ్వరుఁడను.

ప్రపంచములోని మహాద్భుతము లగు ఆధ్యాత్మిక - ఆదిభౌతి కములతోఁ గూడిన వివిధ జీవులకు ఆదికారణము నేను. ప్రతి వస్తువు - నా నుండియే ప్రేరణ పొందుచున్నది. వివేకవంతులు నన్ను - అంతర్గతమైన, అమోఘమైన ఐశ్వర్యశాలిగా, ప్రసన్నమైన అను గ్రహము, సౌందర్యము, క్షమా సహిత మగు ప్రేమ మున్నగు

అనంత కల్యాణ గుణములతోఁడి నా సంబంధము నెఱింగినవారై, నన్ను సేవించునపుడు - ఆ గుణములనే జ్ఞప్తియం దుంచుకొందురు.

**అర్జున స్తుతి :—**

ఆ ఉత్తమ భక్తులు నిన్ను భగవానునిగా, నిన్నే పరమ గమ్యస్థానముగాను, సర్వ విభూతి సంయుక్తుఁడ వనియు, సౌందర్యము, ప్రసన్నము, అనుగ్రహము కలిగిన సంకల్ప సిద్ధునిగను నమ్మి కొల్చుచుందురు.

**భగవానుని వాక్యము :—**

నీవు వెంటనే నా యందు నిశ్చల ధ్యానమును సాధించుటలో జయము గాంచ కున్నచో, అభ్యాస నియమముచేత దానిని పొందుటకు యత్నింపుము. ఇది యెట్లన, విస్తారమైన, పరమోత్తమమైన ప్రేమతో నన్ను మతియం దుంచుకొనుట. నేను అంతర్గతముగా సకల కల్మష వ్యతిరేకిని. సౌందర్యము, ప్రసన్నానుగ్రహము, కనికరము, క్షమా సహిత మగు ప్రేమము, కారుణ్యము, మాధుర్యము, గాంభీర్యము, ఔదార్యము, ధైర్యము, వీర్యము, స్థైర్యము, సర్వవ్యాపకత్వము, నా సంకల్పానుసారము సాధించిన వస్తు స్వాధీనత, సర్వకాల సంకల్ప సిద్ధత గలవాఁడను. సర్వ ప్రాభవ శాలిని. ప్రతి వస్తువుకు ఆది కారణమును.

**అర్జున స్తుతి :—**

ఓ భగవానుఁడా ! నీ వర్ణనమును నీవే యిట్లు కావించితివి. ఓ పురుషోత్తమా ! నే నిప్పుడు ప్రత్యక్షముగా - అనన్య సామాన్య

మైన నీ రూపమును గాంచఁ గోరెదను. నిన్నాశ్రయించువారియందు నీవు క్షమాయుతుఁడవైన ప్రేమసాగరుఁడవు. నీవే ఈశ్వరుఁడవు. అద్వితీయమైనవాఁడవు. సృష్టి స్థితి లయ కారణుఁడవు. కల్యాణ గుణాకరుఁడవు. పరాత్పరుఁడవు.

**శ్రీకృష్ణ భగవానుని విశ్వరూప సందర్శనానంతరము అర్జునుని ప్రార్థనము :—**

అపరిమితమైన వీర్యవంతుఁడవు నీవు. పరాక్రమవంతుఁడవు. నీ శరీరాంగములైన ఆధ్యాత్మిక ఆధిభౌతిక యుక్తము లగు సర్వ భూతములకును ఆత్మవు. అంతటికిని సారాంశము నీవే; మిగిలిన దంతయు నీ యంశ మాత్రమే. ప్రతి నామము నిన్నే సూచించును.

సకల జగములకును నీవు తండ్రివి, అత్యంత పూజార్హుఁడవు. నీ కారుణ్యాది కల్యాణ గుణములచేత నీవు సర్వోన్నతుఁడ వగుట వలన, నీకు సాష్టాంగ దండప్రణామము గావించి, ఆరాధనీయుఁడ వగు నీ యనుగ్రహమును కోరుచున్నాను. అపార కరుణా సాగరా ! వినయముతో బతిమాలుచున్న అపరాధియైన తనయున తండ్రి వలె, మిత్రుని క్షమించు మిత్రుని వలె, ప్రియురాలి ప్రాయుడ్ర నైన నన్ను - ప్రియుఁడవైన నీవు అనుగ్రహింపుము.

గీతా భాష్యము నందలి పై పంక్తులు సైతము - శ్రీమద్రామా నుజుల భగవ త్తత్త్వమును గూర్చి బాగుగా నిర్వానించు చున్నవి.

# చివరి మాట

శ్రీమద్రామానుజులు ఆది శేషాంశా సంభూతులు. శ్రియఃపతికి నివాసముగా, శయ్యగా, ఆసనముగా, ఇంకను అనేక రీతులుగా సేవ గావించి, ఆ భగవానుని యనుగ్రహమునకు పాత్రులైన మహా శీయులు. నిరంతరము శ్రియఃపతి సేవా తత్పరు లగుచు, ఆ భగ వానుని యాజ్ఞచే భూమండలమున నవతరించిన శ్రీమద్రామానుజు లకు - భగవ త్తత్త్వ నిరూపణ కృత్యము కరతలామలకము. అదియే ఆస్తికు లెల్లఱకు పరమ ప్రమాణము. అదియే జిజ్ఞాసువులకు శిరోధార్యము.



# శ్రీమద్రామానుజులు - శరణాగతి గద్యము

'సాహిత్య విద్యా ప్రవీణ'

డాక్టరు : తట్టా విజయరాఘవాచార్యులు, ఎం.ఏ; పిహెచ్. డి.



## అవతారిక

అనాది విధన మైనది వేదము. ఆస్తిక మహా జను లెల్లరును ప్రబల ప్రమాణముగా భావించునది వేదము. ఆ వేదముచే నెఱుంగ బడువాడు (= వేద వేద్యుడు) పరమాత్మ. అట్టి పరమాత్మను ప్రస్తుతించునది వేదము. వేదవేద్యుడైన పరమాత్మ శ్రీరామచంద్రుడుగా అవతరింప, వేదము రామాయణముగా అవతరించెను,[1] అట్టి రామాయణము నందలి రహస్య సారము శరణాగతి. పరమాత్మను శరణు పొంది, మోక్షము నందవలె నని జటాయు - విభీషణ - సుగ్రీవాదుల ద్వారా తెలియజేయుచున్నది రామాయణము. అందువల్లనే రామాయణమునకు - 'దీర్ఘ శరణాగతి' యని పేరు. అట్లే, పంచమ వేద మనబడు మహా భారత సారార్థము కూడ శరణాగతియే. భారతమునకు తలమానికమైన భగవద్గీత యందును పరమాత్మ తెలియజేసినది - మోక్ష సాధనము శరణాగతి యనియే.[2] అట్లే

---

1. " వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా. "

2. " సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. "

శ్రీమద్భాగవతమునందును శరణాగతికి గజేంద్రమోక్షణాది ఉపాఖ్యానములు ఉదాహరణములు.

వేదార్థము నెరిగి, వేదాంత తత్త్వమును ప్రబోధించిన ఆచార్యవర్యులలో ప్రముఖు లగు శ్రీమద్రామానుజులు నవ నిధుల వంటి నవ సంఖ్యాక గ్రంథముల ననుగ్రహించిరి. అట్టివానిలో అత్యంతము ప్రాముఖ్యమును పొందినవి రెండు గ్రంథములు. తత్త్వ నిర్ధారణ పరమైన 'శ్రీభాష్యము' మొదటిది. అనుష్ఠాన పరమైన 'శరణాగతి గద్యము' రెండవది.

## రచనోద్దేశ ప్రయోజనము

శరణాగతి గద్యను రచించుటలో శ్రీ రామానుజ యతీంద్రు లుద్దేశించిన ప్రయోజనమును శ్రీ వేదాంత దేశికు లిట్లు వ్రాక్రుచ్చి యున్నారు :—

" ఆర్తోప చ్ఛందనం గద్యం - భాష్యం తు పర రంజనమ్. "

లోకములో అధికారులు రెండు విధములుగా నుందురు. అగాధము లగు శాస్త్రార్థములను సునిశిత మేధా విలాసముచే మథించి, అర్థ నిర్ధారణ చేయగల ప్రజ్ఞా పాటవములు గలవారు ఒకరు. అంతటి ప్రజ్ఞ లేకున్నను, పెద్ద లుపదేశించిన తత్త్వముపై పూర్ణ విశ్వాసము నుంచి, వైరాగ్య సంపన్నులై, బంధ విముక్తి కొరకు - భగవత్ప్రాప్తి కొరకు అనుక్షణము ఆర్తి నొందు ముముక్షువులు మరియొకరు. అందులో రెండవ వర్గములోనివారిని ఉజ్జీవింపజేయుటకై శరణాగతి గద్యమును శ్రీ రామానుజులు అనుగ్రహించి రనియు, మొదటి వర్గమునకు చెందినవారి మన స్సమాధానము కొరకు యుక్తి

ప్రయుక్తి పూర్వకము, శాస్త్రార్థ జటిలమునైన శ్రీభాష్య గ్రంథ మును సిద్ధాంత స్థాపనా పరముగ ప్రసాదించి రనియూ పై శ్లోక పాదమునకు తాత్పర్యము.

## అవతరణము

శ్రీమద్రామానుజులు శ్రీరంగ క్షేత్రమున వేంచేసియున్న ప్పుడు ఒకనాడు - ఉత్తరఫల్గునీ నక్షత్ర నిమిత్తముగ శ్రీరంగనాయకీ అమ్మవారికి జరుగుచున్న ఉత్సవ కార్యక్రమమును దర్శించుటకై ఆలయమునకు వెళ్ళిరి. అచ్చట మండపముపై అమ్మవారితో పాటు వేంచేసియున్న శ్రీరంగనాథుని సేవించిన సందర్భమున - శ్రీ రామానుజ యతీంద్రుల మనస్సునందు శ్రీవైకుంఠ ధామమునకు వెంటనే చేరవలె నను సంకల్పము కలిగి, ఆ దివ్య దంపతుల సన్నిధిలో తమ మనోరథమును తెలుపుకొనుచు, ద్వయ మంత్రానుసంధాన పూర్వకముగా శరణాగతిని చేసిరి. అప్పుడు ఆ దివ్య దంపతులతో జరిగిన మధుర సంభాషణమునే తమ శిష్య పరంపరకును, అను ష్ఠానమునకు - నిత్యానుసంధానమునకు ఉపయోగించుటకై శ్రీ రామానుజులు ఈ శరణాగతిగద్యరూపమున సంతరించిరి - అని, పెద్దలు ఈ గ్రంథ మవతరించిన విధమును గూర్చి వివరింతురు.

## వ్యాఖ్యానములు - వాని ప్రభావము

శరణాగతి గద్యమునకు రెండు సంస్కృత వ్యాఖ్యా నములు, ఒక మణిప్రవాళ వ్యాఖ్య మాత్రము లభించుచున్నవి. శ్రుతప్రకాశికాచార్యు లయిన సుదర్శనభట్టరువా రనుగ్రహించిన వ్యాఖ్యానము మొదటిది కాగా, వేదాంతదేశికులు విశదీకరించి రచించినది రెండవది. మూడవది - నాలాయిర దివ్య ప్రబంధ

వ్యాఖ్యాత అగు శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళై అనబడు శ్రీకృష్ణసూరి గారిది.

అనంతరము శరణాగతి యొక్క ప్రభావమును వివిధ నామము లతో విశదీకరించుచు వచ్చిన గ్రంథము లనేకములు. అట్టివానిలో నిపుడు కొన్ని కానవచ్చుచున్నవి. క్రీస్తు శకము 12, 13 శతాబ్దము లకు జెందిన (1165 - 1275 A. D.) 'నడాదూరమ్మాళ్' అనబడు వాత్స్య వరదాచార్యులు వ్రాసిన 'ప్రపన్న పారిజాతము' అను గ్రంథమును 1967 లో - శ్రీ విశిష్టాద్వైత ప్రచారిణీ సభా - మద్రాస్ వారిచే ప్రకటితమైనది.

శరణాగతి గద్యకు ప్రత్యేకముగా నొక వ్యాఖ్యానమును రచించినను, తనివితీరని వేదాంత దేశికులు విశదముగ వ్రాసిన (2) శరణాగతి దీపిక (3) న్యాస వింశతి (4) న్యాస దశకము (5) న్యాస తిలకము మున్నగునవి ముఖ్యముగా నిట పేర్కొనదగినవి.

(6) క్రీ: శ: 15 శతాబ్దమున - శ్రీవత్సాంక నారాయణ మునులు 'న్యాస వింశతి వ్యాఖ్య'ను వ్రాసిరి.

(7) 1951 లో - వెల్లూర్ నుండి వెలువడిన విశిష్టాద్వైత కోశము నందలి ఉపోద్ఘాతములో - 'ప్రపత్తి యోగము' అను గ్రంథ మును క్రీ: శ: 16 - వ శతాబ్దమున శాంత పరాంకుశ యతి రచించి నట్లు తెలుపబడినది.

(8) 18 - వ శతాబ్దమున తాత దేశికులు - 'న్యాస విద్యా ప్రకాశము' అను గ్రంథమును రచించిరి. ఇది 15467 సంఖ్యతో - మద్రాసు లైబ్రరీలో గలదు.

(9) 1967 లో ఆండవన్ ఆశ్రమమునుండి - 'న్యాస విద్యా దర్పణము' అను గ్రంథము ప్రకటింపబడినది. దీని కర్త - 18 - వ శతాబ్దమునకు జెందిన వేదాంత రామానుజస్వామి.

అట్లే, 18 - వ శతాబ్దమున వ్రాయబడిన (10) ప్రపన్న ధర్మ సారము, ఆచ్చి రంగాచార్యులవారిచే రచింపబడిన (11) ప్రపన్న విజయమ్', రామానుజ ముని విరచితమైన (12) 'ప్రపన్న విజయమ్', రామానుజయోగి విరచితమైన (13) ప్రపన్న సత్కర్మ చంద్రిక - మొదలగునవి ఈ కోవకు చెందినట్టివే.

ఇవి కాక, గ్రంథకర్త నామము తెలియని - వెలుగు చూడ వలసిన గ్రంథములును మరి కొన్ని కలవు. (14) ప్రపత్తి ప్రయోగము (మద్రాసు - 5303), (15) ప్రపత్త్యనుష్ఠాన ప్రకారము (మద్రాసు - 5305), (16) ప్రపత్త్యనుష్ఠాప ప్రయోగము (మద్రాసు - 5304), (17) ప్రపత్త్యుపాయత్వ విచారము (అడయార్ : 357 - 61) (18) ప్రపన్న గతి విధిః (మద్రాసు - 53085) మొదలగునవి.

ఇంతకును సారాంశమే మనగా - భగవద్రామానుజులవారి శరణాగతి గద్య ప్రభావమునకు ఇవి యన్నియు ప్రతీకలుగా సంభావింప నగును. ఈ వ్యాఖ్యాన కర్తల ఆశయ మే మనగా - శరణాగతి స్వరూపమును అనుష్ఠాన రూపమున బోధించు ద్వయ మంత్రమునకు అర్థ వివరణమే ఈ గద్య యని.

## ద్వయ వివరణమే శరణాగతి

శ్రీవైష్ణవాచార్యులు తమ నాశ్రయించిన శిష్యులకు శ్రీవైష్ణవ పేకను ప్రసాదించునపుడు - 'అష్టాక్షరి, ద్వయము. చరమ శ్లోకము' అను మూడు మంత్రములను నిత్యానుసంధేయములుగా ఉపదేశిం

తురు. అష్టాక్షరి - సర్వ వేద సారము. ద్వయ మంత్రము - ద్వయో పనిషత్తులో ప్రతిపాదిత మైనది. ఆ ద్వయోపనిషత్తు - కఠోపనిషత్తు లోని ఒక భాగము.[3] ఇది ఖిల ప్రతిగా పూర్వోత్తర భాగములు తెలియబడకపోవుటచే, ఆవశ్యకాంశములు మాత్రమే ఫలానా చోట ఇది కలదని ఉదాహరింపబడును. అట్టిదానిని ఖిలశ్రుతి యందురు. వివరము తెలియబడనప్పటికి ప్రసిద్ధ మయిన మంత్రముగా చెప్పబడు 'యజ్ఞోపవీతం పరమ పవిత్రం' వంటిది ద్వయము.

"శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే
శ్రీమతే నారాయణాయ నమః."

అని రెండు వాక్యములుగాను, ఆరు పదములు గాను ఉచ్చరింపబడు చున్న ఈ మంత్రమును 'అష్ట శ్లోకి' స్తోత్రములో - శ్రీ పరాశరభట్టరు వారు - "షట్పదోఽయం ద్విఖండః" అని తెలిపియున్నారు. నారాయణుని గూర్చి శరణాగతి చేయుచు - 'విష్ణు షట్పది' యను స్తోత్రమున ఆదిశంకరులు -

"నారాయణ కరుణామయ - శరణం కరవాణి తావకౌ చరణౌ
ఇతి షట్పదీ మదీయే హృదయ సరోజే నివసతు."

అని పేర్కొనియున్నారు. ద్వయమంత్ర భావముతో వ్రాసిన ఈ శ్లోక పూర్వార్థ భాగమున ఆరు పదము లున్నందున, అది షట్పది. 'షట్పది' యనగా - ఆడు తుమ్మెద. దాని నివాసము పద్మము. అట్లే, నా హృదయ పద్మమున - 'నారాయణ ... చరణౌ' అను షట్పది -

---

3. 'రహస్య త్రయ సారము' - అను గ్రంథములో - ద్వయ మంత్రాధి కరణమును పరిశీలింపుడు.

నిత్యము అనుసంధేయముగా నుండుగాక - అని ఆదిశంకదుల మనో భావము స్పష్ట మగుచున్నది గదా !

శరణాగతి గద్యమున - 'భగవ న్నారాయణాభిమతాను రూప...' అని యారంభించి, 'సంపత్స్యతే' అనునంతవరకు - ద్వయ మంత్రములోని 'శ్రీమత్' శబ్దార్థము వివరింపబడినది. అనంతరము - 'అఖిల హేయ ప్రత్యనీక...' అని యారంభమై, '... అశరణ్య శరణ్యా' అనునంతవరకు విశేషణములచేత - 'నారాయణ' శబ్దార్థము సమగ్రముగా వివరింపబడినిది. 'అనన్య శరణః త్వత్పాదారవింద యుగళం శరణ మహం ప్రపద్యే' అను వాక్యముచేత - 'చరణౌ శరణం ప్రపద్యే' అను వాక్యముచేత - 'చరణౌ శరణం ప్రపద్యే' అను మంత్ర భాగము ప్రయోగ పూర్వకముగా అనుష్ఠితమైనది. ఆనుకూల్య సంకల్ప, ప్రాతికూల్య వర్జనాది పంచాంగ పూర్వకముగా తనలోని అకించనత్వ, కృపణత్వాది ధర్మ నివేదన పూర్వకముగా చేయవలసి యున్నందున ఈ యంశములను నిరూపించుటకు మధ్య - 'పితరం మాతరం దారాన్', 'త్వ మేవ మాతా చ' ఇత్యాది జితంతా స్తోత్ర, భగవద్గీతాది గ్రంథములలోని శ్లోకములు పఠింపబడినవి.

ద్వయ మంత్రములోని పూర్వ వాక్యము ఉపాయానుష్ఠాన పరముగా, ఉత్తర వాక్యము మోక్ష రూప ఫలాంశ ప్రార్థనా పర ముగా నున్నవి. మోక్ష రూప ఫలము అనిష్ట నివృత్తి పూర్వక ఇష్ట ప్రాప్తి రూప మైనందున, 'న - మః' శబ్దార్థ వివక్షితమైన అనిష్ట నివృత్తి ప్రార్థనమును 'మనో వాక్కాయైః, అనాది కాల ప్రవృత్త ...' 'అశేషతః క్షమస్వ' 'మాం తారయ' ఇత్యాది వాక్యములతో నిరూపించిరి. 'తేషాం జ్ఞానీ నిత్య యుక్తః' అను మొదలు - గద్యాంతము వరకును - పరభక్తి, పరజ్ఞాన, పరమ భక్తులను ప్రసాదింపు

మని శ్రీరంగనాథుని ప్రార్థించిరి. నిరతిశయ ప్రీతి కారిత దివ్య దంపతి కైంకర్య రూప పురుషార్థమును శ్రీవైకుంఠమున లభింపజేయు మని అభ్యర్థించిరి. 'తథాఽస్తు' అని శ్రీరంగనాథుని అనుమతిని పొందిరి. ఇట్లు శరణాగతి గద్యము ద్వయమంత్ర వివక్షిత మగు సర్వ రహస్యార్థ నిరూపణ పర మని వ్యాఖ్యాన కర్తలు వక్కాణించిరి.

## శ్రీభాష్యకారుల ముక్తకము

" ప్రపత్తి ర్విశ్వాసః సకృత్ ప్రార్థనా మాత్రేణ అపేక్షితం దాస్య తీతి విశ్వాస పూర్వకం ప్రార్థన మితి యావత్. "

ప్రపత్తి యనగా - విశ్వాసము. ఒకసారి ప్రార్థించినంతనే అపేక్షించిన ఫలము నీయగలడు - అను విశ్వాసముతో భగవంతుని ప్రార్థించుటయే ప్రపత్తి యని శ్రీభాష్యకారుల ముక్తకము. 'ముక్తక' మనగా - గ్రంథములందు రచింపబడినది కాక, యాదృచ్ఛికముగా - సందర్భ వశమున శిష్యుల కుపదేశించిన శ్రీసూక్తి. సంప్రదాయానుగతముగా ఆచార్యులు దీని నుదాహరించుచున్నారని వేదాంత దేశికులు - 'నిక్షేప రక్షా' అను గ్రంథమున తెలిపిరి. ఈ లక్షణము పాంచరాత్రాగమ పద్ధతిలో సూచించుచున్నది. ఇట్లే విష్వక్సేన సంహితలో -

" అనన్య సాధ్యే స్వాభీష్ట మహా విశ్వాస పూర్వకమ్
త దేకోపాయతా యాఞ్ఞా ప్రపత్తి శ్శరణాగతిః. "

అనియు,

" అహ మస్మ్యపరాధానాం ఆలయః అకించనోఽగతిః
త్వ మేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః. "

అని అహిర్బుధ్న్య సంహితలోను చెప్పబడినది. తాత్పర్య మే మనగా :- ప్రపన్నునకు అభీష్టమైనది మోక్షము. 'స్వయముగా సాధించుకొనజాలను, నా యందు కర్మ జ్ఞాన భక్తి వైరాగ్య శమ దమాదులు లే నందున అకించనుడను, అనేకము లగు అపరాధములు చేసినవాడను, వే రే గతియు లేనివాడను అగు నాకు నీవే రక్షకు డవు' అని, స్వస్వ రూపమును నివేదించుకొని, దయా సాగరు డయిన శ్రియఃపతి అవశ్యము రక్షించు నను దృఢ విశ్వాసముతో ఆత్మా ర్పణము చేయుటే ప్రపత్తి యని, శరణాగతి యని చెప్పబడుచున్నది.

## మహా విశ్వాసము

శరణాగతి ఫలించుటకు ముఖ్యము మహా విశ్వాసము. ఈ విషయమున సంశయము లేశమేని ఉండరాదు. ఏనాటికిని విశ్వాసము సడలరాదు. ఎన్ని కష్టములు వచ్చినను - 'రక్షింపడేమో ? రక్షింప లేడేమో ?' అను సంశయము కలుగరాదు. మహా విశ్వాసము కలిగి యుండుటే అతికష్టము కాని, అదియే ఆవశ్యకము.

శ్రీ వేదాంత దేశికులు - 'తమ నిక్షేప రక్ష'లో - విశ్వాస దార్ఢ్యమును గూర్చి ఇట్లు వ్రాసియున్నారు :—

"యేషాం యావజ్జీవం బృహస్పతి ప్రభృతి రపి ప్రతిపాదిభిః సంశోధ్యమా ణానాం ప్రపత్తి శాస్త్రార్థే శంకాశంకుర్నాంకుర్వతి తేషాం త దధికారః । ఈదృశ్యే హి ప్రపత్త్యధికారిణో దుర్లభతమత్వ ముక్తమ్."

బృహస్పతి వంటి మహానుభావులు కూడ ప్రతివాదులై వచ్చి, యుక్తి ప్రయుక్తులతో మెప్పించవలె నని ఎంత కాలము వాదించి నను - ఎవని మనస్సునందు అణుమాత్రమేని అవిశ్వాసము శరణాగతి

యందు కలుగదో, అట్టి దృఢ విశ్వాస శాలియే ప్రపత్తి ననుష్ఠించుటకు అధికారి.

## పూర్వ పక్షము

మానవుడు తాను ఉజ్జీవించుటకై చేయవలసినవిగా శాస్త్రములో విధింపబడిన శ్రమసాధ్యములైన కర్మ - జ్ఞాన - భక్తి యోగాది రూప ప్రపత్తుల కంటెను సర్వ ధర్మములను విడచి, భగవంతునిపై భారము నుంచి, నిర్భరుడై యుండుట అనబడు ఈ నివృత్తి రూప మయిన శరణాగతి సులభ మని మరి కొందరి భావన. 'భగవత్ప్రవృత్తి విరోధి స్వప్రవృత్తి నివృత్తియే ప్రపత్తి' అను లక్షణము శ్రీరామమిశ్రులచే నుడువబడినది. తనకు తానే - 'రక్షించుకొనగలను' - అను భ్రమతో ప్రయత్నించువరకు జీవునిగూర్చి భగవంతుడు ఉదాసీనుడై యుండును. కావున, మనలను భగవంతుడు రక్షింప నుద్యమించుటకు విరుద్ధమైన స్వప్రవృత్తిని మనము మానుకొనుటయే కర్తవ్యము. అనగా - ఆ భగవంతునిపై భార మునుంచి, స్వప్రవృత్తిని పొంది, నిశ్చింతగా నుండుటయే శరణాగతి యని శ్రీరామమిశ్రుల లక్షణార్థము. ఇది సులభ మనిపించవచ్చునుకాని, నిజమునకు - ఇట్లుండుట సాధ్యము కాదు. సత్త్వ రజస్తమో గుణ మయమైన - శరీర ధారియైన మానవుడు స్వరక్షణమునకుగాను ఏమియు చేయక ఎట్లుండగలడు? ప్రబలమైన ఝంఝూవాతముచే నెగిసి చరించు తరంగము లుండు సాగర మధ్యమమున నున్నవానికి అణు మాత్రమేని చలించకుండుట సాధ్యమా? అది యెట్లు అసాధ్యమో - భగవత్ప్రవృత్తి విరోధి స్వప్రవృత్తి నివృత్తి యనబడు ఈ ప్రపత్తియు అట్లే అసాధ్యము గదా!

## సమాధానము

ఉక్త వాక్యము యుక్తమే. ఎవరును ఏ ప్రవృత్తియు లేక ఉండజాలరు. భగవత్ప్రవృత్తికి విరుద్ధమైన స్వప్రవృత్తిని మాను కొనవలె నను లక్షణము యొక్క భావము - సర్వ ప్రవృత్తి నివృత్తి యని కాదు. ప్రపన్నుడు మానుకొనవలసిన స్వప్రవృత్తి యేది యనగా :- స్వరక్షణకై స్వతంత్రించి, తాను ప్రవర్తించుట - లేక, ఇతర దేవతల నాశ్రయించుట మొదలగునవి. మరియు, భగవంతుడు తనను రక్షింప బూనుటకు విరుద్ధమైన స్వప్రవృత్తి యనగా - 'నేను శరణాగతిని చేసితిని, ఇక నా కేమి కొదువ ?' అను భ్రమ పడి, భగవంతునకు గూడ క్షమింపరాని భగవద్భాగవతాచార్యుల విషయమై ఘోరాప చారములను చేయుటకు పూనుకొనరాదు. అది భగవత్ప్రవృత్తికి విరోధి. అట్టి స్వప్రవృత్తిని (దుష్కార్య ప్రవృత్తిని) తనలో లేకుండ నివర్తింపజేసికొనవలె నని భావము. శరణాగతి మహత్తరమైనది గనుక, దీనిని చేసినవాడు అవిశ్వాసముతో మరియొక అల్ప సాధనము ననుష్ఠింపరా దనియు, అట్లు చేసినచో అది ఫలింప దనియు గ్రహింప వలెను. మరియు - ఫలార్థియై రాజ సేవ చేయువాడు - పురుషాంత రముల నాశ్రయించుట తగదు. అపుడా రాజుపై అవిశ్వాసమే మిగులును కాని, రాజును కా దని రెండవ పురుషుడు ఫలము నీయ లేడుగదా ! రాజును సేవించినను ఆ రాజునకు అంతరంగ ప్రేమ పాత్రులైన దార పుత్రాదులను దూషించినచో రాజు క్షమించడు కనుక, ఈ దృష్టాంతములనుబట్టి, ఇట్టి దుష్ట ప్రవృత్తుల నన్నిటిని మానుకొనవలె నని - 'స్వ ప్రవృత్తి నివృత్తి' యనుటకు తాత్పర్యము. అంతే కాని, కర చరణ చలనాభావముతో - నిత్యము సాదర భగవ ద్భాగవతాది వందన కైంకర్యాది కృత్యములను వీడి యుండుట కాదు. కనుక, మహా విశ్వాస రూపమైన ఈ శరణాగతి - ప్రమాద

భరితములైన కర్మ జ్ఞాన భక్తి యోగాది ఉపాయాంతరము కంటెను సులభోపాయమైనది.

## ఉదాహరణము

ఒక సార్వభౌముడు ఒక అపరాధికి శిక్ష విధించెను. భయ కంపితుడైన ఆ దోషి - దైన్యముతో, గద్గద స్వరముతో విలపించుచు, కన్నీరు మున్నీరుగా నేడ్చుచు, ఆ రాజు పాదములపై బడి, క్షమా భిక్ష నర్థించును. మరి యొక యపరాధి - అధికారియొక్క అను గ్రహమును పొందుటకై, తన నద్ద నున్న ధన కనక వస్తు వాహనము లను కానుకగా సర్పించి, అనేక విధములుగా ఆ యధికారిని ప్రస్తు తించుచు, ప్రసన్నుని గావించుకొనును. అట్టి వారి నిరువురను ప్రభువు చివరకు కరుణించి రక్షించును. కాని, మొదటివాని దైన్యమునకు ప్రభువు మనస్సు ద్రవింపగా, అతనిపై అధికముగా అనుగ్రహమును ప్రదర్శించును. ఇది లోక సిద్ధము.

ఆ విధముగా నిశ్చల మగు మహా విశ్వాస ముండుట కొందరిలో అసంభవము గాన, ప్రపత్తి దుష్కరము కానచ్చు కాని, అది కలవానికి కర్మయోగాదుల కంటెను అత్యంత సులభోపాయ మనుటలో సందేహము లేదు. కనుకనే - 'ఉపాయః సుకర శ్చాయం' అని భగవ దుక్తి.

## ముఖ్యాశయము

'బ్రహ్మ రుద్రాదులకు కూడ లభ్యము కాని ఆ మహా మోక్షము - ఈ చిన్న శరణాగతితో లభించునా ? ఒక్క సారి శరణాగతి చేసినంత మాత్రమున చిరకాలమునుండి చేయుచున్న

మహా పాపము లన్నియు తొలగిపోవునా ?" అని - సందేహ డోలా చలచిత్తుడై ఉపాయాంతరముల నన్వేషించుటచే, రజ స్తమోగుణ ములు మన శ్రైథిల్యమును కల్గించి, పెడ త్రోవ బట్టించును.

అదృష్ట పరిపాకముచే పరమాత్మలోని సౌశీల్య వాత్సల్యాది నిరతిశయ మహా గుణములపై విశ్వాస మేర్పడగా - "కాకాసురుని సైతము స్వామి రక్షించెను గదా ! రాక్షస స్త్రీలను హనుమంతుని నుండి సీతాదేవి రక్షించెను గదా ! నమ్ముకొన్న నన్ను మాత్రము రక్షింపరా ? తప్పక రక్షించు నని తలచి, నిస్సందేహ చిత్తుడై, సత్ప్ర వృత్తి కల్గి యుండును. కావున, ఇట్టి దృఢాధ్యవసాయమును అలవరచు కొను మని తెలుపుటయే 'శరణం వ్రజ' అని విధించుటలో ముఖ్యా శయము.

## నిత్యానుసంధేయము

శరణు వేడిన వానికి అష్టాక్షరి నియత సమయములలో అను సంధింపదగినది. ద్వయమంత్ర సార వివరణ రూపమైన శరణాగతి గద్యము నిత్యానుసంధేయము. కనుక, శ్రీ రామానుజులు శరణా గతి గద్యాంతమున -

" యేన కేనాపి ప్రకారేణ ద్వయ వక్తా త్వం. "

అనియు, మరియొక చోట -

" ద్వయ మర్థానుసంధానేన సహ సదా సద్వైవం వక్తా. "

అనియు నక్కాణించియున్నారు. ఇచ్చట కేవలము ఈ మంత్ర రత్నానుసంధానము ముఖ్యము కాదు. దానితోపాటు - త దర్థ మాధుర్యమును భావనా రూపమున ఆస్వాదించుట ముఖ్య మని

దాని తాత్పర్యము. ఈ విధముగా జీవిత కాల శేషమును గడుపుట ప్రపన్నుని విధి యని దీని భావము.

" మంత్రరత్నానుసంధాన సంతత స్ఫురితాధరమ్
తదర్థ తత్త్వ నిధ్యాన - సన్నద్ధ పులకోద్గమమ్. "

'దినచర్యా' స్తోత్రమున - వరవరమునులను గురించిన పై శ్లోకములో - ఈ విషయము స్పష్టము.

'ఆముక్త మాల్యద' యను ఆంధ్ర ప్రబంధమున, ఆంధ్ర భోజుడగు శ్రీ కృష్ణ దేవరాయలు - విల్లిపుత్తూరు వాసుడైన, విష్ణుచిత్తుని గూర్చి - 'ద్వయ సద్మ పద్మ వదనుడు' అని అభివర్ణించినాడు. అనగా - 'విష్ణుచిత్తుని ముఖ పద్మము నిత్యము ద్వయమంత్రానుసంధానమునకు నిలయమైనది' అని భావము.

## అర్థానుసంధానము - ప్రయోజనము

భావుకుడైన ప్రపన్నుడు మంత్రోచ్చారణతో పాటు - ప్రతి పద మందును ఇమిడియున్న ఆచార్యోపదేశ లబ్ధమైన అర్థ తత్త్వమును ఆస్వాదించుచుండును. శ్రీమ చ్ఛబ్దముచేత లక్ష్మీ పురుషకార వైభవమును, నారాయణ శబ్దముచేత రక్షణోపయోగములైన జ్ఞాన బలైశ్వర్యాది మహా గుణములను, ఆశ్రయణ సౌకర్యాపాదకములైన సౌశీల్య సౌలభ్యాది గుణములను, ముఖ్యాతి ముఖ్యములైన దయా వాత్సల్యములను, దివ్య మంగళ విగ్రహ సౌందర్యమును, తనకు స్వామితో గల సత్సంబంధములను మనసార తలచుకొనుచు - 'ప్రపద్యే' అని తాను చేసిన శరణాగతిని మరల మరల స్మరించు కొనును. తనకు అపేక్షితమైన ఫలము ఆ దివ్య దంపతుల నిత్యానువృత్తి రూపమైన కైంకర్యమే యని, ఇంతవరకు అది లభించక ప్రతి

బంధకముగా నున్న ఈ స్థూల సూక్ష్మ ప్రకృతి సంబంధము త జ్జన్యములైన దుర్భర తాపత్రయ దుఃఖము తొలగిపోయి, భగవ త్సన్నిధికి చేరి, ఆ కైంకర్య ఫలమును పొంది, అమృత సాగరాంత ర్నిమగుడను కావలె నని ఉవ్విళ్ళూరుచు -

" కృత కృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియ మివాతిధిమ్. "

అనునట్లు, రాబోవు ఆ మధుర ఘడియలకై ఎదురుచూచుచుండును. శరణాగతి గద్యములోని వాక్యము లన్నియు ఈ అర్థానుసంధాన వివరణమే. ఈ మధుర భావనా పరంపరతోడనే కాలము గడుపువారికి బాహ్య ప్రపంచముపై ధ్యాసయే ఉండదు. 'ప్రపద్యే' అను ఉత్తమ పురుష క్రియా సూచితమైన స్వస్వరూపమును తలంచుకొని, 'నమః' శబ్ద గర్భితమైన అవిద్యా కర్మ వాసనాది విరోధి వర్గమును తొల గించు మనియు, పాపములను క్షమింపు మనియు ప్రార్థింపవలయును.

## 'నమః' శబ్ద గర్భితార్థము

'నమః' అనునది పదద్వయాత్మకము. 'న' అని 'మః' అనియు, 'నమః' అను షష్ఠీ విభక్తి యొక్క స్వాతంత్ర్యమును చెప్పుచున్నది. 'న' అని స్వాతంత్ర్యమును నిషేధించుచున్నది. కనుక, 'నమః' అని అహంకార మమకారములను నివారించుచున్నది. 'నమః' అనునది స్వరూపోపాయ పురుషార్థ విరోధములను నివారించి, స్వరూపోపాయ ఫలములను ప్రకాశింపజేయుచున్నది. 'నమః' అను పదమునందు - దాసుడైన జీవుని శేషత్వము స్పష్ట మగుచున్నది. నమస్కార భావ రహితములైన యజ్ఞాదులు నిష్ప్రయోజనములు. 'ఓం నమో నారా యణాయ' అను అష్టాక్షరీ మంత్రార్థము 'శరణాగతి' బోధక మనియే గ్రహింపనగును.

# అర్థానుసంధాన పద్ధతి

ప్రపత్తి శాస్త్ర సర్వస్వము అనబడు శ్రీవచన భూషణ ప్రబంధములో శ్రీ లోకాచార్యులవారు, వ్యాఖ్యానకర్తలైన వరవర మునీంద్రులును - తృతీయ ప్రకరణములో చివరకు ఈ అర్థాను సంధాన పద్ధతినిగూర్చి కొన్ని సూత్రములలో విశదీకరించియున్నారు.

" స్వదోషానుసంధానం భయహేతు
భగవద్గుణానుసంధానం అభయహేతు. "

ఇది యొక గంభీరమైన సూత్రము ప్రపన్నునకు ఒక విధముగా నిది అభయ మొసంగుచున్నది. ఈ సూత్రము నిత్యము భావనలో మెదలుచుండవలెను. అజ్ఞానముచేత తాను చేసిన, చేయుచున్న, చేయనున్న నానావిధానంత భగవ ద్భాగవతాపచారాదులను తలంచు కొని, వీనివలన తనకు సంప్రాప్తించు దుఃఖ పరంపరను ఊహించు కొని, భయముతో కంపించిపోవును. భగవంతుడు క్షమించినగాని - వీనికి నిష్కృతి లే దని ఆవేదన జెందును. ఈ ఆవేదనా రూపమైన భయము నిత్యానువృత్తము కావలెను. నమ శ్శబ్దార్థానుసంధాన మిదియే. ప్రబలమైన ఈ భయము నివారించుటకు - దయా వాత్స ల్యాది కల్యాణ గుణ సముద్రుడు, ఆపద్బాంధవుడునైన భగవంతుని వివిధ సద్గుణములను విశదముగ భావించుకొనుచు, ఆయన తప్పక రక్షింపగల డని మహా విశ్వాసము కలిగి నిర్భయ మనస్కుడు కావలెను. ఇదియే నారాయణ శబ్దానుసంధాన విధానము. ఇట్టి భయము, అభయము మనస్సులో నిత్యానువృత్తములై యుండవలె నని సూచించుట కొరకు అర్థానుసంధానముతోపాటు - ద్వయ మంత్రోచ్చారణ చేయుచుండవలె నని పెద్దల ఆదేశము.

శరణాగతి గద్యములోని చివరి భాగ మంతయు మనకు ఈ పరమార్థమునే సూచించుచున్నది. నానావిధానంతాపచారములను క్షమింపు మని, పరభక్తి పరజ్ఞాన పరమ భక్తి భావములను మనలో కల్గించు మని, నిరతిశయ ప్రీతికరమైన దివ్య కైంకర్యమును ప్రసాదింపు మని శ్రీ రామానుజులు ప్రార్థించిరి. శ్రీరంగనాథుని 'తథాఽస్తు' అని అనుగ్రహించినాడు.

## ముగింపు

శరణాగతి గద్యయందే శరణాగతి వలన గల్గు ఫలమును శ్రీ రామానుజులు వివరించుచు - 'మరణ కాలమందు కూడ, నా దయచే జ్ఞానము కలవాడవై స్మరింపు' మను భగవానుని ఆదేశాను సారము - 'అట్టి స్మృతిని నా కనుగ్రహింపు' మని శరణాగతి చేసినారు రామానుజులు.

" లక్ష్మీపతే ర్యతిపతే శ్చ దయైక ధామ్నో
యోఽసౌ పురా సమజనిష్ట జగద్ధితార్థమ్
ప్రాప్యం ప్రకాశయతు నః పరమం రహస్యం
సంవాద ఏష శరణాగతి మంత్రసారః. "

దయా సాగరుడైన లక్ష్మీపతికి, యతిపతికిని జరిగిన శరణాగతి! మంత్రసారమైన ఈ సంవాదము మనకు ఉత్తేజమును కల్గించుగావుత



# శరణాగతి గద్యలో తత్త్వార్థము

'కవితార్కిక కేసరి - ఉభయ వేదాంత విద్వాన్'

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు



### ప్రబంధ పరిచయము

భగవద్రామానుజులు ప్రసాదించిన నవ నిధుల వంటి తొమ్మిది మహా ప్రబంధములలో ప్రాముఖ్యమును పొందినవి రెండే ప్రబంధములు. అందొకటి తత్త్వ నిర్ధారణ పరమైనది శ్రీభాష్యము. రెండవది అనుష్ఠాన పరమైనది శరణాగతి గద్యము. వానిని రచించుటలో వారు ఉద్దేశించిన ప్రయోజనమును శ్రీ వేదాంత దేశికులవారు ఈ క్రింది శ్లోక ఖండములో నిట్లు వివరించిరి :-

" ఆర్తోప చ్ఛందనం గద్యం - భాష్యం తు పర రంజనమ్. "

లోకమున అధికారులు రెండు విధములుగా నుందురు. కొందరు అగాధ శాస్త్రములను సునిశిత మేధా విలాసముచే మథించి నిర్ధారణ చేయగల ప్రజ్ఞా పాటవము కలవారు కాగా, మరి కొందరు అంతటి ప్రజ్ఞ లేకున్నను, పెద్దలుపదేశించిన తత్త్వముపై పూర్వ విశ్వాసము నుంచి, వైరాగ్య సంపన్నులై, బంధ విముక్తికిని, భగవత్ప్రాప్తికిని అనుక్షణము ఆర్తి నొందు ముముక్షువులు. అందు రెండవ వర్గము

లోనివారిని ఉజ్జీవింపజేయుటకై శరణాగతి గద్యమును శ్రీ రామానుజ లనుగ్రహించి రనియు, మొదటి వర్గమునకు చెందినవారి మనస్సమాధానమునకై - యుక్తి ప్రయుక్తి పూర్వకము, శాస్త్రార్థ జటిలము నైన శ్రీభాష్య గ్రంథమును సిద్ధాంత స్థాపన పరముగా అనుగ్రహించి రనియు పై శ్లోక ఖండమునకు తాత్పర్యము.

శ్రీరంగ క్షేత్రమున వేంచేసి యుండిన రామానుజులు ఒక నాడు ఉత్తర ఫల్గునీ నక్షత్ర నిమిత్తముగా శ్రీరంగనాయకి అమ్మవారికి జరుగుచున్న ఉత్సవ కార్యక్రమమును దర్శించుటకై ఆలయమునకు వెళ్ళిరి. అచట మంటముపై అమ్మవారితో పాటు వేంచేసియున్న శ్రీరంగనాథుని సేవించిన సమయమున, వీరి హృదయమునందు - సంసార మండలముపై జుగుప్సయు, దీనిని త్యజించి శ్రీవైకుంఠ ధామమునకు వెంటనే చేరిపోవలె నను ఆర్తియు నేర్పడగా, ఆ దివ్య దంపతుల సన్నిధిలో తమ మనోరథమును తెలుపుకొనుచు - ద్వయ మంత్రానుసంధాన పూర్వకముగా శరణాగతిని చేసిరి. అప్పుడు తమకు, ఆ దివ్య దంపతులతో జరిగిన మధుర సంభాషణమునే తమ శిష్య పరంపరకును - అనుష్ఠానమునకు, నిత్యానుసంధానమునకు ఉపయోగించుటకై రామానుజులు ఈ గద్యరూపమున సంతరించిరి - అని పెద్దలు ఈ గ్రంథ మవతరించిన విధమును గూర్చి సెల విత్తురు.

## గద్య వ్యాఖ్యానములు

దీనికి ముగ్గురు పెద్దలు రచించిన వ్యాఖ్యానము లున్నవి. శ్రీభాష్యమునకు వజ్ర కవచము వంటి విపుల విశిష్ట వ్యాఖ్యను - వ్రాసిన శ్రుతప్రకాశికాచార్యులవారి అతి సంగ్రహము, సారవంతము నగు సంస్కృత లఘు టీక యొకటి. కవితార్కిక కేసరి యగు శ్రీ వేదాంతదేశికులవారు వ్రాసిన విపుల విశద సంస్కృత వ్యాఖ్య

రెండవది. ఆళ్వారుల నాలాయిర దివ్యప్రబంధములకు విపుల ద్రవిడ వ్యాఖ్యలను వ్రాసిన వ్యాఖ్యాతృ చక్రవర్తి పెరియవాచ్చాంబిళ్ళై అను ఆచార్యులవారు వ్రాసిన ద్రవిడ వ్యాఖ్య మూడవది.

శరణాగతి స్వరూపమును అనుష్ఠాన రూపమున బోధించు ద్వయ మంత్రమునకు అర్థ వివరణమే ఈ గద్య మని వ్యాఖ్యాన కర్తల ఆశయము.

## సంప్రదాయ భేదము - సమన్వయము

రామానుజుల తరువాత సుమారు 300 సంవత్సరములకు శ్రీవైష్ణవ సంప్రదాయమున రెండు తెగలు ఏర్పడినవి. వడకలై - తెన్కలై అను ఈ రెండు తెగలవారును 18 విషయముల యందు అభిప్రాయ భేదము కలిగి యున్నారు. వానిలో - శరణాగతి విషయ మొకటి. శరణాగతిని పలుమారులు చేయవలెనా ? ఒకసారి చేసిన చాలునా ? అను సందేహమునకు - ఒకసారితో ఫలము సిద్ధింపనిచో పలు మారులు చేయవలె నని వడైకలై వారును, ఒకసారి మాత్రమే నని తెన్కలై వారును బదులు చెప్పుదురు. ఈ శరణాగతి గద్య గ్రంథమును రచించిన సమయమున రామానుజులు శ్రీరంగనాథుని సన్నిధిలో శరణాగతిని చేసినట్లు వెనుక చెప్పబడినది. అంతకు పూర్వమే వారు - తమ ఆచార్యులైన మహాపూర్ణుల (పెరియనంబి) వద్ద పంచ సంస్కారములను పొందినపుడు - ఈ ద్వయ మంత్రమును ఉపదేశ రూపమున గ్రహించి, అపుడే భగవచ్ఛరణాగతిని చేసి యున్నారు గదా ! తిరిగి యిపుడు శరణాగతిని రెండవసారి చేయుటలో వారి అభిప్రాయ మేమి ? ఫలము సిద్ధించువరకు ఎన్నిసారులైన చేయవచ్చు నని ఈ రామానుజులవారి అనుష్ఠానము తెలుపుచున్నది గదా యని వడగలై శాఖవారు తమ వాదమును సమర్థించుదురు.

కాని, ఇది పొరపాటే. ఏల ననగా - ఈ వడకలై తెగకు మూల పురుషు లనబడుచున్న వేదాంతదేశికులవారు తమ వ్యాఖ్యానమున ఒక చోట ఇట్లు వ్రాసియున్నారు :-

" ....వాక్యాన్తరైః పునః పునః ప్రపద్యతే ఇతి తు నా శంకనీయమ్ - ఏక సాధ్య సిధ్యర్థం ప్రపత్త్యావృత్తేః ప్రతిషేధాత్ ! ఇహ సాధ్యాన్తరా యోగా చ్చ. "

ఇతర వాక్యములనుబట్టి, రామానుజులు మాటి మాటికిని శరణాగతిని చేసి రని భావింపరాదు. ఒకే ఫలమును సాధించుటకై, పలుమారులు శరణాగతి చేయుట తప్పు అని శాస్త్రము నిషేధించు చున్నది. వారు మోక్షమును తప్ప, వే రొక ఫలితమును కోరలేదు' అని దేశికులవారి వాక్యములకు అర్థము. మరియు - వీరే తాము రచించిన న్యాస తిలకమున -

" ప్రాయః ప్రపదనే పుంసాం పౌనః పున్యం నివారయన్
హస్తః శ్రీరంగ భర్తు ర్మాం అవ్యాత్ అభయ ముద్రితః. "

అను శ్లోకమున - 'ఓ భక్తులారా ! మీరు నాకు ఒకసారి శరణాగతి చేసిన చాలును. పలుసారులు చేయనద్దని శ్రీరంగనాథుని అభయ హస్త ముద్రిక నిషేధించుచున్నది' అని సెలవిచ్చిరిగదా ! ఇట్లు ఏక వార శరణాగతియే శాస్త్ర సిద్ధ మని దేశికులవారి అభిప్రాయము సిద్ధించుచుండగా, వారి శిష్య పరంపరలోనివారు - 'పలుమారులు చేయవ' చ్చనుట అసమంజసమే.

ఇక తెన్గలై శాఖవారుగూడ - 'ఒకేసారి చేయవలె' నని శాసించినట్లు విధించుట గూడ పొరపాటే. ఈ ప్రబంధమునకు ద్రవిడ వ్యాఖ్యాన ప్రసాదించిన పెరియ ఆచ్చాం పిళ్ళై స్వామి వారు ఈ

శరణాగతి గద్య గ్రంథమునకు అవతారికను రచించుచు, మొదటనే ఇట్లు వ్రాసిరి :-

" ముదలిలే సంసార భీతరాయ్ క్కొండ పెరియనంబి శ్రీపాదత్తై ఆశ్రయిత్తు పోతే పెరియ పెరుమాళ తిరుపడిగళిలే పుక్కిలరో ? 'సకృదేవ' ఎన్ఱు శరణ్య హృదయ మిరుప్పదు. ఆన పిమ్బు....తిరియట్టుం ఇప్పోతు శరణం పుగువా నెన్నె న్నిల్ - ఇవ్వళవు ఆరి యిరుక్క మాట్టాత తమ్ ప్రాప్యత్వరై యలే శరణం పుకు కిరాన్. ఇతి లే ఆళ్వార్గళుక్కుం రీతి. అవర్గళై అడియొత్తుగిర ఆచార్యర్గళుక్కుం ఇతువే రీతి యామిత్తనై యన్ఱో ? సంసార భీతియుం, ప్రాప్య రుచియుం కనక్క కనక్క ఒరు కాల్ శరణం పుక్కా ప్పోలే ఒన్బతిన్ కాల్ శరణం పుగు మిత్త నై యిరే ఇవర్ గళ్. "

ఈ వాక్యముల కర్థ మిది :- 'రామానుజులు మొదటనే ఒక సారి సంసార భయముచే మహాపూర్ణుల నాశ్రయించినపుడే శ్రీరంగ నాథుని శ్రీపాద సన్నిధిలో శరణాగతిని చేయలేదా ? ఒక సారియే శరణాగతి చేసిన వానికి అభయ మిత్తునని సర్వ రక్షకుడైన శ్రీరామ చంద్రుడు తన హృద్గత భావమును ప్రకటించెనుగదా ! ఐనప్పుడు మరల రెండవ సారి ఇప్పుడు రామానుజులవారు శరణాగతి చేయుట తగునా ? అని శంకింపరాదు. ఫలితము కలుగుటలో కొలది మాత్రము ఆలస్యమును కూడ సహింపలేక, ఇంకెపుడు, ఇంకెపుడు అను త్వరాతిశయముచేత మాటి మాటికిని వీరు శరణాగతిని చేయు చున్నారు. వారి అడుగుజాడలలో నడచు ఆచార్యులును ఆ రీతిని అనుసరించుటలో తప్పు లేదు. ప్రబల మగు సంసార భయము నెన్నడుచుండగా, భగవత్కైంకర్యాభిలాషయు ఉత్కటము కాగా, వీరు ఒకటికి పది సారులు శరణాగతిని చేయుచుండుట సహజమే గదా !" ఇట్లు ఉభయ శాఖలకు చెందిన ఇద్ద రాచార్యుల వ్యాఖ్యా నములను పరామర్శింపగా - ఒకసారియే నని గాని, పలుమారులే నని

గాని నియమ మేదియు లేనందున, ఉభయ పక్షములు సంప్రదాయ సిద్ధములే నని గ్రహింపవచ్చును. సహృదయ విమర్శకులు వ్యర్థ వివాదములకు తావియ్యరు.

## ద్వయము వైదిక మంత్రము
## తద్వివరణము శరణాగతి గద్యము

శ్రీవైష్ణవాచార్యులు తమ నాశ్రయించిన శిష్యులకు శ్రీవైష్ణవ దీక్షను ప్రసాదించునపుడు - 'అష్టాక్షరి, ద్వయము, చరమ శ్లోకము' అను మూడు మంత్రములను ఇవి నిత్యానుసంధేయము లని ఉపదేశించుచున్నారు. అష్టాక్షరి సుప్రసిద్ధ వైదిక మంత్ర మనుటలో సందేహము లేదు. గీతోపనిషత్తులోని కృష్ణ చరమ శ్లోకము, రామాయణమునందలి రామ చరమ శ్లోకము ప్రసిద్ధములే. మరి ఈ ద్వయ మంత్రము ఏ వేద భాగములో నున్నదో నని అన్ని వేద గ్రంథములను పరిశీలింపగా, ఎక్కడను దీని ఆకరము లభింపలేదే! ఇ దేదియో వైష్ణవులు కల్పించిన మంత్రమే గాని, వైదికము కాదేమో! అని కొందరు మితజ్ఞులకు సందేహము గలదు. ఇందులకు పెద్ద లిచ్చు సమాధాన మే మనగా - ఈ మంత్రము ద్వయోపనిషత్తులో ప్రతిపాదిత మైనది. ఆ ద్వయోపనిషత్తు కఠోపనిషత్తులోని ఒక భాగము. తైత్తిరీయోపనిషత్తులో - శిక్షావల్లి, బ్రహ్మవల్లి, భృగువల్లి మొదలైన వేరు వేరు భాగము లున్నట్లు, కఠ శ్రుతిలో ఈ ద్వయోపనిషత్తు భాగాంతర మని గ్రహింపదగును. కొన్ని ఉపనిష న్మంత్రములు వరుసగా పాఠ ప్రవచనములో లేనందున, వాని పూర్వోత్తర భాగములు తెలియబడక, ఆవశ్యకాంశములు మాత్రమే ఫలానా చోట ఇవి కల వని ఉదాహరింపబడుచున్నవి. అట్టి వానిని 'ఖిల శ్రుతులు' అందురు. అధ్యయనాభ్యాసములలో లేనందున, ఇవి

ఎక్కడ నున్నవో నని తెలిసికొనుటకు సాధ్యము కాకపోయిన మంత్రములు ఎన్నో కలవు. ఉదాహరణకు - "యజ్ఞోపవీతం పరమం పవిత్రం..." ఇత్యాది యజ్ఞోపవీత ధారణ మంత్రము ఏ వేద శాఖ లోనిదో తెలియుటలేదు. కాని, ప్రసిద్ధముగా సర్వాంగీకృతమైనది. దానిని 'ఖిల శ్రుతి' యగుచున్నారు. అట్లే, ఈ ద్వయోపనిషత్తు గూడ ఖిలమై, ఉపలబ్ధ భాగములో ద్వయ మంత్ర వివరణము చేయ బడి యున్నది. ఈ మంత్రము రెండు వాక్యముల సంపుటీకరణ మని, ఇందు ఆరు పదము లున్నందున దీనిని షట్పద మందు రని, ఇరువది యైదు అక్షరములు కల వని, దీని స్వరూప స్వభావములు ఆ ఉప నిషత్తులో నిరూపితమై యున్నవి. శ్రీ వేదాంతదేశికుల వారు తమ 'రహస్య త్రయ సార' మను ద్రవిడ గ్రంథమున ఈ ద్వయోపనిషత్తు కఠోపనిషత్తులో అంతర్భాగ మని తెలిపియున్నారు.

" శ్రీమన్నారాయణ చరణౌ, శరణం, ప్రపద్యే
శ్రీమతే, నారాయణాయ, నమః. "

అని రెండు విడి విడి వాక్యములుగాను, ఆరు పదములుగాను ఉచ్చ రింపబడుచున్న ఈ మంత్రమును శ్రీ పరాశరభట్టుగారుగూడ - 'అష్ట శ్లోకి' స్తోత్రములో - "షట్పదోఽయం ద్విఖండః" అని తెలిపి యున్నారు. శ్రీ శంకరాచార్యులవారును తాము రచించిన 'విష్ణు షట్పదీ' అను చిన్న స్తోత్రములో - నారాయణుని గూర్చి శరణా గతిని చేయుచు, ఈ ద్వయ మంత్రమున అతి ముఖ్యములైన పదములనే గ్రహించి, ఈ క్రింది శ్లోకమును వ్రాసియున్నారు :-

" నారాయణ ! కరుణామయ ! శరణం కరవాణి తావకౌ చరణౌ
ఇతి షట్పదీ మదీయే హృదయ సరోజే సదా వసతు. "

ద్వయ మంత్రము యొక్క ఛాయలో రచింపబడిన ఈ శ్లోకములోని పూర్వార్థ వాక్యమున ఆరే పదము లున్నందున, అది షట్పది. అవు తుమ్మెదకును 'షట్పది' యని పేరు. అది పద్మములో నుండును. నా హృదయ పద్మమున - 'నారాయణ...చరణౌ' అను షట్పది నిత్యము అనుసంధేయమై యుండుగాక యని శంకరాచార్యులవారి ఆకాంక్ష. ఇట్లు ఇంతవరకును శరణాగతి బోధకమైన ద్వయ మంత్రము కఠోప నిషత్తున గల ఖిలశ్రుతి భాగ మనియు, ఈ మంత్ర చ్ఛాయలో శబ్ద ప్రయోగమును చేసి శ్రీ శంకరులు మొదలగు పూర్వాచార్యులును శరణాగతిని అనుష్ఠించి రనియు ఇట నిరూపించితిమి. ఇక పురాణే తిహాసములలో ప్రసిద్ధులైన ద్రౌపది విభీషణ గజేంద్రాదులు కూడ ఎందరో శరణాగతిని అవలంబింప, ఫలసిద్ధి నొంది రనుట సుప్రసిద్ధము.

ఈ శరణాగతి గద్యమున - "భగవ న్నారాయణాభిమత..." అని యారంభించి, "...సంపత్స్యతే" అనునంతవరకు ద్వయ మంత్రములోని శ్రీమత్ శబ్దార్థము వివరింపపడినది. ఆపైన - "అఖిల హేయ ప్రత్యనీక..." అని యారంభమై, "...అశరణ్య శరణ్య" అనునంతవరకు గల విశేషణములచేత నారాయణ శబ్దార్థము సమగ్ర ముగా ప్రతిపాదింపబడినది. పిదప - "అనన్య శరణః త్వత్పాదార విందయుగళం శరణ మహం ప్రపద్యే" అను వాక్యముచేత "చరణౌ శరణం ప్రపద్యే" అను మంత్ర భాగము ప్రయోగ పూర్వకముగా అనుష్ఠితమైనది. శరణాగతి - ఆనుకూల్య సంకల్ప, ప్రాతికూల్య వర్జ నాది పంచాంగ పూర్వకముగా శాస్త్ర విహిత మైనందున, ఉపా యాంతర త్యాగ పూర్వకముగా తనలోని అకించనత్వ - కృపణత్వాది ధర్మ నివేదన పూర్వకముగా చేయవలసి యున్నందున, ఈ యంశము లను నిరూపించుటకే నడుమ - "పితరం మాతరం దారాన్" "త్వ

మేవ మాతా చ" ఇత్యాది జితంతాస్తోత్ర - భగవద్గీతాది శ్లోకములు పఠింపబడినవి.

ఇట్లు ద్వయ మంత్రములోని పూర్వ వాక్యము ఉపాయాను ష్ఠానపరము కాగా, ఉత్తర వాక్యము మోక్షరూప ఫలాంశ ప్రార్థనా పరము గనుక, మోక్ష రూప ఫలము అనిష్ట నివృత్తి పూర్వక - ఇష్ట ప్రాప్తి రూప మైనందున, "న - మః" శబ్దార్థ వివక్షితమైన అనిష్ట నివృత్తి ప్రార్థనమును "మనో వా క్కాయైః అనాదికాల ప్రవృత్త..." "...అశేషతః క్షమస్వ" మాయాం తారయ" ఇత్యాది వాక్య ములలో నిరూపించిరి. ఆ పైన - "తేషాం జ్ఞానీ నిత్యయుక్తః..." అని యారంభించి, మొత్తము ఈ గద్యాంతము వరకును పరభక్తి - పరజ్ఞాన - పరమ భక్తులను తమకు ప్రసాదింపు మని ప్రార్థించి, త త్పూర్వకముగా నిరతిశయ ప్రీతికారిత దివ్య దంపతి కైంకర్యరూప పురుషార్థమును శ్రీవైకుంఠమున లభింపజేయు మని అపేక్షించిరి. "తథాఽస్తు" - అని శ్రీరంగనాథుని అనుమతిని పొందిరి. ఈ విధ ముగా మొత్తము ఈ శరణాగతి గద్యము ద్వయ మంత్ర వివక్షిత సర్వ రహస్యార్థ నిరూపణ పరము అని వ్యాఖ్యాన కర్తలు తెలిపి యున్నారు.

## శ్రీభాష్యకారుల ముక్తకము - మహా విశ్వాసమే ప్రపత్తి

శ్రీ దేశికులవారు నిక్షేప రక్షా గ్రంథములో నొక చోట - శ్రీభాష్యకారులు ప్రసాదించిన ముక్తక వాక్యము' అని, ప్రపత్తి స్వరూప నిష్కర్ష రూప మగు వాక్య ముదాహరించియున్నారు. అది ముక్తకము. అనగా - తమ గ్రంథములలో - శ్రీరామానుజులవారు

రచించిన వాక్యము గాక, సందర్భ వశమున తాత్కాలికముగా, యాదృచ్ఛికముగా శిష్యు లడిగిన ప్రశ్నకు సమాధాన రూపమున ఒకనాడు వారు ప్రసాదించిన దివ్యసూక్తి యట. సంప్రదాయానుగతముగా గురుపరంపరలోని ఆచార్యులు ఉదాహరించుచు వచ్చినట్లు దేశికులవారు తెలిపిన ఆ రామానుజ దివ్య సూక్తి యిది :-

" ప్రపత్తి ర్విశ్వాసః । సకృత్ ప్రార్థనా మాత్రేణ అపేక్షితం దాస్య తీతి విశ్వాస పూర్వకం ప్రార్థన మితి యావత్. "

'ప్రపత్తి' అనగా విశ్వాసము. ఒకసారి ప్రార్థించినమాత్రముననే అపేక్షించిన ఫలమును తప్పక ఇవ్వగలడు - అను విశ్వాసముతో భగవంతుని ప్రార్థించుటయే ఈ ప్రపత్తి' అని రామానుజులవారి ఉపదేశము ఈ భాష్యకారుల సూక్తి - ప్రపత్తికి లక్షణమును పాంచరాత్రాగమోక్త పద్ధతిలో నిల్లు సూచించుచున్నది :-

" అనన్య సాధ్యే స్వాభీష్టే మహా విశ్వాస పూర్వకమ్
త దేకోపాయతా యాచ్ఞా - ప్రపత్తి శ్శరణాగతిః. "

— (విష్వక్సేన సంహిత)

" అహ మస్మ్యపరాధానాం ఆలయః అకించనోఽగతిః
త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనా మతిః
శరణాగతి రిత్యుక్తా - సా దేవేఽస్మిన్ ప్రయుజ్యతామ్. "

— (అహిర్బుధ్న్య సంహిత)

పై శ్లోకముల తాత్పర్య మిది :—

ప్రపన్నునికి అభీష్టమైనది మోక్షము. దానిని స్వప్రయత్నముతో నేను సాధించుకొనజాలను. నాలో - కర్మ, జ్ఞాన, భక్త్యాదులు, శమ - దమాదులు సాధనము లేవియు లేనందున, నేను

అకించనుడను. దేవతాంతరము నాశ్రయించెద మన్నను, వారు గూడ మోక్షమును సాధించి పెట్టలేరు. ఇట్లు యోగ్యతలుగాని, సాధనములు గాని లేనివాడను. వే రేగతి లేనివాడను, అనేకాపరాధములు చేసిన వాడను అగు నాకు నీవే రక్షకుడవు కమ్ము - అని తన స్వరూపమును నివేదించుకొని, దయామయు డగు శ్రియఃపతి అవశ్యము రక్షింపగల డను విశ్వాసముతో - స్వరక్షణ భరమును భగవంతునిపై నుంచుట యను ఆత్మార్పణమునే ప్రపత్తి యని, శరణాగతి యని పెద్దలు నిర్వచింతురు.

ఈ ప్రపత్తి ఫలించుటకు మహా విశ్వాసమే మూల కారణము. ఈ విషయమున సంశయ లేశము గూడ నుండరాదు. ఎన్ని కష్టములు అవాంతరముగా వచ్చినను - రక్షింపడేమో ? రక్షింపలేడేమో ? అను సందేహము కలుగరాదు. ఈ మహా విశ్వాసము కలిగి యుంచు టయే కష్టము. కాని, అదియే ముఖ్యము.

దేశికులవారు నిక్షేప రక్షలో - ఈ విశ్వాస దార్ఢ్యమును గూర్చి ఇట్లు వ్రాసియున్నారు :-

" యేషాం యావజ్జీవం బృహస్పతి ప్రభృతిభి రపి ప్రతివాదిభిః సంక్షోభ్య మాణానాం ప్రపత్తిశాస్త్రార్థే శంకా శంకుర్నాంకురీతి, తేషాం తదధికారః. ఈదృశస్య హ ప్రపత్త్యధికారిణో దుర్లభత్వ ముక్తమ్. "

బృహస్పతివంటి మహా మేధావులు గూడ ప్రతివాదులై వచ్చి, యుక్తి ప్రయుక్తులతో మెప్పించవలె నని ఎవని మనస్సునందు అణు మాత్రము గూడ ఈ శరణాగతి శాస్త్రమున అవిశ్వాస మేర్పడదో, అట్టి దృఢ విశ్వాస శాలియే ఈ ప్రవృత్తి ననుష్ఠించుటకు అధికారి. ఇంతటి నిష్ఠ కలవారు లోకమున సామాన్యముగా ఉండుట దుర్లభము.

## ఇది సులభోపాయము - అవశ్య ఫలప్రదము

**చిన్న ఆక్షేపము :-** మానవుడు తాను ఉజ్జీవించుటకై చేయవలసినవిగా శాస్త్రములలో విధింపబడిన శ్రమసాధ్యములైన కర్మ - జ్ఞాన - భక్తియోగాది రూప ప్రవృత్తుల కంటె సర్వ ధర్మములను విడచి, భగవంతునిపై స్వరక్షణ భారము నుంచి, నిర్భరుడై యుండుట అనబడు నివృత్తి రూపమైన ఈ శరణాగతి శ్రమ లేనందున, అతి సులభమైన ఉపాయ మని కొందరు భావించుచున్నారు. 'భగవత్ప్రవృత్తి విరోధి స్వప్రవృత్తి నివృత్తియే ప్రపత్తి' యని శ్రీరామమిశ్రు లను ఆచార్యులు దీనికి లక్షణమును గూడ తెలిపియున్నారు. జీవుడు తనను తానే రక్షించుకొన గల నను భ్రమతో ప్రయత్నించునంతవరకు భగవంతుడు వీని రక్షణమున ఉదాసీనుడై యుండును. కావున, భగవంతుడు మనను రక్షింప నుద్యమించుటకు విరుద్ధమైన ప్రవృత్తిని మనము మానుకొనుటయే. అనగా - ఆయనపై భారము వేసి, స్వప్రవృత్తి నివృత్తిని పొంది, నిశ్చింతగా నుండుటయే శరణాగతి యని పై శ్రీరామ మిశ్రుల వారి లక్షణమునకు అర్థము గదా ! పైకి ఇది సులభ మనిపించవచ్చునుగాని, నిజమునకు ఇట్లుండుట సాధ్యమా ? సత్త్వ రజ స్తమో గుణమయమైన శరీరముతో నుండు మానవుడు స్వరక్షణకై ఏమియు చేయక, ఎట్లుండగలడు ? ఆ ప్రాకృత గుణముల ప్రేరణతో ఏదో ఎల్లప్పుడును అవశముగా పని చేయుచుండు వీనికి - సర్వ ప్రవృత్తులను మానుకొనుట ఎట్లు సాధ్యము ? ప్రబలమైన ఝంఝూ వాతముచే ఉవ్వెత్తున లేచి చలించు తరంగములు గల సముద్ర మధ్యమున ఉన్న వానిని నీవు అణుమాత్రము గూడ కదలకు మన్నచో, అత డట్లుండగలడా ? అది యెట్లు అసాధ్యమో, మీరు చెప్పు భగవత్ప్రవృత్తి విరోధి

స్వప్రవృత్తి నివృత్తి యనబడు ఈ ప్రవృత్తియు అట్లు అసాధ్యమే గదా !

**సమాధానము వినుడు :-** మీరు చెప్పినది నిజమే. లోకమందు ఎవడును ఏ ప్రవృత్తియు లేకుండ నుండజాలడు. భగవత్ప్రవృత్తికి విరుద్ధ మగు స్వప్రవృత్తిని మానుకొనవలె నని రక్షణము చెప్పబడినది గాని, "సర్వ ప్రవృత్తి నివృత్తిః" అని చెప్పబడలేదుగదా ! ప్రపన్నుడు మానుకొనవలసిన స్వప్రవృత్తి యనగా - ఏది ? అన్నచో - స్వరక్షణకై స్వతంత్రించి తాను ప్రవర్తించుట, లేక - దేవతాంతరముల నాశ్రయించుట; ఇటువంటి స్వప్రవృత్తిని మానుకొనవలె నని దాని యర్థము. మరియు, భగవంతుడు తనను రక్షింపబూనుటకు విరుద్ధమైన స్వప్రవృత్తి యనగా - 'నేను శరణాగతిని చేసితిని. ఇక నా కేమి ?' అను భ్రమలో పడి, భగవంతుని గూడ క్షమింపరాని భగవద్భాగవ తాచార్యాదుల విషయమై ఘోరాపచారములను చేయుటకు ప్రవర్తింపరాదు. అది భగవత్ప్రపత్తికి విరోధి. అట్టి స్వప్రవృత్తిని (దుష్కార్య ప్రవృత్తిని) తనలో లేకుండ నివర్తింపజేసికొనవలె నని భావమును చెప్పవచ్చును. శరణాగతి బ్రహ్మాస్త్రము వంటిది గనుక, దీనిని చేసినవాడు అవిశ్వాసముతో మరొక అల్ప సాధనమును గూడ అనుష్ఠింపరా దని, అట్లు చేసినచో బ్రహ్మాస్త్రము వలె, ఈ శరణాగతియు ఫలింప దని గ్రహింప దగును. మరియు, ఫలార్థియై రాజ సేవ చేయుచున్నవాడు - అందులకై పురుషాంతరమునుగూడ ఆశ్రయించుట తగదుగదా ! అపుడు రాజుపై అపనమ్మకమే మిగులును గాని, రాజును కా దని ఆ రెండవ పురుషుడు ఫలము నియ్యలేడుగదా ! రాజును సేవించినను, ఆ రాజునకు అంతరంగ ప్రేమపాత్రులైన అతని దార పుత్రాదులను బట్టి ఇటువంటి ప్రవృత్తి నివృత్తి యనుటకు తాత్పర్యము. అంతేకాని, కాలు సేతులు

గూడ కనపడకుండను నిత్యము సాదర భగవ ద్భాగవతాది వందన - కైంకర్యాది కృత్యములు గూడ లేకుండను ముముచుకొని కూర్చున వలె నని తాత్పర్యము కాదు. కావున, ఇప్పుడు చెప్పిన మహా విశ్వాస రూపమైన ఈ ప్రపత్తి - ప్రమాద భరితములై, అసాధ్యములైన కర్మ - జ్ఞాన - భక్తియోగాది ఉపాయాంతరములకంటె తన అశక్తిని, అకించన్యమును పురస్కరించుకొని ఆత్మార్పణము చేయుటయే గనుక, ఇది సులభోపాయమే. ఈ క్రింది ఉదాహరణములను సావధానముగా గమనింపుడు :-

అపరాధి యగు ఒక పురుషునికి సార్వభౌముడు శిక్షను విధించెను. దోషి యగు అతడు భయ చకితుడై, తన దైన్యమును ప్రకటించుకొనుటకు మెడలో చినుగు గుడ్డముక్క కట్టుకొని, గద్గద స్వరముతో విలపించుచు, కన్నీరుగా నేడ్చుచు పాదములపై బడి ప్రబతిమిలాడుచుండును. మరియొక అపరాధి - సార్వభౌముని అనుగ్రహింపజేసికొనుటకై తన వద్ద నున్న సువర్ణ రత్నాది అమూల్య వస్తువులను కానుకగా నర్పించి పలు విధములుగా స్తుతించుచు, వివిధ సేవలు చేయుచుండును. వా రిద్దరిని చక్రవర్తి చివరకు క్షమించును. కాని, మొదటివాని దైన్యమునకు మనస్సు ద్రవింపగా - అతనిపై నెక్కువగా రాజు అనుగ్రహమును ప్రదర్శించును. ఇది లోక సిద్ధము. అంతే కాదు. వెనుక చెప్పినట్లు, నిశ్చల మగు మహా విశ్వాస ముండుట కొందరిలో అసంభవము గనుక, ఆ విధముగా ప్రపత్తి దుష్కరము కావచ్చును గాని, అది కలవానికి కర్మయోగాదులకంటె ఇది అత్యంత సులభోపాయ మనుటలో ఆక్షేపము లేదు. కనుక నే -

" ఉపాయః సుకర శ్చాయం - దుష్కర శ్చ మతో మమ. "

అని భగవంతుడే తెలిపెను.

ఒకడు - 'ఒక్క సారి శరణాగతి చేసినంత మాత్రమున అనాది కాలముగా చేసియున్న మహా పాపము లన్నియు తొలగి పోవునా ? బ్రహ్మ రుద్రాదులకు గూడ లభ్యము కాని ఆ మహా మోక్షము ఈ చిన్న ప్రపత్తితో లభించునా ?' అని సందేహ డోలాచల చ్చిత్తుడై, ఉపాయాంతరములకు అన్వేషించును. అతనిలోని రజ స్తమో గుణములు మన శ్శైథిల్యమును కలిగించి, అతనిని పెడ త్రోవ పట్టించును.

మ రొకడు - తన అదృష్ట పరిపాకమును బట్టి, శ్రియఃపతిలోని సౌశీల్య వాత్సల్యాది నిరతిశయ మహా గుణములపై విశ్వాస మేర్పడగా - 'కాకాసురుని గూడ స్వామి రక్షింపలేదా ! నమ్ముకొన్న నన్ను మాత్రము వారు రక్షింపరా ? అని భావించి, నిస్సందేహుడై, స్వప్రవృత్తి కలిగి యుండును. కావున, ఇట్టి దృఢాధ్యవసాయమును అలవరచుకొను మని తెలుపుటయే "శరణం వ్రజ" అని విధించుటలో గల ముఖ్యాశయము.

## ప్రపన్నునకు ఇది నిత్యానుసంధేయము

ప్రపన్నునకు అష్టాక్షరి నియత సమయములలో అనుసంధింప దగినది కాగా - ఈ ద్వయ మంత్రము, ఏత త్సార వివరణ రూప మైన శరణాగతి గద్యము నిత్యానుసంధేయములు. కనుకనే శ్రీరామానుజులు గద్యాంతమున ఒక చోట - "ద్వయం అర్థానుసంధానేన సహ సదా ఏవం వక్తా" అనియు ప్రసాదించియున్నారు. ఇచట కేవలము ఈ మంత్రరత్నానుసంధానము ముఖ్యము కాదు. దానితో పాటు అందలి అర్థ మాధుర్యమును భావనా రూపమున ఆస్వాదించుటయే ముఖ్య మని - "అర్థానుసన్ధానేన సహ" అను పదముతో సూచించుచున్నారు. ఈ విధముగా జీవిత కాలశేషమును గడుపుట

ప్రపన్నుని విధి యని దీని భావము. శ్రీ వరవర మునీంద్రులను గూర్చిన దినచర్యా స్తోత్రమున గూడ ఈ క్రింది శ్లోకములో ఈ విషయము సూచితము :-

" మంత్ర రత్నానుసంధాన సంతత స్ఫురితాధరమ్
తదర్థ తత్త్వ నిధ్యాన సన్నద్ధ పులకోద్గమమ్. "

సంప్రదాయ తత్త్వము నెరిగిన శ్రీకృష్ణదేవరాయలు శ్రీవిష్ణు చిత్తుని వర్ణించిన పద్యమున - 'ద్వాయ సద్మ పద్మ వదనుడు' అనును. విష్ణుచిత్తుని ముఖ పద్మము నిత్యము ద్వయమంత్రానుసంధానమునకు స్థావర మైనది అని దాని అర్థము.

## అర్థానుసంధానము - దాని ప్రయోజనము

భావుకుడైన ప్రపన్నుడు మంత్రోచ్చారణము చేయుచు, ప్రతి పదము అందులో ఇమిడియున్న ఆచార్యోపదేశ లబ్ధమైన అర్థ తత్త్వమును ఆస్వాదించుచుండును. శ్రీమ చ్ఛబ్దముచేత బోధితమైన లక్ష్మీ పురుషకార వైభవమును నారాయణ శబ్ద నిరూపితమైన లక్షణోప యోగి జ్ఞాన బలైశ్వర్యాది గుణములను ఆశ్రయణ సౌకర్యాపాద కములైన సౌశీల్య సౌలభ్యాది గుణములను, ముఖ్యాతిముఖ్యములైన దయా వాత్సల్యములను, దివ్యమంగళ విగ్రహ సౌందర్యమును తన స్వామితో గల నవ విధ సంబంధములను మనసార భావించుచు - 'ప్రపద్యే' అని తాను చేసిన శరణాగతిని మాటిమాటికి స్మరించు కొనును. తనకు అపేక్షితమైన ఫలము ఆ దివ్య దంపతుల నిత్యాను వృత్తి రూపమైన కైంకర్యమే నని - ఇంతకాలము అది లభించక, ప్రతిబంధముగా గల ఈ స్థూల సూక్ష్మ ప్రకృతి సంబంధము త జ్జన్యములైన దుర్భర తాపత్రయ దుఃఖములు తొలగిపోయి, భగవ

త్సన్నిధికి చేరి, ఆ కైంకర్య ఫలమును లభించి, అమృత సాగరాంతర్నిమగ్నుడను కావలె నని ఉవ్విళ్ళూరుచు -

" కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియ మివాతిథిమ్. "

అనునట్లు - రానున్న ఆ మధుర ఘడియలకై నిరీక్షించుచుండును. ఈ గద్యములోని వాక్యము లన్నియు - ఈ అర్థానుసంధాన వివరణమే. ఈ మధుర భావనా పరంపరతోనే కాలము. అతనికి బాహ్య ప్రపంచముపై ధ్యాసయే ఉండదు. పూర్తిగా దీనిని మరచిపోవును.

"ప్రపద్యే" అను ఉత్తమ పురుష క్రియాపద సూచితమైన స్వస్వరూపమును "నమ" శ్శబ్ద గర్భితమైన అవిద్యా కర్మ వాసనాది విరోధి వర్గమును తొలగించు మనియు, పాపరాశిని క్షమింపు మనియు స్వామిని ప్రార్థించవలెను. ప్రపత్తి శాస్త్ర సర్వస్వము అనబడు శ్రీవచనభూషణ ప్రబంధమున శ్రీ లోకాచార్యులవారును, వ్యాఖ్యాన కర్త శ్రీ వరవర మునీంద్రులును తృతీయ ప్రకరణములో చివరకు ఈ అర్థానుసంధాన పద్ధతిని గూర్చి కొన్ని సూత్రములను వివరించియున్నారు. అట్టి వానిలో - "స్వదోషానుసంధానం భయ హేతు । భగవద్గుణానుసంధానం అభయహేతు." ఇది యొక గంభీర మైన సూత్రము. ప్రపన్నునకు ఒక విధముగా అభయము నిత్యము భావనలో మెదులుచుండవలెను. అజ్ఞానముచేత తాను చేసిన - చేయు చున్న - చేయనున్న నానావిధానంత భగవ ద్భాగవతాపచారము లను తలచుకొని, వీనివలన తనకు సంప్రాప్తించు దుఃఖ పరంపరను ఊహించుకొని, భయముతో వణకిపోవును. భగవంతుడు క్షమించినచో తప్ప, వీనికి నిష్కృతి లే దని ఆవేదన చెందును. ఈ ఆవేదనా రూప

మైన భయము నిత్యానువృత్తము కావలయును. ఇదియే నమః శబ్దార్థానుసంధానము.

ఇక - ప్రబలమైన ఈ భయమును నిర్వర్తించుటకు - దయా వాత్సల్యాది మహాగుణ సముద్రుడును, ఆపద్బాంధవుడు నైన భగవంతుని వివిధ సద్గుణములను విడమరచి భావించుకొనుచు, ఆయన తప్పక రక్షింపగల డని మహా విశ్వాసము కలిగి, నిర్భయ మనస్కులు కావలెను. ఇది నారాయణ శబ్దానుసంధానము. ఇట్టి భయము, అభయము మనస్సులో నిత్యానువృత్తములై యుండవలె నని సూచించుట కొరకే అర్థానుసంధానముతో పాటు - ద్వయోచ్చారణము చేయుచుండవలసిన దని పెద్దలు ఆదేశించిరి.

శరణాగతి గద్యలోని చివరి భాగ మంతయు మనకు ఈ పరమార్థమునే ఆవిష్కరించుచున్నది. నానావిధానంతాపచారములను క్షమించు మనియు, పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తిభావములను నాలో కలిగించు మనియు నిరతిశయ ప్రీతికరమైన నీ దివ్య కైంకర్యము ను ప్రసాదించు మనియు శ్రీ రామానుజులు ప్రార్థించిరి. శ్రీరంగనాథుడు - "తథాఽస్తు" అని అభయమును ప్రసాదించెను. శ్రీ రామానుజులు చేసిన ఈ శరణాగతికి ఫలము - వారికి మాత్రమే గాక, నిత్యము ఇందలి తత్త్వమును మనసార భావించు శ్రీవైష్ణవ భావ భావితమైన సకల భావుక ప్రపన్న లోకమునకు అవశ్యము సంక్రమింపగల దని విశ్వసింతము.

ఈ శరణాగతి గద్యమునందు గల గంభీర భావ పరంపరను రసిక హృదయులు, ఆస్తికులు - సావధానముగా, సంపూర్ణముగా - వ్యాఖ్యానముల, అనువాదముల సహాయముతో గ్రహింతురు గనుక, ఈ తత్త్వోపహారమును సంగ్రహముగా సమర్పించి విరమింతును.



# భగవద్రామానుజులు - శ్రీరంగ గద్యము

గాన కళా ప్రపూర్ణ - సంగీత సాహిత్య కళానిధి

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



" యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మ రుక్మ
వ్యామోహిత స్తదితరాణి తృణాయ మేనే
అస్మ ద్గురో ర్భగవతోఽస్య దయైక సిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే. "

## భృగు మహర్షి శాపము - అవైదిక మత విజృంభణము

భృగు మహర్షి శాప వశముచే ఒకానొకపుడు అవైదికము లగు కొన్ని మతములు నెలకొన్నవి. అందు - జైన, బౌద్ధ, చార్వాకాదులు ప్రధానములు. ఆ మతములు విజృంభించు కాలమున 8 - వ శతాబ్దములో శంకచార్యు లవతరించిరి.

## శంకర యుగము - ఆస్తిక మత పునరుజ్జీవనము

శంకరాచార్యుల జీవిత కాలము ముప్పది రెండు సంవత్సరములే యయ్యును - వారు అవైదిక మతముల నెదుర్కొని, తమ పాండిత్య యుక్తి ప్రభావములచే వానిని రూపు మాపి, తాము రచించిన ప్రస్థానత్రయ భాష్యముల ద్వారా, భజగోవిందాది స్తోత్రముల ద్వారా వేద ప్రామాణ్య బుద్ధిని, నారాయణ పరత్వ బుద్ధిని,

హరి భక్తిని జనులయందు నెలకొల్పి, హైందవ సమాజమును ప్రమాణ పరతంత్రముగా చక్క దిద్దిరి. అంతవరకును వారు చేసినది మహోదాత్త మయిన పని.

## శంకరాచార్యులు - జగన్మిథ్యా వాదము

కాని, శంకరులు ఆత్మ తత్త్వ పరముగా ప్రతిపాదించిన విషయములు - బ్రహ్మము మాయావృతమై, అనేక జీవులుగా భావించుచున్నది కనుక, అది ఆభాస మాత్రమే కాని, నిజమునకు - జీవేశ్వరులకు అభేద మనియు, బ్రహ్మము నిర్గుణ మనియు, నిర్విశేష మనియును. అంతేకాక, ప్రకృతి తత్త్వమును జగన్మిథ్యా వాదముచే నాస్తిగా ప్రతిపాదించిరి. ఇదియే పారమార్థిక సత్య మనియు, తదితరము వ్యావహారిక సత్య మనియు అంగీకరించిరి.

## భగవద్రామానుజులు - తత్త్వ త్రయము

భగవద్రామానుజుల పరిశోధనము ప్రధానముగా పై విషయముల మీద ప్రసరించినది. 'చిత్, అచిత్, ఈశ్వర - తత్త్వములు మూడును నిత్య సత్యములే. ఈశ్వరుడు - చిత్, అచిత్ లను శరీరముగా కలిగి, చిదచిత్తులకు నియంతయై, ఈ అన్నిటికి శేషియై, సమస్త కల్యాణ గుణ భరితుడై, సమస్త హేయగుణ రహితుడై, సమస్త జగత్తులకు ఉపాదాన సహకారికారణమై, ముముక్షువులకు ఉపాస్యుడై, ముక్తి ప్రదుడై ప్రకాశించును' అని భగవద్రామానుజులు తమ శాస్త్రానుభవ, పాండిత్య, దీర్ఘ జీవితానుభవములతో సిద్ధాంతీకరించిరి. ఈ సిద్ధాంతమును ప్రతిపాదించు గ్రంథములే వారి శ్రీభాష్యము (సూత్ర భాష్యము). గీతా భాష్యము, వేదార్థ సంగ్రహము మొదలగునవి.

## శ్రీరామానుజులు పరమ యోగులు

ఈ విషయములను పురస్కరించుకొని భగవద్రామానుజ సిద్ధాంత ప్రవిష్టు లగు మహా పండితులు - రామానుజులు పరమ యోగు లనియు, శ్రుతులకు, బ్రహ్మసూత్రములకు లోజ్వరమును పోగొట్టి రనియు స్తోత్రము చేసియున్నారు.

మరియు, భగవద్రామానుజులు - తాము చేసినది క్రొత్త సిద్ధాంతము కాదనియు, శ్రుతి నికరములకు, పూర్వ ఋషులకు, బోధాయనాది పూర్వాచార్యులకు సమ్మతము లగు సిద్ధాంతము లనియు నొక్కి వక్కాణించిరి.

## శ్రీ రామానుజులు - గద్య త్రయము

తత్త్వమును తెలిసికొనుట ఈ యుగమందు సాధ్యపడునది కాదని భగవద్రామానుజులు లోక సంగ్రహ బుద్ధితో - అనుసంధాన మాత్రమున శ్రేయస్కరములుగా నుండునట్లు మూడు గద్యలను కటాక్షించిరి. వానిని - 'గద్య త్రయ' మందురు. ప్రపన్నులు ఈ గద్య త్రయమును పఠించుకొనిన చాలును.

మొదటిది - శరణాగతి గద్యము. లక్ష్మీదేవి పురుషకారముగా (చేతనుని భగవానుడు అనుగ్రహించునట్లు చేయునది) పరమర్షులు నిర్దేశించిరి. కనుక, "అఖిల జగన్మాతరం అస్మన్మాతరం...శరణ మహం ప్రపద్యే" అని మొదటి గద్యమున లక్ష్మీదేవి శరణాగతి చేసిరి.

రెండవది - శ్రీరంగ గద్యము. ఇది శ్రీరంగనాథుని సంబోధించుచు, శ్రీరంగమందే తమకు నిత్య నివాసమును, నిత్య కైంకర్యమును కటాక్షించు మని చేసిన ప్రార్థనా గద్యము.

# అర్చావతార వైభవము

భగవంతుని పర - వ్యూహ - విభవ - అంతర్యామి - అర్చా అవతారములలో - అర్చావతారమే దర్శన సులభమై, ప్రాజన సులభమై, అభిగమన సులభమై, భక్తులకు కల్పవృక్ష మయినది.

" ప్రతిమా స్వప్రబుద్ధానాం. "

అను వ్యాఖ్యానుసారముగా - భగవంతునిచేత ప్రబుద్ధు లయిన ఆళ్వారు లందరును ఈ అర్చావతారమునందే ఈడు పడిరి. ఈ అర్చావతారమే -

" విజరో, విమృత్యుః, అవాకీ. "

అనునట్లు - తరుగనది, నాశ రహితమైనది, మాటలాడనదిగా నుండి - ప్రపన్నులకు భావస్థిరమై, సేవానందప్రదమై, ఆత్మయొక్క శేషత్వ రక్షకమై, కైంకర్య వర్థకమై యలరారుచున్నది. అట్టి అర్చావతారము లలో - శ్రీరంగనాథునకు కొన్ని ప్రత్యేకతలు గలవు.

# శ్రీరంగనాథ వైభవము

సృష్ట్యాదియందు నారాయణుడే తన ప్రతీక యగు బ్రహ్మ కీయబడిన దా శ్రీరంగనాథుని అర్చా మూర్తి. పిదప - ఇక్ష్వాకుప్ర మొదలుకొని, శ్రీరామచంద్రస్వామివరకు కుల ధనముగ భావించి, ఆ వంశ ప్రభువులచే అర్చింపబడి, దివ్య జ్ఞాన సంపన్నుడు - భగవచ్ఛరణాగతుడు నగు విభీషణునకు ప్రసాదింపబడినది. మరియు -

" కృతే యుగే దేవరాజః త్రేతాయాం రంగనాయకః. "

అను వాక్యానుసారముగా - 'కృత యుగమున వరదరాజస్వామి, త్రేతా యుగమున శ్రీరంగనాథుడు' అనెడి పౌర్వాపర్యము కావేరీ

తీరమందు విభీషణుడు చేసిన ప్రతిష్ఠా కాలమే కాని, శ్రీరంగనాథుని ఆవిర్భావము సృష్ట్యాదియందే కదా ! అందుచేతనే శ్రీరంగనాథుని - 'పెరియ పెరుమాళ్' (పెద్ద దేవుడు) అని పూర్వాచార్యులు నిర్దే శించిరి. మరియు - 'కావేరియే విరజానది, శ్రీరంగమే వైకుంఠము, రంగనాథుడే వాసుదేవుడు' అని పెద్దల నుడి యేర్పడినది. అందుచేతనే అది ప్రపన్నులకు (పరమ యోగులకు) ప్రాప్య స్థాన మయినది. శ్రీరంగ గద్యమున భగవద్రామానుజులు - శ్రీరంగమందు నిత్య నివాసము, ఆ స్వామియొక్క నిత్య కైంకర్యమును ప్రార్థించిరి.

ఈ గద్యమునందు - రామానుజ సిద్ధాంత మంతయు విశదీ కరింపబడినది. గద్యముయొక్క అర్థము సారముగా ఈ క్రింద అనువ దింపబడుచున్నది :-

## శ్రీరంగ గద్యము - శ్రీ రామానుజ మనో భావము

**గద్య తాత్పర్యము :-**

బద్ధులు, ముక్తులు, నిత్యులు అను మూడు విధము లగు చేతనులను, అచేతన పదార్థములను, వాని స్వరూప స్థితి భేదములను తన అధీనమం దుంచుకొని, స్వభావ సిద్ధము లయిన అంతు లేని జ్ఞాన బల ఐశ్వర్యాదులు, సౌశీల్య వాత్సల్యాదులు, మార్దవ సౌహార్ద గాంభీర్యాదులు, సత్యకామ సత్యసంకల్పాది గుణముల సముద్ర మగు వాడు, పరబ్రహ్మము, మనకు ప్రభువు నగు శ్రీరంగనాథుని దాస్య రసికత గల నేను - నిరంతర మనుభవించి, ఆ యనుభవానందమునకు తగినట్లు - సర్వకాల సర్వావస్థలయందు స్వరూప స్థితి కలిగి, నిత్య కింకరుడు నగుదునుగాక !

ఆత్మ భగవంతునిచే, నియమింపబడు నని, దాస్య రసమే దాని స్వభావమే యని యెఱుగక, భగవద్గుణానందానుభవమునకు ఉపాయ మగు భక్తిని, దాని కుపాయ మగు జ్ఞానమును, దాని కుపాయ మగు క్రియలను, వాని కనుగుణ మగు సాత్త్వికత, ఆస్తికత మొదలగు ఆత్మ గుణములు లేక, విపరీత జ్ఞాన క్రియలను చేయుచు, వీనిని దాట లేక, సంసార సముద్రమున మునిగి, నువ్వులలోని నూనెను, కట్టె యందలి నిప్పును చూడలేనట్లు, లోనున్న గుణత్రయ ప్రభావముచేత దాటలేని భగవన్మాయకు లోబడి, ఆత్మజ్ఞాన విహీనుడనై, త్రెంచు కొనలేని కర్మ పాశమునకు బద్ధుడనై, పెక్కు కాలము యోచించియు సంసారమును తరించు ఉపాయము తెలియనివాడనై యున్న నేను - ఓ సర్వభూత శరణ్యా! శ్రీమన్నారాయణా! నీ చరణారవిందములను శరణుగా పొందుచున్నాను.

ఇట్టి అవస్థలు కలిగియు - కోరిన మాత్రము చేత పరమ కారుణికు డగు భగవంతుడు - తన అనుభవమును, కైంకర్య అభి రుచిని, దాస్యమును ప్రసాదింపగల డని నమ్మికచే, భగవంతునే నిత్య కైంకర్యమును ప్రార్థించుచున్నాను. ఏ మనగా -

**శ్లోక తాత్పర్యము :-**

"ఓ నాథా! నీ అనుభవానందముచేత కలిగిన దాస్య రసమును నా కనుగ్రహింపుము. వేరు గతి యెరుగను. సర్వ కాల సర్వావస్థల యందు ఈ దాస రసము నాకు నిలిచియుండునట్లు నీవే అను గ్రహింపుము."

**గద్య తాత్పర్యము :-**

ఇట్టి ఆత్మ స్థితిని తెలియుట గాని, దానియందు ఇచ్ఛ లేనివాడ నైనను, దీనిని ఉచ్చరించినంతమాత్రముచేతనే నా మనస్సును నేను కోరిన పరమార్థమునందు నిష్ఠ కలదానినిగా నీ విప్పుడే చేయుము.

ఓ అపార కరుణాంబుధీ ! నీ వెట్టి ఆలోచనమే లేని సకల లోకులకును రక్షకుడవు. ప్రణతార్తి హారుడవు. ఆశ్రిత వత్సలుడవు. సమస్త భూతముల యాథాత్మ్యము నెల్లప్పుడును ఎరిగినవాడవు. సత్య కాముడవు. సత్య సంకల్పుడవు. ఆప ద్బాంధవుడవు. శ్రీరామా ! శ్రీరంగనాథా ! మన్నాథా ! శ్రీమన్నారాయణా ! పురుషోత్తమా ! నీకు నా ఆత్మను సమర్పణము చేయుచున్నాను.

ఇదియే భగవద్రామానుజుల శ్రీరంగ గద్య తాత్పర్యము.

## శ్రీరంగ గద్య వైశిష్ట్యము

నిజమునకు ఈ గద్యయందు ఆత్మ పరముగా తాము నివేదించు కొన్న లోపములు భగవద్రామానుజులకు లేవు. మరి ఈ గద్యమును వా రెందుకు చేసిరి ? నైచ్యానుసంధానము ఆత్మకు స్వరూపోచిత మగుట అట్లుండనిండు. భావి ప్రపన్న జనులు ఈ గద్యము నుచ్చ రించినమాత్రముచేతనే కైంకర్య రసము వర్ధిల్లి, భగవ దేకాంతులు అగుదురుగాక అని ఆశాసించి, అస్మదాది చేతనోద్ధరణమునకే చేసిరి. భాష్యాది మహా గ్రంథములు పరపక్ష విక్షేపమునకు కాగా - ఈ గద్యమును స్వపక్ష నిక్షేపముగా రామానుజులు మనకు కటాక్షించిరి.

వాస్తవమునకు శరణాగతి గద్యము, వైకుంఠ గద్యము మాత్రము చాలునుగదా ! శ్రీరంగ గద్య వైశిష్ట్య మేమి ? ప్రార్థనా స్వరూపము మూడింటియందును ప్రాయశః సమానమేకదా ! అనిన - పరవాసుదేవుడు కాని, అర్చావతారుడుగాని ఉభయ విభూతులకును నిర్వాహకు లనియే భావ మున్నను, శ్రీరంగనాథుడు ప్రత్యేకముగా లీలా విభూతి నిర్వాహకుడుగా ప్రత్యహమును ప్రత్యక్షముగా నుండు

టచే, సన్నిహిత పరిత్యాగము చేయక, శ్రీరంగ గద్యమును రెండు గద్యముల మధ్య కూర్చిరి.

తిరుమంత్ర చరమ శ్లోకముల మధ్య నున్న ద్వయమంత్ర మెట్లు ప్రపన్న జనులకు నిత్యానుసంధేయమో, ఈ గద్యమును అట్లే. శ్రీరంగ గద్యము కేవలము భగవద్రామానుజులు స్వామి సన్నిధిలో ప్రార్థనా రూప వాదము. దీని పిదప వైకుంఠ గద్యమున రామానుజుల వారి వాదము, అప్రాకృత వైకుంఠ లోక వర్ణనమును కనులకు కట్టిన ట్లుండును. ఈ గద్యమున స్వామివారి ప్రార్థనమును విని వైకుంఠుడు అనుగ్రహ వాక్యములు పలికి, అనుభవానంద సుధానిధియందు ముంచెను. ఈ అనుభవమునకు శ్రీరంగ గద్యమే హేతు వయినది. శ్రీరంగ గద్యానుసంధాన ప్రభావముచేత ధ్యాన యోగము కలిగి, ఆ ధ్యానముచేత వైకుంఠము భగవద్రామానుజులకు కట్టెదుట సాక్షాత్కరించినది. ఆ పారవశ్యమే వాగ్రూపమున వైకుంఠ గద్య మయినది. ఈ శ్రీరంగ గద్య ప్రభావముచేతనే భగవద్రామానుజులు పరమయోగులుగా కీర్తింపబడిరి.

" తస్మై రామానుజార్యాయ నమః పరమయోగినే
య శ్శ్రుతి స్మృతి సూత్రాణాం అంతర్జ్వర మశీశమత్. "



# శ్రీరంగ గద్యము
# శ్రీ రామానుజ భావనా విశేషము

'ఉభయ వేదాంత విశారద'

## శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ



జేజీయతాం భవ పయోనిధి తుంగ భంగ
సంఘర్షి బద్ధ జనతా పన కర్ణ ధారః
రామానుజో యతిపతి ర్వ్యచకార* యో సా
వష్టాక్షరీ మమృత సౌధ సువర్ణ కుంచీమ్.

## మానవులు - కర్మానుభవము

మానవు లనాది సంచిత కర్మ ఫలానుభూతికై జనన మరణ పరంపరా రూప సంసార సాగర తరంగ బంభ్రమ్యమాణు లగుచున్నారు. ఇ దెప్పుడు మొదలైనదో తెలియరాదు గాన 'అనాది' అన్నారు.

" న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మ కృత్. " — (గీత)

ఉండలేదు చేయకుండ కార్యమ్ముల నొక్క నిముసమేని నొక్కడేని.

— (గీతా నవనీతము)

చేతనుడైన జీవుడు పని చేయక క్షణ ముండలేడు కాన, పని చేయును. చేసిన పని - ఫలము నీయక తప్పదు. కావున, కర్మ ఫలానుభూతికి జన్మ నెత్తును. సంచిత కర్మ భాగ మైన ప్రారబ్ధ మనుభవించుచు

---

* క్రూ - విక్షేపే.

చేయు పని, శేషించిన సంచిత కర్మ భాగముతో చేరి, 'ఆగామి'గా భావి జన్మానుభూతికి జీవునియందే లగ్నమై యుండును.

" అర్థా గృహే నివర్తన్తే స్మశానే మిత్ర బాంధవాః
సుకృతం దుష్కృతం చైవ గచ్ఛన్త మనుగచ్ఛతి. "

అనునట్లు, స్థూల శరీరమును వదలి పోవు జీవునితో - ఐహిక ధన ధాన్య గేహాదులు గాని, దార పుత్రాదులు గాని వెంట రారు. చేసిన పుణ్య పాపములు మాత్రమే వెంట వచ్చును' అని యందురు. ఈ కర్మలే మరు జన్మకు బీజము. వీనికి ఆద్యంతములు తెలియుట లేదు. కర్మ శేషించినంతకాలము జనన మరణములకు గురి యగుచున్నారు. 'జనన' మనగా - శరీరముతో చేరిక. 'మరణ' మనగా - శరీరము వదలి పోవుట.

" జీవాపేతం వావకిలేదం మ్రియత ఇతి. న జీవో మ్రియతే. "

— (ఛాందోగ్యము)

జీవుడు శరీరమును వదలినంతనే - 'చచ్చినాడు' అందురు. అంతేగాని, 'జీవుడు చావడు' అని ఉపనిషద్వాక్యము. ఇట్లా శరీరములు పాతవి వదలుచు, క్రొత్తవి ధరించుచుందురు.

చినిగిన పాతలన్ విడచి చేకొను నట్టుల క్రొత్త పుట్టముల్
తనువులు జీర్ణముల్ వదలి తత్కృత కర్మ ఫలానుభూతికై
కొను నవీన దేహముల, గోయవు కత్తులు; నీరు నార్పలే,
దనలము మాడ్చలే; దనిల మార్పదు జీవుని నిత్తు నిశ్చలున్.

— (గీతా నవనీతము)

పాత దేహమును వదలి, క్రొత్తది ధరించుచున్నందువలన, దేహమే క్రొత్తది గాని, జీవులు క్రొత్తవారు కారు. "మా + నవః" అనగా - అదియే యర్థము.

ఈ జీవుల గతి ఇంతేనా ? సముద్ర తరంగముల వలె ఎడతెగక మీద మీద పడుచుండు ఈతి బాధలతో, తాపత్రయములతో సతమత మగుచుండవలసినదేనా ? చీమ, దోమ, పక్షి, పశువు, కుక్క, నక్క, ఆవు, ఏనుగు, వానరము మొదలైన దేహములలో - ఉత్తమమైన 'మానవ' దేహమును - జ్ఞానాతిశయము గలదానిని ధరించియు, ఇతర దేహములందు వలె దేహబంధ విముక్తి పాటు పడక, ఆహార నిద్రాదులతో కాలము గడుపవలసినదేనా ? ఇంతకంటెను మానవులు సాధించవలసిన దేమియు లేదా ? అనగా - ఉన్నది.

## మానవ జీవిత పరమార్థము

" బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్.... " (గీత)

ఎన్ని జన్మల వడపోతతోనో మానవుడు జ్ఞానము గలవాడగుచున్నాడు. జ్ఞాన మనగా - "మోక్షే ధీః జ్ఞానమ్" అని, అమర నిఘంటుకారుని నిర్వచనము. అనగా - మోక్షమును పొందవలె ననెడి బుద్ధియే జ్ఞాన మన జెల్లు నని దీని తాత్పర్యము.

మానవు డైనంత మాత్రమున - మోక్ష విషయిక బుద్ధి కలుగదు. తామస, రాజస గుణ ప్రధానము లగు నర దేహముల నెన్నియో ధరించినమీద, సత్త్వ గుణాతిశయము గల జన్మ గల్గినచో - ముక్తి పొందవలె నను బుద్ధి పొడమును.

ధర్మార్థ కామ మోక్షములు మానవ జన్మ మెత్తినవారు సాధించవలసిన పురుషార్థములు. మొదటి మూడింటికి 'త్రివర్గ' మని

పేరు. వేద చోదిత విధు లగు ధర్మములను, వానికి విరుద్ధము గాని అర్థ కామములను మానవుడు సాధించి అనుభవించవలసినవియే. జ్యోతిష్టోమాది విధుల ననుష్ఠించి, దేవతలు కావచ్చును. ఐనను - పుణ్యము క్షీణించినంతనే భూమికి దిగి రావలసినదే. భూలోక మైనను, స్వర్గ మైనను ఈ లీలా విభూతికి చేరినవియే; సృష్టి స్థితి లయములకు గురి యగుచుండెడివే.

"ఆబ్రహ్మ భువనా ల్లోకాః పునరావృత్తినోఽర్జున!" — (గీత)

సృష్టికర్త యగు చతుర్ముఖునితో బాటు, ఆతని లోకముకూడ ప్రళయములో నామ రూపములు లేక పోవునదియే.

"మా ముపేత్య తు కౌంతేయ! పున ర్జన్మ న విద్యతే." — (గీత)

'నన్ను చేరినవారికి మరు జన్మలేదు' అని గీతాచార్యోపదేశము. దానిని సాధించిననేగాని, మానవ జన్మ సార్థకము కాజాలదు. అదియే పరమ పురుషార్థము. అది భగవంతుని నిత్య విభూతి, శుద్ధ సత్త్వమయము.

అచ్చటకు పోవుటకు జీవుల కర్మలు అడ్డుపడుచున్నవి. ఈ త్రిగుణాత్మక ప్రకృతి - నానారూప రస గంధాఢ్యమై, జీవుల ఇంద్రియములను తన వైపుకు లాగుకొనుచున్నది.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే." — (గీత)

ఈ 'మాయ' యను ప్రకృతి - భగవంతుని అపర ప్రకృతి. చాల బలవత్తరమైనది. దీని బంధములనుండి తప్పించుకొనుట అసాధ్యము.

" ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథ మేవ తు
బుద్ధిం తు సారథిం విద్ధి, మనః ప్రగ్రహ మేవ చ
ఇంద్రియాణి హయా న్యాహుః, విషయాగ్ం స్తేషు గోచరాః. "

అని కఠోపనిషత్తు - శరీర శరీరులను రమ్యముగా రూపించినది.

ఆత్మ రథికుడు, జ్ఞాన స్వరూపుడు. అతని ధర్మ జ్ఞానము బుద్ధి. అదియే సారథి. మనస్సు కళ్ళెము. ఇంద్రియములు గుఱ్ఱములు. విషయములు అశ్వములకు గమ్యములు. అవి గుఱ్ఱములను తమ వైపు లాగుచున్నవి.

" దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా. " —(గీత)

త్రిగుణాత్మిక ప్రకృతి రూప మగు దైవ మాయ - ఇంద్రియముల వెంటనే పోవుచుండును.

" ప్రాయోనేతి శ్రుతి విషయతా విశ్వ మాధుర్య హేతుః. "

అని నీలకంఠ దీక్షితు లన్నట్లు, నిషిద్ధముల యెడనే మక్కువ యెక్కువ.

" యస్త్వేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః
స తు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో న జాయతే. "

—(కఠోపనిషత్తు)

వశ్యేంద్రియములు గలవాడు ఇంద్రియములను ధర్మ మార్గములపై మరలించి, పునరావృత్తి రహిత మగు పరమ పదమును పొందగలడు. కాని, బలవత్తరమైన ప్రకృతి బంధములను విడిపించు కొను టెట్లు ? దానికా భగవానుడే సమాధానించినాడు - "మామేవ యే ప్రపద్యంతే మాయ మేతాం తరంతి తే" అని.

జీవుడు ధర్మి జ్ఞానము. అతని బుద్ధి ధర్మ జ్ఞానము. సూర్యుడు తేజో రూపుడు మింట తేజరిల్లుచుండ, ఆతని ధర్మమైన తేజస్సు ఎండ - దూరదూరములకు వ్యాపించుచుండును. అట్లే జీవుడు, ఆతని ధర్మము జ్ఞాన రూపములే. బుద్ధి పెడ త్రోవల బోవుచున్నను, దానిని రథికుడైన జీవుడు అదుపులో నుంచుకొని, సక్రమ మార్గమున పయనించవలెను. లేకున్న, రథమునకు, అశ్వములకు, సారథికి, రథికునకు ఆపద తప్పదు. అందుకు సజ్జన సహవాసము ఆవశ్యకము. శాస్త్ర బోధ అపేక్షణీయము.

## మోక్ష సాధనము

గీతలో - జ్ఞాన కర్మ భక్తు లను ముక్తి సాధనోపాయములు ఉపదిష్టములు. జ్ఞానము చదచి త్పరమాత్మ విషయక బోధ, "జ్ఞానాదేవ తు కైవల్యం." "జ్ఞాన విహీన స్సర్వ మతేన ముక్తిం న భజతి జన్మ శతేన." జ్ఞానము చేతనే ముక్తి. అది లేనివాని కెన్ని జన్మ లెత్తినను ముక్తి లేదు' అని శంకరాచార్యులు.

" లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ !
జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మ యోగేన యోగినామ్. " — (గీత)

గీతకు శంకరాచార్యులు భాష్యము వ్రాయుచు -

"సాంఖ్యానాం = ఆత్మానాత్మ విషయక జ్ఞానవతాం, బ్రహ్మచర్యాశ్రమా దేవ కృత సన్యాసానాం వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థానాం పరమ హంస పరివ్రాజకానాం బ్రహ్మణ్యేవ అవస్థితానాం, నిష్ఠాప్రోక్తా. "

ఆత్మానాత్మ వివేకము గల్గి, బ్రహ్మచర్యాశ్రమము నుండియే - గృహస్థాశ్రమము గైకొనక, నేరుగా సన్యాసమును స్వీకరించి, వేదాంత విజ్ఞాన పరినిష్ఠిత బుద్ధులై, పరమహంస పరివ్రాజకులై, పరమాత్మైకానుసంధానపరులైనవారికి - జ్ఞాన యోగము మోక్ష సాధనము" అన్నారు.

"జ్ఞానా దేవ తు కైవల్యం" 'జ్ఞానమే మోక్ష సాధనము' అని వారి మత ప్రకారము - ఉపనీతుడు పెండ్లి చేసికొనక, నేరుగా సన్న్యాసి కావలెను. ఆ సన్న్యాసి పరమహంస కావలెను. పరమహంస యనగా - జ్ఞాన కర్మేంద్రియ దశకమును బాహ్య విషయాసక్తము గానీయక, లౌకికము లగు సకల వ్యాపారములను ఆహార పానీయములతో బాటు వర్జించి, బ్రహ్మైక బద్ధ దృష్టి కలవాడు.

అట్టివాడు - నిత్య నైమిత్తిక కర్మ లేవియు చేయ నక్కర లేదు. తపస్వి వలె సదా బ్రహ్మైక బద్ధ దృష్టి కలవాడు కావలెను. భగవ దాజ్ఞ లైన నిత్య కర్మలు చేయ నక్కరలే దని గీతాచార్యుడే తెలిపినాడు :-

" యస్త్వాత్మ రతి రేవస్యా దాత్మ తృప్త శ్చ మానవః
ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే. " అని.

జ్ఞాన యోగ మనగా ఇది. అంతే గాని, "అహం బ్రహ్మాఽస్మి= నేనే బ్రహ్మ. జీవో బ్రహ్మైవ నాపరః = జీవుడే దేవుడు. వేరు కాదు" అను జ్ఞానము సమాధి పర్యంతము ప్రసృతము కాదేని - మోక్ష సాధనము కాజాలదు.

'చక్కెర తియ్యగా నుండును' అను జ్ఞానముచే, నోరు తీయగ కాదు. 'అగ్ని కాల్చును' అని తెలిసినంత మాత్రమున, ఒడలు కాలదు. అది కార్యానుష్ఠానము వరకు సాగవలెను. నోట వేసికొన్న చక్కెర అనుభూత మగును. నిప్పున ద్రేలుంచిన, కాలును. అట్లు పరమహంసయైన సాంఖ్యునకే జ్ఞానయోగము. అది సర్వజన సాధ్యము గానిది. అందులకే శంకరాచార్యులు -

" తస్యాః జ్ఞాన నిష్ఠాయాః సన్యాసినా మేవ అనుష్ఠేయత్వం. "

అని, జ్ఞాననిష్ఠ సన్యాసులకే. కర్మయోగము - సర్వకర్మలు వదలి, ఆహార పానీయయులు మాని, యమ నియమాదులచే స్వాధీన మనస్కులై, ఆత్మైక బద్ధ లక్ష్యులై, సమాధి నిష్ఠులు కాని సంసారు లకు' అని, అధికారి భేదమును నిరూపించిరి.

శ్రీకృష్ణ భగవానుడును -

" కర్మణైవ హి సంసిద్ధి మా స్థితా జనకాదయః "

" కురు కర్మైక తస్మా త్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. "

నీవును పూర్వు లనుష్ఠించినట్లు కర్మ లాచరింపుము' అని శాసించినా డర్జునుని - కాని, సన్యసించు మనలేదు.

చేసిన కర్మ - మరు జన్మకు బీజము గాకుండ, మోక్ష సాధనో పాయ యోగముగా మార్చుకొనుటకు -

" అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః. "

ఫలాసక్తి లేక, నియత కర్మ లనుష్ఠించినవాడు పరమమును పొందు చున్నాడు' అని ఉపాయమును ఆ భగవానుడే ఉపదేశించినాడు. కావున, 'నేను నా కొరకు ఈ ఫల మాసించి చేయుచున్నాను' అను బుద్ధిని వదలి, భగవంతుడు తన కొరకు - నిమిత్తమాత్రుడ నగు నాతో ఈ పనిని చేయించుచున్నాడు. కావున, చేయుటయే నా వంతు. ఫల మేమైనను సరియే - అది భగవంతునికే అను దృష్టితో ఆచ రించినయెడల, ఆ కర్మ - యోగమై, మోక్షసాధనోపాయ మగును.

ఈ జ్ఞానయోగమైనను, కర్మయోగమైనను భగవ త్ప్రసన్ను లకే మోక్ష సాధకము. ప్రకృతి బంధములను వారే తొలగించుకొన గలరు.

" మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే. "

నన్నాశ్రయించినవారే నా మాయను దాటగలరు' అని కృష్ణభగవాను డన్నాడు.

ఇక భక్తి - యోగము గావలె నన్న, పరభక్తియై, పరమ భక్తిగా మారవలయును.

" పూజ్యేషు అనురాగో భక్తిః. "

పెద్దల యెడ గౌరవాతిశయము భక్తి. అది అనన్య భక్తియైనచో పరభక్తి యగును.

" కామై స్తై స్తై ర్హృత జ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః
లభతే చ తతః కామాన్ .......................... " — (గీత)

చిల్లర దేవతలు త్వరగా ఫల మిత్తు రని తలచి, ఇంద్రియ సుఖ లోలుపులు ఇతర దేవతలను గొలిచి, ఫలమును పొందు చున్నారు.

" ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్ శ్రియ మిచ్ఛేద్ధు తాశనాత్
ఐశ్వర్య మీశ్వరా దిచ్ఛేత్ .........................."

అని, సూర్యాగ్నీశ్వరులను ఆ యా ఫలముల నాశించి కొలిచి, ఫలముల నొందుచున్నారు. కాని -

" మ యైవ విహితాన్ హితాన్. " — (గీత)

ఆ దేవతలకు ఆ ఫలము లిచ్చు శక్తి నే నిచ్చినదే' అన్నాడు కృష్ణ పరమాత్మ. ఐనచో - ఆ దేవత లిచ్చు ఫలములు -

" అంతవత్తు ఫలం తేషాం త ద్భవ త్యల్ప మేధసాం. " — (గీత)

అనునట్లు - క్షణికములు, తుచ్ఛములు.

అట్లు గాక, ఆ అల్పఫలములకైనను, నన్నే ఆశ్రయించువారిది పర భక్తి.

" చతు ర్విధా భజంతే మాం జనా స్సుకృతినో౽ర్జున !
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ !" — (గీత)

ఆర్తుడు = ఉన్నది పోగొట్టుకొని ఏడ్చువాడు; అర్థార్థి = లేనిదానికై దేబరించువాడు; జిజ్ఞాసువు - జ్ఞానరూప స్వరూప ప్రాప్తికై, బంధ ముక్తిని గోరువాడు; జ్ఞాని.

" రసో వై సః రసగ్ం హ్యేవాయం లబ్ధ్వా ౽౽నందీ భవతి. "
— (తైత్తిరీయోపనిషత్)

అనునట్లు - ఆనంద స్వరూపుడనైన నన్ను పొందవలె నన్న బుద్ధి గలవాడు. ఈ నాల్గు తెగల వారును నన్నాశ్రయింతురు' అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. వారిది పర భక్తి.

" పున ర్విశ్లేష భీరుత్వం పరమా భక్తి రుచ్యతే. "

భగవంతుని ఎడబాటును క్షణ కాలమేని ఓర్వలేక, గట్టున బడిన చేప వలె, విల విల లాడువాని భక్తి - పరమ భక్తి.

అందువల్లనే రామానుజులు శరణాగతి గద్యయందు భగవద్వాక్యముగా -

" మ చ్చరణారవింద యుగలైకాన్తికాత్యంతిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తిః. "

అని అనుగ్రహించినారు.

ఈ భక్తి యోగము గీతలో ద్వితీయ షట్కమున ప్రతిపాదింపబడినది. ఇది భగవత్ప్రాప్తి సాధనము. పూర్వషట్క మందలి జ్ఞాన కర్మ యోగములు భక్తి యోగాంగములుగా స్వాత్మ శుద్ధ్యార్థ ప్రతిపాదితము లని -

" జ్ఞాన కర్మాత్మకే నిష్ఠే యోగ లక్ష్మే సుసంస్కృతే
ఆత్మానుభూతి సిద్ధ్యర్థే పూర్వ షట్కేన చోదితే. "

అనియు -

" మధ్యమే భగవత్తత్వ యాథాత్మ్యావాప్తి సిద్ధయే
జ్ఞానకర్మాభి నిర్వర్త్యో భక్తియోగః ప్రకీర్తితః. "

అనియు - భగవ ద్యామునముని విరచిత గీతార్థ సంగ్రహము. కనుక నే -

శ్రీ లక్ష్మీ నిలయున్ బరాత్పరుని రాజీవాక్షు నారాయణున్
లీలా నిత్యవిభూతినాయకు జగ న్నిర్మాణ కర్మఠు జీ
వాలి ప్రాప్యునిఁ జేర్పఁజాలెడి యుపాయాంగంబులన్ జ్ఞాన క
ర్మాలన్ జెప్పెను బాండుసూతి కనుకంపన్ గృష్ణు డారింటిలో.

— (గీతా నవనీతము)

అని విశదీకృతము.

జ్ఞాన కర్మాంగ భక్తి యోగము పరమాత్మ ప్రాప్తి సాధన మేని -

" ప్రపన్నా దన్యేషాం న దిశతి ముకుందో నిజ పదమ్. "

అను దేశిక రహస్య త్రయ సార మందలి సూక్తి -

" మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే. "

" మా మేకం శరణం వ్రజ. "

అను అన్యాశ్రయ నివారక గీతా వాక్యములకు సంగతి ఎట్లు ? అను శంక -

" ప్రపత్తి శ్చ ద్వేధా సుచరిత పరీపాక భిదయా
విలంబేన ప్రాప్తి ర్భజన సుఖమేన కన్య విపులం
పర స్యాశు ప్రాప్తిః పరిమిత రసా జీవిత దశా. "

— (రహస్య త్రయ సారము)

అను వాక్యముతో అపాస్తము. ఎట్లనగా -

ప్రపత్తి - 'స ద్వారక ప్రపత్తి' 'అద్వారక ప్రపత్తి' అని రెండు విధములు. ప్రపత్తి అంగములుగా గల భక్తియోగము సద్వారక ప్రపత్తి. ఈ భక్తియోగి చేయు ప్రపత్తి - ఉపాసనలో గల్గు అవాంతరములను భగవానుడు పోకార్చును. ఐనను, భక్తి యోగము జ్ఞాన కర్మాంగకము గాన, సర్వ సులభము కాదు. పురుష ప్రయత్న సాధ్యము. ఐనను - ఈ జన్మలోనే సిద్ధి బడయగల డన్న నిశ్చయ మును లేదు. జన్మాంతరమునైనను పొంది, సాధించవలసి యుండును.

ఇక అద్వారక ప్రపత్తియే శరణాగతి. దానికి భక్తి అంగము. ఇందు ప్రపన్నుడు అకించనుడు. స్వ శక్తితో సాధించగల నను స్థైర్య మేమాత్రము లేనివాడు. ఇతడు భక్తి స్థానమున భగవంతునే నిల్పి - 'నీవే తప్ప నితఃపరం బెరుగ' నన్న అకించనుడు.

ఈ శరణాగతియు - దృప్త, ఆర్త భేదముచే ఇరు తెరంగులు.

" మా ముపేత్య తు కౌంతేయ ! పున ర్జన్మ న విద్యతే. " — (గీత)

నన్ను జేరిన వారికి 'మరు జన్మ లేదు' అనునట్లు - శరణాగతి చేసిన వానికి మరు జన్మ హేతువులైన సంచిత - ఆగామి కర్మలు నశించు

చున్నవి. ప్రారబ్ధ కర్మ - అనుభవముతో తీరిపోవుచున్నది. జన్మ బీజ మైన కర్మ శేషము లేదు గావున, పునర్జన్మ లేదు.

" ప్రారబ్ధం పరభుజ్య కర్మ శకలం ప్రక్షీణ కర్మాంతరః
న్యాసేనైవ ....................................."

అను నిత్యానుసంధాన శ్లోకముచేత -

" ప్రారబ్ధం భోగతో నశ్యేత్. "

అను శ్రుత్యనుసారము - శరీర పతనము వరకు ప్రారబ్ధ మనుభవించి, శరణాగతిచే ఇతర కర్మలు నశించినందువలన ముక్తిని పొందు చున్నాడు దృప్త ప్రపన్నుడు. అట్లైన-చో -

" మా మేకం శరణం వ్రజ । అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షష్యామి. "

నీవు నా శరణు కోరుము. నీకు ముక్తి ప్రతిబంధకము లగు సర్వ సుకృత దుష్కృత రూపము లగు పాపములను తొలగింతును' అను భగవ ద్వాక్యము పొల్లుగాదా ? అనిన -

ప్రారబ్ధ కర్మను గూడ తొలగించి, ప్రపన్నుని నిష్కర్ముని జేసి, పరమ పదము చేర్చు శక్తి ఆయనకు కలదు. ఆ ప్రపన్నుడు అపుడుగా దిపుడు స్వామి సన్నిధికి జేరవలె. క్షణ మీ ప్రాకృత లోకమున నుండజాల నన్న ఆర్తుని ప్రారబ్ధ సుకృతమును వాని మిత్రు లకు, దుష్కృతమును శత్రువులకు పంచి, ఇతనిని తన సన్నిధికి తీసి కొని పోవును. ఇతడే ఆర్త ప్రపన్నుడు.

అటు గాక, నిత్య విభూతికి చేరినను ఆతని సేవయే. ఇచట నున్నను ఆతని సేవయే. అందుకై, తన కర్మలను ఇతరులపై మోష

నేల ? నేనే శరీర పాత పర్యంతము అనుభవింతునుగాక ! అను నిబ్బరము గలవాడు దృప్త ప్రపన్నుడు.

" త్వం చే త్ప్రసీదసి, తవాస్మి సమీపత శ్చేత్
త్వ య్యస్తి భక్తి రనఘా కరిశైలనాథ !
సంసృజ్యతే యది చ దాసజనై స్త్వదీయైః
సంసార ఏవ భగవ న్నపవర్గ ఏవ. "

'ఓ వరదా ! నీ దయ యున్నచో, నీ దగ్గర నున్నచో, నీపై ఎడతెగని భక్తి ఉన్నచో, భాగవత సాన్నిధ్య మున్నచో - ఈ భూలోకమే పరంధామము. ఈ శరీరము రాలిపోయినంతనే - మరు జన్మకు గురి చేయక, నీ సన్నిధికి చేర్చుకొనుము.'

" ఏత ద్దేహావసానే మాం త్వ త్పాదం ప్రాపయ స్వయమ్. "

వారిని, వీరిని పంపక, నీవే దర్శన మిచ్చి, ఈ శరీరమునుండి బహిష్కరించి, నీ నిత్య విభూతికి తీసికొని పొమ్ము' అని, దృప్త ప్రపన్నుని విన్నపము. వానికి ఈ దేహపాత మయినంతనే ముక్తి. అందులకు - భగవ చ్చరణ శరణాగతియే సులభతమ మగు ఉపాయము. అధికారి నియమము లేనిది.

## మంత్ర త్రయోపదేశము

అందుకు మంత్ర త్రయమును గురు ముఖముగా ఉపదేశమును పొందవలెను. అందు ప్రథమము మూల మంత్రము. అది ఉపనిష దంతర్గతము.

" ఓమి త్యగ్రే వ్యాహరేత్ । నమ ఇతి పశ్చాత్ । నారాయణాయే త్యుపరి ష్టాత్ । ఓమి త్యేకాక్షరం । నమ ఇతి ద్వే అక్షరే । నారాయణాయేతి పంచాక్షరాణి ।

ఏతద్వై నారాయణస్యాష్టాక్షరం పదమ్ । యోహవై నారాయణస్యాష్టాక్షరం పదమ ధ్యేతి । అనపబ్రువ స్సర్వమాయు రేతి । విందతే ప్రాజాపత్యగ్ం । రాయస్పోషం గౌపత్యం । తతోఽమృతమశ్నుతే । తతోఽమృతత్వమశ్నుత ఇతి. "

ఓంకారమును దొల్త నుడువంగవలయు । నమ యంచు నా మీద,
నారాయణాయ అనియు, వాకొనవలయు నంతమ్మునందు ।
ఓ మను నక్షర మ్మొకటి, రెండు నమ యనునవి, ఐదు నారాయణాయ ।
అన నిది నారాయణాష్టాక్షరమ్ము ।

(గురుముఖమ్మున నుపదేశమ్ము వడసి) వదలక జపియించు పతిఙ్రాత ముఖుడు ।
పూర్ణాయు వగు, ప్రజాపతి యగు నుమ్ము ।
ఇహమందు ధన ధాన్యమిను మతియగును ।
పుష్టి, యారోగ్యమ్ము, భూపతిత్వము ।
అతనికి పరమందు నమృతత్వ మొదవు ॥ — (నారాయణీయము)

అని దానికి మదీయానువాదము.

" ఓమి త్యాత్మానం యుంజీత. "

ఇత్యాదిగా - శరణాగతి వైదికమే యైనను -

" ప్రపత్తే ర్వైదిక త్వేపి సర్వ వర్ణాధికారితా. "

అని, స్త్రీ - శూద్ర భేదము లేక, దీనికి సర్వులు అధికారు లన్నారు. కాని, ప్రణవమున -

" అకార ఉకార మకార ఇతి । దా నేకధా సమభవ త్తదేత దో మితి. "

అని, అకార - ఉకార - మకార సంసృష్ట రూప మైనను, అనుపనీతు లకు ఉకారమును వదలి, 'అమ్' అని ఉపదేశించుటే సంప్రదాయము.

" సర్వం వాక్యం సావధారణమ్. "

అను రీతిగా - అన్య వ్యావృత్తి అర్థ సిద్ధము.

శ్రీమద్రామానుజులు ఈ మంత్ర ప్రాప్తికై 18 తడవలు గోష్ఠీపూర్ణుల దగ్గరకు పోయి వచ్చుచుండిరట! అన్ని మారులు వేసరక తిరిగినను - ఇతరుల కుపదేశింప ననియు, ఉపదేశించినచో పలు నరకములపా లగుదు ననియు శపథము చేసినమీదనే రామానుజులకు గోష్ఠీపూర్ణులు మూల మంత్రము నుపదేశించినారు.

మంత్ర మనగా - "మంతారం త్రాయత ఇతి మంత్రః." అను వ్యుత్పత్తిచే, 'మనన శీలుని రక్షించునది' యని యర్థము. 'రక్షణ' యనగా - ఐహిక భోగ భాగ్యములను కూర్చుట కాదు.

రక్షణ మన్న - మేనునకు రాంకవముల్, మరి పట్టు వస్త్రముల్
కుక్షికి పాయసాన్నములు, కూరలు, భక్ష్యము, లించు పానకా,
లక్షికి రమ్య దృశ్యము లనామయమున్, ధనమున్, గృహమ్ములా
మోక్షముగాక ? చచ్చుచును, బుట్టుచునుండెడి జీవకోటికిన్ !

— (యతిరాజీయము)

అనునట్లు - మోక్షమే రక్షణ. దాని నీయగలవాడు నారాయణుడే. నకలకును దిక్కైనవాడు, సర్వశేషి, సర్వాంతరాత్ముడు కావున, ఆయనకును నకలకును ఎడతెగని సంబంధము.

అట్టి మంత్రము నుపదేశము పొందినారు రామానుజులు.

" గురుం ప్రకాశయే ద్ధీమాన్ మంత్రం యత్నేన గోపయేత్
అప్రకాశ ప్రకాశాభ్యాం క్షీయేతే సంప దాయుషీ. "

'ఈ మహానుభావుని అనుగ్రహముచే, భవతారకమైన ఈ మంత్రము లభించినది' అని, మంత్రోపదేష్టను ప్రకటించవలెను. ఉప

దిష్ట మంత్రమును రత్నము వలె - హృదయ పేటికయందు దాచు కొనవలెను. అది పరంపరాగత సంప్రదాయము.

అట్లయ్యును - రామానుజాచార్యులు గురూపదేశానంతర క్షణమునందే ఘంటా పథమ్మున గోష్ఠీపుర దేవాలయ గోపుర మధి రోహించి, మోక్ష ద్వార విఘటన క్షమ మగు సువర్ణ కుంచిక బోలిన మంత్రమును "ఎచకార" వెదజల్లినారు. మంత్ర మహత్వము చేత, విసినవా రందరును నిశ్శ్రేయసమును పొందిన, తా మొక్కరు నిరయమునకు (నరకమునకు) ఏగిన నేమి? అని, సువర్ణ శోభిత మంత్ర రత్నమును వెదజల్లిన యుదార దయా సింధువులు రామానుజులు.

ఇట్టి మహానుభావులు - చరమ మంత్రమునకు తమ గీతా భాష్యమున విపుల వ్యాఖ్యానమును రచించి వాసి గాంచిరి. మంత్ర రత్న మగు ద్వయ మంత్రమునకు మహా భాష్య రూపమున - 'శరణా గతి గద్య'ను రచించిరి. ఈ శరణాగతి గద్యకు - 'పృథు గద్య' మనియు, శ్రీరంగ గద్యమునకు 'మిత గద్య' మనియు ప్రసిద్ధి.

## శ్రీరంగ గద్య వివరణము

'మిత గద్య' మను శ్రీరంగ గద్యమున - తొలుత మూడు వాక్యములు, ఆపై రెండు శ్లోకములు, అనంతర మొక చిన్న వాక్యము, కడపట పదునాల్గు సంబోధనములు గావించి, తమ శరణా గతిరూప నమస్కృతిని శ్రీమద్రామానుజులు శ్రీరంగశాయి కర్పించి, గద్యమును ముగించిరి.

" శ్రీమ ల్లక్ష్మణ మునినా శిష్యహితై కాగ్ర చేతసా కథితమ్
మితగద్య మమితసారం వ్యక్తుం వ్యాఖ్యాతి వేంకటేశ కవిః. "

అని దీనిని శ్రీ వేదాంత దేశికులు వ్యాఖ్యానింపదొడగి, ఇది మిత గద్యమే యైనను, 'అమిత సార' మని ప్రశంసించిరి.

ద్వయ మంత్ర వివరణ రూప మగు శరణాగతి గద్యమున వివరించిన మంత్రార్థమునే ప్రకారాంతరముగ మననమును చేయించు చున్నారీ శ్రీరంగ గద్యమున శ్రీమద్రామానుజులు.

భగవాను నాశ్రయించినచో - ఈ జీవి నిత్య విభూతియందు పరవాసుదేవ సేవా సౌభాగ్యమును పొందును. అదియే మానవ జీవిత పరమార్థము.

భగవంతుని స్వరూప స్వభావములు తెలిసినగదా ఆతని పొందు నిచ్చయు. అందుకు ప్రయత్నము పొడమును ! భగవానునకు వ్యక్తావ్యక్త రూపములు రెండున్నవి.

" అంత ర్బహి శ్చ త త్సర్వం వ్యాప్య నారాయణ స్థితః. "

అన్నింటిని - లోపల, వెలుపల వ్యాపించియున్నాడు నారాయణు' డని శ్రుతి.

" మయా తత మిదం సర్వం జగ దవ్యక్త మూర్తినా. "

ఈ జగత్తంతయు నాతో నిండియున్నది' అని గీతాచార్యుడును -

" త్వయా చ విష్ణునా చాంబ ! జగ ద్వ్యాప్తం చరాచరమ్. "

ఓ లక్ష్మీమాతా ! నీచేతను, విష్ణువుచేతను లోక మంతయు వ్యాప్తమై యున్నది' అని విష్ణుపురాణము -

" విష్టభ్యాహ మహం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. "

నా ఒక్క అంశముతో సమస్త జగత్తును వ్యాపించియున్నాను.

" ద్యౌ స్స చంద్రార్క నక్షత్రం ఖం దిశో భూ ర్మహోదధిః
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః. "

మహాత్ముఁ డగు వాసుదేవుని శక్తిచే చంద్ర సూర్య నక్షత్ర యుక్త మగు ఆకాశము, భూమి, సముద్రములు ధరింపబడినవి' అనియు, పంచమ వేద మగు మహా భారతము సైతము నొక్కి వక్కాణించు చున్నది.

ఇట్లు సర్వ ధారక మై, సర్వాంత ర్బహిర్గత మై అవ్యక్త రూప మొక్కటి, భక్తానుగ్రహార్థము వ్యక్త రూప మొక్కటి. అది -

" అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్యపృష్ఠే మహతో మహీయాన్. "
— (తైత్తిరీయము)

మహత్తు కంటెను మహత్తయిన పరమాత్మ, అపారే అంభసి = అనంతమైన ప్రళయ జలమందు, లేక - క్షీరార్ణవమున (శ్వేత ద్వీప మున), భువనస్య మధ్యే = లోక మధ్యమున (సూర్య మండలాంత ర్గతమున లేక - తిరుపతి, శ్రీరంగము మొదలగు దివ్య దేశములందు), న + అకస్య = దుఃఖ సంపర్కము లేని నిత్య పదమునందు (వెల్లడి యగుచున్నాడు.) అదియును గాక, రామ కృష్ణాది విభవావ తారుఁడుగా, సర్వ హృదయాకాశమునందు యోగులకు ప్రత్యక్ష మగుచున్నాఁడు.

వైకుంఠమం దున్నవాఁడు విభవావతారుఁడుగా, అర్చావతారు ఁడుగా అవతరించినచో, వైకుంఠము ఖాళీయైనా ? ఒక్కఁడు పలు చోట్ల నుండలేఁడు గదా ?' అని ప్రశ్నించువా రుందురు.

" పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే
పూర్ణా త్త పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే. " అని శ్రుతి.

వైకుంఠమున పూర్ణు డగువాడు విభవార్చావతారుడుగా ఆవిర్భవించి నను, ఆతని పూర్ణతకు కొదువ లేదు. ఒక్కటినుండి ఒక్కటి తీసిన, మిగులు లేకుండుట సామాన్య గణితము. అది ఇట అన్వయింపదు. "దీపా దుత్పన్న దీపవత్" ఒక ప్రమిద దీప కళికనుండి మరి యొక ప్రమిదను వెలిగించిన, మునుపటి దీప కళికకు తరు గుండదు. అట్టి స్థితియే ఇచ్చట. ఇంతకును మును పిచట లేక, భగవంతు డవతరించుట గాదు. మ రే మనగా - ఆవిర్భవించుట. అవ్యక్తముగా నున్న స్వామి వెల్లడి యగుట. అంతియే.
అటుపై నరుడు -

" కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే ! "

— (గీత)

శంఖ చక్ర గదా ద్యాయుధ పరిష్కృత బాహు చతుష్టయముతో, రత్న కాంతులతో విరాజిల్లు కిరీటముచే అలంకృతమైన మస్తకముచే ప్రకాశించు పరవాసుదేవ స్వరూపమును చూపగోరినాడు అర్జునుడు. దానిని చూపినాడు శ్రీకృష్ణపరమాత్మ. తదుపరి - సామాన్య సౌమ్య మానవ రూపమును చూపినాడు భగవానుడు.

ఆ యవ్యక్త సర్వ వ్యాప్త రూపము, వ్యక్త పరవాసుదేవ రూపము, కాలాంతరీయ విభవావతారము మన కలభ్యములు. అష్టాంగ సాధనీయ మగు అంతర్యామి స్వరూపము కూడ సామాన్యుల కగోచరమే. అందువలన, స్వయం వ్యక్తము, ఆర్ష ప్రతిష్ఠితము అగు అర్చావతారమే శరణ్యము. అందువలన, శరణాగతి గద్యయందు వైకుంఠ ధాముని శరణించినట్లు వ్యాఖ్యానించి, ఇందు జన సామాన్య

దర్శనీయు డగు శ్రీరంగనాథుని సంబోధించుచు, ద్వయ మంత్రార్థమును విశదీకరించుచున్నారు.

ద్వయము రెండు ఖండములు, ఆరు పదములు గల మంత్రము. అందు ప్రథమార్థము అనుష్ఠాన రూపము. ఆ యనుష్ఠానమే భగవత్ప్రాప్త్యుపాయము. ద్వితీయము అనుష్ఠాన లభ్య ఫల ప్రతిపాదకము.

" జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ. " — (గీత)

అనునట్లు - జీవుడు జనన మరణ రూప మగు సంసార సాగరమున బంభ్రమ్యమాణు డగుచున్నాడు.

ఇట్టి జీవులు - నిత్య, ముక్త, బద్ధ భేదములతో త్రిధా భిన్నులు. జ్ఞానము గలవారు గాన, చేతనులు. చైతన్యము లేనివారి పాంచభౌతిక శరీరములు జడములు.

జడము - ప్రకృతి, శుద్ధ సత్త్వము, కాలము అని త్రివిధము. ఆ త్రివిధ చేతనుల - జడముల స్వరూప స్థితి ప్రవృత్తులు భగవదధీనములు. ఆతని సంకల్పముచేత - కొన్ని నిత్యములు, కొన్ని అనిత్యములు. అనిత్యము లనిన - 'నశించునవి' అని గాదర్థము. ఉన్న వస్తువునకు నాశముగాని, లేని వస్తువు అమాంతము ఊడి పడుటగాని ఉండదు. చేతనులు అనిత్యు లన్న, జనన మరణములకు గురి యగువారనియు, అచేతనము లన్న, త్రిగుణాత్మక ప్రకృతి యనియు తాత్పర్యము.

" అచేతనా పరార్థా చ నిత్యా సతత విక్రియా. "

అనునట్లు, అట్టి ప్రకృతి - నిత్యమే అయ్యును. క్షణ క్షణము మార్పు చెందు స్వభావము గలది. జీవునకు భోగ్యముగా నుండుటే దీని ధర్మము. సర్వము నందు మార్పు తెచ్చు కాలమునకు -

" న కాలస్తత్ర వై ప్రభుః. "

అనునట్లు - త్రిపాద్విభూతి యగు శుద్ధ సత్త్వమును మార్చు శక్తి లేదు. అది నిత్య మాత్మముగ నుండును. త్రిగుణాత్మక ప్రకృతి వికృతి చెందుటకును, శుద్ధ సత్త్వము ఏక విధముగా నుండుటకును భగవత్సంకల్పమే కారణము.

ఆ భగవంతుడు బద్ధ జీవుల వలె - క్లేశములచే, కర్మ దోషములచే అసంస్పృష్టుడు. స్వతస్సిద్ధమైన - అనవధికమైన జ్ఞాన శక్తి బలైశ్వర్యాది షడ్గుణములతో పాటు - అనంత కల్యాణ గుణ గణము గలవాడు. నిత్య బద్ధ ముక్తుల కంటెను ఉత్తముడు. అనంత తేజోరాశియైనను, భక్తానుగ్రహార్థము సంవృత స్వతేజస్కుడై, సర్వ నియామకుడయ్యును - భక్త పరతంత్రుడై, అర్చా రూపియై యున్నాడు. ఆ శ్రీరంగశాయి - ఇక్ష్వాకు కుల దైవమై, విభవావతారుడైన శ్రీరామచంద్రునిచే శరణాగతుడైన విభీషణాళ్వారునకు దత్తుడై, కావేరీ ద్వీప వాసియై విరాజిల్లుచున్నాడు.

'ఆతడే సర్వ జగత్పిత, సర్వ రక్షకుడు, సర్వశేషి. ఆతని సేవయే దేహధారికి ఆనంద సంధాయకమన్న జ్ఞాన ముద్బుద్ధమై, ఆతని నిరంతర సేవా సంజనితానంద పారవశ్యము గల్గిన నేను - ఆతని కైంకర్యము ననుభవింతును' అని తా ననుభవించు - శరణాగతికి ఫలమైన ద్వయ మంత్ర ఉత్తర ఖండార్థమును లోక హితార్థము గద్య ప్రథమ వాక్యమైన "స్వాధీన త్రివిధ చేతనాచేతన" ఇత్యాది - "నిత్య కింకరో భవాని" ఇత్యాదిగా, "శరణ మహం ప్రపద్యే" ఇత్యంతముగా గలది ప్రపత్త్యనుష్ఠాన రూపము. ద్వయ మంత్రము ప్రథమ వాక్యార్థము.

పూర్వజన్మ కృత సుకృత విశేషముచే వశీకృతుఁ డగు భగవంతుని యనుగ్రహమునకు పాత్ర మగు జీవి - ఏ యోగము చేతనైనను భవ బంధ ముక్తుడై, త్రిపాద్విభూతిలో -

" సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా. "

సః = ఆ బంధ ముక్తుడు, బ్రహ్మణా సహ = పరబ్రహ్మతో బాటు, సర్వాన్ కామాన్ = అన్ని కోరికలను, అశ్నుతే = అనుభవించును' అను శ్రుతి ననుసరించి, శ్రీపతితో బాటు - కాంక్షించిన కోరికల నన్నింటిని అనుభవించి ఆనందించవలయు ననిన, తొలుత భవ బంధములు తొలగి పోవలె గదా ! అందుకే ముక్తిసాధనోపాయమైన భక్తి యోగమును, త దంగములైన జ్ఞాన కర్మ యోగములను భగవానుడు గీతలో నుపదేశించినాడు. ముక్తి యన నేమి ?

కొందరు మిత్తి ముక్తి యనుకొందు రవిద్య తొలంగిపోవుటే
కొందరు ముక్తి యందు, రిక కొందరు జన్మ ముక్తిఁబే
ర్కొందురు: వార లెట్టు లనుకొన్నను, నిత్యవిభూతియందు గో
విందుడ ! నాకు నీ పదరవింద సపర్యయ ముక్తి కేశవా !

— (కేశవ ప్రపత్తి)

"సర్వం క్షణికం" దేహము రాలిపోవుటయే 'ముక్తి' అని బౌద్ధులు; 'పరబ్రహ్మకు అవిద్య గ్రమ్మి, జీవుడైనాడు; ఆ అవిద్యా భంగమే ముక్తి' అని అద్వైతులు; 'ప్రాకృత దేహ బంధము తొలగి, ప్రత్యగాత్మ స్థితిని పొందుటయే ముక్తి' అని కేవలులు - కాని, నా పాలిటికి ముక్తి యనగా - ఏకపాద్విభూతిని వదలి, శుద్ధ సత్త్వమయ

మగు త్రిపాద్విభూతికి - శ్రీపతి యగు నీ పాదారవింద సేవా భాగ్య మనుభవించుచు ఆనందించుటయే' అని భావము.

అట్టి ముక్తిని పొందుటకు - జ్ఞాన కర్మయోగములు అంగ ములుగా గల భక్తియోగమే గతి' అని దాని నుపదేశించి, తనకు ఇష్టుడు, సఖుడు, ప్రియుడు అను ఉదారాశయముతో, ఆ యోగము కష్టసాధ్యము, అదియును ఈ జన్మతోనే ముక్తి నీజాలదే, అని, సులభము, నిశ్చిత ఫలదము నగు ప్రపత్తి యోగము నుపదేశించి నాడు.

సర్వ ధర్మములను సన్యసింపుము: నీవు
శరణు చొరుము నన్ను నొకని: నీదు
దురితజాల మెల్లఁ దొలగింతు నే: నింక
శోక మించుకంత నీకు వలదు.

— (పరమార్థ దీపిక)

సర్వ ధర్మములను వదలుట యన్న, శరీర ధర్మములను గాదు. విహి విహిత కృత్యములను గూడ కాదు. ఫలాపేక్ష లేక, 'నేను చేయు దును' అను అహంకారము, 'నాకై చేయుదును' అను మమకారము లేక, నిత్య నైమిత్తిక కర్మలను చేసి, ఫలమును వదలుటయే.

అంతేగాక, ధర్మ పదమునకు - 'యోగ' మనియు పేరు.

" స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. " — (గీత)

స్వధర్మము తన కభ్యస్తమైన కర్మయోగము, పరధర్మము జ్ఞాన యోగము. కర్మయోగి ఆ జన్మలో ముక్తిని సాధింపజాలక మరణించి నను బాధకము లేదు. మరు జన్మమును ఉత్తముల వంశమందు గొని, నిలిచిపోయిన కర్మయోగమును కొనసాగించి, ఫలమును పొంద

వచ్చును. కర్మలను సర్వాత్మనా వదలిన జ్ఞానయోగి - ఇందు జేమను, పరమునందును చెమను' అన్నందున, సర్వధర్మములను సన్యసింపు మనిన, మునుపు చెప్పిన అన్ని యోగములను, జ్ఞాన కర్మ భక్తులను సర్వాత్మనా వదలి, నా శరణు చొరుము. అట్లు నీవు చేసిన, నీకు ముక్తిప్రతిబంధకము లగుట - పాపరూప కర్మల నన్నింటిని వదలింతును. అందువల్ల, నీకు మరు జన్మ బీజము లగు కర్మలు లేనందున, ముక్తి కరస్థము' అని - అతి రహస్యమైన ప్రపత్తి యోగమును ఉపదేశించినాడు. అదియే ప్రపత్తి. తత్ఫలితమే శ్రీరంగ గద్యమున - తొలి వాక్యమున ప్రదర్శితము. తదనుష్ఠాన రూప ద్వయమంత్ర ప్రథమార్థ మర్థమే గద్యము ద్వితీయ వాక్యమున నిరూపితము.

తనను రక్షించు మని ప్రార్థించువాడు - రక్షింపవలసిన తనను రక్షకుని యధీనము చేయకున్న, అత డెట్లు రక్షింపగలడు ? కాన -

" ఓమి త్యాత్మానం యుంజీత. "

ప్రత్యగాత్మ యగు తా నను హావిస్సును, పరబ్రహ్మాత్మక మగు పావకమునందు (= అగ్ని యందు) సమర్పించుట యజ్ఞము.

" ఓమి త్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః
ప్రవర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్. " — (గీత)

'ఓమ్' అని హుతాశనునియందు సమర్పించుట యజ్ఞము. కావున, ఆత్మ హావిస్సును 'ఓమ్' అని భగవదధీన మొనర్చవలెను.

స్వరక్షణకు సాధనాంతరముల నెరుగని అకించనుడు - 'త న్నతడు తప్పక రక్షించును' అనెడి మహా విశ్వాసముతో తన్నతని పాదారవిందములందు దారవోయును. తనను రక్షించగల సామర్థ్యము,

ఆశ్రితునిపై జాలి మొదలగు గుణములు గలవానినే రక్షకునిగా ఎన్నుకొనవలెను. అతనికి అనుకూలముగా తాను మెలగవలెను. విరుద్ధముగ ప్రవర్తింపరాదు. ఈ ఆకించన్య - మహా విశ్వాస - గోప్తృత్వ వరణ - అనుకూల్య సంకల్ప - ప్రాతికూల్య వర్జనము లగు పంచాంగములతో స్వాత్మ సమర్పణమే పూర్ణ శరణాగతి.

మూడవ - "ఏవ మవస్థితస్య" ఇత్యాది - "నిత్య కింకరతాం ప్రార్థయే" ఇత్యంత మగు వాక్యముతో - తాను కోరిన ఫలమునకై భగవదాశ్రయణము మహా విశ్వాసపూర్వక మని నిరూపించినారు.

అతడు పరమ కారుణికుడు. 'అనన్య గతికు డగు నితడు న న్నాశ్రయించినాడే ! వీనిని రక్షింపకున్న, వీని గతి యేమి గావలె ? కాన -

" సకృ దేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ. "

— (శ్రీమద్రామాయణము)

అనిన నేను మాట తప్పుదునా ? రక్షించి తీరుదును' అను పట్టుదల; కరుణ లేనివానిని ఆశ్రయించి ఫల మేమి ? అతడు కరుణాళువే గాక; రక్షింపగల సామర్థ్యము గలవాడు. అందుకే భగవంతుడు. ముక్తి ప్రతిబంధక మగు పాప జాలమును పోకార్చగల శక్తి లేక, వట్టి కరుణ యున్న ప్రయోజన మేమి ?

నీవే దేవుడవేని, నేను వినలేవేనిన్ విలాపమ్ములన్;
ప్రోవన్ దీనుల శక్తి రక్తియు నసుక్రోశమ్ము లేదేని, నీ
దేవత్వ మ్మది యేల ? దండుటకు, నో దీనేభ సంరక్షకా !
కావంజాలిన సర్వ శక్తివి రమాకాంతాదవా ! కేశవా !

— (కేశవ ప్రపత్తి)

అన్నట్లు, కరుణాళువు, సర్వశక్తి యగు శ్రీపతి - రస స్వరూపు డగు తన అనుత్తమమైన - అనంతమైన అనుభూతిని అనుగ్రహించునన్న మహా విశ్వాసముతో, ఆతని నిత్య కైంకర్యమును దయచేయు మని ప్రార్థించుచు తృతీయ వాక్యమును ముగించినారు.

ఇచ్చట మహా విశ్వాసము - ఆనుకూల్య సంకల్ప, ప్రాతికూల్య వర్జనములకు ఉప లక్షణము.

పై వాక్యములచే ప్రతిపాదితార్థములను శ్లోక ద్వయముచే సంగ్రహించుచున్నారు.

" తవానుభూతి సంభూత ప్రీతికారిత దాస్యతామ్
దేహి మే కృపయా నాథ ! న జానే గతి మన్యథా. "

"నాథ ! - విశ్వస్య పతిః, ఆత్మేశ్వరః" అను శ్రుత్యను సారము జగన్నాథా ! సర్వ రక్షకా ! మే = జనన మరణ పరంపరకు జిక్కి, విల విల లాడిన నేను, ఇంకను ఈ వ్యధను భరింపజాలక, నీ దివ్య విభూతియందు ప్రేమాతిశయముతో నీ దాస్యమును ఆకాంక్షించుచున్నాను. నీవు తప్ప, ఈ ప్రకృతిబంధములను తెగదెంచు శక్తి గలవా రెవరును లేరు. వేరు గతి లేనివాడను. నీవు ఉపదేశించిన భక్తియోగానుష్ఠానమునకును నేను అశక్తుడను. వేరు గతి లేక, నీ సేవా భాగ్య మనుగ్రహింపు మని నిన్నే ప్రార్థించుచున్నాను. 'పాపి' యని నన్ను నిరాకరింపకుము.

" దోషో య ద్యపి తస్య స్యాత్, సతా మేత దగర్హితమ్. "

ఆశ్రితుని యెడ దోష మున్నను, సత్పురుషుల కది గమనింపదగినది గాదు' అని నీవే వచించినావు. అట్టి వాత్సల్య జలధి నీవే నీ దాస్యము

వీని కనుగ్రహింపుము’ అని మొదటి శ్లోకార్థము. ఇక రెండవ శ్లోకము :-

“ సర్వావస్థోచితాశేష శేషతైకరతి స్తవ
భవేయం పుండరీకాక్ష ! త్వమేవైవం కురుష్వ మామ్. ” అని

నిత్య నిరవద్య కైంకర్య నిరతు డగుదు
నన్యగతి హీను, పద్మపత్రాయతాక్ష !
నీవెఁ గైకొను మీద నీ వానిగాగ.

ఓ పద్మాక్షా ! నీ కను చూంపులను నీ దాసునిపైఁ బారింపుము. నీ దాస్యైక వృత్తిని దయ సేయుము. నిన్ను చేరు వేరు సామర్థ్యము లేనివాడను. నీవే వీనిని నీ వానినిగాఁ జేసికొమ్ము. “దేహి” యన్న పరస్మై పదము నా లాభము కొరకు - “కురుష్వ” అనిన ఆత్మనే పదము నీ వాని రక్షించుట నీకే లాభకరము’ అని ద్యోతితము.

“ఏవం భూత” - ఇత్యాది, “అద్యైవ కారయ.” ఇత్యంత తుగు వేదన వాక్యమున, నాకు నా స్వరూప జ్ఞానము, నీ మహాత్వ జ్ఞానమును లేదు. అదుపు లేని ఇంద్రియములు, చంచల మనస్సు గల వాడను. నోట బల్కిన మాట మాత్రముతో నన్ననుగ్రహించి, నా మనస్సును, నా నోటఁ బల్కిన పలుకులకు అర్థ మగు ఉపాయోపేయ రూప మగు పరమార్థమున దృఢ లగ్న మొనర్పుము’ అని, సర్వాలోప పూర్తిని నీవే ఆచరించి, ఆదరించి దాసు నేలుకొను మని ప్రార్థించి నారు.

అట్లు ప్రార్థించి, పదునాల్గు సంబోధనలతో - స్వామి గుణ గణమును స్మరించుచు, ఇట్టి నీకు నమస్కార మని శరణాగత్యనుష్ఠా నమును పూరించి విరమించుచున్నారు.

1. అపార కరుణాంబుధే ! :- నీవు దయా మయుడవు. నేను నీ ప్రాప్తికి నీవు ఉపదేశించిన జ్ఞాన కర్మాంగ భక్తి యోగ మనుష్ఠించు శక్తి లేనివాడను. అందుకు సమర్థులైనవారు స్వశక్తి చేతనే భవ బంధములఁ దెంచుకొని, నీ చెంతకు రాజాలుదురు. వారి రక్షణ చేయుటలో నీ గొప్పదనము, నీ దయకు సార్థక్యమును లేదు. నావంటి వానిని రక్షించిననే నీ దయకు ప్రయోజనము. అది చరితార్థము గావలయు నన్న, నన్ను రక్షింపును.

2. అనాలోచిత విశేషాశేషలోకశరణ్య ! :- ఆశ్రిత రక్షణ యందు వాని గుణావగుణములను గణించక, ఆర్తత్రాణ పరాయణుడ వని వాసిగాంచినావు.

**శేష స్త్వైవ భజనే తవ చైవ రక్తః, ద్వంద్వం తవైవ పదయోః శ్రవణం ప్రపన్నః**
**త్యాజ్యో న దోషమయి మోచయ సంస్పతే ర్మాం తావ జ్జహామి న పరే**
**జగదేకబంధో !**

— (బాష్ప బిందువులు)

నేను నానావగుణ నిలయుడనే అగుదునుగాక. నిన్నాశ్రయించినాను. నన్ను 'పాపి' యని రక్షింప నిరాకరించితివేని, నీవు కష్టించి సంపాదించుకొన్న ఆర్తత్రాణ పరాయణత్వ, అశేష లోక శరణ్యత్వము లకు ఆఘాత మేర్పడును. కావున, నన్ను రక్షింపుము. నిన్ను తప్ప, ఇతర దైవతముల నాశ్రయింపబోను. బ్రోచినను, త్రోసినను నీ పాద ద్వయమునే ఆశ్రయించినాను. నన్ను ప్రకృతిబంధ ముక్తుని చేయు వరకు నీ యడుగులను వీడను. నన్ను కాపాడుము.

3. ప్రణతార్తిహర ! :- శరణన్న వారిని రక్షించువాడా ! 'నా శరణు చొరుము. నీ బాధలను ముక్తి బంధకములను నేను తొల గింతును' అని నీవే ఆదేశించినావు. మాట నమ్మి, నీ యడుగులఁ

బట్టినాను. నా వంతు పనిఁ జేసినాను. ఇక నీదే తరువాయి. కాన, వీనిని రక్షింపుము.

4. ఆశ్రిత వాత్సల్యైక జలధే ! :- ఆశ్రితుల యందలి గుణముల నాశింపని, దోషముల గమనింపని వాత్సల్యమే అవ్వారిగా గల మహానుభావా ! నా దొసగుల గమనింపక రక్షింపుము. నా ఆవేదన గాక, నీ వాత్సల్య తరంగములలో నా దోషము లసలు కానరావు.

5. అనవరత విదిత నిఖిల భూత జాత యాథాత్మ్య ! :- నిత్య లీలా విభూతులయం దున్న సమస్త జీవ జాతముయొక్క స్వరూప స్వభావముల నెల్ల వేళల నెరుంగఁజాలని మహానుభావా ! నా స్థితి గతులు, మనోభావములు, జ్ఞాన కర్మేంద్రియ పాటవము నీకు తెలియనివా ? నేను నీవాడనే గదా ! నీ అపర ప్రకృతి యగు పంచ భూతములను నాపై పురికొల్పి, వాని బంధములకు వశుని జేసి, కామ క్రోధములకు లోబడకు మని వారించిన, నేను నీ మాయ దాటగల శక్తిశాలినా ? నా కా శక్తి లేదనియే గదా నిన్నాశ్రయించినది ! "మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే" అని నీవే గదా నీ మాయను దాట నుపాయ ముపదేశించితివి ! నీ మాటలు నమ్మి, నీకు ప్రపన్నుడ నైతిని. నీకు దాసుడనైన నీవాని రక్షింప వలసిన బాధ్యత నీదేగదా ! నోరు దెరచి యడుగునంతవరకు తామసించవలయునా ? నీయంతకు నీవే రక్షింపవలసినవాడవుగదా ! ఐనను, అడుగుచున్నాను. రక్షింపుము.

6. సత్యకామ ! :- శరణాగతుని రక్షించుట నీ కోరిక. అది యేనాడును రిత్త వోవునది కాదు. అట్టి నిన్నాశ్రయించితిని. నీ కోర్కె నెరవేరి తీరును. కాని, నీవు సంకల్పించవలయునుగదా ! నీవు సంకల్పించిన -

7. సత్య సంకల్ప ! :- ఏ ప్రయత్నము లేకనే, నీ సంకల్ప మాత్రముచేతనే సర్వము నిష్పన్న మగును. నీ సంకల్పమే సర్వకర్మ నిర్వాహకము.

8. ఆపత్సఖ ! :- ఇతరులు సంపదలందు చేరవత్తురు. వారు కపట మిత్రులు, స్వలాభాపేక్షాపరులు. నీకు పరులవల్ల కావలసిన కార్యము లేదు. ఇతర దైవతములు యజ్ఞములందు ఆహుతులు వైచి ఆరాధించినవారి కోరికల దీర్తురు. అట్లని నీవే -

" దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ
ఇష్టాన్ భోగా న్హినో దేవా దాస్యంతే యజ్ఞభావితాః

పై గీతా శ్లోకముల ద్వారా తెలిపినావు. వారితో వ్యవహారము ఇచ్చి పుచ్చుకొను వ్యాపారము. వారును మావంటి జీవకోటిలోనివారే ! మా వంటి అకించనులు వారి నెట్లు తనియింపగలరు ? ఇంతకును నీవు సర్వశేషివి. ఇతరులవల్ల కావలసిన దేదియు నీకు లేదు. నీవు శ్రీపతివి. జగత్తున కంతకు పిత, మాత నేనే' అని నీవే చెప్పినావు. అట్టి నీవు ఆపదయం దున్న నన్ను చేవిడతువా ? తప్పక రక్షింతువు. ఆపదలందు ఆదుకొనువారే నిజమైన నిచ్చెలులు. విపన్న గజేంద్రుని నీవే రక్షించితివి. ద్రౌపదీ మాన సంరక్షకుడవు నీవే. ప్రహ్లాద వరదుడవు నీవే. కావున, ఆప త్సఖుడవు నీవే.

9. కాకుత్స ! :- సర్వ జగన్నాయకుడవయ్యు - కర్మానుభూత జనిత జన్మశూన్యుడ వయ్యు దేవతల బాధలఁ దొలగింప నీ యమానుష శక్తుల నన్నిటిని దాచుకొని, కౌసల్యా తనయుడుగా జన్మించి,

దేవతా బాధక రక్షస్సులను పరిమార్చి, తపస్వులను రక్షించినావు. విభీషణునే గాదు. దారాపహారి రావణుడే వచ్చి కాపాహి మని ఆశ్ర యించిన రక్షింతు నన్న ఉదారుడవు నీవు. నీ జన్మచే, కకుత్స్థ వంశమే లోక విఖ్యాతి గాంచినది. తమ కపకారము చేసినను గొప్పవారు సహింతురు. తన భార్యయెడ దౌష్ట్యము జూపువానిని - శక్తి గలవా డెవడును సహింపడు. అట్టితరి, అర్ధాపరాధిని కాకాసురుని బ్రహ్మా స్త్రము ప్రయోగించియు ఆశ్రయించినంతమాత్రముతో రక్షించిన రామచంద్రుడవు నీవే గదా ! నన్ను రక్షింపవా !

10. శ్రీమాన్ ! :- ఎవరు నీవు ? ఎవ రని నిన్ను నిర్ణయింతును ? ని న్నెట్లు లక్షించుట ? వ్యాస మహర్షి - 'పరబ్రహ్మ ఎవరు' అను విచికిత్సతో - "జన్మా ద్యస్య యతః" ఈ జగత్తునకు ఎవనివలన సృష్టి స్థితి లయములు జరుగుచున్నవో - అతడే పరబ్రహ్మ అని సూత్రించెను.

" ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై
ఎవ్వనియందు డిందు పరమేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వ డనాది మధ్యలయు డెవ్వడు సర్వము తానయైనవా
డెవ్వడు - వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్.

అని పోతన గజేంద్రుడు వాపోయెను. ఇవి యన్నియు నీ ఘన కార్యములే గావచ్చును. కాని, వీనిని రచించిన అసాధారణ స్వరూపుడవు నీవే యని మంద భాగ్యుల మగు మే మెట్లు గుర్తించుట ?

" వేదాంతా స్తత్వచింతా మురభి దురసి యత్పాద చిహ్నై స్తరంతి. "

అని, పరాశరభట్టరు - నిన్ను కనుగొను నుపాయమును సూచించి నాడు. 'పరతత్త్వ మెవరు ?' అను విచారమును - 'లక్ష్మి ! నీ పాద

చిహ్నలాంఛితుడే అతడు' అని, నీ గుర్తుతో కనుగొని, ముగించు చున్నారు' అని ముగించినాడు. అందుకే -

" లక్ష్మీచరణ రాజీవ లాక్షా లక్షిత వక్షసే
విశ్వసర్గాది లీలాయ వేంకట బ్రహ్మణే నమః. "

అని ఆసూరి వేంకటాధ్వరి - ఇంత యేల ?

" శ్రియఃకాంలో ఒనంతో వరగుణగణై కాస్పద వపుః. "

అనియు -

" అఖిల భువన జన్మ స్థేమ భంగాది లీలే
వినత వివిధ భూత వ్రాత రక్షైక దీక్షే
శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా. "

అనియు భగవద్రామానుజులే కీర్తించినారు. పరమ పురుష ప్రతిపాదకమైన పురుష సూక్త మందలి -

" హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ. "

అను వాక్యమే నిన్ను గుర్తించు సాధనమై, లక్ష్మీపతియే సర్వ జగన్నియామకు డని వాద పరిష్కార మొనర్చుచున్నది. కాన, నీకు లక్షణము లక్ష్మీపతిత్వమే. లక్ష్మీపతియే పరమాత్మ. ఇంత యేల ? 'ఎవరు పరమాత్మ ?' అనిన, 'పరమాత్మయే పరమాత్మ' అనునది నిశ్చప్రపచము. ఇందు స్వాశ్రయ దోషము లేదు.

పరమ = శ్రేష్ఠమైన ఆత్మ ఎవరు ? అను ప్రశ్నకు - "పర = శ్రేష్ఠురాలైన, మా = లక్ష్మీ గల ఆత్మయే పరమాత్మ" అని, లక్ష్మీ

వత్త్వము పరమాత్మ లక్షణ మైనది. అట్టి అవ్యభిచరిత లక్ష్మీవంతుడవు నీవు.

" రాఘవత్వే భవే త్సీతా రుక్మిణీ కృష్ణ జన్మని
అన్యేషు చావతారేషు విష్ణో రేషానపాయినీ. "

విష్ణువుతో విడదీయరానిది లక్ష్మీదేవి. అందుకే రామానుజులు -

"భగవ న్నారాయణాభిమతానురూప స్వరూప రూప గుణ విభ వైశ్వర్య శీలా ద్యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణ గుణగణాం. "

అని, శరణాగతి గద్యయందు తొలదొల్త లక్ష్మీతాయారును కీర్తించినారు. ద్వయ మంత్రమున మనకు సాక్షాత్కరించునది ఆ మహా మాతయే గదా !

" పతి ననుసరించి తానునూ ఆ యా శరీరములను ధరించునది లక్ష్మీదేవి.

అనిన, 'బ్రహ్మచారిగా నవతరించిన వామనావతార దశయందు ఈమె ఎం దేగెను ?' అని శంకించువా రుండవచ్చును. నిజమే. మన దృష్టికామె గోచరించలేదు. కాని, 'రవి గాంచనిచో కవి గాంచునే గదా !' అనునట్లు, ఆ మాయా వటువు కాపట్యమును శ్రీ వేదాంత దేశికులు బట్టబయలు చేసినారు.

" కృష్ణాజినేన సంవృణ్వన్ లక్ష్మీం వక్షస్స్థలాలయాం.

బ్రహ్మచారి లక్షణమైన కృష్ణాజినముతో తన వృక్షస్థలస్థిత యగు లక్ష్మీదేవి కనుబడకుండ కప్పుకొన్నాడట' అని.

మహామాత ఆమె సదా హృదయ సన్నిహిత కావుననే, పాపముల పుట్టల మగు మనవంటివారు స్వామి శరణు చొచ్చునపుడు,

లక్ష్మీపూర్వకముగా పోవలయును, ఆమె మన తప్పులను స్వామి తల కెక్కనీయక, సరిది చెప్పి, రక్షింపజేయును. కావుననే - 'శ్రీమన్ !' అని సంబోధించినారు.

11. నారాయణ ! :- 'రీఙ్ క్షయే' అను ధాతువుచే నిష్పన్నమగు 'రః' నశించునది. 'న' కానిది. "నరః" అను వ్యుత్పత్తిచే, 'నరము' లనిన 'నశించునవి' అని యర్థము. అవి యేవి యన, తత్త్వత్రయమైన చిదచిత్పరమాత్మలు నాశము లేనివి. ఉన్నవానికి వేనికిని నాశము లేదు. ఆ నరముల సముదాయమే నారము. ఈ నారము నుండి లక్ష్మీనారాయణులను తొలగింప, మిగిలిన వన్నియు నారములు. వానికి అయనము = దిక్కు, రక్షకుడైనవాడే నారాయణుడు. 'అయనము' అను పదముచే శ్రీమంతు డగు నారాయణుని గ్రహించుచున్నారుగాన, నారమునుండి వారిని తొలగించుట. ఇచ్చట నారాయణ పదమునకు - 'నర రక్షకు' డని యౌగికార్థమును గ్రహించి -

" పతిం విశ్వస్య ఆత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతం నారాయణం. "

అను శ్రుతిలోని నారాయణ పదమును శివున కన్వయింపగూడదు. అట్లైన, 'నారాయన' అగునుగాని, 'నారాయణ' అని, ణత్వము రాదు. "రషాభ్యాం నోణ స్సమానపదే" అను సూత్రమున నిమిత్తమైన రషలు, స్థానమైన 'న' ఒకే పదమున నున్ననే ణత్వాదేశము. కాన, 'నార' పదములోని 'ర', అయన పదములోని 'న'కు ణత్వము నీయజాలదు. అది యొక వ్యక్తికి సంజ్ఞయైన "పూర్వపదా త్సంజాయా మగః" అను సూత్రముచే, నిమిత్త స్థానములు భిన్న పదస్థములయ్యును - 'శూర్పణఖ' ఇత్యాదులందువలె ణత్వావకాశ ముండును.

కావున, శ్రీపతియే సర్వజన రక్షకుడు. సర్వ శివంకరుడు నారాయణుడే.

" నారాయణా ద్బ్రహ్మా జాయతే । నారాయణా ద్రుద్రో జాయతే. "

ఇత్యాది శ్రుతివల్ల బ్రహ్మ, శివుడును జీవకోటిలోని మనవంటివారే. మనకంటెను గొప్పవ్యక్తులు గాన, చిల్లర కోరికల నీయగలరు గాని, వారికే లేని ముక్తిని వారెట్లీయగలరు ? ప్రళయ కాలమున -

" ఆబ్రహ్మ భువనా ల్లోకాః పున రావృత్తి నోఽర్జున ! " (గీత)

అనునట్లు, వారును, వారి స్థానములును లయమునకు గురి యగు నవియే.

12 పురుషోత్తమ ! :- ఆతడే పురుషోత్తముడు.

" ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర మేవ చ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే
యస్మాత్ క్షరమతీతోహ మక్షరా దపిచోత్తమః
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. " (గీత)

బద్ధజీవులు క్షరులు. ముక్త జీవులు కూటస్థులు అక్షరులు. వారి కంటెను ఉత్తముడైన నీవు - పురుషోత్తముడ వని శాస్త్రములందును, వేదములందును వాసిగాంచినావు.

13 :- శ్రీరంగనాథ ! :- పరవాసుదేవ - వ్యూహావతార ములు మాకు చూడ సాధ్యము గానివి. రామాది విభవావతారములా ? ఆ కాలమందలివారికే గాని, మాకెట్లు గోచరము లగును ? ఇక మా హృదయాంతరాళమందే యుండినను, యమ నియమాది అష్టాంగ

యోగ సంసిద్ధులకేగాని, అంతర్ముఖు లముగా లేని మా కెట్లు లభ్య మగుదువు ? కాన, అంతర్యామి రూపమును మాకు చేరరానిది. ఇక శేషించినది అర్చావతారమే. కావున, నయన గోచరమైన శ్రీరంగ నిలయుడ వగు నీవే పరమాత్మవు. నీవు రక్షకుడవు. నేను రక్ష్యుడను. కావున, నన్ను రక్షింపుము.

14. మన్నాథ ! :- నీవు మాకు నాథుడవు.

" పతిం విశ్వస్య ఆత్మేశ్వరం. "

అను శ్రుతి - మాకు నిన్ను అధిపతివిగా చెప్పుచున్నది. కావున మేము నీ సేవకులము.

" త దహం త్వదృతే న నాథవాన్, మదృతే త్వం దయనీయవాన్న చ
విధి నిర్మిత మేత దన్వయం, భగవన్ ! పాలయ మాస్మ జీహపః. "

— (స్తోత్ర రత్నము)

అనునట్లు, నీవే మాకు నాథుడవు. "స్త్రీప్రాయ మితరం జగత్" అనునట్లు - స్త్రీప్రాయులైన జీవకోటికి భర్తవు నీవే. ఓ సర్వజన రక్షకా ! ఇదియే నా నమస్సు = అని శరణాగతిని సమర్పించు చున్నారు శ్రీమద్రామానుజులు.

## ఆశంస

జేజీయతాం కమల దంబుధిజా కళత్రాం
ప్రీ దించిర న్మృదుమనా యతిసార్వభౌమః
యో నిర్మమే పరమ దివ్య పదస్య మార్గం
నాకాగమం ప్రసవ పేశలతాభిరామమ్.

లక్ష్మీపతి పాదకమలములయందు బంభరాయమాణ మానసులు యతిసార్వభౌములు - బహు క్లేసభూయిష్ఠమైన వైకుంఠ పద మార్గమును దివ్యలోక పారిజాత ప్రసూన సుకుమారముగా, సర్వజన సుగమ్యముగా రచించిన ఉదార హృదయులు వారు. అట్టి భగవద్రామానుజుల సిద్ధాంతము ఆచంద్రార్కము తేజరిల్లుగాత !

---

గమనిక :- 'శ్రీరంగ గద్యము - శ్రీ రామానుజ భావనా విశేషము' అను ఈ వ్యాసమున అట నట సందర్భోచితముగా - గీతా నవనీతము యతిరాజీయము, పరమార్థ దీపిక, బాష్ప బిందువులు అను కావ్యము లందలి కొన్ని పద్యములు, కొన్ని శ్లోకములు ప్రమాణములుగా పేర్కొనబడినవి. ఈ కావ్యములు - వ్యాసకర్త లగు శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ (శేషాచార్యులు) గారిచే రచింపబడినట్టివే యని పాఠకులు గ్రహింతురు గావుత !

— సంపాదకుడు



# శ్రీమద్రామానుజులు - శ్రీవైకుంఠ గద్యము

'ఉభయ వేదాంత శిరోమణి

## శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, ఎం. ఏ

" పష్ఠే వేదాంత కర్పూర చామీకర కరండకమ్
రామానుజార్య మార్యాణాం చూడామణి మహ ర్నిశమ్. "

" యామునార్య సుధాంభోధి మవగాహ్య యథా మతిః
ఆదాయ భక్తి యోగాఖ్యం రత్నం సందర్శయా మ్యహమ్. "

## గద్యత్రయ వైశిష్ట్యము

భగవద్రామానుజ మునులచే అనుగృహీతములైన గ్రంథ రత్నములలో - 'గద్య త్రయము' అని ప్రసిద్ధి చెందిన మూడు గద్యములు - పరమ భోగ్యములు, ప్రపన్నులకు నిత్యానుసంధేయములునై యలరారుచున్నవి. వీరి శ్రీభాష్య - వేదార్థ సంగ్రహాదులు సిద్ధాంత నిరూపణ పరములు కాగా, 'నిత్య' గ్రంథము భగవదారాధన విధాన బోధకము. "అలర్ మేల్ మంగై యురైమార్పా ... ఉన్నడిక్కీళ్ అమర్న్దు పుకున్దేన్" అని శ్రియఃపతి తిరువడిఘళ్ళలో (= పాదపద్మములలో) తాము ప్రపత్తి చేసి, మనచేతను ప్రపత్తి చేయించిన శ్రీ శఠకోప మునీంద్రుల వలె, శ్రీమద్రామానుజ మునీంద్రులును శ్రియఃపతి తిరువడి ఘళ్ళలో (= పాద పద్మములలో) ప్రపత్తి చేయుచు, అస్మదాదులును ఉజ్జీవించుటకు వీలుగా తాము ప్రపత్తి చేసిన ప్రకారమును 'గద్య త్రయ' రూపమున అనుగ్రహించినారు.

1. శరణాగతి గద్యము 2. శ్రీరంగ గద్యము 3. శ్రీవైకుంఠ గద్యము అని, వీనికి గల ప్రత్యేక నామములు. శరణాగతి గద్యమును 'పృథు గద్యము' అనియు, శ్రీరంగ గద్యము 'లఘు గద్యము' అనియు వ్యవహరింతురు. ఈ రెండు గద్యములను భగవత్సన్నిధిలో భగవంతుని ఉద్దేశించి విన్నవింపబడినవి. శ్రీ వైకుంఠ గద్యము భగవత్సన్నిధిలో - చేతనుల నుద్దేశించి ఉపదేశింపబడినది. శ్రీరంగమునందు మీన మాసమునందలి 'ఉత్తర' నక్షత్రమున (పంగు న్యుత్తరము), శ్రీరంగనాయకి అవతార దిన మగుటచే, శ్రీరంగనాథుడు లక్ష్మీదేవి సన్నిధికి వేంచేసి, అచట ఆమెతో కలిసి తిరుమంజనము మొదలైన దివ్య భోగములను అనుభవించును. ఆ ఉత్సవమున శ్రీ శ్రియఃపతులను ఇద్దరిని భక్తులు కనుల పండువుగ సేవించి, తన్మయు లగుచుందురు. అట్టి ఒక పంగు న్యుత్తర దివ్యోత్సవ సందర్భమున శ్రీమద్రామానుజులు ఆ దివ్య దంపతుల సన్నిధిని ఆనంద పరవశులై, 'ఇదికదా విన్నవించదగిన సమయము' అని తలంచి, భక్తిరస పరీవాహ రూపమున ఈ గద్యత్రయమును విన్నవించి, శ్రియఃపతి కటాక్షమునకు పాత్రు లైనారు.

## శ్రీ రామానుజుల కృపా కటాక్షము

ప్రపన్నుడు ప్రతి నిత్యము - తాను శరీరావసాన సమయమున పొందబోవు భగవ దనుభవ ప్రకారమును అను సంధించుకొనుచుండ వలయును. దీనినే 'గతి చింతనము' అని యందురు. తాము అను సంధించుకొను గతి చింతనా ప్రకారమును స్వామి రామానుజులు చేతనుల మీది నిర్హేతుక కృపతో వారును ఉజ్జీవించుటకై శ్రీవైకుంఠ గద్యరూపమున నిబంధించి, మహోపకారము గావించినారు. వారు జగదాచార్యులు గదా !

# శ్రీ వైకుంఠ గద్య స్వరూపము

శ్రీవైకుంఠ గద్యము ఆరు చూర్ణికలుగ విభజింపబడి యున్నది.

" స్వాధీన త్రివిధ చేతనాచేతన స్వరూప స్థితి ప్రవృత్తి భేదము. "

మొదలుకొని -

" తద్గత సర్వ భావేన శరణ మనువ్రజేత్. "

అనునంతవరకు మొదటి చూర్ణిక.

" తతశ్చ ప్రత్యహ మాత్మోజ్జీవనాయ ఏవ మనుస్మరేత్ "

అనునది రెండవ చూర్ణిక.

" చతుర్దశ భువనాత్మక మండం. "

మొదలుకొని -

" ప్రణమ్య ఆత్మానం భగవతే నివేదయేత్. "

అనునంతవరకు మూడవ చూర్ణిక.

" తతో భగవతా స్వయ మేవ. "

మొదలుకొని -

" భగవంత ముపాసీత. "

అనునంతవరకు నాల్గవ చూర్ణిక.

" తతశ్చ అనుభూయమాన భావ విశేషః. "

మొదలు -

" అపలోకనేన అపలోకయన్ ఆసీత. "

వరకు అయిదవ చూర్ణిక. తక్కినది ఆరవ చూర్ణిక.

# ప్రపన్నుని కర్తవ్యము

ఇపుడు శ్రీవైకుంఠ గద్యము యొక్క సంగ్రహ స్వరూపమును దర్శింతము :-

**1. "భగవంతం నారాయణం స్వామిత్వేన సుహృత్త్వేన గురుత్వేన చ పరి గృహ్య తత్పాదాంబుజ ద్వయ ప్రపత్తేః అన్యత్ న మే కల్పకోటి శతేనాఽపి సాధన మస్తీతి మన్వానః తస్యైవ భగవతః నారాయణస్య శ్రీమచ్చరణారవింద యుగళం శరణ మనువ్రజేత్."**

"భగవంతుడైన నారాయణుని తనకు స్వామిగ, సుహృత్తుగ, గురువుగను భావించి (వరించి), అతని పాదారవిందములలో ప్రపత్తి చేయుటకంటె మరి యొక ఆత్మోజ్జీవన సాధనము తనకు ఎన్నటికిని కలుగనేర దని తలంచినవాడై, ఆ శ్రీమన్నారాయణుని పాదార విందములను శరణుపొందవలయును."

**2. తత శ్చ ప్రత్యహం ఆత్మోజ్జీవనాయ ఏవం అనుస్మరేత్."**

"పిమ్మట ప్రతి నిత్యము ఆత్మోజ్జీవనమునకై ఇట్లు స్మరించు చుండవలయును."

**3. " చతుర్దశ భువనాత్మక మండం దశగుణితోత్తరంచ ఆవరణ సప్తకం సమస్తం కార్య కారణ జాతం అతీత్య వర్తమానే శ్రీమతి వైకుంఠే దివ్యలోకే - దివ్య పురుషైః ఆపూరితే దివ్యాయతనే . కస్మింశ్చిత్ దివ్య రత్నమయ దివ్యాస్థాన మండపే - దివ్య పుష్పోపవనైః సౌగంధిక వాపీ శత సహస్రైః ఆవృతే - క్రీడో ద్దేశైః విరాజితే - తత్ర తత్ర దివ్య పుష్ప పర్యంకోపశోభితే - దివ్య గాంధర్వేణ ఆపూరితే - మందానిలాసేవ్యమానే - మహతి దివ్యయోగ పర్యంకే - అనంత భోగిని - శ్రియా సహాసీనం శ్రీమతి విష్వక్సేనే న్యస్త సమస్తాత్మైశ్వర్యం వైనతే యాదిభిః సేవ్యమానం కోమలావలోకనేన విశ్వ మాహ్లాదయన్తం - దివ్య లీలాల**

పామృతేన అఖిల జన హృదయాంతరాణి ఆపూరయన్తం భగవంతం నారాయణం ధ్యాన యోగేన దృష్ట్వా, పరిచర్యాయాం ఆశాం వర్ధయిత్వా, భగవంతం ఉపేత్య - 'సమస్త పరివారాయ శ్రీమతే నారాయణాయ నమః' ఇతి ప్రణమ్య, భగవంత ముపేత్య, శ్రీమతా మూల మంత్రేణ - 'భగవన్ ! మాం ఐకాన్తికాత్యంతిక పరిచర్యా కరణాయ పరిగృహ్ణీష్వ' ఇతి యాచమానః ప్రణమ్య, ఆత్మానం భగవతే నివేదయేత్."

"పదునాలుగు లోకములు గల బ్రహ్మాండమును, దానిని చుట్టి - ఒక దానికంటె మరి యొకటి పదింతలు అధికముగ నుండు ఏడు ఆవరణములను సమస్త కార్య కారణ సముదాయమును అతిక్రమించియుండు శ్రీమంత మగు 'శ్రీవైకుంఠము' అను దివ్య లోకమునందు - దివ్య పురుషులచే (నిత్య ముక్తులచే) నిండియుండు సువిశాలమైన దివ్యాయతనమున గల దివ్యరత్న సంశోభితమైన ఒకానొక దివ్యాస్థాన మండపమున దివ్య పుష్పోపవనముల తోడను, చెంగలువలు గల నడబావుల తోడను పరివేష్టితమై, వివిధ విహార భూమి సంశోభితమై, అట నట దివ్యపుష్ప పర్యంక పరిగతమై, మధుర గాన పరిపూర్ణమై, మంద మారుత సంసేవితమై యొప్పియున్న గొప్ప దివ్యయోగ పర్యంకము అగు ఆదిశేషుని మీద (శేషతల్పమున) లక్ష్మీదేవితో కలిసి ఉపవిష్టుడై యున్నవాడును, తన సమస్తైశ్వర్యమును విష్వక్సేనునికి వశము గావించినవాడును (బదలాయించినవాడును) వైనతేయాదులచే సంసేవితుడును, సుందర వీక్షణములచే సమస్తమును ఆనందింప జేయుచున్నవాడును మధుర భాషితములచే సకల జన హృదయముల నాకర్షించుచున్నవాడును అయిన భగవంతుని, నారాయణుని ధ్యానయోగమున దర్శించి, అతనికి పరిచర్య గావించుటలో అతిశయించిన ఆశతో భగవంతుని దరి జేరి, 'సమస్త పరివారాయ శ్రీమతే నారాయణాయ నమః' అని నమస్కరించి, కొలదిగ

సమీపించి, మూల మంత్రముతో (అష్టాక్షరీ మంత్రముతో) - 'భగవన్ ! సర్వ దేశ సర్వ కాల సర్వావస్థల యందును నీకే పరిచర్య గావింప నన్ను స్వీకరింపుము' అని ప్రార్థించి, ప్రణమిల్లి, తనను భగవంతునికి సమర్పించుకొనవలయును. ''

4. "తతః భగవతా స్వయ మేవ అవలోక్య, అత్యంత శేషభావాయ స్వీకృతః కృతాంజలిపుటః భగవంత ముపాసీత."

"పిమ్మట భగవంతుడు స్వయముగ కటాక్షించి, తన కైంకర్యమునకు స్వీకరింపగా - అంజలి ఘటించి, భగవంతుని ధ్యానింపవలయును."

5. "తత శ్చ అనుభూయమాన భావ విశేషః ఆన్యత్ కించి త్కర్తుం, ద్రష్టుం, స్మర్తుం చ అశక్తః, భగవంత మేవ అవబోధయ న్నాసీత్."

"అటు పిమ్మట భక్తిభావ పరవశుడై, ఇక దేనిని చేయుటలు గాని, చూచుటకుగాని, స్మరించుటకుగాని శక్తి లేనివాడై, భగవంతునే సేవించుచు ఉండవలయును."

6. "తతః భగవతా అవలోక్య సస్మిత మాహూయ, ఆత్మీయ శ్రీమ త్పాదారవింద యుగళం శిరసి కృతం ధ్యాత్వా, అమృత సాగరాంత ర్నిమగ్న సర్వావయవః సుఖ మాసీత."

"పిమ్మట భగవంతుడు కటాక్షించి, మందహాస పూర్వకముగ ఆహ్వానించి, దివ్య పాదారవిందములను తన శిరమున నుంచినట్లు ధ్యానించి, తాను అమృత సాగరమున మునిగిన రీతిని నిరతిశయ సుఖానుభూతిని పొందవలయును."

## ఉపదేశము

ఇది ప్రపన్నుని అనుదిన కర్తవ్య గతి చింతనా ప్రకారము. ఇందు మొదటి చూర్ణికలో - ప్రపన్నుడు శరణ్యుడైన సర్వేశ్వరుని స్వరూప రూప గుణ విభూత్యాదుల వైలక్షణ్యమును, తద్విపరీతమైన తన స్వరూపమును అనుసంధించుకొని, ఇంతటి అయోగ్యుడనైన నేను అంతటి విలక్షణుడైన సర్వేశ్వరుని పొందుటకు - 'ప్రపత్తి' తప్ప, వేరొక ఉపాయము లేదని నిశ్చయించుకొని, ఆశ్రయణ సౌకర్యాపాదకములైన అతని సౌశీల్యాది గుణములనే ఆధారముగ జేసికొని, ఆ శ్రియఃపతిని శరణు పొందవలయును' అని ఉపదేశింపబడినది.

రెండవ చూర్ణికలో - ఒక్కమారు ప్రపత్తి చేసిన చాలును. ఫలము తప్పక సిద్ధించును. కాని, మనస్సు ఇతర విషయముల మీదికి ప్రసరింపకుండుటకును, సత్కాలక్షేపము కొఱకును దీనిని ప్రతి నిత్యము అనుసంధించుకొనుచుండవలయును' అని తెలుపబడినది.

మూడవ చూర్ణికలో - ఇట్టి ప్రపత్తి నిష్ఠుడు అర్చిరాది మార్గమున పయనించి, ప్రకృతి మండలమును అధిగమించి, దానికి పైన గల పరమ వ్యోమము (త్రిపాద్విభూతి, నిత్య విభూతి) అనబడు శ్రీవైకుంఠమును చేరి, ఊహాతీతమైన దాని వైభవమును, అచటి నిత్య ముక్తుల కైంకర్య నిష్ఠను దర్శించును. పిదప, ఆ నగర మధ్యమున నానా ప్రాకార దివ్యోద్యానాది పరివృతమైన ఒక దివ్య భవనమును, అందు వివిధ యవనికా వితాన రత్నదీప సింహాసనాది పరిష్కృతమైన ఒక మణిమయ దివ్యాస్థానమండపమును దర్శించును. దాని చుట్టును గల పుష్పోద్యానములు, క్రీడా శైలములు, విహార వాటికలు, క్రీడాంగణములు కనుల పండువ గావించుచుండును. అచటి పక్షుల కిలకిలా రావములు, రాజ హంసల నడకల బెడగులు, మధు

కరముల మధుర గానములు, వివిధ పుష్పముల పరిమళములను గొని వచ్చు మంద మారుతములు - ప్రేక్షకులకు ఆహ్లాదమును చేకూర్చు చుండును. ఆ మండపముయొక్క మధ్య భాగమున ఆదిశేషుడు దివ్య యోగ పర్యంకము (పాన్పు)గ నమరియుండును. పుష్పాలంకృతమైన ఆ శేషశయ్య మీద శ్రీవైకుంఠ నాథుడు శ్రీదేవితో వేంచేసి యుండును. ఆ శ్రియఃపతి దివ్య మంగళ విగ్రహ సౌందర్యమును, దివ్యావయవ సౌందర్యమును, దివ్యాభరణముల సౌందర్యమును, దివ్యాయుధముల సౌందర్యమును తనివితీర సేవించి - 'అతడు తనకు స్వామి; తాను అతనికి దాసుడు' అను విషయమును చక్కగ అను సంధించుకొని, మా కుల దైవము, మా కుల ధనము నాకు పరమ భోగ్యుడు, తల్లి, తండ్రి అన్నియు అయిన ఆ శ్రీమన్నారాయణుని ఎన్నడు దర్శింతునో - ఎన్నడు అతని పాదసన్నిధిని పరిచర్య గావింతునో - భగవంతుడు నన్ను ఎన్నడు తనకు పరిచారకునిగ స్వీకరించునో అని, అతిశయించిన ఆశతో అతని సన్నిధికి చేరి, దండ ప్రణామము గావించి, లజ్జా వినయ వినమిత గాత్రుడై, ద్వారపాలకు లకు ప్రణమిల్లి, వారి అనుమతి గొని, భగవంతుని సమీపించి, 'భగవన్ ! ఈ దాసుని పరిచర్యకై స్వీకరింపుము' అని ప్రార్థించి, తనను భగవంతునికి సమర్పించుకొనవలయును' అనుచు - భగవ దనుభవ ప్రకారము ఉపదేశింపబడినది.

నాల్గవ చూర్ణికలో - ఈ ప్రపన్నుడు కోరిన రీతిగనే భగ వంతుడు ఇతనిని స్వీకరించి, కైంకర్యమునకు నియమింపగా, భగవ త్కైంకర్య నిరతుడు కావలయు నని బోధింపబడినది.

అయిదవ చూర్ణికలో - అనాదిగ అనుభవించుచున్న దుఃఖము అంతయు తీరునట్లు, అన్య పరత ఏమాత్రము లేక, నిర్నిమేష భావముతో సదా దర్శనము చేయుచుండవలె నని తెలుపబడినది.

ఆరవ చూర్ణికలో - శ్రియఃపతి ఈ ప్రపన్నుని కటాక్షించి, సమీపమునకు ఆహ్వానించి, తన శ్రీపాదములను ఇతని శరీరమున నుంచగా, రాజులు కిరీట ధారణ చేయు రీతిని - శేషత్వ సామ్రాజ్య ధురంధరతకు చిహ్నము, కిరీటాయమానము అయిన ఆ పాదారవింద ద్వంద్వమును శిరమున దాల్చి, స్వారాజ్య ధురంధరుడు అగును' అని ఉపదేశింపబడినది.

ఇట్లు ద్వయార్థ వివరణముగా ప్రసిద్ధమైన గద్యత్రయములో- శ్రీవైకుంఠ గద్యము ముముక్షు జన కర్తవ్యమైన ధ్యానయోగ ప్రకారమును భక్తిరస భరితముగ వర్ణించినది.

## విష్ణు లోక ప్రాప్తి

బ్రహ్మవేత్త శరీరావసాన సమయమున హార్ద జనార్దనాను గృహీతుడై, తాను ఉన్నట్టి హృదయ కమలము యొక్క అగ్ర భాగము చక్కగ ప్రకాశింపగా - మూర్ధమును చేరి, దానిని భేదించు కొని, రశ్మి - దిన - పూర్వపక్ష - ఉత్తరాయణ - సంవత్సర - వాయు - సూర్య - చంద్ర - విద్యుత్ - వరుణ - ఇంద్ర - చతు ర్ముఖ బ్రహ్మలు అను అతివాహికులచే ఆ యా లోకములయందు సన్మానితుడై, ప్రకృతి మండలమును భేదించుకొని, శ్రీవైకుంఠమును చేరి, అచట విరజా నదిలో స్నాన మాడి, ప్రకృతి వాసనలను సమూల ముగ తొలగించుకొని, బ్రహ్మలంకారాలంకృతుడై, తిల్య (అశ్వత్థ) వృక్షమును చేరి బ్రహ్మ గంధమును, 'సాలభ్యము' అను స్థానమును చేరి బ్రహ్మ రసమును; 'అపరాజితము' అను బ్రహ్మ భవనమును చేరి బ్రహ్మ తేజమును; అచటి 'ఇంద్రమను' ప్రజాపతి' అను ద్వారపాలకుల

అనుమతిని పొంది, అందు గల 'విభుప్రమితము' అను సువిశాల మగు ఆస్థాన మండపమును చేరి బ్రహ్మ యశస్సును పొంది. దాని మధ్య గల దర్శనీయమైన శయనాసనమును, దానిమీద 'అమితౌజము' అను పర్యంతమును, దానిమీది చంద్ర కిరణ ధవళ మైన ప్రచ్ఛద పటమును (దుప్పటిని), దాని ప్రక్కన 'ఉద్గీథము' అనెడి శ్రీదేవి యాస్తరణమును, స్వచ్ఛమైన పాదోపధానమును (దిండును), ఇట్టి శయనాసనము మీద ఉపవిష్టుడై యున్న పరబ్రహ్మ మగు శ్రీమన్నారాయణుని - అచటి ప్రజ్ఞాదేవి అనుగ్రహమున సమగ్రముగ సేవించును' - అని కౌషీతక్యాది ఉపనిషత్తులు ముక్త పురుషుని అర్చిరాది మార్గ ప్రయాణమును, బ్రహ్మానుభూతిని వర్ణించి యున్నవి.

" అర్చిరాదినా తత్ప్రథితేః. "

ఇత్యాది సూత్రములచే బ్రహ్మసూత్రకారులు -

" అగ్ని ర్జ్యోతి రహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్
తేన ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మ విదో జనాః. "

అనియు -

" ఏకయా యా త్యనావృత్తిం అన్యయా వర్తతే పునః. "

అని గీతాచార్యుడును ఈ విషయమును విశదీకరించియున్నారు.

వీని ననుసరించియే స్వామి శ్రీమద్రామానుజులు - శ్రీ వైకుంఠ గద్యమును అనుగ్రహించినారు. ప్రపన్నులు అనుదినము ఈ అర్చిరాది మార్గమునుకూడ ధ్యానింపవలసియున్నది. కాని, రామానుజులు ఈ పూర్వ భాగమును విస్తరించి వర్ణింపలేదు. పరమ ప్రాప్య మైన పరబ్రహ్మ లోకానుభవమును మాత్రమే శ్రీ శఠకోప మునీం

ర్కులు - "శూళ్ విశుంబణి ముగిల్" అను దశకమున దర్శించి వర్ణించినారు. ప్రయాణ మార్గము కంటె ప్రాప్యదేశ వైభవము గదా ప్రధానమైనది !

## స్వర్గ భోగములు

ఇక స్వర్గాదులయందును ఇట్టి భోగము లున్నట్లు - శ్రుతి స్మృతీతిహాస పురాణాదులు తెలుపుచున్నవి. కాని, అవి ప్రకృతి మండలాంతరములు, కర్మవశ్యములు. కావుననే - "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" పుణ్యము క్షీణించినంతనే స్వర్గమునుండి భూలోకమునకు వత్తురు' అని - స్వర్గ వాసులకు పునరావృత్తి చెప్ప బడినది.

## పునరావృత్తి రాహిత్యము

శ్రీవైకుంఠమును చేరినవానికి పునరావృత్తి లేదు' అని -

"సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్."

అను కఠశ్రుతి స్పష్టముగ చెప్పుచున్నది. గీతాచార్యుడును -

"ఆబ్రహ్మ భువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున !
మా ముపేత్య తు కౌంతేయ ! పునర్జన్మ న విద్యతే."

తనను పొందినవారికి పునర్జన్మ ఉండదు' అని స్పష్టము గావించినాడు. దేవతాంతరోపాసకులకు ఇట్టి పునరావృత్తి రూప మగు మోక్షము సిద్ధింపదు. ఈ విషయమును గీతాచార్యుడు -

"కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః
తం తం నియత మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా.
యో యో యాం యాం తనుం భక్త శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య తస్యాచలాశ్రద్ధాం తా మేవ విదధా మ్యహమ్.

" స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే
లభతే చ తతః కామాన్ మ యైవ విహితాన్ హితాన్
అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసామ్
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మా మపి. "

వివిధములైన కోరికలచే వివేకమును కోల్పోయినవారు తమ తమ స్వభావములకు అనుగుణముగ నియమ నిష్ఠలతో ఇతర దేవతలను ఆరాధింతురు. ఎవ రెవరు ఏ యే దేవతా మూర్తిని శ్రద్ధా భక్తులతో ఆరాధించినను, వారికి ఆ విషయమున దృఢ విశ్వాసమును నేనే కలిగింతును. ఆ యా దేవతల రూపమున వారికి ఫలము నొసంగు వాడను నేనే. కాని, తత్త్వదృష్టి లేని ఆ దేవతాంతరోపాసకులు పొందు ఫలితము నశ్వరమైనది. ఆ యా దేవతోపాసకులు ఆ యా దేవతల లోకములను పొంది, భోగములను అనుభవించి, మరల జన్మింపరు. నన్ను అనన్య చిత్తముతో ఉపాసించువారు నన్ను పొందు చున్నారు' అని నొక్కి వక్కాణించినాడు.

ఇచట శ్రీ శంకరాచార్యులవారి భాష్యసూక్తిని పరికింపుడు :-

"ఏవం సమానేఽపి ఆయాసే మా మేవ న ప్రపద్యంతే అనంత ఫలాయ అహో సుఖలు కష్టతరం వర్తతే ఇతి అక్రోశం దర్శయతి భగవాన్. "

దేవతాంతరోపాసకులకును ఉపాసనలో శ్రమము సమానమే యైనను, దేవతాంతరోపాసకులు నన్నే చేరి, అనశ్వరమైన మోక్ష రూప ఫలితమును పొందలేకున్నారు. ఏమి కష్టము వీరిది - అని భగ వంతుడు వారి విషయమున జాలి పడుచున్నాడు - అని యను చున్నారు. ఈ విధముగ మత త్రయాచార్యులును విష్ణులోక ప్రాప్తినే మోక్ష మనుచున్నారు - అనుట స్పష్టము గదా !

శ్రీ శంకరాచార్యులవారు నిర్గుణ బ్రహ్మ భావమే జీవునికి వాస్తవ మగు మోక్ష మని, పునరావృత్తి లేని విష్ణులోక ప్రాప్తి (సగుణబ్రహ్మప్రాప్తి) దానికి పూర్వదశ అని భావించుచున్నారు. కాని, శ్రుతి -

"త ద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః. దివీవ చక్షు రాతతం. త ద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ం స స్సమింధతే. విష్ణో ర్య త్పరమం పదమ్."

విష్ణువు యొక్క పరమ పదమునందు ముక్తులు, నిత్యులు అయిన జ్ఞానులు నిర్నిద్రులై, భగవంతుని సదా దర్శించుచు, స్తుతించుచు ఆనందించుచుందురు' అనుచు, బ్రహ్మానుభవ ప్రకారమును తెలుపుచుండగా, దీనిని కా దని, తాము నైయాయికుల మతమున దూషించిన పాషాణ ముక్తినే పరమ ముక్తిగా రూపాంతరమున సంభావించుట - ఘట్ట కుటీర న్యాయమును తలపించుచున్నది. భగవ దనుభవ రసాభిజ్ఞులు ఇట్టి కేవలాత్మానుభూతి రూపమైన ముక్తిని ఊసర క్షేత్ర తీర్థము వలె పరిహరింతురు. "లోకో భిన్న రుచిః" కదా !

## అర్చిరాది గతి

శ్రీ పిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన అష్టాదశ రహస్యములలో ఒక్కటైన 'అర్చిరాది గతి' అను గ్రంథమున అర్చిరాది గమనము, శ్రీవైకుంఠలోక ప్రాప్తి, భగవ దనుభవ ప్రకారము - అత్యంత విశదముగ వర్ణింపబడి యున్నవి. ప్రపన్నులకు అదియు అవశ్య పఠనీయము.

## ప్రపత్తియే ఆచరణీయము

శ్రీ యామున మునీంద్రుల స్తోత్ర రత్నమును శ్రీవైకుంఠ గద్యము శబ్దమునుబట్టి, అర్థమును బట్టియు అనేక సందర్భములలో

అనుసరించుచున్నది. పరమాచార్యుల విషయమున శ్రీ స్వామికి గల నిరతిశయ భక్తికి ఇది తార్కాణము. ఈ విషయమును - "యామునార్య సుధాంబోధిం" అను ఇందలి మంగళ శ్లోకము స్పష్టము చేయుచున్నది. ఇందు 'భక్తి' అనగా - ప్రపత్తి' అని యర్థము. ఇది - భగవత్ప్రవృత్తి విరోధి స్వప్రవృత్తి నివృత్తి రూపమైనది. భక్తి యందు కర్తృత్వా ద్యభిమానము ఉండును. కావుననే భక్తి - మర్కట కిశోర న్యాయమును అనుసరించుచుండగా, ప్రపత్తి - మార్జాల కిశోర న్యాయమును అనుసరించుచున్నది.

సాధన భక్తిని 'భక్తి' యనియు, సాధ్య భక్తిని 'ప్రపత్తి' యనియు వ్యవహరింతురు. భక్తి - ఉపాసనా రూపమైనది. కర్మ జ్ఞానములు దీనికి అంగములు. కావున, ఇది త్రైవర్ణికాధికారికము. అనగా - ఉపనయనాధికారము గలవారికే ఇది సాధ్యము. ప్రపత్తి అట్లుగాక, సర్వాధికారికము. గజేంద్రుడు, కాకాసురుడు, జటాయువు మున్నగువారును ప్రపత్తి చేసి, భగవ దనుగ్రహపాత్రులైరి కదా! ప్రపత్తి సర్వాధికారికమేగాక, సర్వార్థ సాధకము కూడ. ఎట్లన, గజేంద్రుడు భగవద్దర్శనమును, కాకాసురుడు ప్రాణ సంరక్షణమును, జటాయువు మోక్షమును, విభీషణుడు రాజ్యమును, ద్రౌపది మాన సంరక్షణమును పొందినది ప్రపత్తి చేతనే గదా! కావుననే, మన పూర్వాచార్యు లందరు ప్రపత్తి నిష్ఠులైనారు. గీతాచార్యుడు -

" వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః. "

అని కీర్తించినది జ్ఞానియైన ఈ ప్రపన్నునే - అను విషయమును విస్మరింపరాదు. ఈ శరణాగతి మంత్రమును అనుసంధింపుడు :-

" యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై
తగ్ంహ దేవ మాత్మబుద్ధి ప్రసాదం
ముముక్షుర్వై శరణ ప్రపద్యే. "

ఎవడు తొలుత బ్రహ్మను సృష్టించి, అతనికి వేదములను ఉపదేశించినాడో, ఆత్మజ్ఞానము నొసంగు అట్టి భగవంతుని - ముముక్షువునై న నేను శరణు పొందుచున్నాను."

బ్రహ్మను తన నాభి కమలమున సృజించి, అతనికి వేదములను ఉపదేశించినవాడు, "మోక్ష మిచ్ఛేత్ జనార్దనాత్" అని ముముక్షువులకు మోక్షము నిచ్చువాడు, "మా మేకం శరణం వ్రజ" అని, తనను అనన్య భక్తితో శరణు పొంద మన్నవాడు - ఆ శ్రీమన్నారాయణుడే కావున, స్వామి రామానుజులు ఈ వైకుంఠ గద్యమునందు భగవత్ప్రాప్తిరూప మగు మోక్షానుభూతిని భక్తితో అతి మనోహరముగ వర్ణించి, ఆ పరమ సత్యమును మన కనులకు కట్టునట్లు చేసి అనుగ్రహించినారు.

## గద్యత్రయము నిత్యానుసంధేయము

గద్యమునకు జీవితమైన ఓజో గుణము గద్యత్రయమునందు పుష్కలముగ నుండుటచేత, కంఠస్థ మొనర్చుటకును, శ్రావ్యముగ అనుసంధించుకొనుటకును ఇది సులభమై యున్నది. అందరు నిత్యము దీనిని అనుసంధించి తరింతురుగాక !

" లక్ష్మీపతే ర్యతిపతే శ్చ దయైకధామ్నోః
యో௨సౌ పురా సమజనిష్ట జగద్ధితార్థమ్
ప్రాప్యం ప్రకాశయతు నః పరమం రహస్యం
సంవాద ఏష శరణాగతి మంత్రసారః. "

దయాసముద్రులైన లక్ష్మీపతికి, యతిపతికి మధ్య - లోకక్షేమమునకై జరిగిన శరణాగతి మంత్రసారమైన ఈ సంవాదము పరమ రహస్య మగు ప్రాప్య తత్త్వమును విశదీకరించుగాక !"

" రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్. "



# శ్రీమద్రామానుజులు - వర్ణాశ్రమ ధర్మములు

'విశిష్టాద్వైత వేదాంత విశారద'
శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యులు, ఎం. ఏ; బి. యిడి.



## అంజలి

" శ్రీభాష్యం సకల శ్రుతి స్మృతి లసత్ సూత్రార్థ నిర్ణాయకం
సద్వర్ణాశ్రమ ధర్మిణాం పరపదం విష్ణుఃపరం కారణమ్
కల్యాణాఖిల సద్గుణః ఫలద ఇత్యర్థాన్ విసృజ్య త్వరం
వందే భాష్యకృతిం హరిం యతిపతిం సిద్ధాంత సంస్థాపనమ్. "

## అవతారిక

శ్రీ మహావిష్ణువు చరాచరాత్మకమైన ప్రపంచ నిర్మాణమునకు కారణ భూతు డన్నది - త్రిమత వైదిక సమ్మతమైన సిద్ధాంతము. ఇది - ద్వైతాద్వైత విశిష్టాద్వైత భాష్యములలో ప్రపంచితము. వైదిక వర్ణాశ్రమాచార నిష్ఠలో ఏక రూపతయు, సిద్ధాంత భేదమున సంప్రదాయ భిన్నతయు కలిగి, వైదిక బ్రాహ్మణాచార సంపద కలిగిన శ్రోత్రియ సంఘములను నెలకొల్పినది మత త్రయము.

11 - వ శతాబ్దిలో శ్రీమద్రామానుజాచార్యులు మహా ప్రవాహములో ఎదురీత యీదిన మహా సాహసికులు. ఆచార్యాజ్ఞను

మీరుట వలన తాను నరకమునకు పోయినను మంచిదే - తోటి మానవ కోటి మాత్రము మోక్షము పొందవలసినదే యని గోపుర మెక్కి, గొంతెత్తి తిరుమంత్రము నుచ్చరించి, సాహసము చేసిన ఘనత - భగవద్రామానుజాచార్యులకే దక్కినది.

" ధర్మ వ్యతిక్రమో దృష్టో, మహతాం సాహసం తథా.

— (మనుస్మృతి)

'మహా పురుషులు ధర్మ వ్యతిక్రమమును సాహసముతో చేయుదురు' అను మను వచనమునకు వీరే తార్కాణము. భగవద్రామానుజాచార్యులు సాహిసికులే గాక, త్యాగ పురుషులు, దీర్ఘ జీవులు, విశిష్టాద్వైత సిద్ధాంత సంస్థాపకులు, ఆసేతు శీతనగ పర్యంతమువ్యాపన స్థైర్య లక్షణ సిద్ధాంత ప్రవర్తకులు. సర్వ దేశ దేశా కాలములలో అవ్యాహత పరాక్రములు. అనేకాచార్య పీఠ స్థాపకులై, 'చతుస్సప్తతి శిష్యాద్యు' లని కీర్తి గాంచినవారు.

జ్ఞాన కర్మానుష్ఠాన సంపూర్ణత్వమే ఆచార్యత్వ పూర్తికి సంలక్షకము; భగవత్ప్రాప్తి సంధాయకము.

శ్రుతి స్మృతీతిహాసములు ప్రమాణముగాను, శ్రుతి విహితమైన కర్మములచేత ఆరాధ్యుడైన పరబ్రహ్మయే ప్రమేయముగాను నిరూపించినవారు రామానుజులు. భగవ ద్బోధాయనులు, టంకాచార్యులు, ద్రమిడాచార్యులు, గుహదేవ, కపర్ది, భారుచి మున్నగు శిష్టులు పరిగ్రహించినట్టి పురాతన వ్యాఖ్యానములతో, స్పష్టార్థ ప్రతిపాదకములగు అనేక శ్రుతుల ననుసరించిన మార్గము వారిది. వీరి సిద్ధాంతము, వ్యాఖ్యానము, అర్థ నిర్ణయము స్వకపోల కల్పితముగ ఊహించినది కాదనియు, పూర్వాచార్యులు ప్రవర్తించిన వేద మార్గ మనియు

విశదీకరించినారు. శ్రీభాష్యములోను వ్యాఖ్యాన ప్రాకరణిక ప్రదర్శనము ఎంతో ప్రభావ పూరితమైన ప్రతిజ్ఞగా గోచరించుట గమనార్హము.

వేదమునకు వ్యాఖ్యానమైన మీమాంసా శాస్త్ర మొక్కటే కాని, రెండు కావు. కర్మ మీమాంస, బ్రహ్మ మీమాంస - అని, వేదముయొక్క పూర్వోత్తర భాగములు వ్యాఖ్యాన రూపమున సూత్రీకరింపబడినవి. వ్యాస మహర్షి శిష్యులైన జైమిని - "అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా" అని యారంభించి, వర్ణాశ్రమ విహిత కర్మల పౌర్వా పర్యమును చర్చించిన సిద్ధాంత గ్రంథమే పూర్వ భాగము. వేదవ్యాస మహర్షి - "అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా" అని యారంభించి, పర బ్రహ్మ స్వరూప రూప విభవములను చర్చించి, "అనావృత్తి శ్శబ్దా దనావృత్తి శ్శబ్దాత్" అను సూత్రముతో ముగించిన సిద్ధాంత గ్రంథమే ఉత్తర భాగము. బ్రహ్మ విచారము కంటె పూర్వ వృత్తము కర్మ విచారము.

"వృత్తా త్కర్మాధిగమానంతరం బ్రహ్మ వివిదిషా. " — (వృత్తికారుడు)
" రామో విగ్రహవాన్ ధర్మః. " — (రామాయణము : వాల్మీకి)
" కృష్ణం ధర్మం సనాతనమ్. " — (భారతము : వ్యాసుడు)

ధర్మ మనగా - పరబ్రహ్మ మని అర్థము. మీమాంసా శాస్త్రములో పూర్వోత్తర శబ్దములతో నిర్దేశించిన విధానమునకు - ఉపజీవ్యోపజీవిక భావ మని అర్థము. కర్మ బ్రహ్మ విచార విశేషము లతో విషయ మంతయు ఇందు విస్తరింపబడిన దని శాస్త్రైక్యమును సమర్థించినారు.

# సృష్టి విలాసము

సిద్ధ ధర్మ స్వరూపుడును, కరుణా వరుణాలయుడు నైన సర్వేశ్వరుడు - గర్భ జన్మ జరా మరణ నరకాది నానావిధానంత దుఃఖ బాహుళ్యముతో కూడుకొనియున్న జగత్తును సృష్టించుటకు కేవలము విలాసమే ప్రయోజన మని శ్రీభాష్యకారులు దృష్టాంతమును ప్రసాదించినారు.

"సప్త ద్వీప యగు పృథివి కంతటికిని అధిపతియై, మొక్కవోని పరాక్రమము గల మహారాజు కేవలము విలాసము కొఱకు బంతి యాట మున్నగు కార్యములందు ఉద్యమించుచున్నట్టి పరబ్రహ్మ కూడ విలాసార్థమే తన సంకల్ప మాత్రమున జగత్సృష్టి స్థితి లయముల నొనర్చుచున్నాడు."

— (శ్రీభాష్యము : 2 - 1 - 33)

జీవులును, వారి కర్మ ప్రవాహములును అనాదులే కాబట్టి; దేవ తిర్యఙ్మనుష్య స్థావర రూపమైన విషమ సృష్టికి - సర్వేశ్వరుడు నిమిత్త మాత్రుడే, సర్వేశ్వరునియందు వైషమ్య నిర్దయత్వ దోషములు ప్రసక్తింపవు.

" నిమిత్తమాత్రమే వాసౌ సృజ్యానాం సర్గ కర్మణి
ప్రధాన కారణీభూతా యతో వై సృజ్య శక్తయః. "

జీవుని తమయందు దున్న ప్రాచీన కర్మశక్తి చేతనే దేవాది శరీరములను పొందుచున్నవి' అని విష్ణు పురాణము వివరించుచున్నది.

# పుణ్య పాపములు

'ఈ కర్మములు మంచివి, ఈ కర్మములు చెడ్డవి' - అని భగవంతుడు కర్మములకు ద్వైవిధ్యము నేర్పరచి, వానిని గ్రహించుటకు -

ఉచితము లగు దేహేంద్రియాదులను, వానిని నియమించు శక్తిని కూడ సామాన్యముగ ప్రదర్శించి, ఆ శాస్త్రమును ప్రవర్తింపజేయుటకు తాను అంతరాత్మగా అందరిలోనను ప్రవేశించి, అంగీకారము నిచ్చువాడుగా జీవులను నియమించుచున్నాడు. జీవులు కూడ భగవంతు డొసగిన శక్తిని, కరణ కళేబరాదులను కలిగి, భగవ దాధారులై, తమంతట తామే యిష్టానుసారముగ పుణ్య పాప రూపము లగు కర్మముల నొనర్చుచున్నారు' అని శ్రీభాష్యములో పరమాత్మని సర్వశేషిగా, జీవాత్మని శేషభూతునిగా నక్కాణించినారు భగవ ద్రామానుజులు.

"పుణ్యాపుణ్య స్వరూపే విం శాస్త్రైక సమధిగమ్యే. శాస్త్రం చ అనాది నిధనావిచ్ఛిన్న పాఠ సంప్రదాయానాక్రాంత ప్రమాదాది దోష గంధ వేదాఖ్యాక్షర రాశిః, త చ్చ పరమ పురుషారాధన త ద్విపర్యయ రూపే కర్మణీ పుణ్యాపుణ్యే, త దనుగ్రహ నిగ్రహాయత్తే చ తత్ఫలే సుఖ దుఃఖే ఇతి వదతి."

— (శ్రీభాష్యము : 2 - 2 - 3)

పుణ్యపాప కర్మల స్వరూపము శాస్త్రము వలననే తెలిసికొనదగినది. శాస్త్ర మనగా - అనాదియు, నాశ రహితమును, పరంపరాగతమై, ప్రమాదాది దోష గంధ లేశము లేని వేదము. అది భగవదారాధన రూపములైన కర్మముల నాచరించుట పుణ్య మనియు, భగవదాజ్ఞారూపమైన వేద శాస్త్ర విరుద్ధ మగు కర్మముల నాచరించుట పాప మనియు తెలుపుచున్నది.

పుణ్యములచేత ఆనందించి భగవంతుడు కలిగించు సుఖము పుణ్య ఫలము. పాప కర్మముల చేత క్రోధము చెంది, భగవంతుడు కలిగించు దుఃఖము పాప ఫలము. ఈ విషయము సర్వ సమ్మతము.

" ఫలసంబిభిత్సయా హి కర్మభి రాత్మానం పిప్రీషంతి
న ప్రీతోఽలం ఫలా యేతి శాస్త్ర మర్యాదా. " — (ద్రవిడ భాష్యము)

ఫల ప్రాప్తికై, విహిత కర్మల ననుష్ఠించి, పరమాత్మను ఆనందింపజేయుచు, పరమాత్మను ఆనందించిన చాలు ననుకొనుటయే శాస్త్ర మర్యాద' - అను పూర్వాచార్య సూక్తి నుదహరించినారు భగవద్రామానుజులు తమ శ్రీభాష్యములో.

## ఫలప్రదాత పరమ పురుషుడే

జైమిన్యాచార్యుడు పూర్వ మీమాంసా శాస్త్రములో - కర్మ జనితమైన 'అపూర్వమే' స్వర్గాది ఫలము నిచ్చు నని చెప్పినందున, కేవలము అనుమాన సిద్ధ స్వరూపమై, కల్పితమైన 'అపూర్వ' మను అచేతనమునకు ఫల ప్రధాన శక్తి యున్న దని చెప్పుట పొసగ దనియు, కర్మఫల ప్రదాత పరమ పురుషుడే యని శ్రీ వ్యాస భగవానుని మత మనియు శ్రీమద్రామానుజులవారు సిద్ధాంతీకరించినారు.

" ఇష్టా పూర్తం బహుధా జాతం జాయమానం
విశ్వం బిభర్తి భువనస్య నాభిః. " — (తైత్తిరీయము)

" యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. "

— (భగవద్గీత)

సర్వ భూతములను సృజించి, యీ సమస్తమును వ్యాపించి యున్న పరమాత్ముని వర్ణాశ్రమ కర్మానుష్ఠానము చేత ఆరాధించి, మానవుడు సిద్ధిని బొందుచున్నాడు' - అని స్మృతి వక్కాణించుచున్నది.

"జనులు కృష్యాదులచే సంపాదించిన నానావిధ ద్రవ్యములతో, తమ నేలిన వానిని భృత్యుల ద్వారానో, స్వయముగానో పూజింతురు. పూజితుడైన ప్రభువు వారి పూజలకు తగినట్లు ఫల మిచ్చుట లోకమున కనబడుచున్నదిగదా !"

— (శ్రీభాష్యము)

"వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మ నిష్ఠాః ప్రేత్య కర్మఫల మనుభూయ, తతః శేషేణ విశిష్ట దేశ జాతి కుల రూపాయు శ్రుత విత్త వృత్త సుఖ మేధసో హి ప్రతి పద్యంతే." — (గౌతమ ధర్మసూత్రము)

బ్రాహ్మణాది వర్ణస్థులు, బ్రహ్మచర్యాద్యాశ్రమస్థులును తమ తమ వర్ణాశ్రమముల కనుగుణములైన కర్మ శేషము వలన - శ్రేష్ఠ దేశమునందు, ఉత్తమ వర్ణమునందు, సద్వంశమున - రూపవంతులుగాను, ఆయుష్మంతులుగాను, విద్యావంతులుగాను, ధనవంతులుగాను, ఆచారవంతులుగాను, సుఖవంతులుగాను, బుద్ధిమంతులుగాను పుట్టుచున్నారని గౌతమ ధర్మసూత్రము చెప్పుచున్నది. సర్వేశ్వరుని యనుగ్రహము వలన సత్కర్మానుష్ఠానపరులు ధర్మార్థ కామమోక్షములను పొందుదురు.

## పురుషార్థములు

మానవ జన్మ లభించిన జీవులు పురుషులు. ఆ పురుషులచేత అర్థింపదగినవి పురుషార్థములు. అవి - ధర్మార్థ కామ మోక్షములని చతుర్విధములు. ఇందులో - మొదటి మూడింటిని త్రివర్గ మందురు. చరమమైన - పరమమైన పురుషార్థము మోక్షము. మోక్షమును పొందుటకు ధర్మార్థ కామములు సోపానముల వంటివి.

ధర్మము - 'సాధ్యము, సిద్ధము' అని ద్వివిధము. సిద్ధ ధర్మము భగవానుడే. ఆ సిద్ధ ధర్మము నిరపేక్షము; ఒకరి మీద ఆధారపడి

యుండునది కాదు. అది తనంత తానే యుండును. పరమ చేతనము, పరిపూర్ణ మది.

సాధ్య ఖర్మము పురుష ప్రయత్నముచే సాధింపదగిన కర్మ - జ్ఞాన - భక్తి యోగములు - పురుషాపేక్ష లేకుండ, తనంత తా నుండజాలని యచేతనము కాబట్టి, ఇది సాపేక్షము. ప్రయత్నమునకు తగినంత ఫలము నీయగలదు కాబట్టి, ఇది సావధియు.

"యతో౽భ్యుదయ నిశ్శ్రేయస సాధనం ధర్మః."

— (కణాదుని వైశేషిక సూత్రము)

ధర్మము అజ్ఞాత జ్ఞాపనమైన విధిని, నిషేధమును బోధించుచు, అభ్యుదయమును చేకూర్చును. పరమ పురుషార్థ స్వరూపమును ప్రతిపాదించి, పరమాత్మని పొందు నుపాయమును తెలిపి, నిశ్శ్రేయసమును మీాద చేకూర్చును.అలౌకిక శ్రేయ స్సాధనమే ధర్మము గదా !

" న్యాయే నార్జన మర్థానామ్. "

అన్నట్లు - వర్ణాశ్రమ ధర్మానుగుణముగా ధనమును గడించి, జీవనమును గడుపవలెను.

" అక్షైర్మా దీవ్యః, కృషిమత్కృషస్వ, విత్తే రమస్వ. "

జూదమాడకుము, కష్టపడి పని చేయుము, కలిగిన కలిమితో తృప్తి పడు మని - శ్రుతి బోధించుచున్నది.

భోగ్యతా బుద్ధి లేకుండ, కేవలము ధర్మ నిరతితో కామము ననుభవించుట మేలు.

" ధర్మావిరుద్ధో భూతేషు కామో౽స్మి భరతర్షభ ! "

ప్రాణులయందు ధర్మ విరుద్ధము కానట్టి కామ పురుషార్థమును నేను' - అని గీతాచార్యుని ఉపదేశము.

" యథా ధర్మః స్వభార్యా చ పరస్పర వశానుగౌ
తథా ధర్మార్థ కామానాం త్రయాణా మపి సంగమః. " — (భారతము)

ధర్మము పురుషుడు, అర్థము పత్ని, చకారముచేత కామము సంతాన మని యర్థము. వీరు అన్యోన్యాసక్తులై, గృహమేధి వశమున నుండి ప్రవర్తించునట్లే, ధర్మము ననుసరించి అర్థ కామము లున్న చోట - త్రివర్గ ఫల ముండును.

" క్షణేన మర్త్యేన కృతం మనస్వినః
సంన్యస్య సంయా త్యభయం పదం హరేః. " — (భాగవతము)

మానవులు అల్పాయుష్మంతులైనను - వర్ణాశ్రమాచారముల నాచరించి, కర్మ ఫలమును భగవ దర్పణము చేసి, పరమ పదము పొందుచున్నా రని దేవతలు అబ్బురపడుచున్నారు.

కర్మములు - నిత్యము లనియు, నైమిత్తికము లనియు, కామ్యము లనియు త్రివిధములు.

## కర్మములు - తత్ఫలములు

**1. నిత్య కర్మములు :-** స్నాన సంధ్యావందనాదులు. ఇవి కర్మాంతరముల నాచరించుటకు యోగ్యతను కల్పించును.

**2. నైమిత్తికములు :-** పర్వ దినము లందును, గ్రహణాది నిమిత్తములయందును ఆచరింపవలసినవిధులు, ప్రాయశ్చిత్తాదులును.

ఈ నైమిత్తిక కర్మములకు - "ఆయు రాశాస్తే, సుప్రజాస్త్వ మాశాస్తే, దివ్యం ధామాశాస్తే" అని - ఆయుష్యము, సత్సంతానము, స్వర్గ ఫలాదులు చెప్పబడినవి.

**3. కామ్యములు :-** స్వర్గ పుత్ర పశు వృష్ట్యన్నాది ఫలముల నుద్దేశించి - అశ్వమేధ, పుత్రకామేష్టి ఇత్యాది యాగముల నొనర్చి, తత్ఫలములను పొందుట.

వైదిక కర్మానుష్ఠానపరులు ముముక్షువు లనియు, కామ్య కర్మల నాచరించువారు భోగైశ్వర్య కాము లనియు తెలియుచున్నది.

ముముక్షువునకు సర్వ కర్మములును ఒక్క మోక్ష ఫల సాధనమునకే విధింపబడుచున్నవి. ముముక్షువులు కర్మాసక్తులు కాకూడ దన్నారు శ్రీమద్రామానుజులవారు.

" కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే. "

— (ఈశావాస్యోపనిషత్తు)

మానవుడు యావజ్జీవము విద్యాంగమైన కర్మయోగమును త్రివిధ త్యాగ బుద్ధితో ననుష్ఠించుటకై జీవింప దలచవలెను. కర్మాచరణమును మానుకొనరాదు. ఫలాపేక్ష లేకుండ చేసిన కర్మములు ఫల ప్రదము కావు.

## ఆచారములు

శ్రీమద్రామానుజులవారి శ్రీసూక్తి అయస్కాంతము వలె ఉండజేసి ఆకర్షించినది. సమస్త దురితక్షయార్థముగా నుండిన స్నానాది సంకల్పములు - గోవిందాది నామ స్మరణముతో భగవ

శ్రీప్రీత్యర్థము, భగవత్ కైంకర్యార్థము నని సంకల్పించునట్లుగా నిరూపించినవి.

" ధ్యాయే న్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు
బ్రహ్మలోక మవాప్నోతి, న చేహ వర్తతే పునః. " — (దక్ష స్మృతి)

స్నానాది కర్మల నాచరించునప్పుడు శ్రీమన్నారాయణుని ధ్యానించు వ్యక్తి - పరంధామును చేరుకొనును. పునర్జన్మ ముండదు. స్నానాది కర్మము లందఱికి సామాన్యమే యయ్యును, వ్రత నిష్ఠనకు అవశ్యా చరణీయములు. పుణ్య కర్మము ఆచారము నపేక్షించును. ఆచార వంతునికే కదా పుణ్య కర్మలయం దధికారము !

" ఆచార హీనం న పునంతి వేదాః. " — (వసిష్ఠ స్మృతి)

ఆచార హీనుని వేదములు పవిత్రుని చేయజాలవు.

" ధర్మజ్ఞః సమయః ప్రమాణమ్. " — (గృహ్య సూత్రము)

ధర్మము తెలిసి యాచరించు వారి యాచారము ప్రమాణమే.

'నింద్యములు గాని కర్మములు సేవింప దగినవి. మేము చేయు పనులలో నింద్యము లైనవి నీకు గోచరించిన యెడల, చేయకుము, మేము చేయు మంచి పనులనే నీవు ఉపాసింపదగును'అని ఆచార్యుడు శిష్యునికి చేయు అనుశాసనము - శ్రుతిలోని 'కర్మములు', 'సుచరితములు' అను పదములు వేర్వేరుగా నున్నను, 'కర్మము' అను అర్థ మొక్కటే గోబలీవర్ద న్యాయ ప్రకారము పొసగునని కృతాత్యయాధి కరణమున శ్రీభాష్యకార శ్రీసూక్తి.

" యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః. "

శ్రేష్ఠు డాచరించిన దానినే ఇతర జన మాచరించు నని గీతాచార్యోపదేశము.

" సర్వాగమానా మాచారః ప్రథమం పరికల్ప్యతే. "

సకల వేద శాస్త్రములకు తొలుత ఆచారమే చెప్పబడినది. ఆచారము వలన ధర్మము, ధర్మమునకు ప్రభువు అచ్యుతు డని భీష్మోపదేశము.

" ఆచారా చ్ఛ జ్ఞాత్వా స్మృతే స్తు శ్రుతి కల్పనమ్. "

లోకాచారమునకు స్మృతులు, స్మృతులకు, శ్రుతులు ఆధారములు. ధర్మాధర్మములను తెల్పుటయే వేదమునకు సార్థకత.

## ధర్మము షడ్విధము

(1) వర్ణ ధర్మము (2) ఆశ్రమ ధర్మము (3) వర్ణాశ్రమ ధర్మము (4) గుణ ధర్మము (5) నిమిత్త ధర్మము (6) సాధారణ ధర్మము అని - ధర్మము ఆరు విధములుగా నుండును. ధర్మము శాశ్వతమైనది. కర్మము తాత్కాలికమైనవి. ధర్మము ప్రచోదకము, కర్మ ప్రబోధితము. కాబట్టి, ధర్మమే కర్మము. ధర్మ కర్మములను ఆచరణమున విడదీసి చెప్పజాలము.

## వర్ణ ధర్మములు

" చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. " — (భగవద్గీత)

చాతుర్వర్ణ ప్రముఖమైన - బ్రహ్మాది స్తంబ పర్యంత మగు సమస్త జగత్తును, సత్త్వాది గుణములయు, తద్గుణోచిత శమ దమాది వ్యాపార విభాగము చొప్పున భగవంతుడు సృజించినాడు.

"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్." — (భగవద్గీత)
"పరిత్రాణాయ సాధూనాం. వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే." — (భగవద్గీత)

తాను సృష్టించిన సమాజములో - వేదోక్తమైన చాతుర్వర్ణ్య-చాతురాశ్రమ్య వ్యవస్థా రూపముగాను, కర్తవ్యముగాను ఉండునట్టి ధర్మమునకు గ్లానియు, అధర్మమున కభివృద్ధియు కల్గినప్పుడు - సహింపక, భగవంతుడు శిష్ట రక్షణకై, దుష్ట శిక్షణకై, ధర్మ సంస్థాపనార్థము తన సంకల్పనము చేతనే దేవ - మానవాది రూపముగ అవతరించును. — (గీతా భాష్యము)

"చత్వారో వర్ణాః బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాః."
— (గృహ్య సూత్రము)

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అని - వర్ణములు నాలుగు.

## బ్రాహ్మణ వర్ణ ధర్మములు

"శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మణ్యం కర్మ స్వభావజమ్."
— (భగవద్గీత)

జన్మ హేతువైన ప్రాచీన కర్మోద్భవమైనవి సత్త్వాది గుణములు. రజస్తమస్సుల నణచుట వలన పుట్టునట్టి సత్త్వ గుణము బ్రాహ్మణ స్వభావము. బాహ్యేంద్రియ నిగ్రహము, అంతఃకరణ నియమనము, శాస్త్ర సిద్ధమైనకాయక్లేశము, శాస్త్రీయకర్మోచితమైన

శుచిత్వము, పరులు బాధించినను - చిత్తము వికృతి నొందకుండుట, ఆర్జవము, పరావర తత్త్వ విషయమైన వివేకము, పరతత్త్వ మందలి అసాధారణ విషయములను తెలిసికొను విజ్ఞానము, ఆస్తిక్యము, వైదిక కర్మలచే సంప్రీతుడైన భగవంతుడు - ధర్మార్థ కామ మోక్ష రూపమైన ఫలము నిచ్చు విషయము సత్యమే యను అధ్యవసాయము కలిగి యుండుట బ్రాహ్మణ ధర్మములు.

## క్షత్రియ వర్ణ ధర్మములు

" శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చా ప్యపలాయనమ్
దాన మీశ్వర భావ శ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. " — (భగవద్గీత)

తమ స్సత్త్వ గుణముల నణచుట వలన పుట్టునట్టి రజోగుణము క్షత్రియునికి స్వభావ సిద్ధము. యుద్ధము నందు నిర్భయముగ ప్రవేశించు సామర్థ్యము, తేజస్సు, నిర్విఘ్నముగా కార్యమును పూర్తి చేయు శక్తి, సర్వ క్రియా నిర్వహణము, రణమున తన మరణము తప్పదని తెలిసినను వెను దీయకుండుట, తన విత్తమును పరుల సొత్తుగా చేయునంతవరకైన త్యాగము, తనను తప్ప - తక్కిన జను లందరిని నియమించు సామర్థ్యము క్షత్రియ వర్ణమునకు జన్మసిద్ధ కర్మములు.

## వైశ్య వర్ణ ధర్మములు

" కృషి గో రక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్. "

— (భగవద్గీత)

వైశ్యునకు స్వభావ ప్రభవమైన తమోగుణము సత్త్వ రజ స్తమోగుణముల నణచి, స్వల్పముగా నుద్రేకించునట్టిది. సేద్యము చేయుట, పశు పాలనము, ధన సంచయనమునకు కారణమైన క్రయ

విక్రయ రూప వర్తకము, వడ్డీవ్యాపారము చేయుట - వైశ్య స్వభావ సిద్ధ కర్మములు.

## శూద్ర వర్ణ ధర్మములు

" పరిచర్యాత్మకం కర్మ శూద్ర స్యాపి స్వభావజమ్. " — (భగవద్గీత)

సత్త్వ రజ స్తమోగుణములచే ఉద్రిక్తమైన తమో గుణమే శూద్రవర్ణమునకు ప్రాచీన కర్మ సిద్ధము. తమో గుణముతో పాటు విభక్తమైన కర్మము - త్రివర్ణముల వారికి పరిచర్య చేయుటయే.

యజ్ఞాధ్యయన దాన కర్మములు మూడు వర్ణములవారికిని సాధారణములు. నియమములు కూడ మూడు వర్ణములందలి మనుష్యులకు సాధారణములే. బ్రాహ్మణుని వృత్తి - యాజనాధ్యాపన ప్రతిగ్రహములు. క్షత్రియ వృత్తి - జనపదపరిపాలనము; వైశ్య వృత్తి - కృష్యాదులు; శూద్రవృత్తియు కర్తవ్యమును - త్రైవర్ణికులకు పరిచర్య చేయుటయే. స్వ వర్ణాశ్రమోచిత కర్మములచేత మానవుడు సర్వాంతర్యామిని ఆరాధించి, భగవత్ప్రాప్తి రూప సిద్ధిని పొందుచున్నాడు. ఫలాభిసంధి రహితమై, భగవదారాధన రూపమైన కర్మము స్వధర్మ మనబడును. ఇది ప్రమాద రహితము. సర్వేంద్రియ నియమనముచే సాధింపదగిన జ్ఞాన యోగము పర ధర్మము. ఇది ప్రమాద సహితమైనది. కాబట్టి, స్వధర్మము గుణ రహితమైనను - చక్కగా అనుష్ఠింపబడు పర ధర్మము కంటె శ్రేయస్కరము. " — (గీతా భాష్యము.

" యద్వై కించ మను రవదత్ తద్భేషజమ్. " మనువు చెప్పినది మందు.

" షట్కర్మ సహితో విప్రః కృషి కర్మ చ కారయేత్. "

— (గీతా భాష్యము)

యజన యాజన అధ్యయన అధ్యాపన దాన ప్రతిగ్రహములు షట్కర్మములు. బ్రాహ్మణుడు యాజన అధ్యాపన ప్రతిగ్రహము

లనేకు మహాత్ము వృత్తులలో చక్కగా కుటుంబ పోషణము జరుగనిచో వ్యవసాయమును కూడ చేసికొనవచ్చును.

ద్విజుల హితమును గోరి - వారికి సముచిత సమయములలో పరిచర్య చేయుచు - వ్యాపారము చేతను, వివిధ శిల్పముల చేతను శూద్రుడు జీవింప నగునని యాజ్ఞవల్క్య స్మృతియు —

తమ వర్ణ ధర్మము నాచరించుటతో పాటు - దోష రహితమైన వివిధ వృత్తులతో కర్షణ, పశుపాలన, భారోద్వహన, ఆపణ వ్యవహార, చిత్రకర్మ, నృత్త గీత, వేణు - వీణా - మురజ - మృదంగ వాదనాది శిల్ప కళలతో శూద్రుడు జీవింప వచ్చునని దేవల స్మృతియు వివరించుచున్నవి.

## ఆశ్రమాపేక్షకత

శ్రమ విహిత కర్మానుష్ఠానము చేతనే విద్యా నిష్పత్తి.

" అనుష్ఠేయం బాదరాయణ స్సామ్య శ్రుతేః. "

— (శ్రీభాష్యము 3-4-19)

" త్రయో ధర్మస్కంధా యజ్ఞోధ్యయనం దానం బ్రహ్మచర్యమ్. "

— (ఛాందోగ్యము)

బ్రహ్మసంస్థుడుగా ఉండుట.. స్థితి - చతురాశ్రమములవారికిని సంభవమని ఆశ్రమ చతుష్టయమును విధించుచున్నది. ఋణ శ్రుతి, యావజ్జీవ శ్రుతి, అపవాద శ్రుతియు సంసారము నుండి విరక్తులు గాని వారినే గార్హస్థ్య ప్రస్తావించినవే.

శ్రుతి :-

"త్రిభి ర్ఋణవా జాయతే బ్రహ్మచర్యేణ
ఋషిభ్యః, యజ్ఞేన దేవేభ్యః, ప్రజయా పితృభ్యః. "

పుట్టుకతోనే బ్రాహ్మణుడు 1. ఋషి ఋణము 2. దేవ ఋణము 3. పితౄణము అను మూడు ఋణములను భరించును.

౧. ఋషి ఋణము :-

ఋషులు పరంపరగా వేద వేదాంగములను కాపాడి, తన కంద జేసినవారు కాబట్టి, బ్రహ్మచర్యాశ్రమములో వేదాధ్యయనము చేసి, ఋషి ఋణమునుండి విముక్తుడు కావలెను.

౨. దేవ ఋణము :-

దేవతలు తన వంశమునకు పసు పుత్ర వృష్ట్యన్నాదులను కలుగజేసి, సంరక్షించినవారు కావున, గృహస్థాశ్రమమునందు యజ్ఞాది కర్మముల నాచరించి, దేవ ఋణము నుండి విముక్తుడు కావలయును.

1. పితౄణము :-

తన వంశ మంతరించకుండ తన వజను వంశమును నిలుపు కొనుచు వచ్చినవారు పితరులు. కనుక, తాను సత్సంతానమును పొంది, వంశమును నిలబెట్టి. పితౄణము నుండి విముక్తి నొంద వలయును.

2. యావజ్జీవ శ్రుతి :-

" స ఖ ల్వేవం వ ర్తయన్యావ దాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే. "

" న చ పునరావర్తత ఇతి యావ దాయుషం గార్హస్థ్య ధర్మేణ స్థితి దర్శన ముపపద్యతే."

—(శ్రీభాష్యము : 3-4-46.)

బ్రహ్మచర్యానంతరము గృహమున శుద్ధ ప్రదేశమందుండి, బ్రతికి యున్నంత వఱకును వేదాధ్యయనము చేయు మానవుడు - బ్రహ్మలోకమును పొందును. పునర్జన్మ నొందడును - యావజ్జీవము గార్హస్థ్యమునందే యుండవలెనని ఛాందోగ్యోపనిషత్తు ప్రబోధించుచున్నది.

### 3. అపవాద శ్రుతి :

"వీర హా వా ఏష దేవానాం యోఽగ్ని ముద్వాసయతే."

అగ్న్యుద్వాసనము చేసినవాడు వరహంతకుడే యని తైత్తిరీయోపనిషత్తు అనుచున్నది. ఈ శ్రుతి - గృహస్థాశ్రమమున కంటెను అగ్నిహోత్రాదిరహితమగు ఆశ్రమాంతరమును నిషేధించుచున్నది.

"బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్, గృహీ వనీ భూత్వా ప్రవ్రజేత్, యది వేతరథా బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్."

బ్రహ్మచర్యమును పూర్తి చేసి గృహస్థాశ్రమమును, తర్వాత వానప్రస్థమును, పిమ్మట సన్యాసాశ్రమము నవలంబింపవలెను. లేక - బ్రహ్మచర్యము నుండియే సన్యసింపవచ్చును. వైరాగ్యము కలిగినపుడు - ఏ ఆశ్రమము నుండి యైనను సన్యసింపవలెనని జాబాల వాక్యము.

## బ్రహ్మచర్యాశ్రమము

"స్వాధ్యాయోఽధ్యేతవ్యః .... ...."

"ఇత్యధ్యయనేనైవ స్వాధ్యాయ శబ్దవాచ్య వేదాఖ్యాక్షర రాశేర్గ్రహణమ్."

— (శ్రీభాష్యము — జిజ్ఞాసాధికరణము)

బ్రాహ్మణుడు వేదాధ్యయనము చేయవలెను. గురువు వేదాక్షరములను ఉదాత్తానుదాత్త స్వరితము లనెడు స్వర విశేషములతో నుచ్చరింపగా, శిష్యుడును అట్లే ఉచ్చరించి అభ్యసించుటయే అధ్యయనము. కాని, స్వయముగా పుస్తకాక్షరములను మస్తకమున కెక్కించుకొనరాదని శ్రుతి విధించుచున్నది.

'అగ్నీ నాదధీత' అను అగ్న్యాధాన విధి వాక్యము అగ్నిని సంపాదింపవలె ననియే విధించును కాని, అగ్ని క్రతూప యుక్తమైన దని విధింపనేరదు. అట్లే, ఈ వేదాధ్యయన విధి వాక్యము - కేవలము అక్షర రాశి గ్రహణమున మాత్రమే పురుషుని ప్రవర్తింప చేయుచున్నది కాని, అర్థ జ్ఞానమున ప్రవర్తింపచేయుట లే దనిరి శ్రీ భాష్యకారులు.

వేదాధ్యయనమునకు ఉపనయన సంస్కారము నొందిన బ్రహ్మచారియే అధికారి. "అష్ట వర్షం బ్రాహ్మణ ముపనయీత, త మధ్యాపయేత్."

" శౌచాదికం సమాచార మాచార్య శ్శిక్షయే ద్వటుమ్
మౌంజీ బంధన మారభ్య శౌచా ద్యాచార మాదితః. "

వటువునకు యజ్ఞోపవీతమును, కౌపీనముతోడ వస్త్ర ద్వయమును, జింక చర్మము, మౌంజీ బంధనమును ధరింపజేయవలయును. బ్రాహ్మణ వటువు పాలాశ దండమును, క్షత్రియ వటువు మర్రి కొమ్మను, వైశ్య వటువు మేడి కొమ్మను దండముగా నుపయోగించుట నియమము. ఆచార్యుడు శిష్యునికి గాయత్రీ మంత్రమును - "భూర్భువస్సువః" అను వ్యాహృతి పూర్వకముగా ఉపదేశించును. ఆచార్యుడు వటువునకు - "బ్రహ్మచార్యసి; తపోధాన; కర్మ కురు;

మా సుషుప్థాః; భిక్షాచర్యం చర; ఆచార్యాధీనో భవ" అని ఆచారము ననుశాసించును.

" తస్మిం స్నభిజన విద్యా సముదేతం సమాహితం సంస్కర్తార మీప్సేత్."

ఉపనీతులమై వేదాధ్యయనమునందు అపేక్ష కలిగినను, కలుగకున్నను - అధ్యయనము చేయవలెనని ఆపస్తంబ ధర్మసూత్రము మాణవకుని గూర్చి విధించినది.

సత్సంతాన ప్రసూత, సదాచార్య నిష్ఠ, అన్వేషాది ఆత్మగుణోపేత యగు వేదవిద్యాచార్యుడే ఉపనయనము చేయవలయును.

"ఆచార్యా ద్ధైవ విదితా విద్యా సాధిష్ఠం ప్రాపత్. "

ఆచార్యుని నుండి పొందిన విద్యయే ఫల జనకము కాగలదు. కాబట్టి, ఆచార్యోచ్చారణానుచ్చారణమే అధ్యయనము. అసకృదావృత్తి రూపముగా అక్షర రాశి గ్రహణమే ఫలము. అనుష్ఠానానుగుణ జపాదులు, ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థములను వేదాధ్యయనముతోనే కలుగును" అని శ్రీభాష్యకారులు విశదీకరించినారు.

ఉపనయన సంస్కారము కేవలము శరీరమునకు కాక, శరీరముతో కూడియున్న ఆత్మకు సంబంధించినవి. కాబట్టి, బ్రహ్మచారి సర్వదా శుచి ర్భూతుడై, ఆశ్రమ ధర్మము ననుష్ఠింపవలెను.

## బ్రహ్మచర్యాశ్రమ ధర్మములు

బ్రహ్మచారి త్రికాలములందు సంధ్యా వందనమును, ఉభయ సంధ్యలయందు అగ్ని కార్యము చేసి, స్వ గోత్ర నామోచ్చారణ

ముతో గురు వృద్ధుల కభివాదము చేయుటను శాస్త్రము విధించు చున్నది.

" సాయం ప్రాత శ్చరే ద్భైక్షం గురవే త న్నివేదయేత్

భుంజీత చ హ్యనుజ్ఞాతో, నోచే దుపవసే త్త్ర్యహమ్. "

ఉపనయన సంస్కారములో ప్రథమమున - 'మాతా గరీయసీ' కాబట్టి, 'మాతృ భిక్ష' గ్రహించి, ఆత్మ జీవనార్థము ప్రాత స్సాయం కాలములందు స్వధర్మ నిరతులైన బ్రాహ్మణులను భిక్ష నర్థించవలెను.

" ఆది మధ్యావసానేషు భవ చ్ఛబ్దోపలక్షితా

బ్రాహ్మణ క్షత్రియ విశాం "భిక్షాచర్యా యథాక్రమమ్. "

బ్రాహ్మణ బ్రహ్మచారి - 'భవతి భిక్షాం దేహి' యనియు, క్షత్రియ బ్రహ్మచారి - 'భిక్షాం భవతి దేహి భవతి' యనియు, పురుషుని భిక్ష నడుగుచో - 'భవాన్ భిక్షాం దదాతు' అనియు యాచింపవలయును.

బ్రహ్మచారి యేకాన్నమును భుజింపరాదు. భిక్షాన్నమును గురువునకు నివేదించవలెను. పరీక్షార్థమై భోజనమునకు ఆచార్యుని యాజ్ఞ లభింపనిచో - ఉపవసింపవలసినదే.

"అశిష్య న్నాచామే దశిత్వా చాచామేత్. "

అపోశన క్రియా పూర్వకముగా భుజింపవలెను.

" తస్మాద్వా ఏత దశిష్యంత పురస్తా చ్చోపరిష్టా చ్చాద్భిః పరి దధతీ త్యద్భిః. " "పరిధాన మేవో క్తం నాచమనమ్. "

" ఏత మేవ త దన్న మనగ్నం కురుతే. "

పరిషేచనము చేసి భుజించుటకు ముందు, భుజించిన తర్వాతను ఉదకమును ప్రాణము యొక్క వస్త్రముగా భావించి, మొదట యుపస్తరణము, తర్వాత అపిధానముగా చేయుదురు. అపోశన క్రియను ఆచమాన మనరా దని భగవద్రామానుజులు తమ శ్రీభాష్యమున - కార్యాఖ్యానాధికరణములో సిద్ధాంతీకరించినారు. ముఖ్యముగా - అన్నమును నగ్నముగా నుంచరా దని శ్రుత్యర్థము.

" శస్త్రైచ్ఛ శిషయే ప్లైవ న చ పారుష్యవా గ్భవేత్. "

అధ్యాపకుడు పరుండిగాని, కాలుపై కాలు వేసికొనిగాని, తలంటుకొనుచుగాని, మంచముపై కూర్చొనిగాని వేదాధ్యయనమును చేయింపరాదు. ఇంద్రియ నిగ్రహము కలిగియుండవలెను. పరుష వాక్కు లాడరాదు. శిక్షింపవలసినచో - త్రాడుతోగాని, బెత్తముతోగాని వీపుమీద కొట్టవలెను కాని, తలపైన కొట్టరాదు. "నోత్తమాంగే కదాచన."

శిష్యుడు కృతజ్ఞుడు, మేధావి, ఆధి వ్యాధి రహితుడు, శీలవంతుడు, అసూయ లేనివాడు, శుశ్రూషాపరుడు, ఆప్తుడు, వాఙ్నియమము కలవాడు, స్త్రీ ప్రసంగ మెఱుగనివాడు, జితేంద్రియుడునై, సర్వదా గురుహిత మాచరించుచు, ఉపకుర్వాణుడై* యుండవలెను.

---

* ఉపకుర్వాణు డనగా - స్వాధ్యాయ గ్రహణము వరకు బ్రహ్మచర్యమును జరిపి, తర్వాత గురు దక్షిణ యిచ్చి, స్నాతక వ్రత మాచరించి, గృహస్థాశ్రమమును ప్రవేశింపబోవు బ్రహ్మచారి.

— సంపాదకుడు.

" ఆహూత శ్చా ప్యధీయీత లబ్ధం చాస్మై నివేదయేత్. "

గురువును - 'ఇక చెప్పండి' యనక; గురువు చెప్పదలచినప్పుడే కృతాంజలియై, యేకాగ్రచిత్తముతో గ్రహణధారణ శక్తిమంతుడై, వేదాధ్యయనము చేయవలెను. పొందిన విద్యను గురువునకు నివేదింపవలెను.

" వ్రజం స్తిష్ఠ న్నాసీన శ్శయానో ఽరణ్యే గ్రామే వా యావ త్తపసం స్వాధ్యాయ మధీయీత. " — (తైత్తిరీయము)

నడచునప్పుడు, నిలబడినప్పుడు, కూర్చొన్నను, పరున్నను, సమిధలకై యడవికి, భిక్ష కొఱకు గ్రామములోనికి వెడలినప్పుడును ఉత్సాసక్తితో వేదమును అధ్యయనము చేయుచుండవలయును.

" శ్రావణ్యాం ప్రౌష్ఠపద్యాం వా ఉపాకృత్య యథావిధి
యుక్త శ్ఛందా స్యధీయీత మాసాన్ విప్రోర్ధ పంచమాన్. "

— (మనుస్మృతి)

వ్రతాంగమైన అధ్యాయోపాకర్మము - ఓషధు లావిర్భవించి నచో, శ్రావణ పూర్ణిమనాడు - లేక, హస్తా నక్షత్ర యుక్త శ్రావణ పంచమినాడైనను చేయవలెను.

" ఓషధీనాగ్ం హ యశో ద్దర్భా స్వరస మేవ బ్రహ్మ పచతే. "

— (తైత్తిరీయము)

ఓషధులలో దర్భ పవిత్రమైనది. దర్భాసీనుడై అధ్యయనము చేయుట పరమ మని సాయణ భాష్యము. శ్రావణమున గాని, భాద్రపదమాసమున గాని ఉపక్రమించి, తొమ్మిది పక్షములు వేదాధ్యయనము చేయవలెను.

" ప్రాష్యేషు ఛందసాం కుర్యా ద్బహి రుత్సర్జనం బుధః
మాఘ శుక్లస్య వా ప్రాప్తే పూర్వాహ్ణే ప్రథమేఽహని. "
— (మనుస్మృతి.)

పుష్య మాసమున గాని, మాఘ శుక్ల ప్రథమ దినమునగాని - ఉదయమున, ఊరి బయట - జల సమీపమున వేద వ్రతోత్సర్జనము చేయవలెను. మరునాడు మరల అధ్యయనము చేయుచుండవలెను. అనధ్యాయములను పాటించుచు, వేదములను శుక్ల పక్షమున, వేదాంగములను కృష్ణ పక్షమునను పఠించవలెను, స్వరయుక్తమగు అక్షరోచ్చారణను బోధించుచు శిక్షా శాస్త్రము, వ్యాకరణము, ఛంద శ్శాస్త్రము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను ఆఱు వేదాంగములను అధ్యయనము చేయవలెను. వేదములలో కొంత నేర్చినవాడు - 'బ్రాహ్మణుడు,' ఒక శాఖాధ్యేత - 'శ్రోత్రియుడు,' అంగాధ్యాయి - 'అనూచానుడు', కల్పాధ్యాయి - 'ఋషి', కల్ప సూత్ర ప్రవచనాధ్యాయి - 'భ్రూణుడు.'

" యదృచో ధీతే పయ ఆహుతి భిరేవ త ద్దేవాగ్ం స్తర్పయతి. "
— (తైత్తిరీయము)

" ప్రతివేదం సమాప్తౌ తు శక్త్యా తం పూజయే ద్గురుమ్. "

వేదాధ్యయనమును బ్రహ్మ యజ్ఞ మందురు. ఋగ్వేదాధ్యేత - మధు పయస్సులచే దేవతలకు, మధు ఘృతములతో పితృదేవతలకును, యజుర్వేదాధ్యేత - ఘృతామృతములతో దేవతలకు, మధు ఘృతములతో పితరులకును; సామాధ్యేత - సోమ ఘృతములతో దేవతలకు, మధు సర్పి ర్ద్రవ్యములచే పితృదేవతలకును; అథర్వాంగి రస్సులను పఠించువాడు దేవతలకు, పితరులకును మధు సర్పి ర్ద్రవ్యము

లతో తర్పణము చేయునంత తృప్తి కలుగును' అని శ్రుతి. 'తర్పణము చేయవలె' నని స్మృతి. తర్పయేత్ దేవతా ఋషీన్" ప్రతి వేదాధ్యయనము సమాప్తి యైనంతనే ఆచార్యుని పూజింపవలయును.

అక్షరరాశి మాత్రముగ గ్రహింపబడిన వేదములు ఫలవంతము లైన కర్మములను బోధించునట్టి వని తెలిసి, వాని నిర్ణయమునకై వేదార్థ విచారమునందు పురుషుడు - బ్రహ్మచారి, సకల శాస్త్ర బలమున స్వయముగనే ప్రవర్తించును. తత్ఫలితముగా - కర్మార్థి కర్మజ్ఞానమునందు, ముముక్షువు బ్రహ్మజ్ఞానమునందు ప్రవర్తించు నని భగవద్రామానుజులు తమ శ్రీభాష్యమున పురుషార్థాధికరణములో వివరించియున్నారు.

గాయత్రుడు, బ్రాహ్మ్యుడు, బృహత్తు, ప్రాజాపత్యుడు - అని బ్రహ్మచారులు నాల్గు విధములుగా నుందురు. ఈ బ్రహ్మచారుల విధులు శాస్త్రములలో విశదముగా నిర్దేశింపబడి యున్నవి.

## గృహస్థాశ్రమ ధర్మములు

" ఆచార్య కులా ద్వేద మధీత్య యథా విధానం గురోః కర్మాతిశేషేణాభి సమావృత్య కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయ మధీయానో ధార్మికాన్ విదధత్ ఆత్మని సర్వేంద్రియాణి సంప్రతిష్ఠా వ్యాహింసన్ సర్వా భూతాని. "

— (ఛాందోగ్యోపనిషత్తు)

ఆచార్య సన్నిధిలో వేదముల నభ్యసించి, ఆ యాచార్యునకు దక్షిణ నొసగి, "ప్రజా తంతుం మా వ్యవచ్ఛేత్సీః" వివాహ మాడి, సంతానమును పొందు మని, ఆచార్యునిచేత అనుజ్ఞాతుడై వచ్చి,

యథావిధిగ దారను పరిగ్రహించి, గార్హస్థ్య విహిత కర్మనిష్ఠుడై, అభ్యసించిన విద్యను విస్మరింపక, అధ్యయనానుకూలమైన భగవ ద్భాగవతాధిష్ఠిత దివ్య క్షేత్రాది పవిత్ర స్థలములలో వేదాధ్యయ నము గావించుచు, పుత్ర శిష్యాదులను కూడ ధర్మమున నియో గించుచు, ఆత్మ నిగ్రహము కలిగి, సర్వ భూతములయందును దయ గలిగి యుండవలెనని శ్రీమద్రామానుజులు తమ శ్రీభాష్యమున పురుషార్థాధికరణములో గృహస్థాశ్రమ ధర్మములను సిద్ధాంతీకరించి నారు.

" చతుర్ణా మాశ్రమాణాం చ గార్హస్థ్యం శ్రేష్ఠ ముచ్యతే. "
— (వాల్మీకి రామాయణము)

సత్సంతాన ప్రాప్తికి, సకల ధర్మ ప్రవర్తన నిర్వహణమునకు, వాపీ కూప తటాకారామ మందిర నిర్మాణ సామర్థ్యమునకు - ఇది యది యన నేల ? సకల జీవ సముదాయమునకు సర్వోపకార క్షమ మైన గృహస్థాశ్రమము చతురాశ్రమములలో ద్వితీయ మయ్యు - అద్వితీయమైనది. వాస్తవముగా గార్హస్థ్యము ఐహికాభ్యుదయమున కాధారము. పారమార్థిక నికాయమునకు ముఖ ద్వారము.

" త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి - యజ్ఞేన
దానేన తపసా నాశకేన. " — (బృహదారణ్యకోపనిషత్తు)

శ్రౌత స్మార్త కర్మానుష్ఠాన పరులైన బ్రాహ్మణులు - యజ్ఞ దాన తపముల చేత పరబ్రహ్మను తెలిసికొనగోరుదు రని శ్రుతి.

" కర్మ ణైవ హి సంసిద్ధి మా స్థితా జనకాదయనః " — (భగవద్గీత)

జనకాదులు బ్రహ్మవిదగ్రేసరులు, కర్మనిష్ఠులునై సిద్ధిని పొందినారు. "సహకారిత్వేన చ " అను సూత్రము - యజ్ఞాది కర్మ

ములు జీవన నిమిత్తము గాను, బ్రహ్మవిద్యా సహకారిగాను విని యోగపడు నని వ్యాస భగవానుని యాశయమును ప్రకటించు చున్నది. కాబట్టి, కర్మ జ్ఞాన సహకృత మగు భక్తి - సాధనాను ష్ఠానముచేత బ్రహ్మప్రాప్తిరూప మగు మోక్షఫల లాభము కలుగును.

ఉపాస్య బ్రహ్మస్వరూప జిజ్ఞాసునై, సమిత్పాణియై, శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడునైన సదాచార్యుని సమాశ్రయించి, తదుప దిష్టమైన విద్య నుపాసించువాడుగాని, ఉపాసింపనివాడుగాని - ఉభయులు యజ్ఞముల నాచరింపవలె నని శ్రుతి.

"తేనోభౌ కురుతో య శ్చైతదేవం వేద య శ్చ న వేద."

— (ఛాందోగ్యోపనిషత్తు)

"అథ పరమైకాంతినో భగవ దారాధన ప్రయోగం వక్ష్యే"

అని శ్రీమద్రామానుజాచార్యులు 'నిత్య గ్రంథము'లో - సూత్రప్రాయముగ జెప్పినారు.

భగవంతునకు పరతంత్రుడను, పూజాద్రవ్యము లన్నియు పర మాత్మునివే; ఈ కల్యాణోపకరణములతో -

" స్వాత్మానం ప్రీతం కారయితు ముపక్రమతే "

నాచేత తన యర్చనను చేయించి, భగవంతుడు సంప్రీతు డగుచున్నాడు' - అని యనుసంధించి, ఔపచారికము, సాంస్పర్శికము, ఆభ్యవహారికము, సాంద్రృష్టికము - అను ప్రక్రియలతో దేవుని పూజింపవలయును.

భగవంతుని యసాధారణ మంత్రములైన 'వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ' - అను చతుర్వ్యూహ నామములతో గాని,

'సత్య, అచ్యుత, పురుష, వాసుదేవ' నామములతోగాని శ్రీవైష్ణవులు వైశ్వదేవ బలిని నిర్వర్తింపవలె నని శ్రీ వేంకటనాథ దేశికులు 'సచ్చరిత్ర రక్ష' అను గ్రంథమున తెలియజేసియున్నారు.

ప్రపన్నుల గృహార్చనయందును భగవద్విగ్రహములతో పాటు-ఆళ్వారాచార్యుల విగ్రహము లుండునుగదా ! భగవంతునకు, ఆళ్వారాచార్యులకు నివేదించిన ప్రసాదము యతీంద్రుల శేష మని భుజించుటవలన, వారికి నిత్యము వైశ్వదేవము చేయని దోషము ఉండనేరదని శిష్టాచారము.

వార్తాకుడు, యాయావరుడు, శాలీనుడు, ఘోర సన్యాసికుడు అని, గృహస్థులు నాలుగు విధములుగా నుందురు. వీరి విధులు - శాస్త్రములలో విశదముగ నిర్దేశింపబడియున్నవి.

## వానప్రస్థాశ్రమ ధర్మములు

" వయః పరిణతో రాజన్ కృతకృత్యో గృహాశ్రమీ
పుత్రేషు భార్యాం నిక్షిప్య మాం గచ్ఛే త్సహైన వా. "

— (విష్ణు పురాణము)

ఆజన్మ శుద్ధులైన భారతీయులు - "ఆశ్రమా దాశ్రమం గచ్ఛేత్" అను రీతిగా - గృహస్థాశ్రమ ధర్మములను సక్రమముగా నెరవేర్చి, ప్రాయము ప్రాలగనే పత్నిని పుత్రులవద్ద నుంచిగాని, లేక - తమ వెంట గొని గాని, వానప్రస్థాశ్రమమును స్వీకరించి, వనవాసము చేయుదురు.

" వానప్రస్థో జటీ చ స్యా త్సదా శ్మశ్రూది లోమభృత్
శాకమూల ఫలాశస్స్యా ద్వనస్థః సతతం ద్విజః. "

వానప్రస్థుడు కేశ శ్మశ్రు జటలను పెంచి, కందమూల పర్ణ ఫలములను భుజించుచు, నేలపై పరుండుచు, త్రికాల స్నానము చేయుచు, చర్మ - కాశ - కుశలతో చేయబడిన కట్టు పుట్టములను ధరించుచు, ఔపాసన, దేవతార్చన గావించుచు, వైశ్వదేవమును, అతిథి సత్కారమును చేయుచు, హిమ వాయ్వగ్ని వర్షాతపముల నోర్చుచు, గరిష్ఠముగ పండ్రెండేండ్లు, కనిష్ఠముగ నొక సంవత్సర మైనను - శమ దమాది గుణోపేతుడై వనమున నుండుట ధర్మము.

"ఆరణ్య మియా త్తతో న పున రేయాత్."

అను శ్రుతి - 'వనమునకు పోయిన ఆశ్రమస్థుడు ఏనాడును తిరిగి రాకూడదు' అను వానప్రస్థాశ్రమ ధర్మమును విధించుచున్నదని శ్రీభాష్య సూక్తి.

వైరాగ్య పోషకమైన వానప్రస్థము - తపోనిష్ఠకు సహకారిగ నుండినచో, భగవత్ప్రీతి జనకమై, తత్ఫలముగ ప్రాకృత దోషములు దగ్ధ మగును; శాశ్వత పదవి లభించును.

వానప్రస్థులు - వైఖానసు డనియు, ఔదుంబరు డనియు, వాలఖిల్యు డనియు, ఫేనపు డనియు నాలుగు విధములుగా నుందురు. వీరి విధులు - శాస్త్రములలో విపులముగా నిర్దేశింపబడి యున్నవి.

## సన్న్యాసాశ్రమ ధర్మములు

" బ్రాహ్మణాః పుత్రైషణాయా శ్చ విత్తైషణాయా శ్చ లోకైషణాయా శ్చ వ్యుత్థా యాథభిక్షాచర్యం చరంతీతి పారివ్రాజ్యైకాంతధర్మమ్. "

బ్రాహ్మణుడు పుత్రేషణ, ధనేషణ, లోకేషణ - అనెడు ఈషణ త్రయమునుండి వినిర్ముక్తుడైన తరువాత భిక్షాటనము

చేయును' అను బృహదారణ్యక శ్రుతి - సన్న్యాసాశ్రమ మందలి యసాధారణ ధర్మమును ప్రతిపాదించుచున్నారు శ్రీభాష్యకారులు.

" గృహస్థో బ్రహ్మచారీ వానప్రస్థోవా లౌకికాగ్నీ నుదరాగ్నౌ సమారోపయేత్. "

గృహస్థుడు గాని, బ్రహ్మచారి గాని, వానప్రస్థుడు గాని సన్న్యాసాశ్రమ స్వీకారమునకు అగ్న్యాశ్రమ స్వీకారమునకు అశక్తుడైనచో - అహంకార మమకారములను త్యజించి, భూత సంఘాత రూపమైన శరీరేంద్రియ జాతాదికము యొక్క లయానుసంధానమును "తమః పరే దేవ ఏకీ భవతి" - ప్రళయానుసంధానమును చేసి, భగవదనుగ్రహమునకు పాటుపడవలెను.

"సన్న్యస్తః శ్రవణం కుర్యాత్" - అను న్యాయముచే, వైరాగ్యాతిశయముతో శ్రవణాదులను చేయుటకై సన్న్యసించుట - 'వివిదిషా సన్న్యాస' మనబడును.

" నాయమాత్మా బలహీనేన లభ్యః. న చ ప్రమాదా త్తపసో వా ప్యలింగాత్. "
— (ముండకోపనిషత్తు.)

మనోబలము, ఏకాగ్రత, శిఖా యజ్ఞోపవీత కాషాయవస్త్ర దండ ధారణాది చిహ్నములతోపాటు - ఆహార విహారాది ఆశ్రమ ధర్మములను పాటింపని సన్న్యాసికిని మోక్షము లభింప దని తెలిసి, విషయ భోగములందు ఆత్యంతిక హేయ బుద్ధితో - ఏ యాశ్రమము నుండిగాని సన్న్యాసమును స్వీకరించుట - 'విద్వ త్సన్న్యాస' మనబడును.

"తద్య ఇత్థం విదుర్యేచేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే. "
— (ఛాందోగ్యోపనిషత్తు)

గర్భ జన్మ జరా మరణ సంసార మహాభయము చేత భోగా పేక్షా రహితులైన బ్రహ్మజ్ఞానులును అరణ్యమునందుండి, తప స్సనెడి ఆశ్రమ కర్మములను, శ్రద్ధ యనెడు బ్రహ్మోపాసనము చేయుదురు.

"తపశ్రద్ధే యే హ్యుపవస న్త్యరణ్యే శాన్తా విద్వాంసో భైక్షచర్యాం చరంతః."
— (ముండకోపనిషత్తు)

విద్వాంసులు సన్న్యాసాశ్రమమందు భిక్షాటనము జేయుచు, జితేంద్రియులై, తప శ్శ్రద్ధలనెడు కర్మ జ్ఞానముల నుపాసించుచు, అరణ్యమందు నుందురు.

"ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి."
— (బృహదారణ్యోపనిషత్తు)

సన్న్యాసులు పరబ్రహ్మ సాన్నిధ్యమును గోరి, ఆశ్రమ స్వీకారము చేయుచున్నారు.

ఊర్ధ్వ రేతస్కుల విషయమున అచ్చటచ్చట ఈ శ్రుతి వాక్య ములు శ్రీభాష్యములో పేర్కొనబడినవి.

"ఋతం తప స్సత్యం తప శ్శ్రుతం తప శ్శాంతం తపో దమ స్తప శ్శమ స్తపో దానం తపో యజ్ఞ స్తపో భూర్భువస్సువ ర్బ్రహ్మైత దుపా స్వైత త్తపః."
— (తైత్తిరీయ నారాయణోపనిషత్తు.)

ఈ ఋత సత్య శ్రుతాదు లన్నియు తప శ్శబ్ద వాచ్యములే. ఈ తపస్సు లన్నింటిలో - 'న్యాస' మనెడు శరణాగతియే శ్రేష్ఠ మైనది.

"తస్మా న్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః." — (తై-నారా)

" ప్రపత్తిం తపసా మేషాం న్యాసాఖ్యా మాహు రుత్తమమ్
సన్న్యాస స్త్యాగ ఇత్యుక్త శ్శరణాగతి రిత్యపి. "

— (విష్వక్సేన సంహిత)

మోక్ష సాధనములలో - న్యాసమే ఉత్తమము. సన్న్యాస శబ్దమునకు - ప్రపత్తి, త్యాగము, శరణాగతి అనునవి పర్యాయ పదములు.

" అత స్త్యాగ సన్న్యాసశబ్దయో రేకార్థ మంగీకృత మితి జ్ఞాయతే. "

త్యాగము, సన్న్యాసము ఏకార్థ బోధకము లని రామానుజ గీతాభాష్యము (18-2) వివరించుచున్నది.

సన్న్యాసులలో ఆచరణ భేదములనుబట్టి - కుటీచకుడు, బహూదకుడు, హంస, పరమహంస అని నాలుగు తెగలు కలవు. ఈ నాల్గు తెగల విధులును - శాస్త్రములలో విపులముగా నిర్దేశింపబడియున్నవి.

## శ్రీవైష్ణవ యతి ధర్మములు

పండితుడు, తమకు మొదట వేదాంత శాస్త్ర బోధకుడు నైన యాదవ ప్రకాశుడు నిర్విణ్ణుడై, తన నుద్ధరించవలసిన దని ప్రార్థింప, శ్రీ రామానుజ యతిసార్వభౌములు - పూర్వము శిఖా యజ్ఞోపవీతములు పరిత్యజించిన యాదవప్రకాశునకు - ప్రాయశ్చిత్త పూర్వకముగా మౌంజీ బంధనాదులను చేయించి, పంచసంస్కారములను చేసి, సన్న్యాసము నొసగి, 'గోవింద దాసు' అను నామము నుంచిరి.

" హీనో యజ్ఞోపవీతేన యది స్యాద్ జ్ఞాన భిక్షుకః
తస్య క్రియా నిష్ఫలా స్స్యుః ప్రాయశ్చిత్తం విధీయతే
గాయత్రీ సహితా నేవ ప్రాజాపత్యాన్ షడాచరేత్
పున స్సంస్కార మాహృత్య నిత్యం యజ్ఞోపవీతకః. "

— (ప్రపన్నామృతము)

జ్ఞాని యైన సన్న్యాసి - యజ్ఞోపవీతము లేకుండ చేయు క్రియలు నిష్ఫలములు కాబట్టి, ప్రాయశ్చిత్తమును చేసికొనవలెను. గాయత్రీ మంత్రముతోనే ప్రాజాపత్యాది షట్కముల నాచరింపవలసి యున్నందున, మఱల ఉపనయనమును చేసికొని, యజ్ఞోపవీతమును ధరించుట ధర్మము.

అద్వైత పండితు డగు యజ్ఞమూర్తికిని ఇట్లే పున స్సంస్కారము జేసి, పంచసంస్కార పూర్వకముగ సన్న్యాసము నొసగి, దేవరాజ ముని' నామము నను గ్రహించి, యతిరాజు లిట్లాజ్ఞాపించినారు :-

" ఉపవీతం త్రిదండం చ పాత్రం జల పవిత్రకమ్
కౌపీనం కటిసూత్రం చ న త్యాజ్యం యావ దాయుషమ్. "
— (ప్రపన్నామృతము)

యజ్ఞోపవీతమును, త్రిదండమును, కమండలువును, జల పవిత్రమును, కౌపీనమును, మొలత్రాడును ఆయువున్నంత వఱకును విడువరాదు.'

పూర్వోక్త శ్రీవైష్ణవ కుల దూషణ దోషమును పరిహరించుకొనుటకు యతిరాజుల ఆజ్ఞానుసారము - గోవింద దాస నామాంకితులగు యాదవ ప్రకాశులు - 'యతిధర్మ సముచ్చయ' మను గ్రంథమును రచించినారు.

" అప్రమత్త శ్చరే ద్భైక్షం సాయాహ్నే వాఽపి లక్షితః
రహితే భిక్షుకై ర్గ్రామే యాత్రామాత్ర మలోలుపః. "
— (యతిధర్మ సముచ్చయము)

యతి - సాయంకాలము వఱకును అప్రమత్తుడై, నిరీక్షించి యైనను మాధూకర భిక్ష నాచరింపవలెను. భిక్షుకులు లేని గ్రామమందు - దాన నిరతులైన గృహస్థుల యిండ్లలో నొకరి యింట - దేహ యాత్ర జరుపుటకును ఏక భిక్షా ప్రక్రియగా భిక్షను గ్రహింపవచ్చును.

" న శిష్య బంధు మిత్రాదీన్ భిక్షా మీప్సేత కర్హి చిత్. "

తనకు శిష్య బంధు మిత్రులైన వ్యక్తులనుండి యతి భిక్షను కోరి స్వీకరింపరాదు.

" ధాతుః ప్రకృప్యతే యేన త దన్నం తు విసర్జయేత్. "
" క్షార లవణ వర్జ మష్టౌ గ్రాసా నేవ భుంజీత. "
— (జాబాలి వచనము)

శుక్రధాతువు నుద్రేకింపజేయు పదార్థములను భుజింపరాదు. ఉప్పు, కారము లేని యెనిమిది గ్రాసముల యాహారమును మాత్రమే విజన స్థలమున గాని, విష్ణ్వాలయమున గాని భుజింపవలెను.

## భిక్షా పంచకము

" మాధూకర మసంక్లప్తం ప్రాక్ప్రణీత మయాచితమ్
ఉపక్లప్తం చ తాత్కాల భైక్షం పంచవిధం స్మృతమ్. "

(1) మాధూకరము (2) అసంక్లప్తము (3) ప్రాక్ప్రణీతము (4) అయాచితము (5) ఉపక్లప్తము - అని, భిక్ష అయిదు విధములుగా నుండును.

**1. మాధూకరము :-**

తుమ్మెద పూలనుండి మధువును స్వీకరించునట్లు, నియమముగా కొన్ని గృహములనుండి స్వీకరించు భిక్షము.

**2. అసంక్లప్తము :-**

గృహస్థులు సిద్ధము చేసికొనినవానిలోనుండి యర్పించిన భిక్షము.

**3. ప్రాక్ప్రణీతము :-**

యతి తన యనుష్ఠానమును పూర్తి చేయక ముందే, గృహస్థుడు యతి నర్థించి, యేక భిక్షా రూపముగ సమర్పించునది.

**4. అయాచితము :-**

యతి యాచనకు రాక ముందే గృహస్థుడు యతిని సమీపించి, తా మీ దినమున మా యింటనే భిక్షమును స్వీకరింపవలె నని ప్రార్థించి అర్పించు భిక్షము.

**5. ఉపక్లప్తము :-**

యతి అస్వస్థుడై, తన మఠముతో నివసింపగా, గృహస్థులు స్వయముగా తెచ్చి సమర్పించు భిక్షము.

మాధూకరము సర్వ యతులకు సాధారణము. ప్రపన్నులైన యతివరులకు శిష్యులైన శ్రీవైష్ణవ గృహస్థులు భగవంతునికి నివేదించి సమర్పించిన పంచవిధ భిక్షము పరిగ్రాహ్యమే. ”

— (యతిధర్మ సముచ్చయము.)

" దేవ విప్రాధికారం వై యతీనాం సద్విధి ర్భవేత్
వేదాన్త శ్రవణం వాక్యం వా ధ్యేయం వైష్ణవం తథా. "

" మాతాపత్యం యతిః కుర్యాత్. "

దేవాలయములకు, మఠములకును ఆధిపత్యము వహించి, సక్రమముగా విధులను నిర్వహింపజేయుచు, వేదాంత శ్రవణమును, శ్రీ మహావిష్ణు కథా కథనమును, వేదాంతోపన్యాసములను చేయుట యతీశ్వరుల ధర్మము.

శ్రీమన్నాథ - యామునమునులు చరితము నొరవడిగా జేసి కొని, శ్రీ రామానుజ యతీంద్రులు - ఆత్మ సంబంధులైన యతి వరులను - శ్రీరంగ కరిశైలాది దివ్య స్థలముల, మఠముల యాధిపత్య మును నిర్వహించుటకు నియమించిన సంగతి సుప్రసిద్ధము కదా !

## వందన విధి

సకల వర్ణాశ్రమస్థులు యతికి వందన మాచరించినంతనే, యతి- 'నారాయణ' నామము నుచ్చరించినచో - వందన మాచరించినవానికి ఆయువు వృద్ధి యగును. యతి - ప్రతివందనము చేయరాదు.

" వైష్ణవౌ ద్వౌ యదా సద్యః సంగతౌ తు పరస్పరమ్
ప్రణామం కురుత స్తత్ర తయో ర్మధ్యే హరి స్థితః. "

శ్రీవైష్ణవు లిద్దరు ఎదురుగా కలిసినపుడు - వెంటనే పరస్పర ముగ సాష్టాంగ ప్రణామము చేయవలెను. వారి నడుమ శ్రియఃపతి యుండి, ఆ ప్రణతిని స్వీకరించును.

'ప్రత్యుద్గమ ప్రశ్రయణాభివాదన గౌరవము అంతర్యామియైన శ్రీమన్నారాయణునికే చెందు' నని శ్రీమద్భాగవతము విశదీకరించు

చున్నది యతీంద్రులు, బ్రహ్మజ్ఞానులు - సర్వదా పరతత్త్వమునే గొలుతురు.

'బ్రహ్మవిద్యలయం దెల్లను - అక్షర, శివ, శంభు, పరబ్రహ్మ, పరంజ్యోతిః, పరతత్త్వ, పరమాత్మాది శబ్దములచేత నిర్దిష్ట ధ్యేయ వస్తువైన పరతత్త్వము శ్రీమన్నారాయణుడే' యని, శ్రీమద్రామానుజులు శ్రీభాష్యమున ప్రబోధించినారు.

" శ్రీమద్భాగవతార్చనం భగవతః పూజావిధే రుత్తమమ్. "

వైష్ణవతేజ స్సంపన్నులైన భాగవకోత్తముల నర్చించుట - భగవత్పూజావిధి కంటెను ఉత్తమమైన దని భగవద్రామానుజుల చరమోపదేశ రత్నము అనర్ఘముగదా !

ఆచార్య నిష్ఠ, భాగవత సేవ, భగవత్కైంకర్యము - ఈ రత్న త్రయము వలన, అపహత పాప్మత్వాది మహిమ సిద్ధించును.

" భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వ సంశయాః
క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే. "

— (ముండకోపనిషత్తు.)

స్వధర్మానుష్ఠానముచేత భగవంతునియెడ - దర్శన సమానాకార మగు భక్తి సిద్ధించినప్పుడు - ఉపాసకుని హృద్గతము లగు సకల పుణ్యపాపరూప కర్మములు నశించు నని శ్రుతి వాక్యము.

## ముగింపు

ఏవ మహరహ రనుష్ఠీయమాన వర్ణాశ్రమ ధర్మాను గృహీత త దుపాసన రూప తత్సమారాధన ప్రీతః .... అనవధికాతిశయానందం ప్రాపయ్య, పున ర్నావర్తయతి. "

దైనందిన మనుష్ఠించుచున్న వర్ణాశ్రమ ధర్మానుగృహీతోపాసన రూపమైన ఆరాధనముచేత భగవంతుడు సంప్రీతుడై, భక్తుల యందు అత్యంత కృప కలిగి, అనాది కాలముగ వారు చేసిన అనంత పాప కర్మము లనెడి అవిద్యను నివారించి, వారికి తమ ఆధ్యాత్మానుభవ రూపమైన నిరతిశయానందమును మజల పొందకుండ చేయుచున్నాడు.

" న చ పున రావర్తతే న చ పున రావర్తతే. "

" మా ముపేత్య పున ర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః. "

మానవుడు తన వర్ణాశ్రమ ధర్మ నిర్వహణముతో భగవదనుగ్రహ పాత్రుడై, సాయుజ్యమును పొందవలె నని, జ్ఞానియైనవాని నెన్నడును భగవంతుడు విడనాడ డనియు - శ్రీమద్రామానుజులు అనేక శ్రుతి స్మృతి పురాణేతిహాస ప్రమాణములతో నిరూపించిన గీతాభాష్య, శ్రీభాష్యాది గ్రంథ రాజములను మన కనుగ్రహించిన మహనీయులు. వారి కివియే జోహారులు.

" రామానుజం యతిపతిం ప్రణమామి మూర్ధ్నా. "



# శ్రీ రామానుజ వైభవోల్లాసము

'కవితావతంస - గానకళా నిపుణ - హరికథా చతురానన'


## శ్రీమాన్ కరి నారాయణాచార్యులు




శ్రీ శాజ్ఞన్ శిరసా వహించి, పరమ ప్రీతిన్ విభూతి ద్వయా
ధీశత్వంబు గ్రహించి, సర్వ జన ముక్తి శ్రీప్రదానక్రియా
కౌశల్యంబు లభించి, ధాత్రిని భుజంగస్వామి యంశంబునన్
ప్రాశస్త్యంబున నుద్భవించిన ఘనున్ భావింతు రామానుజున్.

ఆ నిగమాంతవేద్యుడు శ్రియఃపతియో ! ఫణిసార్వభౌముడో
సైనిక నాథుడో ! యిటుల సర్వ జనమ్ముల నుద్ధరింప నీ
క్షోణి జనించె నేమొ యని సూరి జనుల్ దలపోయనైన రా
మానుజ దేశికోత్తము నమానుష వైభవ మెన్న శక్యమే !

అనయన్ దొల్లి జగద్ధురంధరుడు శేషాహీశుడే, దాననం
తర మా రాఘవ సోదరుండగుచు సుమిత్రానందనుండై మొగిన్
మఱి శ్రీకృష్ణుని యగ్రజుండు బలరామస్వామియై, యంత ను
ర్వరలో నీ గురు శేఖరుం డయిన శ్రీ రామానుజుం డాయెగా !

క్షితి రామానుజు డార్యుఁ డర్జునునకున్ గీతన్ ప్రసాదించి, యా
దృతిమైఁ దన్నిజ భావముల్ ప్రజల కర్థిన్ దెల్పఁదాఁ గ్రమ్మఱన్
ప్రతినన్ బూని, ద్వితీయ రూపమున శ్రీ రామానుజార్యాఖ్యుఁడై
ప్రతిభాస్ఫూర్తి జనించి, దాని కనువౌ వ్యాఖ్యన్ రచించెన్ గదా !

పరమ దివ్యస్థల ప్రఖ్యాతి యదుశైల
ధవుని కర్మిలిఁ గన్నతండ్రి యయ్యె
భూమ్యంగనాంశ సంభూతయౌ గోదాంబ
కాదరింపఁగన్నైన యన్న యయ్యె
విపుల సంపల్లస ద్వేంకటేశునకు ను
త్తమ శంఖచక్ర ప్రదాత యయ్యె
కూర్మిఁ దిరుక్కురుంగుడి పెరుమాళ్ళకుఁ
గోర్కొన్న మంత్రార్థ గురుఁడు నయ్యె

భరత దేశీయ భవ్య దివ్యస్థలస్థ
దేవతానీక సంపూజ్యతా విశిష్టుఁ
డైన మహనీయవర్యు, రామానుజార్యు
వైభవం బెన్నఁ దరమె ? వాక్పతి నైన.

శిరసా వహించి యిచ్చెను గదా ! శ్రీభాష్య
సద్గ్రంథమునుఁ గాంచి శారదాంబ
తన వాహనం బిచ్చి యనిపె గదా ! కూర్మ
నాథు నొద్దకు జగన్నాథ విభుఁడు
రూపించి యొసఁగిన రూపమూనెను గదా !
కూర్మితో శ్వేతాద్రి కూర్మవిభుఁడు
తిలకించి జాబుఁ బ్రీతిని ముక్తి నిడెఁగదా
గుటి వేంకటేశుండు గోపతికి

స్వామి రామానుజార్య ! తావక గభీర
మధురసూక్తి ప్రభావంబు, మాన్యతయును
నాథ భావంబు, ముక్తిదానాధిపత్య
మహహా ! వాచామగోచర మగుట నిజము,

నాఁ డా గోపుర మెక్కి లోక తరణానల్పక్రియాసక్తిమై
వాడల్ వాడల నెల్లఁ గల్గు ప్రజలన్ వైశమ్ముగా బిల్చి, మేల్
జాడన్ వారికి మంత్రరత్న ముపదేశం బిచ్చి, రక్షించె నె
వ్వాఁడో ! ఆ యతిసార్వభౌముని మహత్త్వం బెన్నఁగా శక్యమే !

మొదటన్ శేషుఁడ కిచ్చినాఁడ గద ! నే మోక్షాధిపత్యం' బటం
చెద నూహించిరె సింహశైలపతి దాఁ కృష్ణార్యుతో ధీవిశా
రద ! మోక్షప్రదుఁ డా గురూత్తముఁడు శ్రీ రామానుజార్యుండె గా
న, దదంఘ్రి ద్వయి నాశ్రయింపు' మనుచున్ స్పష్టమ్ముగాఁ జెప్పఁగా !

జయ రామానుజ ! బాలభాను నిభ తేజా ! శేషమూర్త్యంశజా !
జయ శ్రీ కాంతిమతీ సతీమణి తనూజా ! కేశవార్యాత్మజా !
జయ ! విశ్వావన కారణావతరణా ! సర్వప్రజోద్ధారణా !
జయ సర్వోపనిష ద్విచారణ చణా ! సత్యార్థ నిర్ధారణా !

* * *

మానిత సత్ప్రకాశ పరిమండితమై, విధు సుప్రసాద భా
వానఘమై, లస త్కువలయ ప్రియమై, మతిమచ్చకోర సం
తాన సుఖప్రదం బయి, నితాంత జగ త్తిమిరఘ్నమైన రా
మానుజ కీర్తి కౌముది సమస్త దిశల్ వెలుగొంద జేసెడిన్.



# శ్రీ పరాశర భట్టరు

'విద్యా రత్న'

శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు,

ఎం. ఏ; ఏ. ఇ. యస్



" శ్రీపరాశర భట్టార్య శ్శ్రీరంగేశ పురోహితః
శ్రీవత్సాంక సుత శ్శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే. "

## అవతారిక

శ్రీవైష్ణవ సంప్రదాయమున భగవద్రామానుజులచే ఆచా స్థానమున అభిషిక్తులై, అఖండ జ్ఞాన వైరాగ్య సంపన్నులై విలసిల్లిన 'పరాశర భట్టరు' అను విద్వత్కవి పవిత్ర జీవిత చరిత్రము సర్వు లకును అవశ్య గ్రహణీయమై యలరారుచున్నది.

విశిష్టాద్వైత మతోద్ధారకు లగు భగవద్రామానుజులకు (క్రీ:శ: 1017 - 1137) అత్యంత ప్రియాంతేవాసి - కూరేశు లనబడు కూరత్తాళ్వారు (జన్మ - క్రీ: శ: 1039) హారితకుల తిలకు లగు వీరికి- శ్రీవత్సాంక మిశ్రులు' అని నామాంతరము. వీరి జనకులు రామ సోమయాజి. కూరత్తాళ్వారు అతి నిశిత మేధా నిధులు. జ్ఞాన భక్తి వైరాగ్య సంపన్నులు. అప్రతిమ కవితా ప్రభావాన్వితులు. సిద్ధా ప్రతిపాదక వాద ధురీణులు. రామానుజులకు కుడి భుజమై, బ్రహ్మ సూత్రములకు అపూర్వ వ్యాఖ్య యగు బోధాయన వృత్తిని ఒక్క

సారి విని, శ్రీభాష్య రచనమున విశేష సాహాయ్య మొనరించిన ప్రజ్ఞాశాలి. వీరు - అతిమానుష స్తవము, వరదరాజ స్తవము, వైకుంఠ స్తవము, శ్రీ స్తవము, సుందరబాహు స్తవము - అను స్తవ పంచకమును రచించిరి. ఈ స్తవములు కవితా కళా ప్రపూర్ణములు, భక్తి వైరాగ్య స్ఫోరకములై యలరారుచున్నవి.

ఇట్టి మహనీయులకు శ్రీరంగనాయకీ రంగనాథుల కటాక్ష విశేషమున, పరాశర భట్టరు క్రీ: శ: 1123 - వ సంవత్సరమున ఆండాళు గర్భ శుక్తి ముక్తా ఫలముగా అవతరించిరి.

## ప్రతిభా విశేషములు

శ్రీ శంకర భగవత్పాదులకు వలెనే - బాల్యమునందే శ్రీ వేదాంతదేశికుల వలెనే పరాశరభట్టరు నిశిత ధిషణా పాటవము ప్రస్ఫుటము కాజొచ్చెను. రామానుజులకు పరమాచార్యు లగు యామున మునికి సంకల్ప మాత్రమున నుండిపోయిన కోరిక ననుసరించి తమ శిష్యులయిన కూరత్తాళ్వారుల జ్యేష్ఠ పుత్రు లగు ఈ భట్టరుకు - విష్ణు పురాణ నిర్మాత యగు పరాశరుల పవిత్ర నామము బెట్టించిరి. వీరి జీవిత కాల మత్యల్పము - 28 సంవత్సరములు.

ఇందును - వీరికిని, శంకరాచార్యుల వారికిని సామ్యము కలదు. ఇంత స్వల్పకాలముననే రామానుజుల చరణ సన్నిధిని, జనకు లగు కూరత్తాళ్వారుల యొద్దను, గోవింద భట్ట రను ఎంబారు వద్దను - భట్టరు సమస్త విద్యల నభ్యసించి, వేదాంతి యను ఉద్దండ పండితు డగు అద్వైతిని తమ వాద కౌశలమున జయించి, విశిష్టాద్వైత మతమునకు త్రిప్పి, శిష్యునిగా స్వీకరించి, పంచ సంస్కారము లొనర్చి, ఆయన మూలమున విశేషముగా విశిష్టాద్వైత మత ప్రచారము

నొనర్చిరి. జీవించిన అత్యల్ప కాలముననే వీ రనేక గ్రంథములను రచించుటయేగాక, శ్రీరంగనాథ దేవాలయమున నిత్యమును జరుగు పూజోత్సవాదులను గూర్చి యెన్నియో కట్టుబాటు లొనరించిరి. నేటికిని శ్రీరంగమున ఈ నియమములు మిక్కిలి భక్తి శ్రద్ధలతో పాటింపబడుచున్నవి.

షోళింగర్ (చోళలింగపుర) వాసి దొడ్డయాచార్యులు (మహాచార్యులు) కందాడై వంశమున, వాధూల గోత్రమున నవతరించెను. ఈయన 'పరాశర విజయము'న, పరాశర భట్టర్ జీవితమును, వైభవమును చిత్రించెను. కృష్ణదేవరాయల జామాత యగు అళియ రామరాయలును, మహాచార్యులును సమ కాలికులు. చండ మారుతము, (= వేదాంత దేశికులు 'శత దూషణి' పై వ్యాఖ్య) వేదాంత విద్యా విజయము, సద్విద్యా విజయము, వేదాంత దేశిక వైభవ ప్రకాశిక - మహాచార్యుల యితర కృతులు.

## పరాశర భట్టరు రచనలు

**1. అధ్యాత్మ ఖండద్వయ వివరణము :-**

'భట్టార్య ముక్తకములు' (1940) అను గ్రంథమునందలి భూమికలో నుదాహృతము.

**2. అష్ట శ్లోకి :-**

అష్టాక్షరీ ద్వయ చరమ శ్లోక వివరణాత్మక మగు లఘు కృతి.

**3. క్రియా దీపము :-**

భట్టార్య ముక్తక భూమికయం దుదాహృతము.

**4. తత్త్వ రత్నాకరము :-**

విశేష నైపుణ్య ప్రదర్శక మగు ఈ గ్రంథరాజ ముత్సన్న మైనది. శ్రీ వేదాంత దేశికుల 'న్యాయ పరిశుద్ధి' యందలి కొన్ని యాకరములు మాత్రము ఈ గ్రంథమునుండి లభించుచున్నవి.

**5. తిరునెడుం దాండగమ్ :-**

అను తిరుమంగై యాళ్వారు కృత దివ్య ప్రబంధమునందలి కొన్ని కొన్ని భాగములకు ద్రావిడ భాషా వివరణము.

**6. భగవద్గుణ దర్పణము :-**

శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రమునకు భాష్యము. భట్టరు నిశిత ప్రతిభా సంపద, అపార నైపుణ్యమును - ఈ గ్రంథమునుబట్టి ప్రస్ఫుటము లగుచున్నవి.

**7. భట్టార్య ముక్తకములు :-**

తత్త్వ యాథాత్మ్య విచారము లగు ఖండ కృతులు. ఇందుపలబ్ధము లగు పదునొకండు శ్లోకములకు తెనుగు వివరణము - శ్రీమత్పరవస్తు గోవిందాచార్యస్వామిచే శ్రీనివాస గ్రంథమాల యందు మూడవ పుష్పముగా ప్రకటింపబడెను. గోటింట. విశాఖ మండలము (1940).

భట్టార్య ముక్తకములకు మచ్చుతునుక :-

శ్లో॥ 'త్వం మే' 'ఒహం మే' కుత స్తత్ దపి కుత ఇదం వేదమూల ప్రమాణా
దేత చ్చానాది సిద్ధా దనుభవ విభవా త్తర్హి సాక్రోశ ఏవ
క్వాక్రోశః కస్య గీతాదిషు మమ విదితః కోత్ర సాక్షీ సుధీః స్యా
ద్ధన్త త్వత్ పక్షపాతీ స ఇతి నృకలహే మృగ్య మధ్యస్థవ త్త్వమ్.'

ఈ శ్లోకము జీవేశ్వర సంవాద రూపము. దీని వివరణము ఈ క్రింద ఈయబడుచున్నది :-

రంగనాథుడు :- నీవు నా యధీనుడవు.

జీవుడు :- నేను స్వతంత్రుడను.

రంగ :- నీ వెట్లు స్వతంత్రుడవు ?

జీవుడు :- నీవు చెప్పినది మాత్ర మెట్లు ?

రంగ :- వేదాది ప్రమాణములచే నాది సిద్ధము.

జీవుడు :- అనాది సిద్ధ మగు అనుభవము వలన, నా స్వాతంత్రత సిద్ధము.

రంగ :- ఆ యనుభవ మాక్షేపము గలది.

జీవుడు :- ఏమి యా క్షేపము ?

రంగ :- నేను చెప్పిన గీతాదులయందు జీవ స్వాతంత్ర్యము ఆక్షిప్తము.

జీవుడు :- ఈ విషయమున సాక్షి యెవరు ?

రంగ :- పండితుడు.

జీవుడు :- పండితుడు నీ పక్షపాతియే.

అని జీవు డనగా - రంగనాథుడు ప్రమాణము చేయ నుద్యుక్తుడాయె నట. ఈ విధముగా భట్టరువారు జీవ స్వాతంత్ర్య వాదమును ఖండించిరి.

ముక్తకములలోనిదే యిం కొక శ్లోకము. పై గ్రంథమున మాత్రము చెప్పబడలేదు.

పృథ్వీ. 'దిదేవిషతి మానుష స్స చ తత ద్విభూష త్యసౌ
శశ క్ష్విషతి సర్వదా వివిధయిష్యతే లేన చ,
షుముక్షిషతి తత్త్వగ త్యవగతే స్స నిస్సంశయః,
వినిత్యషతి సర్వదా స చ రిరంగ భిక్షాపతి.'

ఈ శ్లోకమునకు శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులవారి యాంధ్రీకరణము :-

చ॥ 'నరు డమరత్వ, మాయమరనాథత యాత, డతండు నెప్పుడున్
గిరిశత, గొంక రాత(డును గీర్వ్యవతీశత యాత( డెంతయున్
మురిప మెలర్ప ముక్తతయు, ముక్తుడు నిత్యత, నిత్యుడు న్నిరం
తరమును రంగనిక్షకత - దప్పక కోరుదు రోలి నాత్మలన్.

భట్టరు రచించిన యిట్టి శ్లోకము లెన్నియో కలవు. ఇవి - 'తిరుమంజనక్కవి' యను శీర్షికతో వ్యవహరింపబడుచున్నవి. వీనిపై భట్టరు మణిప్రవాళభాష (సంస్కృత మిశ్రిత ద్రావిడ భాష)లో వ్యాఖ్యానమును రచించి రట.

**8. శ్రీ రంగనాథ స్తోత్రము :-**

అష్టశ్లోకాత్మక మగు ఈ మనోహర మగు లఘు కావ్యము మధుర భావ సమన్వితము. ఇందు - ప్రపన్న జను డగు జీవుడు పరమాత్మను జేరు ఉత్కంఠ వ్యక్త మగుచున్నది. ఉదాహరణ :-

శిఖరిణి. " క దాహం కావేరీ విమలసలిలే వీతకలుషః
భవేయం త త్తీరే శ్రమముషి వసేయం ఘనవనే
కదాహం త త్పుణ్యే మహతి పులినే మంగళ గుణం
భజేయం రంగేశం కమల నయనం శేష శయనమ్."

**9. లక్ష్మీ కల్యాణ నాటకము :-** (లక్ష్మీ స్వయంవరము)

ఇది యుత్సన్నము. ఇందలి యీ క్రింది నాందీ శ్లోకము వేదాంత దేశికులు - 'రహస్యత్రయ సారము'న ఉదహరించుకొనిరి. (తెనుగు లిపి ప్రతి - 747 పుట.)

" అనన్యాధీన కల్యాణ మన్య మంగళ కారకం
జగ న్నిదాన మద్వన్ద్వం ద్వన్ద్వం వన్దామహే మహః."

వేదాంత దేశికులు - 'సారాసారము'న (198 పు.) కూడ ఈ కృతి నుండి మధ్య భాగము నుల్లేఖించుకొనిరి.

" స్వయం వస్తూ కుర్వన్ జన మిమ మకస్మాత్ సరసిజ
ప్రకాశా పద్మాయా స్తవ చ చరణౌ న శ్శరణయన్. "
ఇతి లక్ష్మీకల్యాణే.

## 10. శ్రీగుణ రత్న కోశము :-

61 శ్లోకములు గల యీ స్తుతిని మధుర మధుర పద్యములు గల లఘు కావ్యమును వలె శ్రీవైష్ణవ మండలి నిత్యమును పఠించు చుందురు.

ఉదాహరణ పద్యము :-

శ్లో॥ " పాదారుంతుద మేవ పంకజరజ శ్చేటీభృశాలోకితై
రంగమ్లాని ర ధాంబ, సాహసవిధౌ లీలారవిందగ్రహః
డోలా తే వనమాలయా హరిభుజే హాకష్టశబ్దాస్పదం
కేన శ్రీరతి కోమలా తను రియం వాచాం విమర్దక్షమా. "

## 11. శ్రీ రంగరాజ స్తవము :-

ఇందు - పూర్వ శతకము, ఉత్తర శతకము అను రెండు విభాగము లున్నవి. పూర్వశతకము 127 శ్లోకములు, ఉత్తర శతకము 105 శ్లోకములు. భట్టరు ప్రధాన గ్రంథములలో ఇది యొకటి. దీనిని దాక్షిణాత్య శ్రీవైష్ణవులు కావ్యమునుగా పఠింతురు. ఇది అతి మనోహర కవితా సురభిళము. శ్రీరంగనాథ సన్నిధిని ధనుర్మాస మున నొక రోజున ఈ స్తోత్రమును సేవా కాలము (పారాయణము) నేటికిని చేయుచుందురు.

రసిక వినోదమునకై యొక శ్లోకము :-

శ్లో॥ అతంద్రిత చమూపతి ప్రహితహస్త మస్వీకృత
ప్రణీత మణిపాదుకం కి మితి వాకులాంతఃపురమ్
అవాహన పరిష్క్రియం పతగరాజ మారోహతః
కరిప్రవరబృంహితే భగవత స్త్వరాయై నమః. "

బమ్మెర పోతన - 'గజేంద్ర మోక్షము'నందలి - 'సిరికిం జెప్పడు శంఖ చక్రయుగముం జేదోయి సంధింపడు' అను పద్యమున కిది సంవాద రూపమున నున్నది.

శ్లో॥ " వైశాఖమా స్యనూరాధా జాతం నిట్టార్య దేశికం
గోవిన్దయతిపాదాబ్జ చంచరీక మహం భజే. "

♦ ♦ ♦

# కవి పండిత పరిచయము

## శ్రీ పువ్వాడ శేషగిరిరావు



జన్మస్థానము - మొవ్వ. (కృష్ణా జిల్లా) జననము : 12-7-1906 - విద్యాభ్యాసము మచిలీపట్టణము నందలి ఉన్నత విద్యాలయములో. స్వయంకృషితో - ఉభయభాషా ప్రవీణ, పి. ఓ. యల్. పట్టములను సంపాదించిరి.

ఉద్యోగము :- S. K. P. V. V. హైస్కూలు, విజయవాడ - 1929 - 34. హిందూ హైస్కూలు, మచిలీపట్టణము - 1934 - 35, హిందూ కళాశాల మచిలీపట్టణము - 1935 - 47. మహారాజా వారి కళాశాల, విజయనగరము - 1947-51. ఆంధ్ర జాతీయ కళాశాల, మచిలీపటణము - 1951 - 70,

రచనలు :- పద్య కావ్యములు :- 1) కవిత 2) గోవత్సము 3) తాజమహలు 4) దారా 5) శతపత్రము 6) పాలవెల్లి 7) అపశ్రుతులు 8) ఆంధ్ర సామ్రాజ్యము.

గద్య కృతులు :- 1) మధు కలశము 2) తెలుగు వెలుగులు 3) దీప కళికలు 4) పరశురాముడు 5) ఆంధ్ర తేజము 6) ఏరువాక 7) దారా 8) ఎవడు ? 9) ఉత్తరములు. (వీనిలో 9 - వ గద్యకృతి అముద్రితము.

బుఱ్ఱకథ :- రక్త తర్పణము. నాటకములు :- 1) ఢిల్లీ దర్బారు 2) దుర్గాదాసు 3) పృథ్వీపుత్రి 4) ప్రతాపరుద్రమదేవి 5) సహపంక్తి 6) ప్రాణ రక్షణ 7) శిల్ప కావ్యము 8) తిప్పు పరిష్కారము 9) తొట్రుపాటు 10) నందనార్ 11) బిల్హణీయము 12) లక్ష్మీ స్వయంవరము 13) సత్య ప్రభ 14) చదరంగము. (వీనిలో - 3, 4, 5, 6, 7, 8, 10, 11, 12 సంఖ్యలు గలవి ముద్రితములు.) బిరుదము :- కవి పాదుషా.

విశేషాంశములు :- 1) కవిపాదుషా వారి రచన లగు పద్య కావ్యములలో తాజ మహలు, దారా, గోవత్సము, గద్య కృతులలో - మధు కలశము, ఏరువాక, ష్మారా, ఆంధ్ర తేజము, నాటకములలో - పృథ్వీ పుత్రి, సహ పంక్తి మొదలగునవి- ఆంధ్ర విశ్వవిద్యాలయ, వేంకటేశ్వర విశ్వ విద్యాలయ, నాగార్జున విశ్వ విద్యాలయములకు - బియ్యే, ఇంటర్, భాషాప్రవీణ తరగతుల పాఠ్య గ్రంథములుగా నిర్ణయించబడినవి

2) కవిపాదుషావారు తొలి ప్రపంచ మహాసభలలో సన్మానితులైరి. 1975 ఉపాధ్యాయ దినోత్సవములలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సన్మానము నందుకొనిరి. మచిలీపట్టణములో ఘనమైన షష్టిపూర్తి సన్మాన సభ జరిగినది.

3) కవిపాదుషా - పువ్వాడ శేషగిరిరావుగారి రచనలపై పరిశోధన చేసిన శ్రీ A. చందోజీ సిద్ధాంత వ్యాసమునకు అనంతపురమునందు శ్రీకృష్ణదేవరాయ విశ్వ విద్యాలయము 1989 లో M. Phil పట్ట ప్రదానము చేసినది.

4) 'కావ్యేషు నాటకం రమ్యమ్' అను భావము - అన్ని వాఙ్మయము లందును స్థిర పడి యుండగా, అది సోపపత్తికము కాదని, దృశ్యము కందెను శ్రవ్యమే ప్రశస్తమైన దని ప్రతిపాదించ సిద్ధాంతీకరించిన వ్యాసము - సాహిత్య లోకమున సంచలనము సృష్టించినది. (ఈ వ్యాసము - 'మధు కలశము'లో ముద్రితమైనది.)

ఈ శేషగిరి విద్వత్కవి శేఖరులు - 1981 లో కీర్తి శేషు లయిరి.

## శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు



జననీ జనకులు :- నాచ్చియా రమ్మ, అప్పలాచార్య దంపతులు. జన్మ తిథి :- 16 ఫిబ్రవరి 1933. జన్మించిన గ్రామము :- వేములవాడ (పల్లి), కరీంనగర్ జిల్లా. విద్యాభ్యాసము :- వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాల - సీతారాంబాగ్, హైదరాబాదు. చదివిన శాస్త్రములు :- 1. వేదాంతము, 2. వ్యాకరణము, 3. న్యాయము, 4. సాహిత్యము. శాస్త్రాచార్యులు :- శ్రీ ఉ. వే. శ్రీమాన్ కోయిల్ కందాడై అప్పన్ శఠకోప రామానుజాచార్యస్వామి వారు [సీతారాంబాగు సంస్కృత కళాశాలా సంస్థాపకులు, సుప్రసిద్ధ చతుశ్శాస్త్ర పండితులు.] ఉత్తీర్ణత నొందిన పరీక్షలు :- 1. నవీన తర్క విద్వాన్ [మైసూరు విద్వన్మహాసభ - మైసూరు ప్రభుత్వము] 2. విశిష్టాద్వైత వేదాంత విద్వాన్ [వేద శాస్త్రాగమ విద్వత్ సదస్సు - తిరుమల] 3. సాహిత్య విద్యా ప్రవీణ [ఆంధ్రకళా పరిషత్తు - వాల్తేరు] 4. వ్యాకరణ బి. ఓ. యల్. 5. సాహిత్య రత్న [ప్రయాగ హిందీ విద్యాలయ] 6. తెలుగు బి. ఓ. యల్. 7. ఎం. ఏ. తెలుగు. 8. ఎం. ఏ. సంస్కృతము. [4, 6, 7, 8 సంఖ్యలు గల డిగ్రీలు హైదరాబాదులో గల ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సంబంధించినవి.]

సన్మానములు - బిరుదములు :- 1. మైసూరు విద్వన్మహాసభ వీరిని నవీన తర్క విద్వాంసులుగా పరిగణించి, మహారాణావారి ద్వారా సన్మానింప జేసినది. 2. వేదశాస్త్రాగమ సదస్సు వీరిని విశిష్టాద్వైత వేదాంత విద్వాంసులుగా పరిగణించి, ప్రతి సంవత్సరము సన్మానించుచున్నది. 3. హైదరాబాదులోని 1. సుర భారతి

2. సంస్కృత భాషా ప్రచారిణీ సభ - అను సుప్రసిద్ధ సంస్కృత సంస్థలు రెండును వీరిని మహా విద్వాంసులుగా సంభావించి సన్మానించినవి. 4. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము వీరిని గ్రంథ సంపాదకులుగా భావించి సన్మానించినది. 5. విశిష్టాద్వైత ప్రచారక సంఘము విజయవాడ శాఖగా - వీరిని విశిష్ట మహా విద్వాంసులుగా తలంచి సన్మానించినది. 6. నడిగడ్డ పాలెమున గల శ్రీమదుభయవేదాంతాచార్య పీఠము వీరిని మహా విద్వాంసులుగా భావించి ప్రతి సంవత్సరము సన్మానించుచున్నది. 7. వేమురవాడ, సిద్దిపేట, యాదగిరి, పాలకొల్లు, నరసాపురము, కోరుకొండ, సింహాచలము, భద్రాచలము మొదలగు పట్టణములలో గల అనేక దేవస్థానములు వీరిని మహోపన్యాసకులుగా భావించి సన్మానించినవి. 8. విజయవాడ, ఉయ్యూరు, మచిలీపట్టణము, రాజమండ్రి, గుంటూరు, పాలకొల్లు, పెంటపాడు, విశాఖ పట్టణము, విజయనగరము మొదలగు అనేక పట్టణములకు సంబంధించిన సాహిత్య ఆధ్యాత్మిక సంస్థ లనేకములు వీరి ఉపన్యాసము లేర్పరచి, 'ప్రవచన వాచస్పతి' 'మధురోపన్యాసక', 'విశద వాక్స్వభామణి' ఇత్యాది బిరుదులతోకూడ వీరిని సన్మానించినవి. 9. జంట నగరము లందును ఎల్లప్పుడు ఏదియో యొక సంస్థ పక్షమున, రామాయణ-భారత-భగవద్గీతాదులకును, ముముక్షుప్పడి, గీతా భాష్యము, తిరుప్పావై, భగవ ద్విషయము మొదలగువానికిని సంబంధించిన వీరి ప్రవచనము జరుగుచుండును. సన్మానము, బిరుద ప్రదానము కూడ జరుగుచుండును. 10. హైదరాబాదులోని జీయర్ ఎడ్యుకేషన్ ట్రస్టు భవనమున - ప్రతి ఆదివారము వీరి భగవద్విషయ ప్రవచనము, శ్రీశ్రీశ్రీ త్రిదండి - శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరుస్వామి వారి నియమనమున జరుగుచున్నది. 11. హైదరాబాదు రేడియో కేంద్రమున సుమారు 35 సంవత్సరములనుండి వీరి సంస్కృత కావ్యగానము కాని, సంస్కృత కావ్య నాటక సంబంధము లగు ప్రసంగములు కాని ప్రసార మగుచున్నవి. 11 సంవత్సరములనుండి వీరి సంస్కృత పాఠములు కూడా ప్రసారము చేయబడుచున్నవి. ఇది రేడియోవారి సన్మానము.

వృత్తి :- హైదరాబాదు నగరము నందలి శ్రీ వేంకటేశ్వర వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాలలో 1952 నుండి వీరు న్యాయశాస్త్రాచార్యులుగా శాస్త్రాధ్యాపనము.

రచనలు :- 1. భాగవత రత్నములు [సురభారతీ ప్రచురణ] 2. అలంకార మకరంద [ఆంధ్ర ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార ప్రచురణ] 3. వివిధ గ్రంథములకు పీఠికలు, కవితా ఖండికలు, వ్యాసములు అనేకములు.

## శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు



జననము :- పరీధావి నామ సంవత్సర-నిజ ఆషాఢము (17-7-1912). జన్మస్థానము సుబ్బమ్మపేట. (టెక్కలి తాలూకా శ్రీకాకుళము జిల్లా) జననీ జనకులు :- చూడమ్మ, శఠకోప రామానుజాచార్యులు గారలు. ప్రస్తుత నివాసము :- హైదరాబాదు.

ఆంధ్ర, సంస్కృత, ఆంగ్ల, హిందీ, తమిళ, భాషలలో వీరు విద్వాంసులు. కృష్ణా జిల్లాలో గల చిట్టిగూడూరు గ్రామము, హైదరాబాదు, సికింద్రాబాదు నగరంలందును వీరు ఉపాధ్యాయులుగా పని చేసిరి. వీరు - సహజ కవి, విద్యా రత్న - అను బిరుదములను సంపాదించిరి.

ముద్రిత రచనలు :- (1) పురుషోత్తముడు (ఆంధ్ర విశ్వ విద్యాలయ పాఠ్యము) (2) రామాయణ కల్పవృక్ష విమర్శ (1957 జులై భారతి) (3) ఆంధ్ర ముకుందమాలా కులశేఖర చరిత్రలు (1964) (4) ఆచార్య - జగదీశ చంద్రబోసు (1971) సంవత్సరమున న్యూఢిల్లీలో - కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖవారి అవార్డు పొందినది.) (5) భారత హృదయము (గీతా కావ్యము - ఆంధ్ర భగవద్గీతలు.) (6) ఆంధ్ర సుదర్శన శతకము.

అముద్రితములు :- (1) ఆచార్య జగదీశ చంద్రబోసు (గద్యము) (2) కళాశాల (సికింద్రాబాదు నందలి మహబూబ్ కాలేజీ చరిత్ర.)

సన్మానము :- మాజీ మంత్రివర్యులు - ఆంధ్ర విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షు లగు యం. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతన, వివేకానంద పరిషత్తువారిచే ఘన సన్మానము.

## డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు

జననము :- 3-6-1959. జన్మ స్థానము :- కృష్ణాజిల్లా, చిన శ్రీరంగ పురము. జననీ జనకులు :- వేంకట నరసమ్మ, గోపాలకృష్ణమాచార్యులు గారలు. విద్యాభ్యాసము :- కృష్ణాజిల్లా - జగ్గయ్యపేట జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలలో పదియవ తరగతి వరకు, అనంతరము 1967 వరకు చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసము - సాహిత్య విద్యా ప్రవీణలో ఉత్తీర్ణత. 1981 నుండి 1983 వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు సర్వ దర్శన విభాగమున అధ్యయ నము, సంస్కృతములో - ఎం. ఏ. డిగ్రీ స్వీకరణము.

పరిశోధన వ్యాస రచనలు :- (1) 1984 నుండి తిరుపతిలో కేంద్రీయ సంస్కృత విద్యాపీఠమునందు విశిష్టాద్వైత దర్శనమున పరిశోధనము. తత్త్వాధ్య క్షులు, చతుశ్శాస్త్ర పండితులు - 'తర్క వాచస్పతి' బిరుదాలంకృతులు, రాష్ట్రపతి బహుమాన గ్రహీతలు నగు శ్రీమాన్ N. S. రామానుజతాతాచార్యుల వారి పర్య వేక్షణమున 'వేదార్థ సంగ్రహ సమీక్షాత్మక మధ్యయనమ్' అను విషయముపై పరి శోధన వ్యాసమును రచించి, Ph. D. డిగ్రీ నిమిత్తమై రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠమునందు 9-10-1986 తేదీన సమర్పించిరి. (2) ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు జైపూరునందు - 'ఆత్మ విచారము' అను పరిశోధక వ్యాసమును సమ ర్పించిరి. (3) ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు గుంటూరులో - 'భక్తేః మోక్షసాధనత్వే వివిధాభిప్రాయాః' అను శీర్షికతో పరిశోధక వ్యాసమును సమ ర్పించిరి.

పరిశోధనము :- 'విశిష్టాద్వైతస్య ఆంధ్రాణాం యోగదానమ్' 'ఆంధ్రులు - విశిష్టాద్వైతము' అను విషయముపై ఇటీవల పరిశోధన చేసిరి.

సంపాదకత్వము :- శ్రీమాన్ శిరిశినహళ్ కృష్ణమాచార్యులవారిచే ఆంధ్రీక రింపబడిన వేదార్థ సంగ్రహమునకు సంపాదకత్వము వహించి, దానిని 'ఆంధ్ర

వేదార్థ సంగ్రహ' అను పేర టి. టి. డి. వారి ఆర్థిక సహాయముతో 1986 లో ప్రకటించిరి.

వ్యాఖ్యానము :- శ్రీ యామునాచార్యులవారి 'గీతార్థ సంగ్రహము'నకు వ్యాఖ్యానమును రచించిరి.

అనువాదము :- (1) భక్తిసిద్ధాంతః (2) అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యమ్ (3) సవిశేషం బ్రహ్మ (4) లక్ష్మీ పురుషకార వైభవము (5) విశిష్టాద్వైతమ్ (6) తత్త్వత్రయమ్ అను సంస్కృత వ్యాసములు, వానికి ఆంధ్రానువాదములు వీరిచే రచింపబడినవి.

సంస్కరణము :- (1) శ్రీనివాస రాఘవ విరచిత మగు 'రామానుజ సిద్ధాంత సంగ్రహః' (2) శ్రీ వాత్స్య వరదాచార్య విరచిత మగు 'రామానుజ సిద్ధాంత సారః' (3) శ్రీకృష్ణ తాతాచార్య విరచిత మగు 'తత్త్వ చంద్రికా' అను సంస్కృత గ్రంథములు వీరిచే సంస్కరింపబడి, ముద్రణకు సిద్ధమై యున్నవి. (4) సురపురం శ్రీనివాసాచార్యులవారి జ్ఞాన రత్న ప్రకాశికా (5) షష్ఠి దర్పణమ్ అను సంస్కృత గ్రంథములును (6) నాయమాత్మా భాష్యమ్ (7) 'శరణాగతి శబ్దార్థ విచారః' (8) 'ప్రపత్త్యనుష్ఠాపకత్వ విచారః' అను సంస్కృత ప్రకరణ గ్రంథములును (9) శుద్ధసత్త్వం రామానుజాచార్యులవారి 'రహస్యత్రయ మీమాంసా భాష్యమ్' అను సంస్కృత గ్రంథమును - ఇప్పుడు వీరిచే సంస్కరింపబడుచున్నవి.

ఆంగ్ల వ్యాసములు :- (1) క్రియేషన్ ఆఫ్ ది వరల్డు (2) గాడ్ అండ్ సోల్ (3) డాక్ట్రిన్ ఆఫ్ విశిష్టాద్వైత - అనునవి వీరి ఆంగ్ల వ్యాసములు.

ఉద్యోగము :- రాష్ట్రీయ సంస్కృత సంస్థానము - న్యూఢిల్లీ వారిచే నిర్వహింపబడిన ఇంటర్వ్యూలో వీరు 'సెలక్టు' అయి, తిరుపతిలో కేంద్రీయ సంస్కృత విద్యా పీఠమున, విశిష్టాద్వైత విభాగమునందు 31-7-1987 తేదీన ఉపన్యాసకులుగా నియుక్తులైరి. ఇప్పుడీ విద్యా సంస్థ - 'రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠ' మను పేర వ్యవహరింపబడుచు, విశ్వ విద్యాలయ ప్రతిపత్తిని పొంది యున్నది.

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు



జననము :- 10-10-1928 జననీ జనకులు :- శేషమ్మ, తాతాచార్యులు గారలు. జన్మస్థానము :- కృష్ణాజిల్లా - గుడివాడ సమీపమున గల మోటూరు గ్రామము. ప్రస్తుత నివాసము :- వరంగల్.

వీరు సంస్కృతాంధ్రములలో గొప్ప విద్వాంసులు. బి. ఓ. యల్. పట్టమును ఉస్మానియా విశ్వ విద్యాలయమునుండి స్వీకరించిరి. ఈ పట్టము - సంస్కృతములో ఎం. ఏ పట్టముతో సమానగా గుర్తింపబడినది.

ఉద్యోగము :- సింహాద్రిబాగ్, వరంగల్‌లో గల సంస్కృత పాఠశాలలో 1946 నుండి 1966 వరకు సంస్కృత పండితులుగా పని చేసిరి. వరంగల్‌లో గల శ్రీ విశ్వేశ్వర సంస్కృత కళాశాలలో 1967 నుండి 1986 వరకు సంస్కృతోపన్యాసకులుగా పని చేసిరి.

బహుమతులు :- సంస్కృతమున ఉత్తమ అధ్యాపకులుగా 19/2 లో గుర్తింపబడి, భారత రాష్ట్రపతి నుండి అత్యుత్తమమైన జాతీయ బహుమానమును పొందగల్గిరి.

బిరుదము :- కవి శాబ్దిక కేసరి.

రచనలు :- 1) మదిరేక్షణా పరిష్కారః 2) శతకోటిః 3) దంభోళిః (ఈ మూడును సంస్కృతమున గద్య రచనలు) 4) కృతజ్ఞతావిష్కరణమ్ (సంస్కృత పద్య కావ్యము) 5) దివ్యసూరి సూక్తి సుధ (ద్రావిడ పాశురములకు సంస్కృత పద్యానువాదము - సంస్కృత వ్యాఖ్యానముతో) 6) ఈశావాస్యోపనిషత్ 7) మాండోక్యోపనిషత్ 8) కఠోపనిషత్ (ఈ ఉపనిషత్తులు మూడును

ుసువాదములు - ఆంధ్రవ్యాఖ్యా సహితములు) 9) శ్రీమద్రామాయణ రత్న క 10) గ్రామ సౌభాగ్యమ్ (సంస్కృత పద్య కావ్యము) 11) యుక్తిసాలి (సంస్కృత నాటకము) 12] గాంధీ తారావళి 13] శ్రీరామ చంద్ర భాతమ్ 14] లక్ష్మీ స్తుతి మంజరి [12, 13, 14 సంఖ్యలుగల ఈ మూడును స్కృత పద్య కావ్యములు.]

సంస్కృత గ్రంథములకు సంపాదకత్వము :- 15] మద్రాసు రాష్ట్రీయుని త్కవిగా విఖ్యాతి గాంచిన కె. యస్. కృష్ణమూర్తి శాస్త్రిగారిచే రచింపబడిన కృతి విలాసమ్' అను కావ్యమునకు సంపాదకత్వము 16] శ్రీమన్నా

పరిశోధన :- 17] జగన్నాథ పండితరాయల రసగంగాధరముపై పరిశోధన 8] ఆముక్తమాల్యదపై విమర్శనాత్మక వ్యాసము [1980 లో - కాకతీయ విశ్వ ద్యాలయమున తెలుగుశాఖలో సమర్పింపబడినవి 19] 'మహా భాగవతము - పోతన వి' అను విషయముపై విమర్శనాత్మక వ్యాసము. [తిరుమల తిరుపతి దేవస్థాన ముల వారి 'భాగవత నీరాజనము' అను గ్రంథమున ప్రకటింపబడినది] 20] రామాయణము - సుందర కాండము [టి.టి.డి. తిరుపతి వారి స్వర్ణోత్సవ సంచికలో ప్రకటింపబడినది.]

విశిష్ట సభ్యులు - సంస్కృత పరిశోధకులు :- 1] శ్రీభాష్యము [విమర్శ నాత్మక ప్రచురణము] 2] విశిష్టాద్వైత పదకోశ ప్రకాశిక 3] ఉపనిష ద్భాష్య ములు [విమర్శనాత్మక ప్రచురణ - సంస్కృత పరిశోధన అకాడమి - మేల్కోట. కర్నాట రాష్ట్రము.

పదవులు :- హోదాలు :— హనుమకొండలో గల శ్రీ సీతారామచంద్ర స్వామి దేవాలయ పాలక వర్గమునకు 1975 నుండి 1965 వరకు అధ్యక్షులుగా, 2] వరంగల్ విజ్ఞాన పరిషత్తుకు 1965 నుండి 1968 వరకు కార్యదర్శిగా. 3] గీతా ప్రచార పరిషత్తుకు 1970 నుండి 1988 వరకు కార్యదర్శిగా, 4] ఉభయ వేదాంత పీఠము - వరంగల్ శాఖకు 1970 నుండి 1988 వరకు అధ్యక్షులుగా - ఆ యా పదవుల నధిష్ఠించి, మిక్కిలి సమర్థతతో నిర్వహించినారు.

కర్నాటక రాష్ట్రము నందలి మేల్కోటలో గల – 'సంస్కృత సంశోధన సంసత్' వారి ఆహ్వానముతో వీరు 1989 జూలై నెల నుండి, అచట సంస్కృత భాషా పరిశోధన గావించుచున్నారు.

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



జననము 19.4. జన్మస్థానము – జగ్గయ్యపేట. ప్రస్తుత నివాసము – విజయవాడ, వీరు సంస్కృతాంధ్ర భాషలలో ఉద్దండ పండితులు. తర్క, వ్యాకరణ, అలంకార శాస్త్ర వేత్తలు. సంగీత విద్యా నిపుణులు. వాయులీన విద్వాంసులు. కవితా ధురంధరులు. ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయన తత్పరులు. 'సంగీత సాహిత్య కళానిధి' బిరుదాలంకృతులు.

త్యాగరాజ చరిత్రము, నారాయణ శతకము, బిడాల మోక్షము మున్నగు వీరి తెలుగు కావ్యములును. 'నరసింహ తాండవమ్' అను నొక హరికథయు, ధూ ప్రశంస, చంద్ర కళా షోడశత్వము, నౌకా చరితమ్, రామాయణ కథాయాం వ్యాస చేహః మొదలగు వీరి గ్రంథములు - పండిత ప్రశంసలకు పాత్రము లైనవి. క్షేమేంద్రుని కళా విలాసమున కనువాదము, సింహావలోకనము [సంస్కృతము], శ్రీనివాస కల్యాణము, రామకృష్ణ పరమహంస, వరదాభ్యుదయము [హరికథలు], విప్రనారాయణ [యక్షగానము] మున్నగునవి ముద్రణ భాగ్యమును పొందవలసి యున్నవి.

నాట్యకళ, గానకళ మొదలగు పత్రికలలో – వీరి సంగీత సాహిత్య వ్యాసము లనేకములు ప్రకటింపబడినవి. త్యాగరాజు, రామదాసు, గోదాదేవి మొదలగు హరికథా కాలక్షేపములు శ్రోతలను తన్మయుల గావించుచు, కొనియాడబడు చున్నవి.

ఏడేలు వాద్యములో అసేతు శీతాచలము పెద్ద పెద్ద సభలలో వీరి ప్రక్క వాద్యములు, సోలో కచేరీలు అనేకములు జరిగినవి. ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమీ పక్షమున వీరు పెక్కు తావులలో సంగీతమును గూర్చి ఉపన్యాసము లొసంగిరి. 1982 డిసెంబరులో — మద్రాసు మ్యూజిక్ అకాడమీలో — సంగీతోత్స వమున విద్వత్పరిషత్తులో — సంగీతమును గురించి తమిళ భాషలో ప్రసంగించి, శ్రోతల మన్ననల బడసి, ఘన సన్మానము నందిరి.

కపిలేశ్వర పురము జమీందారగు శ్రీ S.B.P.B.K. సత్యనారాయణరావు గారి కోరికను పురస్కరించుకొని — మాలవికాగ్ని మిత్రమ్, మేఘ సందేశమ్, వాల్మీకి రామాయణమ్ కథలు, రఘువంశానుసారముగా రామ చరితమ్, త్యాగరాజ చరితమ్ - అని, పండ్రెండు హరికథలను వీరు సంస్కృతమున ఇటీవల రచించిరి. ఇవి అనితర సాధ్యములు.

## శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ (శేషాచార్యులు)



జననము :- పరీధావి మాఘ బహుళ అష్టమి (8-2-1913). జన్మ స్థానము :- అనంతపురము. జననీ జనకులు :- శేషమ్మ, రంగాచార్యులు గారలు. శ్రీమాన్ కుంటిమద్ది వేంకట రంగాచార్యులవారికి ఈ శేషశర్మ గారిని బాల్యమునందే దత్తపుత్రులుగా గైకొనిరి.

విద్యాభ్యాసము :- ప్రాథమిక విద్యాభ్యాసానంతరము - పితామహులగు శ్రీనివాసాచార్యులవారి వద్ద కావ్య పఠనము. అనంతరము - తిరుపతి వేంకటేశ్వర సంస్కృతకళాశాలలో విద్యాభ్యాసము - 'సాహిత్య శిరోమణి' పరీక్షలో ఉత్తీర్ణత. అటుపిమ్మట బి. విద్వాన్, స్వయంకృషితో S.S.L.C. పరిషత్ ట్రైనింగ్; (రాజమండ్రిలో) తెలుగు ఎం.ఏ. (వాల్తేరులో).

ఉద్యోగము :— అనంతపురము జిల్లాబోర్డు స్కూళ్ళలో 1937 నుండి — అప్పటప్పుడు తాత్కాలిక సంస్కృత, ఆంధ్ర పండిత పదవి. 1943 నుండి స్థిర ఆంధ్ర పండిత పదవి. అనంతపురము జిల్లాహైస్కూళ్ళలో. 1971 లో ధర్మవరము జూనియర్ కళాశాలనుండి ఉద్యోగ విరమణము.

రచనలు :- (ముద్రితములు. పద్య గ్రంథములు. తెలుగు) 1) సుధా బిందువులు 2) తెనుగు తల్లి 3) రామిరెడ్డి 4) యతిరాజీయము (మూడు భాగములు) 5) శరణ ప్రపత్తి 6) శ్రీనివాస కుసుమాంజలి 7) మిణుగురులు 8) హంస సందేశము. ఉపశన కావ్యములు :- 9) గీతామృతము 10) పరకాల మఠ వైభవము 11) పరమార్థ దీపిక 12) రామాయణ పర్యాలోకనము 13) విశిష్టాద్వైత సిద్ధాంత దర్పణము - వివరణ తోటి పద్యానువాదములు :- 14) న్యాస మంజరి (సంస్కృతము) 15) ముకుంద విలాసః 16) ఇందిరా వందనమ్ 17) మను సంభవః 18) విష్ణుచిత్తీయమ్ (అముద్రితము) 19) రాఘవేంద్ర విజయః 20) శ్రీనివాస ప్రణతిః 21) సుమతి శతకమ్ (అముద్రితములు) 22) శాంతి విలాసము 23) మేలి నోము 24) శఠకోప వాగ్ఝరి 25) సింధుజా వందనము 26) గోదా వందనము 27) దయా శతకము 28, 29, 30) కరావలంబన. కనకధారా స్తవ, షట్పదీ స్తోత్రములు. 31) వైరాగ్య పంచకము 32) 33) 34) ఈశావాస్య, కేన, కఠ ఉపనిషత్తుల వివరణ పద్యానువాదములు. వచనములు :- కాలక్షేప వ్యాసములు, భారతీయ సంస్కృతి, గురు దక్షిణ, విష్ణుచిత్తీయము, తాతా మనుమని సల్లాపము, అలంకార వినోదము, వ్యాకృతి బోధిని, గీతానవనీతము (పద్యము)

ఆంధ్రప్రదేశ్, సప్తగిరి, నృసింహ ప్రియ ఇత్యాది పత్రికలందు అనేక పద్య గద్య వ్యాసములు, శతాధిక ఖండికలు, పద్యములు.

సన్మానములు :- అనేక ఉన్నత పాఠశాలలో, లలిత కళా పరిషత్ (అనంతపురము) (బ్రహ్మరాతి) స్వతంత్ర పరకాల మఠము (మైసూరు).

## శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు



జననము :- 1-7-1930. జన్మ స్థానము :- తిరుపతి. జననీ జనకులు :- జానకమ్మ, వేంకట నరసింహాచార్యులు గారలు. విద్యాభ్యాసము :- నెల్లూరు నందలి వేద సంస్కృత కళాశాలలో. ఉభయ వేదాంతాధ్యయనము :- తండ్రి గారి సన్నిధిలో. డిగ్రీలు :- 1) విద్యా ప్రవీణ 2) భాషాప్రవీణ 3) ఎం.ఏ. (సంస్కృతము).

ఉద్యోగము :- నెల్లూరులో — వేద సంస్కృత కళాశాలాధ్యక్షులుగా చిరకాలము పని చేసి, ఇటీవలనే ఉద్యోగ విరమణ గావించిరి.

రచనలు :- (ముద్రితములు) 1) శుక సందేశమ్ (సంస్కృత కావ్యమ్) 2) సంస్కృత భాషా ప్రవేశిక (వ్యాకరణము) 3) వైకుంఠనాథ పంచాశత్ (స్తోత్రము) 4) శ్రీమన్మహాశిలగిరీశ్వర (పెంచలకోన) సుప్రభాతము 5) స్వాగతమ్ (ఖండ కావ్యము) 6) హాహా హూహూ (విశ్వనాథ సత్యనారాయణగారి నవలకు సంస్కృతానువాదము) 7) శ్రీభాష్య సారము - 1, 2 భాగములు 8) శ్రీ భగవద్గీతా మృతము - 1, 2, 3 భాగములు 9) శ్రీ గోదా సహస్ర కమల మాలికా (శ్రీ గోదా సహస్రనామ స్తోత్రము) 10) శిక్షావల్లి (చంద్రికా వ్యాఖ్యానముతో - 'భక్తామృతమ్' మేగజైనులో.)

అముద్రితములు :- 11] రత్నమాలా [డాక్టర్ : బెజవాడ గోపాలరెడ్డిగారి వచన కవితకు సంస్కృతానువాదము] 12] శర్వరీ [ఆకిలి శ్రీరామశర్మగారి ఆంధ్ర పద్య కావ్యమునకు సంస్కృత పద్యానువాదము] 13] బాదరాయణ హృదయము [బాదరాయణ, బోధాయన సంవాద రూపమున బ్రహ్మసూత్రార్థ వివరణము సలుపుట] 14] ఉపనిష చ్చంద్రికా [ఆంధ్రమున ఉపనిషత్తులకు ప్రతిపదార్థ తాత్పర్యములు గలది. ఛాందోగ్య, బృహదారణ్యకములు మినహా.]

## శ్రీమాన్ కాంరచేటి తిరుమల వేంకట రాఘవాచార్యులు



జననము :- విభవ నామ సంవత్సర పుష్య శుద్ధ ద్వాదశి (1929). జన్మ స్థానము :- కరీంనగర్ జిల్లా - నారాయణ పురము. జననీ జనకులు :- వేంకటమ్మ, మనోహరాచార్యులు గారలు. అభ్యసించిన భాషలు :- సంస్కృతములో - ఎం. ఏ. తెలుగులో - ఎం.ఏ. హిందీలో - 'భూషణ', బి. యిడి. ట్రైనింగు, స్వయంకృషితో ఉరుదు.

అభ్యసించిన విద్యలు :- వేదము, పంచ దశ కర్మలు, ద్రావిడ దివ్య ప్రబంధములు.

ఉద్యోగములు :- ఆంధ్రోపన్యాసకులుగా, సంస్కృతోపన్యాసకులుగా తెలంగాణమున అనేక కళాశాలలో పని చేసి, చివరకు - సిద్దిపేట ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పని చేసి, ఇటీవలనే ఉద్యోగ విరమణ గావించి, హైదరాబాదులో స్థిర నివాస మేర్పరచుకొని యున్నారు.

విశేషాంశములు :- రామాయణము, భాగవతము, భగవద్గీత, తిరుమంత్రార్థము, తిరుప్పావు, భగవద్విషయము వంటివానిని గురించి వీరు తరచుగా ఉపన్యాసము లొనంగుచుందురు. దేవ మానుష యాహ్నికములను నిర్వహించుచుందురు. హైదరాబాదు ఆకాశవాణిలో - వేద పఠనము, సంస్కృత కావ్య ప్రసంగములను చేసి, ప్రశంసల నందుకొనిరి. వివిధ సందర్భములలో అనేక ఘన సన్మానములను పొందిరి.

రచనలు :- 1) మాఘ మహాకవి విరచిత మగు 'శిశుపాల వధ' కావ్యము నందలి విశిష్ట మగు కవితా సౌందర్యము నుగ్గడించుచు - 'మాఘకావ్య వైభవము' అను పేర నొక గ్రంథమును వీరు రచింప, దానిని - యువ భారతి - (హైదరాబాదు) వారు ప్రచురించిరి. 2) శ్రీ వేదాంతదేశికులచే రచింపబడిన గోదాస్తుతికి పరిమళ వ్యాఖ్యానము, 3) భగవద్ధ్యాన సోపానమునకు మనోహరా వ్యాఖ్యానము చు రచించిరి. 4) భగవ ద్విషయము - 'ఈడు అవతారిక' అనునది - వీరి ఆంధ్రానువాదము.

## శ్రీమాన్ కరి నారాయణాచార్యులు



విజయనగర సమీపమున గల శ్రీరామ తీర్థము వీరి జన్మస్థానము. వీరు సంగీత సాహిత్యములలో విశేష వైదుష్యము గలవారు. సంస్కృతాంధ్రము లలో భావ మధురమైన కవిత్వము నల్ల గల సమర్థులు. భాష్య భగవద్విషయాది సంప్రదాయ గ్రంథములను అధ్యయనము గావించి, ఆ యా విశేషములను ఉపన్యాసముల ద్వారా, పురాణ కాలక్షేపముల ద్వారా, హరికథా కాలక్షేపముల ద్వారా శ్రోతలను తన్మయుల గావించు సామర్థ్యము గలవారు.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము వారి యాధ్వర్యమున - అత్తమూరులో జరుపబడిన యతిరాజాశ్రమోత్సవ సందర్భములో సమావిష్టమైన పండిత పరిషత్తు వారు వీరికి - 'కవితావతంస', 'గానకళా నిపుణ' అను బిరుదము లొసంగి, సమ్మానించిరి. విజయనగర సంస్కృత కళాశాలాధ్యక్షులుగా చిరకాలము ఉద్యోగము గావించి, పదవీ విరమణ చేసిన శ్రీమాన్ శ్రీమత్తిరుమల వేంకట నరసింహాచార్యులవారి యాధ్వర్యమున పెంటపాడులో జరిగిన శ్రీవైష్ణవ పత్రికా రజతోత్సవ సందర్భమున, పండిత పరిషత్తు వీరికి 'హరికథా చతురానన' అను బిరుదము నొసంగి, ఘన సన్మానము గావించినది.

అమృతాంజన శతకము, రామానుజ గురువరణము, మధుస్వాదు, స్వాహా శశాంకము - మొదలగు నాటికలు, ఖండ కావ్యములు, చాటువులు, గేయ ప్రబంధములు, హరికథలు, స్తవములు అనేకములు వీరిచే రచింపబడినవి.

వీరు సుమారు రెండు దశాబ్దముల కాలము సింహాచల దేవస్థానమున స్థానాచార్యులుగా నుండి, శ్రీ వరాహ లక్ష్మీ నరసింహ సుప్రభాత స్తోత్రమును రచించి ప్రశస్తి వహించిరి. వీ రిపుడు - పరమ పద వాసులు.

## శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు



జననము 1902. విజయ నగరమున గల మహారాజావారి సంస్కృత కళాశాలలో - బి. ఏ. అభ్యసించిరి. 1933 లో సంస్కృతమున - ఎం. ఏ. పట్టమును పొందిరి. కాకినాడలో గల ప్రభుత్వ పి. ఆర్. కళాశాలలో ప్రధానోపాధ్యాయులుగా, భారతీయ భాషా శాఖాధ్యక్షులుగా, 1933 నుండి 1955 వరకు పని చేసిరి. అటు పిమ్మట, అచటనుండి రాజమండ్రిలో గల ప్రభుత్వ కళాశాలకు బదిలీ అయి, 1959 వరకు పని చేసి, అనంతరము ఉద్యోగ విరమణ గావించిరి. అటు పిమ్మట, కొవ్వూరు సంస్కృత కళాశాలలో సంస్కృతోపన్యాసకులుగా మూడు సంవత్సరములు పని చేసిరి. 1953లో - 'విద్యారత్న' బిరుద విభూషితులైరి.

భారత దేశము నందలి విశ్వ విద్యాలయములలో జరిగిన అఖిల భారత ప్రాచ్యభాషా సమ్మేళనములలో వీరు - వరుసగా పదునైదు సభలలో పాల్గొని, వివిధ విషయములపై తాము రచించిన సాహిత్యవ్యాసములను చదివి విన్పించి, సమర్పించి, ఘన సన్మానములను పొందిరి. ఆ వ్యాసము లన్నియు ముద్రణ భాగ్యమును పొంది, వీరి పాండిత్య విశేషమును వేనోళ్ళ చాటుచున్నవి. వీరి సాహిత్య వ్యాసము లనేకములు - 'భారతి' పత్రికలో ప్రచురింపబడి, వీరికి పారితోషికములను సంపాదించి యిచ్చినవి. శ్రీవైష్ణవ పత్రిక, రామకృష్ణ ప్రభ, ప్రపన్న సుధ వంటి ధార్మిక మాస పత్రికలలో వీరి వ్యాసము లనేకములు ప్రకటింపబడినవి. వీరు - 1981 అక్టోబరులో - అనంతపురమున అస్తమించిరి.

# స వ ర ణ లు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 15 | రాంచగ | రాంపగ |
| 27 | 16 | ప్రషాణములు | ప్రహాణములు |
| 31 | 6 | విందు | లిందు |
| 35 | 7 | స్వారభము | సౌరభము |
| 35 | 10 | శుద్ధాద్వైతము | శుద్ధాద్వైతము |
| 37 | 7 | శెషవాదమ్ము, | శేషవాదము. |
| 37 | 22 | వై శెషిక | వై శేషిక |
| 41 | 2 | అవిశెష | అవిశేష |
| 41 | 9 | విశెషాత్ | విశేషాత్ |
| 42 | 16 | యుక్తయు | యుక్తియు |
| 45 | 16 | దహాడ | దహార |
| 45 | 21 | పర్యంతలు | పర్యంతము |
| 46 | 18 | యుధికరణ | యధికరణ |
| 48 | 21 | ఉద్గీదమాప | ఉద్గీధమాన |
| 48 | 23 | ప్రాణకర్తృక్ | ప్రాణకర్తృక |
| 49 | 12 | విపైశ్యక్యము | విద్వైశ్యక్యము |
| 56 | 4 | దుచ్ఛాదుల | పుచ్ఛాదుల |
| 57 | 7 | వార్యాశ్యా | వార్యావ్యా |
| 57 | 16 | దనియు | ననిము |
| 65 | 22 | తైత్తిరీయ | తైత్తిరీము |
| 71 | 2 | అన్ని | అని |
| 71 | 17 | పద్యంత మా | పర్యంత మో |
| 73 | 15 | అక్షర వ్యధికరణము | అక్షంత్వ్యధికరణము |
| 78 | 14 | మొక | యొక్క |
| 79 | 10 | పపస్వక | పరస్పర |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 79 | 11 | కానరాదందుకు | కానరావందురు |
| 81 | 11 | సంకల్పాదులు | సంకల్పాదులు |
| 91 | 7 | పూర్వపక్షి. అభిమతము | పూర్వపక్షి అభిమతము |
| 99 | 15 | మతము. కాదు. | మతము కాదు. |
| 107 | 3 | శెష | శేష |
| ,, | 9 | శేషభూతుదుగా | శేషభూతుడుగా |
| 110 | 13 | వానప్రస్థి | వానప్రస్థ |
| 119 | 11 | సంద్భరము | సంపత్ప్రము |
| 120 | 10 | బ్రహ్మవ్యిదానిష్ఠ | బ్రహ్మవిద్యానిష్ఠ |
| 131 | 20 | శెషి | శేషి |
| 152 | 21 | బ్రహస్పతి | బృహస్పతి |
| 158 | 5 | త్నిమగుడను | త్నిమగ్నుడను |
| 169 | 9 | అశెషతః | అశేషతః |
| 206 | 22 | అందువలన | అందువలన |
| 219 | 7 | శ్రియఃకాంలో | శ్రియఃకాంతో |
| 239 | 5 | శరణ ప్రపద్యే. | శరణమహం ప్రపద్యే. |
| 239 | 11 | మా మేకిం | మా మేకం |
| 240 | 4 | కహస్యం | రహస్యం |
| 240 | 9 | వదతా రుభివర్ధతామ్ | వర్ధతా మభివర్ధతామ్ |
| 242 | 8 | మహాపురుషులు | మహాపురుషులు |
| 242 | 18 | ఆరాధ్యుడైన | ఆరాధ్యుడైన |
| 244 | 10 | ఉద్యముంచుచున్నట్లే | ఉద్యమించుచున్నట్లే |
| ,, | 13 | కాబట్టి; | కాబట్టి, |
| ,, | 20 | తమయం దున్న | తమయం దున్న |
| 245 | 11 | స్వరూపే విం | స్వరూపే హి |
| ,, | 15 | శ్రీభాష్యషము | శ్రీభాష్యము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 245 | 25 | ఫలసంవిభత్స్వయా | ఫలసంభిభంత్స్వయా |
| ,, | 26 | ద్రవిడ భాష్యము | ద్రమిడ భాష్యము |
| 247 | 10 | కర్మశేషము | కర్మశేషము |
| ,, | 22 | పొందుజకు | పొందుటకు |
| 248 | 4 | సాఖ్య ఖర్మము | సాధ్య ధర్మము |
| ,, | 8 | యతో ఒభ్యుదయ | యతో ఒభ్యుదయ |
| ,, | 13 | శ్రేయస్సాధనమే | శ్రేయస్సాధనమే |
| ,, | 18 | అక్షైర్మాదీర్యః | అక్షై ర్మా దీవ్యః |
| 248 | 11 | సంసస్వ | సంన్యస్య |
| 251 | 20 | గోబరీవర్దన్యాయ | గోబలీవర్దన్యాయ |
| 256 | 13 | వేతసే | చేతసే |
| 257 | 19 | సఖల్వేదం | సఖల్వేవం |
| 266 | 4 | దివ్వ | దివ్య |
| 267 | 11 | యశ్చైతదేకం | యశ్చైతదేవం |
| ,, | 13 | కక్ష్యే | వక్ష్యే |
| ,, | 18 | కావయితు | కారయితు |
| 268 | 15 | మాం గచ్ఛే | వనం గచ్ఛే |
| ,, | 16 | విషుపురాణము | విష్ణుపురాణము |
| ,, | 23 | ఫలాశస్యా | ఫలాశీస్యా |
| 270 | 23 | ంఛాదోగ్యోపనిషత్తు | ఛాందోగ్యోపనిషత్తు |
| 272 | 23 | విధియతే | విధీయతే |
| ,, | 25 | యజ్ఞోపవీతకః. | యజ్ఞోపవీతకమ్. |
| 276 | 17 | నౌష్ణవా | వైష్ణవా |

0—0

# శ్రీ రామానుజ కీర్తి కౌముది గ్రంథమాల

## వదాన్య శేఖరులు

Professor : Narender P. Reddy, Ph.D. Akron (U.S.A.)
Dol's 300

## మహారాజ పోషకులు

1. శ్రీమాన్ చిలకపట్టి సత్యలక్ష్మణాచార్యులు, Retd. I.T.O. గుంటూరు
2. డాక్టర్ : కె. సత్యనారాయణాచార్యులు, M S; M.Ch. ,,
3. శ్రీ వి. మధుసూదనరావు, రిటైర్డు జిల్లా రిజిస్ట్రార్ ,,
4. శ్రీమాన్ కిడాంబి వేంకట నరసింహాచార్యులు పెంటపాడు
5. శ్రీ ఘండికోట వేంకట సుబ్బారావు ప్రశాంతి నిలయము
6. శ్రీమతి - గుడివాడ హేమమాలినీ రాణీ, M A. గుంటూరు

## రాజపోషకులు

1. శ్రీమాన్ కందాడ శ్రీనివాస రాఘవన్, B Com. గుంటూరు

## పోషకులు

1. శ్రీమాన్ నంబూరి సత్యనారాయణాచార్యులు గుడివాడ
2. శ్రీ పుతుంబాక శ్రీరాములు (మాజీ శాసన సభ్యులు) పెదపాలెము
3. శ్రీమాన్ నంబూరు బుచ్చిరామానుజాచార్యులు గుంటూరు
4. డాక్టర్ : సి. రామదాసు, D.M. & E.D.M.R. ,,
5. శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయ, M.A. విశాఖపట్టణము
6. శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యులు, M.A; B.Ed. హైదరాబాదు
7. శ్రీమాన్ యన్. సి. వరదాచారి, B.A; I.R.S. మద్రాసు
8. శ్రీమాన్ కందాడై అప్పన్ కృష్ణమాచార్యులు, M.A. వాల్తేరు
9. శ్రీమాన్ సౌమిత్రి రంగాచార్యులు, M A; B.Ed. హనుమకొండ
10. శ్రీమాన్ టి. కె. వి. రాఘవన్, M.A హైదరాబాదు
11. డాక్టర్ : సముద్రాల రంగరామానుజాచార్యులు, M.A; Ph.D కొవ్వూరు
12. శ్రీ ఎట్టం బాలకృష్ణారెడ్డి నెల్లూరు
13. శ్రీమాన్ యన్. సి. గోపాలస్వామి, M.A; B.T. మద్రాసు
14. శ్రీమతి - కిడాంబి వేంకట లక్ష్మమ్మ గుంటూరు